నెహ్రూ బాల పుస్తకాలయం

# సముద్ర తీర గ్రామం

అనితా దేశాయ్

అనువాదం

ఎం. ఐ. చలపతి రావు

చిత్రాలు

మిక్కీ పటేల్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

## అంకితం

తుళ్‌లో వాళ్ళ యింట్లో నాకు స్నేహపూర్వక
వాతావరణాన్ని కల్పించి, ఈ పుస్తకానికి అవసరమైన
విషయాన్నంతా సమకూర్చిన
లీనా, అదితి, రంజిత్ మాయాదాస్‌లకు.

# ఒకటవ అధ్యాయం

లీల, ఉదయం చాల పెందలకడనే సముద్ర తీరానికి వెళ్లింది. అప్పటికి అక్కడ ఎవరూ లేరు. క్రితం రాత్రి సముద్రం నుండి పొంగిన అలలు తీరంపై యిసుకను శుభ్రం చేసాయి. తీరం వెంట చేపలను వేటాడే సముద్రపు కాకులు, బలాకాలు లాంటి సముద్రపు పక్షుల కాలిగుర్తులు తప్పమరే ప్రాణీ ఆ యిసుకపై తిరిగినట్లు దాఖలాలు లేవు. ఆమె సముద్రం దాకా వెళ్లింది. ఆమె అరచేతిలో చిన్నబుట్ట ఉంది. ఆ బుట్టలో వాళ్ల యింటి చుట్టూ ఉన్న తోటలో కోసిన ఎఱ్ఱమందారాలు, సువాసన వెదజల్లే లిల్లీ పూలు, ఆకర్షణీయమైన పచ్చగన్నేరుపూలు ఉన్నాయి.

మెత్తని నురగలో, తన మడమల చుట్టూ సుళ్లు తిరుగుతూ పైకి ఎగసి పడుతున్న అలల్లో నడవటానికి వీలుగా లీల తన చీరె అంచులనుమడిచి, బొడ్లో దోపింది. అలా ఆమె మూడు శిలల సముదాయం దాకా నీటిలో నడచి వెళ్లింది. ఆ శిలల్లో ఒక దానికి ఎరుపు, తెలుపు చూర్ణం పూయబడి ఉంది. అదే పవిత్రమైన శిల. అది సముద్రంలో ఒక దేవాలయం లాంటిది. అలలు ఎగసి పడే సమయంలో ఈశిల పూర్తిగా నీటిలో మునుగుతుంది. ఇప్పుడు అలలు అంత తీవంగ్రా లేవు. ఈ సమయంలో చక్కగా పూజ చేయవచ్చు. లీల తన చేతి లోని బుట్టలో నుండి పూలు తీసి శిల చుట్టూ చల్లి, చేతులెత్తి, శిరసువంచి, నమస్కరించింది.

సరిగా ఆసమయానికి తీరం వెంట వరుసగా ఉన్న కొబ్బరి చెట్ల నుండి సూర్యుడు ఉదయించి, వెండిలాగా మెరుస్తున్న యిసుకపై తన కిరణాలను ఏటవాలుగా ప్రసరింప జేసాడు. ఆ కిరణాలు ఆమె శిరసు వెనుక భాగం మీద పడ్డాయి. లేత సూర్యకిరణాల వెచ్చదనాన్ని అనుభవిస్తూ, కొంచెం సేపు ఆమె అలాగే శిరసు వంచి నిలబడింది. ఆమెపాదాలు, చల్లగా ఊగులాడుతున్న అలల్లో నిశ్చలంగా ఉన్నాయి. కెంపు, నీలశోణిత వర్ణపు అలలను సూర్యుడు ప్రకాశవంతం

చేస్తున్నాడు. చేపలను వేటాడేందుకు రాత్రంతా సముద్రం పై ప్రయాణం చేసిన పడవలు, చాలా దూరంలో దిగంతాల అంచువరకు విస్తరించి ఉన్నాయి. సముద్రంలో కనపడుతున్న వాటి తెరచాపలు తెల్లని రెక్కల్లాగ లేక తోకల్లాగ ఉన్నాయి. వాటికి లంగరు వేయటం వల్ల నిశ్చలంగా ఉన్నాయి. అవి సూర్యాస్తమయంలోపు మళ్లీ సముద్రంలోకి వెళ్లవు.

ఉదయం, కొంచెం సేపటి తరువాత, స్త్రీలు అధిక సంఖ్యలో వచ్చి, ఆ పవిత్రమైన శిలను పుష్పాలతో పూజిస్తారు. అలా పూజ చేసే స్త్రీలందరు జాలరుల భార్యలో, కుమార్తెలో కావటం వల్ల, కొందరు సముద్రం పై చేపల వేటకు వెళ్లిన జాలరుల రక్షణ కొరకు ఒక చిన్న ప్రార్ధన చేస్తారు. మరి కొంతమంది లీల లాగే శిరసు వంచి నమస్కరించి భగవంతుణ్ణి కీర్తిస్తారు. ఉదయం పూట యిలాంటి కార్యక్రమంతో ప్రారంభించటం బాగానే ఉన్నట్లు తోస్తోంది. ఇతర శిలలను వదలి పెట్టి లోతు తక్కువ నీళ్లలో ఉన్న చదునైన ఉపరితలంగల ఈ శిలనే పూజించటానికి వాస్తవమైన కారణమేమీలేదు; కాని వాళ్లు ప్రార్ధన చేసేటప్పుడు పుష్పాలు, కుంకుమ సమర్పించేందుకు ఏదో ఒకటి అవసరం; దానికి తోడు యీరెండు శిలల దగ్గరకు వెళ్లటం సులభంగా ఉంటుంది. దూరంగా తీరం చివర ఉన్న గ్రామ దేవాలయం లాగా యిది దూరం కాదు. ఆదేవాలయంలో పూజలను నిర్వహించే పూజారికి డబ్బు యివ్వాలి; యిక్కడ ఆ అవసరం లేదు. స్త్రీలు పూజ తామే చేయటానికి యిష్టపడతారు.

లీల తండ్రికి పడవ ఉండగా, ఆయన సముద్రంపై చేపల వేటకు వెళ్లినప్పుడు, ఆమె తల్లి సముద్రంలోని యీ శిలవద్దకు పుష్పాలను తీసుకొని వెళ్లి, ప్రార్ధన చేసేది. కాని యిప్పుడు ఆమె తండ్రి చేపల వేటకు వెళ్లటం లేదు. అప్పులు తీర్చేందుకు ఆయన పడవను అమ్మివేసాడు; ఆమె తల్లికి తీవ్రంగా జబ్బుచేసి, బలహీనతవల్ల మంచం లోంచి లేవ లేకుండా ఉంది. అందువల్ల సముద్రానికి పుష్పాలు సమర్పించటంతో ఉదయంపూట కార్య క్రమాలను ప్రారంభించేందుకు లీలే సముద్ర తీరానికి వెళ్లింది. ఒక్కొక్కపుడు ఉదయమే రోజంతటిలోను ఉత్తమ సమయంలా ఆమె భావించేది; యీసమయమే పూర్తి సంతోషకరంగాను, ప్రశాంతంగాను ఆమె భావించేది. లీల తన చేతిలో ఉన్న బుట్టలో యింకా మిగిలి ఉన్న పుష్పాల రేకులను అలలకు సమర్పించింది; వాటిని అలలు త్వరగా దూరంగా కొనిపోయాయి; అప్పుడు ఆమె వెనుదిరిగి తీరం వెంటనడుస్తూ సూర్యకాంతిలో వెలుగొందుతున్న కొబ్బరి చెట్ల వరుస వరకు చేరింది. పని మొదలెట్ట వలసిన సమయం యిదే.

ఆమె సముద్ర తీరం లోని నీలశోణిత వర్ణంతోటి పూలతో మెరుస్తున్న యిసుక తిన్నెల మీదగా, కొబ్బరి చెట్ల తోపులోకి చేరి, తలుపులన్నీ మూసి, తాళం వేయబడి ఉన్న తెల్లని భవనం ప్రక్కగానడిచింది. ఈ భవనం బొంబాయిలోని ధనవంతులది; వాళ్లు చాలా అరుదుగా, సెలవుల్లో మాత్రమే యిక్కడికివస్తారు. ఆ భవనం పేరు 'మాన్ రిపాస్.' ఆ పేరు చిన్న రేకు మీద వ్రాసి, కొబ్బరి చెట్టు బోదెకు మేకులతో బిగించారు. ఆ భవనం పేరుకు అర్థం ఏమిటి? లీల దాని అర్థం ఏమిటో ఎప్పుడూ తెలుసుకోలేదు. కొబ్బరి తోటలో నుండి వెళుతున్న దారిగుండా ఆ భవనం ప్రక్కగా వెళుతున్నప్పుడల్లా దాని అర్థం ఏమిటోనని ఆమె ఆలోచిస్తుంది.

ఉదయపు వెలుగు కొబ్బరి ఆకుల్లోంచి ప్రసరిస్తోంది; అది యింకా చల్లగానే ఉంది; అక్కడక్కడా కనుపించీ కనుపించని పూరి యిళ్లలోంచి వెలువడే కట్టె పుల్లల నీలి రంగు పొగ వలయాలుగా పైకి విస్తరిస్తోంది; ఆ పొగ ఉదయపు వెలుగులో విలీనమవుతోంది. వచ్చగడ్డి పై యింకామంచు పరచుకొనే ఉంది. ఆ మంచు వల్ల సాలెగూళ్లు మెరుస్తున్నాయి. ఆసాలె గూళ్లు చిన్నవిగాను,



దట్టంగాను ఉన్నాయి. అవి పచ్చ గడ్డిపై విస్తరించి ఉన్నాయి. వాటి మధ్యలో రంధ్రం ఉంది; అది పురుగులను పట్టుకొనటానికి ఉపకరిస్తుంది. పొదవాటి గడ్డినుండి, బహిరంగ ప్రదేశాల్లో వికసించే పూపొదల నుండి సీతాకోకచిలుకలు ఎగురుతున్నాయి-వాటిలో జీబ్రాలాగ చారల చారల రంగుతో, రెక్కలు లేతనీలి వర్ణంతోను, రెక్కల చివర ఎఱ్ఱని రంగు కలిగిన అందమైన నల్లనివి, పచ్చని భాస్వరపు రంగుగల చిన్న సీతాకోకచిలుకలు ఉన్నాయి. అవి రెండు, మూడు కలిసి గాలిలోకి ఎగురుతున్నాయి.

వీటితో పాటు మెత్తని ముళ్లతో, నీడనిస్తున్న సరుగుడు చెట్లనుండి దట్టంగా అలము కొన్న మొగలి పొదల్లోంచి ఎగురుతున్న అన్ని రకాల పక్షులున్నాయి. అవిపగటి పూట యితర వేళల్లో కన్న యీ ఉదయంపూట పాటలు పాడుతూ, ఒక దాన్ని మరొకటి పలకరించుకొంటూ, బిగ్గరగా కూస్తున్నాయి. మురళీ నాదం లాంటి కంఠంగల డ్రోంగో పక్షులు అకస్మాత్తుగా క్రిందికి దిగుతూ, గాలిని తళుక్కుమనే కత్తుల్లాగ కోస్తున్నాయి. వాటి రెక్కల పై సూర్యకాంతి ప్రసరించటంతో అవి నీలి; నలుపు రంగుల మిశ్రమం లాగా మెరుస్తున్నాయి. దూకుడుగా ఎగిరే పాల పిట్టలు ఎగురుతూ, తోకలను అటూయిటూ ఆడిస్తూ మంచుపరచుకొన్న పచ్చగడ్డి మీద ఎగురు తున్నాయి. అవి ఎగురుతున్న క్రిములను సాలె గూళ్లలో పడిపోవటానికి ముందే పట్టుకొంటున్నాయి. తలపై యీకల తురాయిలున్న బుల్ బుల్ పిట్టల జంటలు చెట్ల కొమ్మల్లో పాడుతున్నాయి. ఒంటరి జెముడు కాకి ఒకటి పొదలో కనిపించకుండా దాక్కొని, నిశ్చలమైన మానవ కంఠంతో "కూప్-కూప్-కూప్" అని పిలుస్తోంది. ఓ పావురం కూత కూస్తూ, గల గలమనే శబ్దాలు చేస్తోంది. ఈ శబ్దాలన్నీ 'తుళ్' గ్రామపు కంఠం లాగా ఉన్నాయి. సముద్రపు అలల గంభీరనాదం, కొబ్బరి చెట్ల లోంచి వీచే గాలి లాగాకూడా ఉంది. ఈ గ్రామపు కంఠం లాంటి శబ్దాలు లీలకు ప్రశాంతంగాను, హాయిగా ఉండమని, అంతా చక్కబడుతుందని, అంతాయింతకుముందు లాగే ఉంటుందని చెప్పున్నట్లు తోస్తోంది.

లీల చిత్తడి సముద్రపు కయ్యపై వంతెనగా ఉన్న కొయ్య దుంగను చేరుకొంది. ఈ దుంగ మీదగా వెళ్తే సముద్రపు కయ్యకు ఆవలి ఒడ్డున ఉన్న తమ పూరింటికి చేరవచ్చు. అక్కడి నుండి తమ పూరింటి వైపు చూస్తే పరిస్థితులు యింతకు ముందు లాగా లేవని, పరిస్థితులు ఏమీ బాగాలేవని కూడా లీలకు తెలిసిపోయింది. తమ పూరింటిని ఎప్పుడో కప్పించి ఉండవలసింది-పాత కొబ్బరి ఆకులు ఎండిపోయి, అక్కడక్కడ చిరిగిపోయి, వాసాల మీద నుండి రాలి పడుతున్నాయి.

మట్టి గోడలు పడిపోతున్నాయి. కిటికీలకు రెక్కలు లేక పోవటంతో యిల్లంతా కనపడుతోంది. చుట్టూరా ఉన్న కొబ్బరి చెట్ల, అరటి చెట్ల తోపుల్లో ఉన్న పూరిళ్ల లో లాగ వాళ్ల యింట్లో పొయ్యి మీద వంట పాత్ర నుండి వలయాలుగా వెలువడే పొగ కూడా కాన రావటంలేదు.

లీల చెల్లెళ్లు బేల, కమల యింటి వెనుక వైపున ఉన్న వేప చెట్టునుండి విరిచిన పుల్లలతో పళ్లుతోముతూ, గుమ్మంలో నిలబడ్డారు. వాళ్లు బడికి వెళ్లేందుకుస్నానం చేయలేదు, బట్టలు మార్చుకోలేదు. "బట్టలు వేసుకోరేం? మీకు పాఠ శాలకు ఆలస్యమౌతుంది," అని లీల హెచ్చరించింది. దానికి వాళ్లు. "మాకు నీవు యింకా టీ పెట్టలేదుగా-నీవు యివాళ ఆలస్యమయ్యావు," అనిసమాధాన మిచ్చారు.

లీల తన చేతిలోని చిన్న బుట్టను గుమ్మంలో పడవేసి, పొయ్యి వెలిగించటానికి లో పలికి వెళ్లింది. సముద్రతీరానికి వెళ్లక ముందే పొయ్యి వెలిగించి ఉండవలసిందని అని పించింది ఆమెకు. అలా చేసి ఉంటే పొయ్యి మీద నీళ్లు తాను తిరిగి వచ్చేసరికి మరుగుతూ ఉండేవి. కాని ఎందువల్లో ఉదయం మేల్కొన్నప్పుడు ఆమెకు సముద్ర తీరానికి పరుగెత్తి వెళ్లాలనిపించింది. సముద్ర తీరానికి వెళ్లి, సముద్రాన్ని చూచి, పవిత్రశిలపై పూలు చల్లనిదే ఆమెకు క్రితం రాత్రి ఆరిపోయిన బొగ్గులను, ఎంగిలి వంట పాత్రలను చూడాలనిపించ లేదు. ఇప్పుడు ఆమె ఆపని పూర్తి చేసింది కాబట్టి వంట చెరకు సిద్ధంచేసి పొయ్యి వెలిగించి కుటుంబ సభ్యులందరికి టీ తయారుచేయవచ్చు. బేల, కమల, తనను అవగాహన చేసుకోగలరని ఆమె భావించింది.

లీల మౌనంగా పొయ్యి వెలిగించి, ఓ పాత్రను దాని మీద ఉంచింది. దానిలో కొంచెం నీరు పోసి, ఆ నీటిలో పిడికెడు టీ ఆకులు, పంచదార వేసింది. ముగ్గురు అక్కా చెల్లెళ్లు పొయ్యి మీద నీరు మరగపెట్టి తమసోదరుడు పాలు తీసుకొని రావటానికి వెళ్ళగా వానికొరకు ఎదురుచూస్తూ కూర్చొన్నారు. ఒకప్పుడు వాళ్లకు గూడ ఓగేదె ఉండేది. దాన్ని గూడ అప్పులు తీర్చటానికి అమ్మివేయవలసి వచ్చింది. అందు వల్ల యిప్పుడు పాలు గ్రామంలోని పశువుల కాపరి నుండి తేవలసి ఉంది.

వాళ్లు ముగ్గురూ కొబ్బరి చెట్ల తోపులోంచి పోతున్న మార్గం వైపుచూస్తూ యింటి గడప మీద కూర్చొన్నారు, ఇంతలోనే హరిచేతిలో చిన్న యిత్తడి చెంబుతో పాలు తెస్తూ కనిపించాడు. వాళ్ల స్తోమత అంత వరకే. తన చెల్లెళ్లిద్దరి లా కాకుండా అతను స్నానం చేసి శుభ్రమైన ఖాకీనిక్కరు, చొక్కా వేసుకొన్నాడు. అతని



చెల్లెళ్లిద్దరూ అతని చేతిలోంచి పాలు తీసుకోవటానికి పరుగెత్తారు. లీల కొంచెం పాలను పొయ్యి మీద పాత్రలోపోసింది. త్వరలోనే టీ తయారు కావటంతో వేడి, వేడి టీ తో నిండిన లోహపుగ్లాసులను ఎఱ్ఱమల్లె చెట్టు కింద ఉన్న నులకమంచం దగ్గరకు తీసుకొనిపోయి. అక్కడ కూర్చొని టీ త్రాగుతున్నారు.

"అమ్మ, నాన్నకో" అని హరి అడిగాడు.

"అమ్మకు టీ నేనిస్తాలే," అని లీల అంది.

"నాన్న నిద్రపోతూనే ఉన్నాడుగా," అనిబేల, కమలలు యిద్దరూ, ఒకేసారి అన్నారు.

ఖాళీగ్లాస్ వంక చూడటంలో హరి తల వాలి పోయింది. ఇంతలో లీల తన చెల్లెళ్లు గ్రామంలో బడికి వెళ్లే బాలికలందరు వేసుకొనే నీలి రంగు పొట్టి లంగాలు,

తెల్లటిచొక్కాలు ధరించే ఏర్పాటుచేసి, చినిగిన వాళ్ల కొద్దిపాటి పుస్తకాలను వెదకి పెట్టటంతో వాళ్లు బడికి బయలుదేరారు. అప్పుడు హరి లేచి నిలబడి, చెల్లెళ్లిద్దరినీ బడిదాకా పంపించి, తిరిగి వచ్చేటప్పుడు పొలం వెళ్లి కొంత త్రవ్వకంపని, నీళ్లు పెట్టే పనిని చూస్తానన్నాడు.

లీల వాళ్ల అమ్మకు ఒక గ్లాస్‌తో టీ తీసుకొనివెళ్లింది. వెళ్ళేముందు ఆ టీ లో కొంచెం అదనంగా పాలు కలిపింది. లీల గది గుమ్మానికి ఉన్న తెరను తొలగించుకొని, మాసిన దుప్పట్లు పరచి ఉన్న నులకమంచం మీద వాళ్ల అమ్మ పండుకొని ఉన్న చోటికివెళ్లింది. ఆమె తల్లి గూడ, అక్కడ ఉన్న నలిగిన పాత గుడ్డ పేలికలా ఉంది. చాలా రోజులుగా ఆమె అనారోగ్యంతో



ఉంది. ఆమె అనారోగ్యం ఏమిటో ఎవరికీ తెలియదు. ఆమెకు ఎలాంటి నొప్పులు లేవు, జ్వరమూ లేదు; అయినా ఆమె రోజుకీ బలహీనపడిపోతోంది. ఇప్పుడు ఆమె లేచి కూర్చొని, టీ త్రాగ లేని స్థితిలో ఉంది. టీ త్రాగేందుకు లీల తన తల్లి తలను ఎత్తిపట్టుకొని, సహాయంచేస్తూ ఉంటే, కొద్ది కొద్దిగా గ్లాస్ లోంచి టీ త్రాగింది. లీల తల్లి చాలా బలహీనంగా ఉంది. అందువల్ల ఆమెను ఎవరూ తాకటానికి గూడా యిచ్ఛగించరు. అయితే లీల తన తల్లి పట్ల మృదువుగా, జాగ్రత్తగా వ్యవహరిస్తుంది.

లీల, చీకటిగాను, మసకగాను ఉన్నగదిలో చాపపై నిద్రపోతున్న గుడ్డలమూట మీద నుంచి తల త్రిప్పుకొంది. ఆ మూటలో చలనం లేదు కాని, ఆగి, ఆగి శ్వాసిస్తూ, గురగురమన్న శబ్దం వెలుపడుతోంది. లీలకు దూరంనుండి కూడా పులిసిన సారాయి కంపువస్తోంది - ఆ కంపు ఆమెకు పరిచయమైందే, ఆమె యీ కంపును చిన్న తనం నుండి అసహ్యించు కుంటూనే ఉంది. ఆమెముక్కు మూసుకొని, తన తండ్రి యీ సారాయి కంపుతో తల్లిగదిని దుర్గంధ పూరితం చేయకుండా మరోమూలని నిద్రిస్తే బాగుండునని అనుకొంది. కాని ఆమాట ఆయనకు చెప్పే ధైర్యం, ఎవ్వరికి, ఆఖరికి ఆమెతల్లికి కూడాలేదు.

" లీల, అమ్మాయిలు బడికి వెళ్లారా?" అని మాత్రమే ఆమె తల్లి అడిగింది.

"ఆఁ ! వెళ్లారు."

"హరి పొలం వెళ్లాడా?"

" ఆఁ ! హరి పొలంవెళ్ళాడు."

"అయితే నీవు యిల్లు ఊడ్చి మార్కెట్‌కు వెళ్లివచ్చి, వంట చేయ్, లీలా."

లీలకు అలా చెప్పవలసిన అవసరం లేక పోయినా, "అలాగే అమ్మా," అంది.

లీల యింటి దగ్గరే ఉండి వంట చేయటానికి, బట్టలుతకటానికి, యితరుల సంరక్షణ చేయటానికి, చాలా కాలం క్రితమే బడి మానివేసింది. ఆమె మార్కెట్‌కు వెళ్లటానికి బయలుదేరింది.

బేల, కమల పుస్తకాలతో గ్రామంలోని రోడ్డు మీద పరుగిడుతున్నారు. హరి బెత్తం పట్టుకొని వాళ్లను వెంబడిస్తూ, వాళ్లను బడికి పంపిస్తున్నట్లు నటిస్తున్నాడు.

గ్రామంలోని రోడ్డు నిండా దుమ్ము నిండి ఉంది. అది ఎత్తైన కొబ్బరి తోపులు, అంతకంటె ఎత్తుగాను, సన్నగాను ఉన్న, పచ్చని, పోకచెట్లతోపుల మధ్యగుండా పోతుంది. ఈ రోడ్డు ప్రక్క యిళ్లు తీరం వెంట ఉన్న పూరి

యిళ్లలాంటివి కావు; యిటుకలతో నిర్మింపబడి, కొయ్యద్వారాలు, యినుప కమ్మిల చట్రాల కిటికీలున్న దిట్టమైన భవనాలు. ఈ భవనాల్లో చాలా వసారాల్లో కప్పునుండి వేలాడుతున్న ఉయ్యాల బల్లలు ఉన్నాయి. కొన్నింటి పై కొంతమంది వృద్ధులు ఉదయం పూట ఎండలో కునుకు తీస్తున్నారు. ఒక్కచోట తెల్ల పిల్లి నేల మీద నిద్రపోతూంటే, స్త్రీలు, మెట్ల మీద కూర్చొని పళ్లాల్లోని బియ్యంలో రాళ్లు, మట్టి గడ్డలు ఏరుతున్నారు. పెరళ్లలో మందారాలు పూచి ఉన్నాయి. కోళ్లు దుమ్మును కెలుకుతున్నాయి. తపాలా కార్యాలయాన్ని యింకా తెరవ లేదు. బియ్యం, గోధుమలు, పంచదార, కిరోసిన్ అమ్మే దుకాణం తెరచి ఉంది. బేల, కమల దాని ముందు ఆగారు.

"పదండి, పదండి, యిప్పటికే మీకు ఆలస్యం అయ్యింది," అని హరి కేక వేసాడు. చేతిలోని బెత్తం ఉంపుతూ.

" అన్నా, స్వీట్లు కొని పెట్టవా? కొద్దిగానే," అని అడిగారు వాళ్లిద్దరు.

"స్వీట్లు లేవు, ఏమీ లేవు, నాదగ్గర డబ్బులు లేవు," అన్నాడు, హరి.

" ఓ హరి అన్నా, మూడే, రెండే - ఆఖరికి ఒక్కటి, ఒకటంటే ఒకటే," అని అరిచారు వాళ్లిద్దరూ.

కాని హరి అనంగీకార సూచకంగా తల అడ్డంగా ఊపి, తీక్షణంగా చూసాడు. వాళ్లిద్దరూ హరి గంభీరంగా ఉన్నారని గ్రహించి, నిరుత్సాహంగా నడక కొనసాగించారు.

గ్రామం చివర ఒక చెరువు ఉంది. ఆ చెరువులో మోకాళ్ల లోతు నీళ్లులో, నీరు త్రాగుతూ, నీళ్ళను తోకలతో మీద చల్లుకొంటూ గేదెలు నిలబడి ఉన్నాయి. ఆ చెరువులో ఎఱ్ఱని ఆకులు, కాడలతో ఎఱ్ఱతామరలు, పచ్చని ఆకులు, కాడలతో తెల్ల తామరలు వికసించి ఉన్నాయి. చదరంగాను, గుండ్రంగాను ఉన్న పెద్ద తామరాకుల మధ్య బాతులు ఈదుతున్నాయి. తెల్లని కొంగలు లోతు తక్కువగా ఉన్న చోట నిలబడి చేపలను వేటాడుతున్నాయి. అవతలి ఒడ్డున స్త్రీలు బట్టలుతుకుతున్నారు. అలా ఉతుకుతూ వాళ్లు బట్టలను చదరంగా ఉన్న రాళ్లకేసి బాదుతూ, అరుస్తూ, నవ్వుతున్నారు. పైకి లేచే బట్టలనుండి నీటి తుంపరులు పైకి ఎగురు తున్నాయి. వాళ్లు ఆకర్షణీయమైన ఎరుపు, నారింజరంగు, నిమ్మపండు పసుపు రంగు చీరెలు కట్టు కొన్నారు. వాళ్లు వాటిని నీటిలో నడిచేటప్పుడు, బురదలో నిలబడటానికి వీలుగా మడిచి బొడ్లో దోపుకొన్నారు. వాళ్లందరూ యింటి పనిలోని యీభాగాన్ని ఆనందిస్తున్నట్లు తోస్తోంది

అప్పటికే గ్రామంలో రోడ్డుగా ఉపయోగించే సందులో దుమ్మురేగి, గాళ్లు ఏర్పడ్డాయి. చాలా మంది పిల్లలు పరుగిడు తున్నారు - వాళ్లలో ఆ సందు జాతీయ రహదారిలో కలిసే చోట, కుడివైపున ఉన్న బాలుర పాఠశాలకు ఖాకీనిక్కర్లు, తెల్ల చొక్కాలు ధరించి వెళ్లే బాలురు, ఎడమవైపున ఉన్న బాలికల పాఠశాలకు నీలిరంగు పొట్టిలంగాలు, తెల్లని చొక్కాలు ధరించి వెళ్లే బాలికలు కూడా ఉన్నారు. ఆ పాఠశాల కొండకు దిగువన ఉంది ఆ కొండపై ఒక ఆలయం ఉంది. హరి యింతకుముందు బాలుర పాఠశాలకు వెళ్తూండే వాడు. కాని యిటీవల వాళ్లనాన్న ఏమీ పనిచేయక పోవటంవల్ల తాను పొలం పనిచేయవలసి ఉందని బడికి వెళ్లటం మాని వేసాడు. అందు వల్ల అతను కొంఠ దిగువ ప్రాంతం వరకు మాత్రమే వెళ్లాడు. అక్కడ శేల, కమల, రేకుల కప్పుతో ఉన్న బడివైపు మళ్లారు. ఆ పాఠశాల ఖాళీగా దుమ్ముతో నిండిన స్థలం మధ్యలో ఉంది. తరువాత హరి తిరిగి వెళ్లటానికి వెనుదిరిగాడు.

అలా వెనుదిరిగే సమయంలో క్రొత్త యినుపరేకుల పాకకు సంబంధించిన ప్రకాశవంతమైన మెరుపులు అతను చూసాడు. అలాంటి దాన్ని అతను ఇంతకు ముందు చూడలేదు. అది పాఠశాలకు దగ్గరలోని కొంఠ మొదట్లో ఉంది - ఆ పాకకు నాలుగు వైపులా వంకర, వంకర్లుగా ఉన్న యినుపరేకులు గోడల్లా అమర్చి ఉన్నాయి. పూరి కప్పు ఉంది. దాని ముందు ఉక్కు గొట్టాలతో నింపిన పలుపు పచ్చ లారీ ఒకటి నిలబడి ఉంది. గ్రామంలో చాలా అరుదుగా మాత్రమే క్రొత్త వస్తువులను చూడటం జరుగుతుంది కాబట్టి గ్రామస్తులు అలాంటివి కనపడినప్పుడు విచిత్రంగాచూస్తారు. అలాగే గ్రామంలో క్రొత్తవస్తువు కనపడటంతో హరిగూడ ఆశ్చర్య పడ్డాడు. ఓ చిన్నగులక రాయిని నేలపైనుండి తీసుకొని దాన్ని ఒక చేతినుండి మరోచేతిలోకి మార్చుకొంటూ, హరి ఆ లారీ వైపునడిచాడు. ఆ పాకతలుపులు తెరచి ఉన్నప్పటికీ చుట్టుపట్ల ఎవరూ ఉన్నట్లు లేదు. పాకలోని నేల మీద వంట పొయ్యి, కొన్ని సత్తు పాత్రలు కనపడుతున్నాయి. హరి లారీని పరిశీలించటానికి వెళ్లాడు. లారీలో ముందు సీటులో కాళ్లుకిటికీ గుండా బయటికి వేసి డ్రైవర్ నిద్రపోతూండటం కనిపించింది. ఎవరు, ఎందుకు, ఈ ఉక్కు గొట్టాలను పంపి ఉంటారోనని ఆలోచిస్తూ హరి డ్రైవర్ వైపుచూసాడు. అతను బిగ్గరగా గుర్రుపెడుతున్నాడు.

హరి మళ్లీ సందు వరకునడిచి వెళ్లాడు. అక్కడ గ్రామంలోని కుర్రవాడొకడు దుమ్ములో సైకిల్ త్రొక్కుతూ పోతున్నాడు.

"ఏయ్, రాము - ఇక్కడ ఇల్లు కట్టిందెవరు?" అని హరి ఆ కుర్రవాణ్ణి

అడిగాడు.

రాము, హరి తన దగ్గరకు వచ్చేంతవరకు ఆగాడు.

" నీకు తెలియదా?" అని అతను హరిని అడిగాడు. "గ్రామంలో ప్రతి వాళ్లు దీన్ని గురించే మాట్లాడుతున్నారు."

"నేను గ్రామంలోకి వెళ్లటం లేదు, అక్కడ అందరికి త్రాగటం తప్ప మరో పని లేదు," అన్నాడు హరి. తన తండ్రిని సారా దుకాణం వెలుపల కలుసుకోవలసి వస్తే తనకు భయం వేస్తుందని, గ్రామంలోని దుకాణాల్లో తన దగ్గర డబ్బేమీ లేదని హరి ఆ కుర్రవానికి చెప్పలేదు.

"నీవు వినే ఉండవచ్చు. ప్రభుత్వం యిక్కడ ఒక కర్మాగారాన్ని నిర్మించ బోతోంది. ఒకటి కాదు, చాలా; కొన్ని వందలు," అని అన్నాడు రాము.

"అయితే అక్కడ కర్మాగారం ఏర్పాటవబోతోందా?" అని హరి యింతకు ముందు చూసిన యినుపరేకులు, పూరి కప్పుతో ఏర్పాటైన పాకను చేతితో చూపిస్తూ, తృణీకారంగా నవ్వాడు.

"ఆఁ! అది కాపలా దారుడు ఉండే పాక మాత్రమే మొదట ఒక కాపలా మనిషిని పంపిస్తారు. తరువాత నిర్మాణానికి అవసరమయ్యేవస్తువులను పంపిస్తే యితను వాటికి కాపలాగా ఉంటాడు. ఆ తరువాత బుల్ డోజర్లను, నీటి ఆవిరితోనడిచే రోలర్లను పంపిస్తారు. జాతీయమార్గాన్ని వెడల్పుచేస్తున్నారు. రెండింతలు వెడల్పుచేస్తున్నారు. అలా అయితే ఆ యంత్రాలను యిక్కడికి తీసుకొని రావటానికి వీలవుతుంది. తర్వాత కార్మికులకు యిళ్లు నిర్మిస్తారు. ఆ తరువాత కార్మికులు వస్తారు. కర్మాగారాలు నిర్మించటం జరుగుతుంది," అన్నాడు రాము.

రాము భవిష్యత్తును గురించి వర్ణించుకుంటూ పోతున్నాడు. హరి వాటన్నిటిని నమ్మలేక పోయాడు. ఇనుప రేకులపాక, నిద్రించే డ్రైవర్ ఉన్న పసుపు పచ్చలారీ - యివి అలాంటి గొప్పమార్పులకు ప్రారంభ సూచనగా అతనికి తోచలేదు. "అయితే అక్కడ ఉన్న కొండ, దాని మీద దేవాలయం, ఏమౌతాయి?" అని అతను రాము చెప్పిన కథను నమ్మలేని విధంగా అడిగాడు.

రాము గడ్డి మోవును కోస్తున్నట్లు తన చేతితో అతిశయంతో కూడిన సైగ చేస్తూ, "దాన్ని పగులకొడతారు. చదును చేస్తారు. దాని మీద కర్మాగారాన్ని నిర్మిస్తారు," అన్నాడు.

"ఉఁ హూఁ" అని ఆమాటల్లో దేన్ని నమ్మనట్లు హరినవ్వాడు. కొండ, దేవాలయం ఎలా అదృశ్యమౌతాయి? అవితాను పుట్టినప్పటి నుంచి ఉన్నాయి.

రాము చెప్పేదంతా తప్పక కట్టుకథ అయిఉండాలి. "చూద్దాం. మరి అద్భుతమైన మీ కర్మాగారంలో ఏమి తయారు చేస్తారు?" అని హరి రామును అడిగాడు.

"ఆ కర్మాగారం నాది కాదు - కాని నాకు ఉద్యోగం యిస్తారు. వాళ్ల కర్మాగారాల్లో పని చేయటానికి మనుషులు కావాలి - అందువల్ల మనకు ఉద్యోగాలు లభిస్తాయి," అని రాము ఉ త్తేజంతో గాలిలో చేయి ఊపుతూ అన్నాడు.

అప్పటికి వాళ్లు ఊరి చెరువు దగ్గరకు చేరుకొన్నారు. అక్కడ సందు మెత్తగాను, చదరంగాను ఉంది. రాము తన సైకి లెక్కి, "హరి, మనకు ఉద్యోగా లొస్తాయి - మనకు ఉద్యోగాలొస్తాయి. నీవేచూస్తావుగా," అంటూ పెద్దగా అరుస్తూ, సైకిల్ తొక్కుకొంటూ వెళ్లిపోయాడు.

హరి ఆ ఉదయం అంతా తమ యింటివెనుక ఉన్న పొలంలో ప్రశాతంగా పని చేస్తూ రాము చెప్పిన విషయాన్ని గురించే ఆలోచించాడు. అతను వాళ్లకున్న ఆ కాస్త పొలంలో కలుపు తీసి, రాళ్లు త్రవ్వి, వ్రేళ్లుతొలగించి, చలికాలంలో కూరగాయలు పండించటానికి సిద్ధంచేస్తున్నంతసేపు అతనికి - "ఉద్యోగం. కర్మాగారం. చాలా ఉద్యోగాలు, చాలా కర్మాగారాలు, ఉద్యోగాలు. కర్మాగారాలు - ఉద్యోగాలు," అన్నమాటలే చెవుల్లో ప్రతిధ్వనించాయి. అలా అతను ఎండలో వంగి త్రవ్వటం, వ్రేళ్ళులాగి వేస్తూండటంతో త్వరలో హరి శరీరమంతా చెమటతో తడిసిపోయింది. ఓమారు పదునైన రాయివల్ల అతని కాలి బొటన వ్రేలు తెగటంతో చాలా నొప్పికలిగింది ఒకసారి బాగా దట్టంగా పెరిగిన రామ బాణం పూల పొదను నరకటానికి వెళ్తే, నల్లని పాము ఒకటి అందులోకి ప్రాకిపోయి దాక్కోవటంతో దాన్ని అలాగేవదలి వేయవలసివచ్చింది. పని చేస్తున్నప్పటికీ అతను కర్మాగారాన్ని గురించి, ఉద్యోగాన్ని గురించి ఆలోచిస్తూనేఉన్నాడు. తనకు గూడ ఉద్యోగం లభిస్తుందా? తాను కర్మాగారంలో పని చేసి డబ్బు సంపాదించ గలడా? తాను పాఠశాల విద్యను పూర్తిచెయ లేదు కాబట్టి తనకు ఉద్యోగం లభించదని అతను భావించాడు. తనకు రాయడం, చదవడం కూడికలు చేయడం చేతనైనప్పటికీ తాను పరీక్ష రాయలేదు, పట్టాలేదు. అలాంటప్పుడు తనకు ఉద్యోగం ఎలా లభిస్తుంది? కర్మాగారంలో పని చేయటానికి నిజంగా పట్టా అవసరమా? ఏ వ్యక్తికైనా చేతులు అనుకూలంగా ఉంటే యంత్రాలను నడపవచ్చు, పని ముట్లను ఉపయోగించవచ్చు. హరికి అలాంటి చేతులే ఉన్నాయి.

హరి తన చేతులను పరిశీలించుకొనేందుకు పని ఆపి వేసాడు. అతని చేతులు ధృఢంగాను, గోధుమ వర్ణంతోను, మొరటుగా ఉండి శ్రమచేసే వ్య క్తి చేతులు.

అతను ఆ చేతులతో త్రవ్వటం, విత్తనాలు చల్లటం, కొబ్బరి చెట్లనుండి కాయలు కోయటం, సముద్రంలో వలలు లాగటం తప్ప మరే పనులు చేయలేదన్నది నిజమే కాని వాటికి యంత్రాలను నడపటం నేర్పుతాడు. నిస్సందేహంగా అలాచేయగలనని అతను అనుకొన్నాడు. నిస్సందేహంగా తాను అలాచేయగలడా? లేదు, బహుశ పూర్తిగా నమ్మకంలేదు.

హరి అలాగే నిలబడి తన చేతులను చూసుకొంటూండగా అతని అక్క లీల, వాళ్ల యింటినుండి పొలందాకా ఉన్నకాలి బాట మీదుగా నడచి వచ్చింది. ఆమె ఒక చేత్తో నడుము మీద నీళ్లకుండను పట్టు కొంది, మరోచేతిలో హరికోసం తెచ్చిన భోజనం ఉంది. గుడ్డలో చుట్టిన కొద్దిపాటి ఎండిపోయిన చపాతీలే అతని భోజనం. ఆమె వెంట వాళ్ల నలుపు, తెలుపు రంగుల పొట్టి కుక్క పింటో కూడ వచ్చింది. హరిని చూడగానే పింటో ముందుకు ఉరికి, అతన్ని కలుసు కోవటానికి వేగంగా ముందుకు దూకింది. లీల దాని వెనుక మెల్లగా వస్తోంది. హరి ఖాళీగా ఉన్న పొలంలో అలా ఊరకే నిలబడటం ఆమెకు నచ్చదు. అయినా ఆమె, "హరి భోజనం చెయ్," అతనికి అంద జేసి అతనికి నీటిని తీసుకొని రావటానికి కుండతో బావి దగ్గరకు వెళ్లింది.

హరి కూడ ఆమెతో పాటే బావి దగ్గరకు వెళ్లాడు. బావిలోని ఒకటి, రెండు కప్పలు బకెట్‌ను చూసి భయ పడ్డాయి. త్రాడు చివర బరువుగా నీటితో నిండి పోవటంతో దాన్ని పైకి లాగటానికి అతను ఆమెకు సాయంచేసాడు. తరువాత అతను బావి అంచున భోజనంచేయటానికి కూర్చున్నాడు. చపాతీలతో పాటు తినటానికి చిటికెడు ఉప్పు, వాళ్లయింటి వెనుక ఉన్న మిరప మొక్కలనుండి కోసిన పచ్చి మిరపకాయలు తప్ప మరేమీ లేవు.

లీల నడుం మీద చేతులు పెట్టుకొని హరిని గమనిస్తూ ఉంది. "మనమేం చేద్దాం," అందామె ఆకస్మికంగా.

అలా అనటంలో ఆమె మనసులోని భావం ఏమిటో హరికి బాగా తెలుసు, కాని అతనికి ఆ విషయం ఆమెకు చెప్పటం యిష్టంలేదు. అతను ఎప్పుడూ ఎక్కువ మాట్లాడడు, అతను ఎప్పుడూ మాట్లాడే ముందు విషయాలను గురించి నిదానంగా, జాగ్రత్తగాను ఆలోచించటం మంచిదని భావించేవాడు. అందువల్ల అతను చపాతీలు, మిరపకాయలను తింటూనే ఉన్నాడు.

"నాన్న యింకా అక్కడ నిద్రపోతూనే ఉన్నాడు. ఆయన రోజంతా నిద్రపోతాడు. ఆయన చీకటి పడిన తర్వాతనే నిద్రలేచి, తిన్నగా సారాదుకాణానికి వెళతాడు," అంది లీల, కళ్ల నీళ్ల పర్యంతమై.

"ఆయన్ని అలాగే చేయనివ్వు," అన్నాడు హరి, తింటూనే.

"ఆ పాడు మనుషులు తయారుచేసే అమ్మే సారాత్రాగి ఆయన తన ప్రాణం మీదికి తెచ్చుకొంటాడు."

"తెచ్చు కోనివ్వు," అన్నాడు హరి మళ్లీ, తింటూనే.

"అయితే అమ్మ? అమ్మ? మనం? మనసంగతేమిటి? మనలను ఎవరు చూస్తారు?" అంది లీల.

" ఆయన మన సంగతి పట్టించుకోవటం లేదు. మనకు సంబంధించిన విషయాలను మనమే చూసుకొంటున్నాం గదా?" అన్నాడు హరి, కారంగా ఉన్న మిరప ముక్కను ఊసివేస్తూ.

"ఎలాగ?" అంది లీల. "నీవు, నేను బడికి వెళ్లటంలేదు. బేల, కమలయ్య మాత్రమే బడికి వెళుతున్నారు - వచ్చే సంవత్సరం మనం వాళ్లకు క్రొత్త పుస్తకాలు కొన లేము. మనకు ప్రతిరోజు తినటానికి పట్టి రొట్టె, అన్నం మాత్రమే ఉంటుంది. బజారులో వస్తువులు కొనటానికి ఎప్పుడూ సరిపడే డబ్బులుండవు - మల బారీలకు మనం కొబ్బరి కాయలు అమ్మినపుడు మాత్రమే ఉంటాయి. నీవు చేపల వేటకు వెళ్లినప్పుడు మాత్రమే మనం చేపలు తినటానికి వీలవు తుంది. నాన్న చేపల వేటకు వెళ్లడు. ఇలా అయితే అమ్మ ఆరోగ్యం ఎలాచక్కబడు తుంది?" అంది లీల.

లీల మాటలు విన్న హరి కొంచెం ముందుకు వంగాడు. ఈ విషయాలు తనకు తెలుసు. వాటిని గురించే అతను ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటాడు. అందు వల్ల అతనికి లీల పెద్దగా ఏడ్వటం నచ్చలేదు. తాను మాత్రం ఏం చేయగలడు? అతను పొలం పని చేస్తున్నాడు. కొబ్బరి చెట్లు ఎక్కి, అమ్మటానికి కొబ్బరి కాయలు కోస్తున్నాడు. ఖాళీ ఉన్నప్పుడు వల తీసుకొని తీరం వెంట చేపలను పడుతున్నాడు. ఇంతకంటె అతను ఏంచేయగలడు? ఈ పాటి కృషి సరిపోదని అతనికి తెలుసు. కాని తను యీపాటి పని మాత్రమే చేయగలడు.

"నేనేం చేసేది. నేను చేయగలిగింది చేస్తున్నాను," అన్నాడతను అస్పష్టంగా.

" నాకు తెలుసు" అంది లీల, కళ్లలో నీరు నింపుకొంటూ. "అయినా హరి, యిప్పుడు మనం మరింత కృషి చేయవలసి ఉందని నీవు భావించటంలేదా?" అని ఆమె అడిగింది.

ఆమె అలా అనటంతో హరి తినటం ఆపి, భోజనంలో మిగిలిన భాగాన్ని ప్రక్కన ఉంచి, ఆమెకు సమాధానం చెప్పి, నమ్మకం కలిగించే మార్గాన్ని గురించి, ఆలోచిస్తూ ఆమె వైపుచూసాడు.

"ఏదో ఒకటి జరుగుతుంది లీల" అన్నాడతను. చివరికి "గ్రామంలో కుర్రవాళ్లు యిక్కడ తుళ్‌లో ఒక కర్మాగారం నిర్మింపబడబోతోంది అని చెప్తున్నారు. అందులో అందరికి ఉద్యోగాలు లభిస్తాయి. బహుశ నాకుగూడ ఉద్యోగం లభించవచ్చు."

"ఎప్పుడు?" అంది లీల.

"నాకు తెలియదు. ఇప్పుడు కాదు. చాలా కాలంవరకు మాత్రంకాదు. ఇంతలో - యింతలో ఎక్కడైనా పనిదొరుకుతుందేమో విచారిస్తాను. ఈ సారి డిసిల్వాలు బొంబాయి నుండి వచ్చినప్పుడు నన్ను వాళ్లు తమతో తీసుకొని వెళ్లి నాకు పని యిప్పించ గలరేమో అడుగుతాను," అన్నాడు హరి. ఈ భావం హరికి చాలా రోజులుగా ఉన్నప్పటికీ, ఎప్పుడూ వెల్లడించలేదు. ఆ విషయం యీ విధంగా వెల్లడికావటంతో అతను పూర్తిగా ఆశ్చర్యపడ్డాడు. లీల కూడా అలాగే ఆశ్చర్యపోయింది.

"బొంబాయిలోనా?" అంది ఆమె. "అయితే హరి నీవు మమ్మల్ని వదలి వెళ్లిపోతావా?"

"అవును. నేను యిక్కడ ఉంటే చేపలువట్టే పడవ మీద నాకు పని దొరుకుతుంది నేను వాళ్లను అడుగుతాను. ఏమౌతుందో చూద్దాం," అన్నాడు హరి.

లీల అంగీకార సూచకంగా తల ఊపింది. హరి పెరిగి పెద్ద వాడై, త్వరలోనే ఉద్యోగం సంపాదించి, డబ్బు సంపాదించగలడన్న ఆలోచన ఆమెకు ఊరటనిచ్చింది. అతను యింకా చిన్న వాడేనన్న విషయం వాస్తవమే. తన కంటె ఒక సంవత్సరం చిన్న వాడు. అందువల్ల అతను వయోజనుడైన వ్యక్తి లాగా పని చేయాలని ఆశించటం భావ్యంకాదు. వాళ్ల కుంటుంబంలోను మార్పు అకస్మాత్తుగాను, త్వరగానురాదు, కాని ఎప్పుడో ఒకప్పుడు మార్పువస్తుంది. అలావస్తుందని నమ్మాలి.

ఆమె లేచి నిలబడి, బరువుగా ఉన్న నీటి కుండను తీసుకోవటానికి వంగింది. ఆమెకు సాయంచేయటానికి హరి గూడా వంగాడు, వాళ్లిద్దరూ కలిసి దాన్ని పైకెత్తారు. లీల కుండను తల మీద పెట్టు కొంది. ఆమె ఒక క్షణంపాటు కుండను కుదురుగా ఉంచుకొనేందుకు నిలబడి తర్వాత వాళ్ల పూరింటికి నడిచి వెళ్లింది. ఇప్పుడు ఆమె తనపని తాను చూసుకోవచ్చు. పింటో ఎప్పటి లాగే, అంకితభావంతో ఆమెను అనుసరించింది.

హరి యిక పని చేయలేక పోయాడు. లీలతో తాను మాట్లాడుతున్నప్పుడు భవిష్యత్తును గురించి ఆశతో ఉన్నా దాన్ని గురించి వాస్తవంగా తానేమైన

చేయగలనా అని యిప్పుడు ఆలోచించటం ప్రారంభించాడు, కూరగాయల మొక్కలు నాటబోయే పొలం వైపు చూసాడు. అది రాళ్లతో నిండి ఉంది. పొలాన్ని శుభ్రంచేసి, త్రవ్వి గుమ్మడిలాంటి విత్తనాలను నాటితే? కూరగాయలను తిని వేయటం జరుగుతుంది. తర్వాత ఏమీ మిగలదు, ఇది అసలు పనికిరాదు.

అతను సముద్రం దగ్గరికి నడిచివెళ్లాడు. సముద్రం భారంగాను, నిశ్చలంగాను ఉండి, మధ్యాహ్నపు ఎండలో మెరుస్తూ ఉంది. అలలు చాలా దూరంలో ఉన్నాయి. చేపలను వేటాడే పడవలు దిగంతాల్లో ప్రశాంతంగా ఉన్నాయి. అవి ప్రపంచం చివరకు చేరుకొని, యికముందుకు పోవటానికి వీలులేనట్లు యీ పశాంత సమయంలో తెరచాపల్లో ఎలాంటి చలనం లేకుండా ఉన్నాయి. కొన్ని గ్రద్దలు మాత్రమే గుమ్మటంలాంటి ఆకాశంలో ఎత్తున గుండ్రంగా తిరుగుతూ, ఆ ఎత్తైన ప్రదేశం నుండి ప్రాకుతున్న సముద్రాన్ని, భూమి మీద ఉన్న, చిన్న చిన్న ప్రాణులను గమనిస్తున్నాయి. అప్పుడప్పుడూ కీచుమంటూ యీలల్లాగా శబ్దాలు చేస్తున్నాయి. పెద్దపెద్ద మద్ది చెట్లలో ఆ వాసం ఏర్పరచు కొన్న పావురాలు ఒక దాన్ని మరొకటి ఓదార్చు కొంటున్నట్లు "కూ, కూ," అని కూస్తున్నాయి.

హరి ఎప్పుడూ నీడగానూ, చల్లగాను ఉండే సరుగుడు చెట్లతోపులో కూర్చొన్నాడు. కొంచెం గాలి వీచినా, ముసలివైపోయి వంకరలు తిరిగిన చెట్ల మెత్తని ఆకుల్లోంచి గుసగుస మంటున్నట్టు ధ్వని వెలువడుతుంది. తీరం అంతటిలోను ఆ ప్రదేశమే నీడగాను, చాలా చల్లగాను ఉంటుంది. మధ్యాహ్నంపూట ఆ ప్రదేశానికి వెళ్లేది హరి ఒక్కడేకాదు. హరి వాళ్ల కొబ్బరితోపు ప్రక్కన కొబ్బరితోట వృద్ధ యజమాని తల సరుగుడు ఆకుల మీద పెట్టుకొని, తలపాగా కళ్ల మీద కప్పుకొని అక్కడ నిద్రపోతున్నాడు. ఆవృద్ధుడు త్రాగుబోతు. కోపిష్టి. అందువలన హరి అతన్ని మేల్కొకుండా జాగ్రత్త పడ్డాడు.

అతను చేతులను తల వెనుక ఉంచుకొని, చెట్టు మొదలుకు ఆనుకొని, సముద్రపు వెలుగు పడకుండా ఉండేందుకు కళ్లు సగం మూసుకొన్నాడు. తెల్లటి ఎండతో నిండిన ఆకాశంలో ఎగురుతున్న గ్రద్ద ఒకటి అకస్మాత్తుగా క్రిందికి దిగి, తీరం మీద దేన్నో తన్నుకొని, మళ్లీ ఆకాశంలోకి ఎగిరిపోయింది. దాని ముక్కు నుండి నిస్సహాయంగా వ్రేళ్లాడేది ఏమిటో చూడటానికి హరి కళ్లు తెరిచాడు. రెండు గ్రద్దలు, మొదటి గ్రద్దను తరుముతున్నాయి. మొదటి గ్రద్దముక్కున ఉన్నఆహారం క్రింద పడటంతో అది చచ్చిన పామని హరికి తెలిసింది.

హరి లేచి నిలబడి, దాని దగ్గరకు వెళ్లి చూద్దామను కొంటూండగానే

రాము, సైకిల్ త్రొక్కుతూ వచ్చి హరి ఉన్న చెట్ల క్రింద ఆగిపోయాడు. అతనితో పాటు యింకా యిద్దరు కుర్రవాళ్లు ఉన్నారు. వాళ్లు కూడా హరి లాగే బడి మాని వేసారు. వాళ్లు బడిమానివేసిన కారణాలు, హరి మానివేసిన కారణాలలాంటివికావు. పాఠశాల ఫీజులు తక్కువగా ఉన్నప్పటికీ హరి చెల్లించ లేకపోయేవాడు, పాఠ్య పుస్తకాలు కొనలేక పోయేవాడు. కాని యీ కుర్రవాళ్ల తండ్రులకు చేపలను వేటాడే పడవలుండటం వల్ల వాళ్లు చేపలను పట్టటానికి వెళ్లి భారీగా చేపలతో తిరిగి వచ్చేవారు, వాళ్లు ఆ పట్టిన చేపలను వ్యాపారులకు అమ్మితే వాళ్లు వాటిని లారీల్లో బొంబాయి తీసుకొని వెళ్లేవారు. ఇలా ఆదాయం ఉండటంవల్ల వాళ్లకు పాఠశాల ఫీజు చెల్లించటానికి, పుస్తకాలు కొనటానికి ఎలాంటి యిబ్బంది లేదు. వీళ్లకు పాఠశాల అంటే విసుగు పుట్టి, మంచి అవకాశం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూసారు. పాఠశాల మానివేస్తే తల్లి దండ్రులు యిచ్చే డబ్బు ఖర్చుచేస్తూ, హాయిగా తిరగ వచ్చునని వాళ్లు భావించారు. వాళ్లకు తండ్రులకు సాయం చేయగలిగిన వయసు ఉంది. కాని చదువురాని వాళ్లకు యిది విసుగు పుట్టించేపని అని వాళ్లు తండ్రులకు సాయం చేయటానికి యిష్టపడలేదు.

హరి, రాము, భోలా, మహేషులు కలిసి సముద్ర తీరంలో ఆటలు ఆడేవారు;



వాళ్లు కుక్కలను వెంటబెట్టుకొని వెళ్లేవారు; కుస్తీలు పట్టేవారు ; కొబ్బరి చెట్లు ఎక్కేవారు; గ్రామంలో ఉత్సవాలు జరిగేటప్పుడు ప్రదర్శింపబడే నాటకాలకు వెళ్లేవారు. ఇప్పుడు వాళ్లకు ఆటలు ఆడే వయసు మీరి పోవటంతో వాళ్లు ఎలాంటి పని చేయకుండ, సరుగుడు చెట్ల క్రింద కూర్చోవటమో,

మాట్లాడుకోవటమో చేస్తున్నారు.

వాళ్లు దేన్ని గురించి మాట్లాడుకొంటున్నారు?

"మనకు ఉద్యోగాలు వస్తాయి-మనకు డబ్బులువస్తాయి."

"మనకు ఉద్యోగాలెలా వస్తాయి?" అన్నాడు హరి, ఆకస్మికంగా లేచి కూర్చుని, పిడికిళ్ల నిండా యిసుకను చేతుల్లోకితీసు కొంటూ, "కర్మాగారాల్లో పని చేయటానికి మనుషుల్ని నగరాలనుంచి తీసుకొనివస్తారు," అన్నాడు హరి.

"లేదు, తీసుకొని రారు," అన్నారు, మిగతా ముగ్గురు కుర్రవాళ్లు, అసమ్మతి సూచకంగా.

ఒక నిముషం పాటు వాళ్ళందరు నిశ్శబ్దంగా ఉండి పోయారు, తర్వాత వాళ్లలో ఒకతను, "ఎలా తీసుకొస్తారు? నగరంలో ఉండే వాళ్లు గ్రామాలకు ఉండటానికి రారు. వాళ్లు ఎక్కడ ఉండగలరు? వాళ్లు ఉండటానికి అనువైన ప్రదేశమే లేదు, దుకాణాలు లేవు, సినిమాలు లేవు. వాళ్లు యిక్కడికి రావాలను కోరు. మనం యిక్కడ ఉండే వాళ్లం - మనం వాళ్ల కర్మాగారాల్లో పని చేయగలం," అన్నాడు.

"ఎలా చేయాలో మనకు తెలియదు" అన్నాడు హరి.

"మనం నేర్చుకోలేమా?"

"ఎవరైనా నేర్చు కోగలరు."

"యంత్రాలను ఎవరైనా నడపవచ్చు. వాళ్లు మనకు వాటిని నడపడం ఎలాగో చూపిస్తారు - అప్పుడు మనం నడపగలం."

"మనకు యంత్రాలను గురించి ఏమీ తెలియదు," అన్నాడు, హరి, వాళ్ల మాటలను వ్యతిరేకిస్తూ. "మనకు చేపలను వేటాడటం, కొబ్బరి చెట్లు పెంచటం మాత్రమే తెలుసు," అన్నాడు.

"మనం నేర్చు కొంటాం," అని అన్నారు, వాళ్లందరూ.

విసుగు, నిరాశ, తనలేతముఖాన్ని కప్పుతూ నల్లని కళ్లను మరింత నల్లగా చేస్తూండగా, "ఎలా నేర్చుకోగలం. మనం పాఠశాల విద్యకూడ పూర్తిచేయలేదు, మనకేమి తెలియదు. వాటినిగురించి నేర్చుకోవటానికి కళాశాలకు వెళ్లాలి - ఇంజనీరింగ్ చదవాలి," అన్నాడు హరి.

"కళాశాలా," అన్నారు అందరూ వెటకారంగా. "కళాశాలలు, పాఠశాలలు మనకేమీ బోధించవు. యంత్రాలను నడపటాన్ని గురించి పుస్తకాలేమి చెప్పవు. మనం కర్మాగారాల్లో నేర్చుకొంటాం."

వాళ్లలాగే ఆశాపూర్వకంగా ఉండటానికి ప్రయత్నిస్తూ, ఎక్కువ విచారపడటము, భయపడటం మానుకొంటూ, "అవి ఏమి కర్మాగారాలు? అవి ఏమి తయారుచేస్తాయి?" అని అడిగాడు, హరి. కాని మిగతా వాళ్లు



సమాధానం చెప్పలేకపోయారు.

"సైకిళ్లు అనుకొంటాను."

"ఎవరో మోటారుకార్లు అన్నారు."

"చూసారా మీకేమీ తెలియదు," అన్నాడు హరి కోపంగా. "మీకేమీ తెలియదు."

రాము, హరి మీద కొబ్బరి డిప్పను విసిరాడు. హరిదాన్ని పట్టుకొని, మళ్లీ విసిరేసాడు. అది రాముకు మోకాలి మీద తగిలింది. అతను అరుస్తూ గంతులు వేసాడు, నిద్రపోతున్న వ్యక్తి మేల్కొని వాళ్లను కేకలు వేసాడు.

రాము లేచి నిలబడి పరుగెత్తాడు. కొంత దూరం హరి అతని వెంటబడి, తర్వాత ఆగి పోయాడు - బయట ఎండ వేడి ఎక్కువగా ఉండటం వల్ల పరు గెత్తటానికి వీలు లేకుండా ఉంది. హరి తానొక్కడే సముద్రతీరానికి వెళ్లాడు.

బేల, కమల బడినుండి తిరిగి వచ్చి, చెరొక యిత్తడిచెంబు, చిన్నకత్తిని తీసుకొని సముద్ర తీరానికి రావటం హరి చూసాడు. వాళ్లు శిలలనుండి నత్తలను గీరటానికి వెళుతున్నారని అతనికి తెలుసు - లీల రాత్రి భోజనానికి నత్తలను తీసుకొని రమ్మని వాళ్లకు చెప్పి ఉంటుంది. అతను వాళ్లను కలుసుకోదలచుకోలేదు. సముద్ర తీరం వెంట నీటి పై కనిపిస్తున్న శిలలచుట్టూ యిప్పటికే స్త్రీలు, బాలికలు చేరి పదునైన చేతికత్తులతో ఆహారంగా ఉపయోగించే నత్తలను గవ్వల్లోంచి తీసి, ప్రోగుచేస్తున్నారు. అది ఆడ వాళ్లుచేసేపని. అతను వెనక్కి వెళ్లి, తన వల తీసుకొని వచ్చి చేపలు పట్టాలని నిశ్చయించుకొన్నాడు.

నీలి రంగు పొట్టి లంగాలు వేసుకొన్న బేల, కమలలు శిలల దగ్గర వంగి, తమచేతిలో ఉన్న పదునైన చిన్న కత్తులతో గీరు తున్నారు. గట్టిగా ఉన్న గవ్వల్లోంచి, జిగురుగా, ఉన్న నత్తలను తీసి, లీల వాళ్లకిచ్చిన చిన్న యిత్తడి చెంబుల్లో వేస్తున్నారు. పాఠశాలలో వాళ్లతో పాటు చదువుకొంటున్న స్నేహితులు కూడ వాళ్ల లాగే గీరుతూ నత్తలను వెలికి తీస్తున్నారు. వాళ్లతోపాటు వాళ్ల తల్లులు, అమ్మమ్మలు లేక నాయనమ్మలు కూడ అదే పనిచేస్తున్నారు. మరి కొంత మంది కొబ్బరి మట్టలను యిసుకలో లోతుగా పాతి పెడుతున్నారు, తర్వాత ఆప్రాంతంలో సముద్రపు నీరు చేరటంతో అవి మెత్తబడతాయి. కొన్ని నెలల తర్వాత వాటిని త్రవ్వి తీసి, త్రాళ్లు మోకులు తయారు చేస్తారు. ఇప్పుడు వాతావరణం చల్లగా ఉండటం వల్ల, సముద్ర తీరంలో ఎండలో పని చేయటం ఆహ్లాదకరంగా ఉంటుంది. వాళ్లు లోతుతక్కువ ప్రాంతంలో కలిసి కట్టుగా చేపలను వేటాడే సముద్రపుకాకులు, కొక్కెరలు, యిసుకగుట్టల మీద నివసించే కొంగల లాంటి వారు; అయితే వాళ్లు పక్షుల కంటె భిన్నమైనప్పటికీ ప్రశాంతంగా ఉండలేరు; అందు వల్ల వాళ్లు మాట్లాడుకొంటూ కబుర్లు చెప్పుకొంటున్నారు.

"అదిగోచూడు హేమ వాళ్ల అమ్మతో వెళ్తోంది," అంది బేల, సముద్ర తీరంపై యిద్దరు రంగు రంగుల దుస్తులు ధరించిన వ్యక్తులను చూపిస్తూ - వాళ్లలో తల్లి, రక్త నీలం, కెంపు, నారింజ రంగుల్లో ఆకర్షణీయమైన చీరె కట్టు కొంది; కూతురు వెండి అంచు ఉన్న నీలం దుస్తులు వేసుకొంది.

చాల మందిస్త్రీలు వాళ్ల దుస్తుల వైపుచూసి, వ్యంగ్యంగా నవ్వారు.

"వాళ్లు చేపలను కొనుగోలుచేయటానికి అలీబాగ్‌వెళ్లారు."

" వాళ్లకు కావలసిన చేపలను వేటాడలేని గొప్పవాళ్లు. అవునా?" అన్నారు మరొకరు.

"వాళ్లు వేటాడనవసరం లేదు. నీకు బిజూ తెలుసుగా - అతను చేపల వేటకు వెళ్లి తిరిగి వచ్చినప్పుడు అతని పడవలో టన్నుల కొలదీ చేపలుంటాయి - టన్నుల టన్నుల - రొయ్యలు, చందువాలు, సుర్‌మాయి చేపలు, యింకా అన్నిరకాలు, వాళ్లు ఏ చేపలు కొనుక్కోనవసరం లేదు."

" అవును, నిజమే - వాళ్లు అమ్ముతారు; వాళ్ళ దగ్గర చాలా చేపలుంటాయి."

"ఇక్కడ తుళ్‌లోగాని, లేక అలీబాగ్‌లోగాని లభించే దాని కంటె, బొంబాయిలో రెండు రెట్ల ధరలభిస్తుంది."

"రెండు రెట్లా? మూడింతల ధరలభిస్తుంది."

"అందువల్లే వాళ్లకు ఆబంగారు గాజులన్ని ఉన్నాయి," అందొక పాప, ఈర్ష్యపూర్వకంగా.

కొంత సేపటి వరకు స్త్రీ లందరు నిశ్శబ్దంగా ఉండి పోయారు. ఆసమయంలో శిలల మీద పొరలాగా ఉన్న నత్తలను వాళ్లు కొడవళ్లతో గీరేశబ్దం మాత్రమే వినిపిస్తోంది. అలా చేస్తున్నప్పుడు వాళ్ల చేతులకున్న గాజుల సవ్వడి వినిపిస్తోంది. తుళ్‌లోని స్త్రీ లందరికి గాజులంటే అపేక్ష ఎక్కువ. చాలా కొద్ది మందికి మాత్రమే, బంగారు, వెండి గాజులు వేసుకొనే స్తోమత ఉన్నప్పటికీ అందరూ డజన్లకొద్దీ మట్టిగాజులు వేసుకొన్నారు. వాళ్లు వేసుకొన్న వాటిల్లో నీలం, ఆకుపచ్చ. బంగారు రంగు గాజులున్నాయి. వాళ్లు వాటిని మణికట్టు నుండి మోచేతుల వరకు వేసుకొన్నారు. బేల, కమల మాత్రమే తక్కువ వేసుకొన్నారు. వాళ్లు వాటిని క్రిందటి దీపావళి సంతలో కొన్నారు. మట్టితో చేసిన గాజులు చౌకగా లభిస్తాయి కాని ఎక్కువ రోజులుండవు. తేలికగా పగిలిపోతాయి కాని, ఉన్నంతవరకు అందగా ఉంటాయి.

అప్పుడు వాళ్ల పక్కన శిలల మీద కూర్చున్న నెరసిపోయిన జుట్టున్న కాశీబాయ్ అనే ఒక వృద్ధురాలు, "విన్నారా - బిజూ మరో పడవతయారు చేయిస్తున్నాడట," అంది.

" మరోపడవా? అతనికి చాలా ఉన్నాయే. అతనికి మరో పడవ ఏమవసరం?" అన్నారు, మిగతా స్త్రీ లందరు, సామూహికంగా.

"ఈ పడవ మిగతావాటి కంటె పెద్దదిగాను ఉంటుంది. వేగంగాను ప్రయాణంచేస్తుంది. మా వారు నాకు మొన్నచెప్పారు; అయనకు బిజూ యే ఈవిషయంచెప్పాడట - యీపడవకు యంత్రాలుంటాయి. అందువల్ల అది అన్ని వాతావరణాల్లో సముద్రం మీదకు, సౌరాష్ట్ర, గుజరాత్ వరకు కూడా వెళ్ల వచ్చు. దాని మీద చేపల వేటకు చాలా దూరం - ఎక్కువ చేపలు పట్టటానికి - వెళ్లవచ్చు. ఇక్కడ ఎక్కువ చేపలు దొరకటం లేదు."

"నిజమే చాలినన్ని లేవు, ఉన్నవి చాలా స్వల్పం," అన్నారందరు.

"అయినా మన మగవాళ్లకు యింకా యిక్కడ చేపలు లభిస్తున్నాయిగదా! మన వాళ్ళు యింకా యిక్కడనే చేపల వేట కొనసాగిస్తూనే ఉన్నారు; వాళ్లకు చేపలు లభిస్తున్నాయిగదా!" అందొక స్త్రీ.

"కాని లభించేది చాలా స్వల్పం," అని నిట్టూర్చారు, మిగతా వాళ్లు. "వాళ్లు యింటికి తెచ్చే చేపలు చాలా స్వల్పం."

బేల, కమల మౌనంగా ఉండిపోయారు. ఇద్దరూ ఆలోచిస్తున్నారు. "మీ మగవాళ్లు కనీసం కొద్దిగానైనా తెస్తున్నారు. మానాన్న చేపల వేటకు అసలు వెళ్లటమే లేదు. చిన్న వలతోనే హరి చేపలను పట్టవలసి వస్తోంది. అతను పట్టే చేపలు చాలా స్వల్పం." వాళ్లు యీమాటలు బిగ్గరగా అనలేదు. దానికి బదులుగా, వాళ్లు శిలల చుట్టూ ప్రాకుతూ, గవ్వలను తెరచి, వాటిలోని నత్తలను వెలికితీసి, తమశక్తి మేరకు యిత్తడి చెంబులను నింపుతున్నారు.

అప్పటికి చాలా వరకు మధ్యాహ్నం గడిచిపోయింది. ఆ నిశ్శబ్దసమయంలో, అలలు ఉధృతంగా లేవు. గాలి కూడా చలనం లేకుండా ఉంది. అప్పుడు వాళ్లందరికి గుసగుసలాంటి శబ్దం వినిపించింది. అదిసముద్రం విడిచిన నిట్టూర్పులాగా ఉంది. తర్వాత ఆ నిట్టూర్పు లాంటి శబ్దం సుదీర్ఘమైన గల గలమనే చిన్న అలల శబ్దం లాగ విస్తరించింది. ఆ శబ్దం సముద్రంలో సుదూరం నుండి వచ్చింది. ఓ చిన్న అల చదరంగాను, మంద్రస్థాయిలోను ఉన్న సముద్రం నుండి పుట్టింది - ఆ చిన్న కెరటం పొడవుగాను, తెల్లగాను ఉన్న రేఖ అది సముద్రం నుండి పుట్టి, చిన్న కెరటాలుగా విస్తరించి, భూమికి సన్నిహితంగా వచ్చేంత వరకు ముందుకు వ్యాపించి, శిలలకు తాకి, నీటి తుంపురులుగా పైకి ఎగ సేంతవరకు పయనించింది. అలలు ప్రారంభ మయ్యాయి. సముద్రంలో అలల ఉధృతం ప్రారంభమవుతోంది. వాటితోపాటు వచ్చిన సాయంత్రపు గాలి తాజాగాను, చల్లగాను, మనోరంజకంగాను ఉంది. అలల, గాలి వాళ్ల వైపు వేగంగా రావటం ప్రారంభమైంది. దానితో స్త్రీలుతాము

చేస్తున్న పనిని ఆపి, లేచి నిలబడ్డారు, "ఇళ్లకు వెళదాం," అన్నారు వాళ్లందరు, "ఇక వంట మొదలెట్టాలి." ఈ మాటలంటూ వాళ్లందరు, తమకొడవళ్లు, యిత్తడి చెంబులు తీసుకొని, యిద్దరు, ముగ్గురు కలిసి సముద్ర తీరం మీద నడుస్తూ యిళ్లకు బయలుదేరారు. వాళ్లలో ఆకర్షణీయమైన ఆకు పచ్చ, నారింజ రంగు చీరెలు కట్టుకొన్న స్త్రీలు, తెలుపు, నీలి రంగు పాఠశాల దుస్తులు వేసుకొన్న బాలికలు ఉన్నారు. కొంత మంది మాట్లాడు కొంటూ నవ్వుతూను, మరికొంత మంది మౌనంగాను నడుస్తున్నారు.

హరి చేపలను పట్టే వలను సముద్ర తీరానికి తీసుకొని వచ్చేటప్పుడు, యిళ్లకు తిరిగి - వచ్చే స్త్రీలను చూసాడు. ఆ గ్రామంలో పడవలేని వాడు, చేపలను వేటాడే పడవల్లో ఉద్యోగం లేని కుర్రవాడు తానొక్కడే. అందుకని వాళ్లు తనను గమనించటం అతనికి యిష్టం లేదు. అంతే కాక తనవలతో తీరం వెంట ఎక్కువ చేపలను వేటాడలేనని కూడా అతనికి తెలుసు.

అయినప్పటికీ అతనికి చేపలను వేటాడటం యిష్టమే. అతను వలను నురగలోకి విసరి, కాఫీ రంగు అలలు దానిలోంచి చొచ్చుకుపోయే వరకు అటు యిటూ నడచి, దానిని ఒడ్డుకు లాగాడు. ఆవలలో కొద్దిపాటి బంగారు రంగు, వెండి రంగులోను ఉన్న కొద్ది చేపలు మాత్రమే పడ్డాయి, అవి చాలా చిన్నవి; పట్టు కొన్నా ఉపయోగం లేనివి. చచ్చిపోయే ముందు అవినోళ్లుతెరచి, ఎగురుతున్నాయి. ఇంకా మూడు, నాలుగు పీతలున్నాయి - అవి కూడా చాలా చిన్నవి; పిసరంత మాంసం కూడలేదు. అవి వెల్లకిలా పడి పారదర్శకమైన వాటి కాళ్లను గాలిలో ఊపుతున్నాయి. ఒక పెద్ద నల్ల కాకి ఏమైనా దొరుకుతా యేమోనని అటుఎగురు కొంటూ వచ్చింది. హరి, పీతలను బోర్లాత్రిప్పి, అవి సముద్రంలోకి రక్షణకొరకు పోతాయో లేదోనని చూస్తూ ఆనందిస్తున్నాడు. కాని ఆ కాకి ముక్కుతో వాటిని మళ్లీ వెల్లకిలా పడవేసింది. హరి కాకిని పీతలను పట్టుకోవటానికి వదలివేసి, తన ఖాళీ వలతో వెనుదిరిగాడు.

చేపలను వేటాడే పడవలు తిరిగి వస్తున్నాయి. వాటిలో మొదటి పడవ సముద్ర తీరానికి కేకవేస్తే వినిపించేంత దగ్గరకు వచ్చింది. పడవ మీద ఉన్న జాలరి ఒకడు కేకవేయగానే గ్రామంనుండి స్త్రీల గుంపొకటి కయ్య ప్రక్కగా సముద్రతీరం దగ్గరకుచేరుకొంది. అందరి చేతుల్లోను తట్టలున్నాయి. కొంతమంది పడవలు ఒడ్డుకు వచ్చేవరకు ఆగకుండా చీరెలు బొడ్లోదోపుకొని సముద్రంలోకి దూకి పడవల దగ్గరకు వెళ్లారు. జాలరులు చేపలతో బరువుగా ఉన్న తట్టలను వాళ్లకు అందించారు. వాళ్లు వాటిని తలల మీద పెట్టు కొని ఒడ్డుకు చేరుకొన్నారు. ఇద్దరు ముగ్గురు

వాళ్లను అనుసరించారు. సముద్రపు అలలు పెద్దవి కానంతవరకు పడవలు కయ్యలోకి ప్రవేశించలేవు.

ఇప్పటి వరకు ప్రశాంతంగా ఉన్న తీరం యిప్పుడు పెద్ద ధ్వనులతోను, అరుపులతోను నిండిపోయింది. జాలరులు చేపల తట్టలను వేలం వేయటం ప్రారంభిచారు. స్త్రీలు తట్టల్లోకి చేతులు పోనిచ్చి, చేపలను యిసుక మీద వేస్తున్నారు. పొడవుగా, పాములాగా, "బొంబాయిబాతు" లాగా ఉన్నవి, జీవంతో ప్రాకుతున్న ఎఱ్ఱరొయ్యలు మణుగుల కొద్దీ ఉన్నాయి. వాస్తవంగా యింకా పెరిగే వరకు సముద్రంలో వదలి వేయదగినవి, చిన్నవి, బల్ల పరుపుగా ఉన్న చందువా చేపలున్నాయి. తినటానికి చాలా రుచిగా ఉండే నీలం, నలుపు మచ్చలున్న సుర్మాయ్ చేపలు, కొన్ని నల్లపీతలున్నాయి. చేపల వేలంలో పోటీపడుతున్న స్త్రీలు తట్టల విషయంలో తగాదాలు పడుతూ, ఒకరుని ఒకరు తోసుకొంటూంటే వాళ్ల అరుపులు యింకా పెద్దవి అయ్యాయి.

ఒక స్త్రీ తాజాగాను, బాగా ఎఱ్ఱగాను ఉన్న రొయ్యలు, బొంబాయిలో ఒక్కొక్కటి పదిరూపాయలకు అమ్ముడుపోయే పెద్ద చందువా చేపలున్న తట్టనుచూసి, "ఏభై రూపాయలు" అంది. "అరవై రూపాయలు," అని అరచింది మరో స్త్రీ. "డెభ్భై," అంది ఎత్తుగా, లావుగా ఉండి ఎఱ్ఱని చీరెకట్టుకొన్న మూడో స్త్రీ, మిగిలిన స్త్రీలు సందేహిస్తుండగా, ఆమె బొడ్లో దోపుకొన్న గుడ్డ పట్టీ నొక దాన్ని విప్పి, మురికిగా ఉన్న నోట్ల కట్టను తీసి, సంతృప్తిగా నవ్వుతున్న జాలరులకు యిచ్చింది. మిగతా స్త్రీలు చిన్న చేపల తట్టల విషయంలో గొణుక్కొంటూ, కొట్లాడుకొంటూండగా, ఆమెతాను కొన్న చేపల తట్టను తీసుకోవటానికి వంగుతూ కేక వేసింది.

ఆమె బిగ్గరగా వేసిన కేకకు సమాధానంగా గుఱ్ఱపు బండొకటి తీరం మీద చప్పుడు చేసుకొంటూ వచ్చింది. గోధుమ వన్నెగుఱ్ఱం కాళ్లు వేగంగా యిసుకలో కదుల్తోంటే, తేమగాను, నున్నగాను ఉన్న తీరం మీద చక్రాలు కదుల్తున్నాయి. గుఱ్ఱపు బండిని తోలేవ్యక్తి కొరడా ఎత్తి, గాలిలో ఝుళిపించటంతో గుఱ్ఱపుబండి నురగలోంచి కొంచెం సేపు, దాని బయట మరి కొంతసేపు ప్రయాణించి, తట్టలు ముందు పెట్టుకొని కూర్చొన్న స్త్రీల సమూహం దగ్గరికి చేరుకొంది.

మళ్లీ బేరసారాలు మొదలయ్యాయి.

"రోడ్ మీద బస్‌లు ఆగే చోటికి రెండు రూపాయలు," అందొక రొయ్యల బస్తాను కొన్న స్త్రీ.

"మూడు రూపాయలు!"

"ఐదు!"

మళ్లీ యీసారి కూడ పట్టీలో ఎక్కువ డబ్బులు పెట్టుకొని, ఎత్తుగా, లావుగా ఉన్న స్త్రీ యే గెలిచింది. "ఆరు," అందామె గుఱ్ఱపు బండిని తోలే వ్యక్తి సమాధానం వరకు ఎదురుచూడకుండా ఆమె తట్ట తీసుకొని అందులోకి ఎక్కి కూర్చొంది. గుఱ్ఱపు బండి కిర్రుమని శబ్దంచేసింది. బరువుకు గుఱ్ఱం ఊగిస లాడింది, గుఱ్ఱపు బండిని తోలే వ్యక్తి దీన్నేమీ పట్టించుకోకుండా, తల మీది టోపీని కొంచెం వంకరగా పెట్టుకొని, కొరడా ఝుళిపించి, కయ్యే ప్రక్కన ఉన్న యిసుక దారి మీదుగా రోడ్ మీదికి బయలుదేరాడు. అక్కడ యీ స్త్రీ తాను కొన్న చేపలను గ్రామాలనుండి చేపలను కొనటానికి వచ్చిన ఒక లారీ డ్రైవర్‌కు అమ్ముతుంది. అలా కాని పక్షంలో బస్సెక్కి, తానే వాటిని అమ్మటానికి ఆలీబాగ్ బజారుకు వెళుతుంది. మిగతా స్త్రీలు అమ్ముడు పోకుండా మిగిలి పోయిన చేపలను బేరం ఆడుతున్నారు. చూడటానికి మరేమీ లేకపోవటంతో హరి వెనుదిరిగాడు.

ఆచేపల్లో ఒకదాన్ని తమకుటుంబ సభ్యుల కొరకుకొని ఉంటే బాగుండేది అనుకొన్నాడు. అలాంటి చేపనొక దాన్ని తనే పట్టే అంతకంటే బాగుండేది అనుకొన్నాడు. కాని అతని చేపల వల ఖాళీగా ఉంది. అతను మృదువైన నీలశోణిత వర్ణపు సంజె వెలుగులో, యీల వేస్తూ వలను తన వెనుక యీడ్చుకొంటూ యింటికి వెళ్లాడు.

ఆ సమయానికి సముద్రపు నీటి నురగ ఆ ఉదయం లీల పువ్వులు చల్లిన శిలల భాగం వరకు ఎగురుతోంది. త్వరలోనే దాని మీద చల్లిన ఎరుపు, తెలుపు చూర్ణం కొట్టుకొని పోతుంది; దానితోపాటు దాని మీద ఉన్న పూరేకులు కూడ కొట్టుకుపోతాయి. మరుసటి ఉదయం ఎవరో ఒకరు వచ్చి మరి కొంత చూర్ణం, మరి కొన్ని పూలు చల్లటం జరుగు తుంది.

వాళ్ల పూరింటికి దిగువన, గడ్డి పెరిగిన ఒడ్డు మీద, బేల, కమలలు యింకా ఆడుకొంటూ ఎగురుతూనే ఉన్నారు. వాళ్లు "కుంటికాలు" ఆట ఆడుతున్నారు. బేల ఒంటికాలితో ఎగురుతూ, గులక రాళ్లతో నిండిన చిన్న వలుచదరపు ప్రదేశంలో రెండు కాళ్లతో పరుగెత్తుతున్న కమలను పట్టుకోవటానికి ముందుకు దూకింది. దాంతో కమల ప్రక్కకు తప్పుకొంది. బేల మోకాళ్ల మీద కూల బడింది.

"బిగ్గరగా అరవకు గాయాలేమి కాలేదులే," అన్నాడు హరి, ఒడ్డు పైకి ఎక్కుతూ.

"నేనేమీ అరవ బోవటం లేదు," అంది బేల, లేచి, దుమ్ము దులుపుకొంటూ.

"చూడు, నీపొట్టి లంగా ఎంతదుమ్ము చేసుకొన్నావో," అన్నాడు హరి.

"లీల ఉతుకుతుంది లే."

"హుఁ-అన్నీ లీలే చేయాలి."

"ఏమైనా చేపలు పట్టావా?" అంది వేగంగా బేల, సంభాషణ విషయాన్ని మార్చటానికి.

అతని దగ్గర ఉన్న వల ఖాళీగా ఉన్నట్లు వాళ్లకు కనపడు తూనే ఉంది.

"మీరు యింటికి కొన్ని నత్తలను తీసుకొని పోయారుగా? లేదూ?" అని హరి అడిగాడు.

ఆ సమయానికి, చీకటి పడక ముందే వాళ్లను పిలవటానికి అన్నట్లు పింటో దారిన పరుగెత్తుకొంటూ వచ్చింది. కొబ్బరి చెట్ల తోపునుండి వ్యాపించిన నీడలు ఆ సమయానికి సముద్ర తీరం అంతా వ్యాపించాయి. పడమటి ఆకాశంలో సూర్యుని ముదురుగులాబీ, నారింజ రంగు వెలుగు మాత్రం అంతం కాకుండ మరింత స్పష్టమూ, అధికమూ అయ్యింది.

సాయంత్రం పూట ఆకాశంలో మొదట కనిపించే శుక్రనక్షత్రం పొడిచింది, ఆ నక్షత్రం ప్రశాంతంగాను, ప్రకాశవంతంగాను ఉంది. చంద్రునితో పోల్చిచూస్తే యీ శుక్రనక్షత్రం ప్రకాశ వంతంగా ఉంది. అది నీలం, నలుపు వర్ణాల మిశ్రమ ఆకాశంలో తేలియాడుతున్నపాల లాంటి తెల్లని చక్రంలాగ ఉంది. చీకటి మరింత వ్యాపించటంతో చంద్రుడూ, ఆ నక్షత్రమూ మరింత ప్రకాశవంతం అయ్యాయి.

దారి మీద, దాని దగ్గరకు పరుగిడుతూ, కమల, "పింటో, పింటో," అని పిలిచింది.

పింటోను వాళ్లు ఒక వ్యక్తి దగ్గర తెచ్చుకొన్నారు. అతని పేరు పింటో. వాళ్లు దానికి అతని పేరే పెట్టారు. అతను వ్యాపారం చేయటానికి వాళ్ల ఊరు వచ్చాడు: అతని వ్యాపారం ఏమిటో ఎవరికి తెలియదు. అతను ఆహారధాన్యాల సరఫరా దుకాణం వెనుక ఒక పూరింటిలో ఉండేవాడు. అతనికి ఒక కుక్క సహచరుడిగా ఉండేది. అతను తన వంట తానేచేసుకొంటూ, మనుషులతో మాట్లాడుతూ, గ్రామం అంతటా తిరుగుతూ ఉండేవాడు. అతను సారాదుకాణం దగ్గరకు వెళ్లే కొంతమందితో స్నేహం పెంచుకొన్నాడు. వాళ్లలో వాళ్లనాన్న ఒకడు. గనుల నుండి నది మీద యినుప ఖనిజాన్ని ఓడలకు చేరవేసే పడవల మీద పనిచేయటానికి గోవా వెళతావా అని అతను వాళ్లనాన్నను

అడిగాడు. గోవాలో మిక్కిలి మేలి రకం సారా ఉంటుందని భావించటంచేత తాను గోవా వెళ్లటానికి యిష్టపడి, అతనికి బస్‌ఛార్జీలకుగాను ఏభైరూపాయలు యిచ్చాడు. గ్రామంలోని నిరుద్యోగులతో పాటు, వాళ్లనాన్న గోవా వెళ్ల వలసిన క్రితంరోజు పింటో అదృశ్యమయ్యాడు. వాళ్లనాన్న ఆ విషయాన్ని నమ్మలేక పోయాడు. విస్తుపోయి, రోజంతా సారాదుకాణం దగ్గరే కూర్చున్నాడు. బడినుండి తిరిగి వచ్చిన కమల నిర్మానుష్యంగా ఉన్న పూరింటిలో కుక్క, దాని పిల్లలు అరవటంవిని, పిల్లల్లో చిన్నదిగాను, బలహీనంగాను ఉన్నదాన్ని వాళ్ల యింటికి తీసుకొని వెళ్లటానికి చేతిలోకి తీసుకొంది. వాళ్లనాన్న యిచ్చిన ఏభైరూపాయలకు ప్రతిఫలంగా ఆకుక్కపిల్లే దక్కింది. తరువాత పింటోచేత మోసగింప బడిన చాలా మంది యితర వ్యక్తులను గురించి కూడా వాళ్లకు తెలిసింది.

అయితే అతని లాగే అతని కుక్క, కుక్కపిల్లలు మోసం చేసాయన టానికివీలు లేదు, పింటో ఆకారంలో చాలా చిన్నదిగా ఉంటుంది; రోమాలు ఎక్కువ; బూడిద తెలుపుల మిశ్రమం, సింహంలాగ ధైర్యంకలది. తనను రక్షించిన కమల పట్ల దానికి మక్కువ. అందరిలోకి తనతో పాటు రోజంతా యింటి పట్టునే ఉండి, తనను వదలకుండా ఉండే లీల పట్ల దానికి విశ్వాసం ఎక్కువ. హరి ఒక్కడే దాన్ని ఎప్పుడూ తాక లేదు. అతను ఎప్పుడూ దాని వైపు నిందాపూర్వకంగాచూసేలాడు. పింటోను చూసినప్పుడల్లా అతనికి వాళ్లనాన్న మూర్ఖత్వం జ్ఞాపకం వస్తుంది. అయితే గ్రామంలో చాలా మంది యితరులు యిలాగే మోసపోయారు, వాస్తవంచెప్పాలంటే యింతకు ముందు కూడ నగరాల నుండి తెలివిగల మోసగాళ్లు వచ్చి అమాయక గ్రామస్తులను మోసగించటం జరిగింది. ఆ విషయం తలచుకొంటే హరికి పిచ్చెత్తి నట్లుంటుంది. తాను తెలివి గలవాడు కాక పోయినప్పటికీ, మోసానికి గురికాడు.

అతను ఆ యిద్దరు బాలికలను, కుక్కను మెల్లగా అనుసరించాడు. దారిలో పిశాచాలవలె తెల్లనిగోడలున్న 'మాన్‌రిపోస' ప్రక్కగానడచి వెళ్ళాడు. వాళ్ల పూరింటిలో చిన్న దీపం వెలుగులో లీల రాత్రికి అవసరమైన భోజనాన్ని వండుతోంది.

భోజనంలో బాగా కారంగా ఉన్న కూర వడ్డించబడింది. ఆ కూరలో మిరపకాయలు ఎక్కువ వేయటం జరిగింది. బేల, కమల తెచ్చిన నత్తలు ఎఱ్ఱనిపులుసులో స్పష్టంగా కనబడుతున్నాయి. గ్రామంలో ఉన్న దుకాణంలో వాళ్లు చౌకధరకుకొన్న ముతక బియ్యపు అన్నం వడ్డించబడింది.

లీల ఒక పళ్లెంలో వాళ్ల అమ్మకు భోజనం తీసుకొని వెళ్లింది. తరువాత తన

చెల్లెళ్లు, సోదరునితో కలిసి వంటగదిలో నేల మీద కూర్చొని భోజనం చేసింది, పింటో కూడా అక్కడ వాళ్లు వదలి వేసే ముక్కలకొరకు ఎదురుచూస్తోంది.

"నాన్న ఎక్కడ?" అన్నాడు హరి చిన్న స్వరంతో "బయటికి వెళ్లాడా?"

లీల తల ఊపింది. హరి, లీల, యిద్దరూ వాళ్లనాన్న యింటి నుంచి వెళ్లినందుకు ఉపశమనం పొందారు. కాని ఆయన గ్రామంలోని యితర త్రాగుబోతులతో రాత్రంతా త్రాగటానికి ఊళ్లోని సారాదుకాణానికి వెళ్లినందుకు ఏవగింపు కలిగింది.

లీల, హరి, రాత్రిచాల చాలప్రొద్దుపోయేవరకు మేల్కొనే ఉన్నారు. ఆసమయంలో యింటికి తిరిగి వస్తున్న వ్యక్తుల స్వరాలు వాళ్లకు వినిపించాయి. వాళ్లలో వాళ్లనాన్న, ఆయనతోపాటు రాత్రంతా త్రాగేపొరుగున ఉన్న వ్యవసాయక్షేత్రానికి చెందిన ముగ్గురు సోదరులు ఉన్నారు. చంద్రుడు అస్తమించటంతో అంతటా గాఢంగా చీకటి అలముకొంది. ప్రకాశవంతంగా వెలుగుతున్న నక్షత్రాలు యిసుకతోనిండిన సముద్రతీరంపై తమ వెలుగును ప్రసరిస్తున్నాయి. కాని వాటి వెలుగు కొబ్బరి తోపులో దట్టంగా విస్తరించిన కొబ్బరి ఆకుల వల్ల అలముకొన్న గాఢాంధకారాన్ని ఛేదించ లేక పోతోంది. వాళ్లు గ్రామంనుండి వెళ్లేటప్పుడు తమతో లాంతరునొక దాన్ని తీసుకొని వెళ్లారు. అయితే ఆ లాంతరు వాళ్లు త్రాగిన మైకంలో ఒకరికొకరు గుద్దుకోవటం వల్ల చెట్ల బోదెలకు కొట్టుకొని కిందపడి పగిలి పోయింది. అది పగిలి గల గల మన్న శబ్దంతో రాళ్ల మీద ముక్కలైనప్పుడు వాళ్లు నవ్వుకొన్నారు. వాళ్ల భార్యలు మాత్రమే క్రొత్త లాంతరు కొనటం, దానిలో పోయవలసిన కిరోసిన్‌ను గురించి విచారిస్తారు. అందువల్ల వాళ్లందరు ఒకరి నొకరు పలకరించుకొంటూ, ధైర్యం సడలకుండా ఉండేందుకు పాటలు పాడుకొంటూ, ఆ చీకటిలో యింటికి వెళ్లటానికి ప్రయత్నిస్తున్నారు.

వాళ్లు పెద్దగా సందడి చేయటం వల్ల ఆశబ్దాలకు తుళ్లోని ఊరకుక్కలన్నీ మేల్కొని, భయంతో, అసమ్మతి సూచకంగా మొరిగాయి.

లీలకు, హరికి, వాళ్లనాన్న వాళ్లలో ఉన్నాడని తెలుసు. అందువల్ల వాళ్లు ఆశబ్దాలు వినపడకుండా దిండ్లను తల మీద కప్పుకొన్నారు. లీలకు ఆసందడి అంటే విపరీతమైన అసహ్యాము, భయము కలగటంతో తనలో తాను రోదించింది. హరి మాత్రం ఏడవకుండా, పెదవిని పంటితో నొక్కి ఆలోచించ నారంభించాడు. "విషసర్పం ఆయన్ను కరవవచ్చు. ఆయన ఏ విషసర్పం మీదో కాలు

వేయవచ్చు. అది ఆయనను కరవవచ్చు. ఇక్కడ అలాంటివి చాలా ఉన్నాయి. అందులోను చీకటిగా ఉంది. అప్పుడు ఆయన మరణిస్తాడు." అతను యీ మాటలను భయంకొద్దీ వినిపించేటట్లు అనలేదు. అతను అలాజరిగితే బాగుండునని ఆశిస్తున్నట్లు అనుకొన్నాడు.

కొంచెం సేపటి తర్వాత తలుపు తట్టిన చప్పుడైంది. వాళ్లనాన్న తలుపు నెట్టి లో పలికి ప్రవేశించాడు. దానివల్ల కలిగిన కర్కశమైన ధ్వనికి గోడలు కంపించి, పూరికప్పు గల గల లాడింది. పింటో మేల్కొని భయంకొద్దీ తీక్షణమైన బాధతో మూలిగింది. వాళ్లనాన్న దాన్ని "ఇష్, ఊరుకో," అని అరచి వాళ్ల అమ్మ నిద్రపోతున్న గదిలోకి తూలుకొంటూ, తడుము కొంటూ వెళ్లాడు. వాళ్ల అమ్మ అసమ్మతి సూచకంగా ఏదో అనటం వాళ్లకు వినిపించింది. కాని వాళ్ల నాన్న గుర్రుమంటూ కుప్పకూలిపోయి, కొద్దిసేపట్లో గుర్రుపెట్టటం మొదలెట్టాడు.

తరువాత నిశ్శబ్దం నెలకొంది. అయితే నిశ్శబ్దం ప్రశాంత మైంది గాని, మనో రంజకమైనది కాదు. ఆ నిశ్శబ్దంలో భయం, కోపం, పీడకలలుకూడా నిండి ఉన్నాయి.

# రెండవ అధ్యాయం

లీల యీ రోజు తుళ్‌లోని మార్కెట్‌కు వెళ్ళి బియ్యం, వాటితోపాటు కొంచెం పంచదార, టీ కూడ కొనవలసి ఉంది. హరి ఆరు కొబ్బరి కాయల గెలలను కోసి, లారీలో బొంబాయి నుండి వచ్చిన మలబారీలకు అమ్మాడు. అందువలన ఆమెకు ఖర్చు చేయటానికి కొంచెం డబ్బు ఉంది. బేల కమల బడికి వెళ్లాక, వాళ్లు, తాను, ఉమ్మడిగా వాడుకొనే చీరెల్లో మంచి దాన్ని గదిలో మూల నున్న ట్రంకుపెట్టెనుండి తీసి కట్టుకొంది. ఆ చీరె కెంపురంగులో ఉంది. దాని మీద గోధుమ రంగు పూలుకుట్టి ఉన్నాయి. దానికి నీలం రంగు అంచు ఉంది. అది ఖరీదు తక్కువ చీరే. అయినా ఆమె దాన్ని చాలా అరుదుగా మాత్రమే కట్టుకోవటం వల్ల అది క్రొత్త దాని లాగా కనిపిస్తోంది. అందు వల్ల ఎక్కువ సార్లు కట్టు కొన్నా మనటానికి వీలుగా ఉండి, ప్రతిరోజు తాను కట్టుకొనే సాదాముదురు ఆకుపచ్చ, ముదురు నీలం రంగు చీరెలు ధరించి నప్పటి కంటె ఈ రోజు ఆమె ఆకర్షణీయంగా ఉంది. ఆమె కూడ వయసురీత్యా తాను చిన్న దానిగానే భావించుకొని, సంతోషపడి, వంటగది తలుపు మేకుకు తగిలించిన మార్కెట్‌కు వెళ్లే సంచిని తీసుకొని, తన తల్లికి బజారుకు వెళ్లివస్తానని చెప్పింది. ఆమె తల్లి నిద్రిస్తున్నది కాబోలు; తిరిగి సమాధానం చెప్పలేదు, దాంతో లీల ఉదయం వెలుగులో కాంతివంతంగాను, అప్పటికే వేడెక్కిన సముద్ర తీరం మీదుగా బయలుదేరింది.

కొంత మంది యితర స్త్రీలు, తెల్లని వెలుగుతో మిరుమిట్లు గొలిపే సూర్యకాంతినుండి రక్షించుకోవటానికి ఉపయోగించే నల్లని, పెద్ద గొడుగులతో మార్కెట్‌కు నడచి వెళ్తున్నారు. సూర్యుని వెలుగు ప్రతిబింబించటంతో సముద్రమంతా పగిలిన అద్దం ముక్కల్లాగ తళ తళ లాడుతోంది. ఆవెలుగులో అంధేరి, కంధేరి అన్న రాళ్ల గుట్టల చిన్న ద్వీపాలు రెండు మాత్రమే చిన్న

బిందువుల్లాగ కనిపిస్తున్నాయి. వాటిల్లో ఒక దాని మీద చాలా కాలం క్రితం చిన్న కోట నిర్మింపబడింది. ఆ కోట నిర్మానుష్యంగా ఉండటం వల్ల బల్లులకు మాత్రమే ఆవాసంగా ఉంది. చల్లని గాలి తెమ్మెర వీచింది. సముద్రంపై ప్రయాణంచేసే చిన్న నౌకలు, చేపలు వేటాడేపడవలు గుజరాత్, సౌరాష్ట్ర లాంటి ఎగువ తీర ప్రాంతాలకు సరుకును మోసుకొని పోతూ పక్షుల్లాగా వేగంగా కదిలాయి.

లారీ ఒకటి వచ్చి కొంచెం కలపను దింపటంతో సముద్ర తీరం మీద అలజడి నెలకొంది. కొంత సేపటికి అది యిసుకలో కూరుకుపోయింది. డ్రైవర్ పెద్దగా తిట్టుకొంటున్నాడు. బడికి వెళ్లని కొంతమంది కుర్రవాళ్లు సహాయంచేసేందుకు అక్కడికి చేరారు. లారీ చక్రాల క్రింది యిసుకలో కొబ్బరి ఆకులు వేసి లారీని యిసుక గాళ్లలోంచి వాటి మీదకి త్రోయటానికి ప్రయత్నిస్తున్నారు.

లీల ఆ ప్రక్కగా నడుస్తూంటే లారీ చక్రాలు గుండ్రంగా తిరుగుతూ, యిసుకను పైకి విసిరేస్తున్నాయి. తరువాత లారీ పైకి వచ్చిశబ్దం చేసుకొంటూ తన దారిని బయలుదేరింది. "ఈసారి మీ కలపను ఎద్దుల బండి మీద పంపించండి," అని కుర్రవాళ్లలో ఒకడు లారీ డ్రైవర్నుద్దేశించి కేకవేసాడు. అప్పుడు వాళ్లందరూ వేళాకోళంగా, బిగ్గరగా నవ్వారు.

"నేను ఎద్దుల బండిని తోలుతాననుకొన్నారా?" అని లారీ డ్రైవర్ కిటికీ లోంచి అరిచాడు.

"ఎద్దులు నీ నాజూకు లారీ లాగ యిసుకలో కూరుకుపోవు" అని వాళ్లు అరిచారు. కాని అప్పటికే డ్రైవర్ వెళ్లిపోయాడు.

వేడెక్కిన యిసుకలో లీల కాళ్లు కాలుతుండటంతో వాళ్ల మాటలు యింకా వినేందుకు నిలబడకుండా ముందుకునడచింది. అలా నడచి ఆమె పెద్ద మఱ్ఱిచెట్లు, ములగచెట్లు ఉన్నచోటికి చేరింది. ఆ చెట్లు గ్రామం చుట్టూ వేడెక్కిన చదరపునేలపై నీడలను పరచాయి. అందువల్ల అక్కడ చల్లగాఉంది.

మార్కెట్‌కు వెళ్లే మార్గం పక్కన యిళ్లున్నాయి. వాటిలో కొన్ని గట్టి యిటుకలతో నిర్మింపబడ్డాయి; గోడలకు వెల్లవేసి ఉంది; వసారా గోడలపై ఆకర్షణీయమైన పూలు చిత్రించబడి ఉన్నాయి. మరికొన్ని యిళ్లు మట్టితో నిర్మింపబడ్డాయి. ఆ యిళ్లకు చిరిగిన తాటియాకుల కప్పు ఉంది. చిన్న, పెద్ద యిళ్లల్లోను, పేదల, ధనికుల యిళ్లల్లోను, అన్ని యిళ్ళల్లోను ప్రవేశ ద్వారం ప్రక్కకుండీలో తులసి మొక్క ఉంది. పసిపిల్లలు, ఊరకుక్కలతో పాటు దుమ్ములో ఆడుతున్నారు. స్త్రీలు బియ్యం కడుగుతూ, ఆ కడిగిన

నీటిని సందులో పోస్తున్నారు.

సందు చివర దేవాలయం ఉంది. అది అంత పురాతనమైంది కాదు; అందంగాను లేదు. నాలుగు వైపుల యిటుకలతో కట్టిన స్తంభాలపై పెంకుటికప్పు ఉంది. గోడలు లేని ప్రాంగణం, విగ్రహం ఉన్న గర్భగుడి ఉంది. అంతే. ఆగుడి మెట్ల మీద కూర్చొని, మృదంగం వాయిస్తూ, పాడు తున్న యువకులు చాలా మంది ఉన్నారు.

లీల అటువైపు చూడకుండ ఉండ లేకపోయింది. సందుఅవతల యిటుకలతో కట్టిన యింటినుండి లీలను గమనిస్తున్న అమ్మాయి ఆమెను పిలిచింది. "చూసావా, లీలా నటులు వచ్చేసారు. వాళ్లు యీ రాత్రికి నాటకం ప్రదర్శించ బోతున్నారు." అందామె.

"లీల చిరునవ్వు నవ్వి, తన స్నేహితురాలు మీనా దగ్గరకు వెళ్లి. ఏమి నాటకం ప్రదర్శించ బోతున్నారో నీకుతెలుసా?" అని అడిగింది.

మీనా ఆ నటులు ఎప్పుడూ నాటకాలు ప్రదర్శించే దేవాలయం అవతలవైపున ఉండటం వల్ల, వాటి నన్నింటినీ చూసింది. అందువల్ల, "నాకు తెలియదు, అయినా వాళ్లు ఎప్పుడూ ప్రదర్శించే నాటకాల్లో ఏదో ఏదో ఒకటి అయి ఉంటుంది. రాధా కృష్ణులకథో, లేక సీతా రాముల కథో లేక నలదమయంతో అయి ఉంటుంది. వాళ్లెప్పుడు వాటినే ప్రదర్శిస్తారు. తెలుసా," అంది.

లీల చాలా తక్కువ నాటక ప్రదర్శనలకు హాజరైంది. "నీవు వెళ్లి ఆ ప్రదర్శనచూస్తావా?" అని అడిగింది, అసూయతో.

"నేను వరండాలోనే కూర్చొని చూస్తాను."

"నీవు గ్రామంలో ఉండటం నీ అదృష్టం."

"నీవూ వచ్చి, ప్రదర్శన చూడు."

"రాత్రిపూట నేను రాలేను."

"ఏం? హరి తీసుకొని రావచ్చుగా."

హరి, నేను యిద్దరం ఒకే సారి యిక్కడికి వస్తే, యింట్లో మాచెల్లెళ్లు ఒంటరిగా ఉంటారు. అలా బాగుండదు.

"వాళ్లకు ఏమవుతుంది? మీ అమ్మ, నాన్న ఉన్నారుగా."

లీల ఏమి వివరించకుండా తల అడ్డంగా ఊపింది. "నేను వెళ్లి బియ్యం, పంచదార కొనాలి. నీవూ వస్తావా?" అని అడిగింది.

మీనాకు చేయవలసిన పనేమీ లేదు, ఆమె తల్లి దండ్రులు ఆమె కొరకు సంబంధాలు చూస్తున్నారు. ఆమె లీలతో పాటు వెళ్లింది. వాళ్లిద్దరూకలిసి,

సందులో యిరువైపులా కూర్చొన్న స్త్రీల ప్రక్కగానడచి వెళ్లారు. అలాకూర్చొన్న స్త్రీలు తమ ముందర అరటి ఆకులను పరచుకొని వాటి మీద వాళ్లు సాధారణంగా అమ్మే బచ్చలి ఆకు కట్టలు, ఐదు, ఆరు అరటి కాయలు, ఒకటి, రెండు కొబ్బరి బొండాలు,కంచెలు, పొదలనుండి కోసిన ఎరుపు, తెలుపు, పసుపు పచ్చని పువ్వులు పెట్టారు. దండ గ్రుచ్చి, తలలో తురుముకొనేందుకు మీనా కొన్ని పువ్వులుకొంది. మరి కొంత డబ్బు చెల్లిస్తే కట్టిన పూలదండలు కొనవచ్చు.

లీల దగ్గర అలాంటి వస్తువులను కొనటానికి డబ్బు లేదు. నాలుగు వీధుల కూడలిలో మార్కెట్‌లో ఉన్న రెండు కిరాణాదుకాణాల్లో ఒక దాంట్లోకి లీల వెళ్లింది. అక్కడ బియ్యం, గ్రుడ్లు, బంగాళాదుంపలు, పంచదార, టీ, మిఠాయిలు కొనవచ్చు. లీల అక్కడ ఉన్న వివిధ రకాల బియ్యాన్ని జాగ్రత్తగా చూసి, తక్కువ ధరలో బాగున్నవనిపించినవాటిని ఎంచుకొని, తనకు కావలసినన్ని కొన్నది.

సరుకులు కొనటానికి యింకా చాలా మంది ఎదురుచూస్తున్నారు. వాళ్లు తమకు కావలసిన బంగాళాదుంపలు ఏరుకొంటూ, బియ్యాన్ని చేతుల్లోకి తీసుకొని బస్తాల్లోకి జారవిడుస్తూ నిలబడి మాట్లాడుకొంటున్నారు. లీలకు, మీనాకు సముద్రతీరం మీది కలప ఎందుకో అర్థంమైంది.

"బిజూకు చెందిన కలప ఆలీబాగ్ నుండి వచ్చింది. చూసావా?"

"అది బిజూకు చెందిన కలపా? పడవ కొరకా?"

"డీజెల్ యంత్రమో? అది కూడా వచ్చిందా?" అని ఎవరో ఎగతాళిగానవ్వారు.

"అవీ వస్తాయి. నీకే తెలుస్తుందిగా. బిజూ మనల్ని మోసం చేయటంలేదు. అతని కున్న డబ్బుతో రెండు డీజల్ యంత్రాలను కొనగలడు."

" చూద్దాం."

లీల, మీనాలు వెనక్కు మళ్లారు. లీల చేతిలో ఉన్న సంచి సరుకులతో పూర్తిగా నిండిపోయి బరువెక్కింది.

"బిజూ తన డబ్బంతా సరుకుల దొంగ రవాణా ద్వారా సంపాదించాడని మా నాన్న చెప్పారు."

"సరుకుల దొంగరవాణానా?" అంది లీల, వాస్తవంగా ఆశ్చర్య పడకపోయినా. ఆమె ఆ విషయాన్ని యింతకుముందే విన్నది. "నీవు ఆ విషయాన్ని నమ్ముతావా?" అని అడిగిందామె.

"ఆఁ నేను నమ్ముతాను. లేకపోతే అతనికి టెలివిజన్ సెట్ ఎలావస్తుంది?"

"మన ఊరికి బొంబాయి లోని టి.వి. కేంద్రం చాలా దూరంగా ఉండటం వల్ల అది పనిచేయదని హరి, అంటున్నాడు."



"బాగా డబ్బు సంపాదించిన తర్వాత బహుంశ వాళ్లు బొంబాయి వెళ్తారేమో."

లీల, మీనాలు రెండు మైళ్లదూరంలో ఉన్న జిల్లా కేంద్రం ఆలీబాగ్ దాటి ఎప్పుడూ వెళ్లలేదు. కాని వాళ్లు సాహసవంతులైన వ్యక్తులు జాతీయమార్గం మీద బస్ ఎక్కో లేక రేవాస్‌లో ప్రయాణీకుల పడవ మీదను సముద్రం ఆవల ఉన్న పెద్దనగరానికి వెళ్ల టాన్ని గురించి విన్నారు. వాళ్ల చిన్న తనంలో "బొంబాయి వెళ్లే ఆట" ఆడే వాళ్లు, కాని ఆ ఆట యిప్పుడు నిరుపయోగం.

తర్వాత లీల గ్రామంలోని సందునుండి సముద్ర తీరానికి వచ్చింది, సముద్ర తీరం మరింత నిర్జనంగాను, యింతకు ముందు కంటె తెల్లగాను, వేడిగాను ఉంది.

"నాటకం చూడటానికి రాత్రికి రా," అని లీల వెనుక నుంచి కేక వేసింది మీనా.

"వీలైతే వస్తాన్లే," అంది లీల, తాను వెళ్లలేనని తెలిసి కూడా.

బిజూకు సంబంధించినపడవ నిర్మాణం జరుగుతోంది. గ్రామంలోని పిల్లలు, ముగ్గురు, నలుగురు సభులు బృందాలుగా వచ్చి, నిలబడి నిర్మాణాన్ని గమనిస్తూండేవారు. వాళ్లలో హరిగూడా ఉండే వాడు. బిజూపడవను నిర్మించటానికి పని వాళ్లను ఆలీ బాగ్‌నుండి రప్పించాడు. తుళ్ గ్రామస్తులు తమ జీవితమంతా పడవలను నిర్మిస్తున్నప్పటికీ వాళ్లు ఆ పని చేయలేరని అతను భావించాడు. అందువల్ల గ్రామస్తులు ఆలీబాగ్ నుండి వచ్చిన పని వాళ్లను గమనించి వాళ్లను ఎగతాళి చేయాలని అనుకొన్నారు. ఒక్కొక్కప్పుడు

అలా గమనించటం చూచి బిజూకు కోపంవచ్చి వాళ్లను కేకలు వేసేవాడు. అందువల్ల అక్కడ ఎప్పుడూ సందడిగా ఉండేది.

బిజూ, పడవ నిర్మాణాన్ని చూడటానికి ఊగుతూ నడుచుకొంటూ వచ్చేవాడు, ఒక చిన్న కుర్రవాడు అతని యింటినుండి మడతకుర్చీ ఒకటి సముద్ర తీరానికి తెచ్చి బిజా కూర్చొవటానికి యిసుక మీద వేసేవాడు. బిజూ అతి జాగ్రత్తగా అందులోకి జారగిలబడి, ధోవతి సరిచేసుకొంటూ, చాలా అసౌకర్యంగా కూర్చొనే వాడు. మిగతా వాళ్లలాగ గొంతు కూర్చోవటం అతనికి సౌకర్యంగా ఉండవచ్చు. కాని అతను యిప్పుడు పెద్దపడవ యజమాని కావటం వల్ల మిగతా వాళ్లకంటె భిన్నంగా తానుకుర్చీలో కూర్చోవలసి ఉంటుందని భావించాడు.

ఒక్కొక్కపుడు అతని భార్య పడవ నిర్మాణాన్ని చూసేందుకు యింటినుండి ఊగుతూ నడచివచ్చేది, ఆమెకు కూర్చోనేందుకు మడత కుర్చీ ఉండేదికాదు. అందువల్ల ఆమె అలసిపోయేంత వరకు నిలబడి యింటికి తిరిగి వెళ్లేది. వాళ్ల యిల్లు యిటుకలతో కట్టిన పెద్ద రెండంతస్తుల భవనం. అది చీకటిగా ఉన్న కొబ్బరి చెట్లు, పోకచెట్లు ఆవరణలో ఉంది. ఆ చెట్లు దట్టంగా పెరిగి ఉండటంవల్ల వాటి ఆకుల ద్వారా వెలుగు క్రిందికి ప్రసరించేదికాదు. ఆ ఆవరణంలో ప్రతిచోట వాళ్ల సంపన్నత గుర్తులుండేవి. వాళ్లకు చాలా లోతుగా ఉండే బావులు, చాలా ఎడ్లబండ్లు, ఎద్దులు, కోళ్లు, బాతులు, గుట్టలకొద్దీ వంట చెరకు, పావురాలగూడు, ప్రసిద్ధమైన టెలివిజన్ సెట్ ఉండేవి. తుళ్లో నీలం రంగు ఇనుపరేకులకప్పు మీద ఏరియల్ ఉన్న యిల్లు అది ఒక్కటే. 'ఆనంద భవన్' అన్న ఆ యింటి పేరు యినుపరేకు మీద పెద్ద అక్షరాలతో ఎఱ్ఱనిరంగులో వ్రాయబడి ఉంది. కాని దగ్గర దగ్గరగా చెట్లుండటం వల్ల, వెలుతురు లేక పోవటం వల్ల, ఆవరణ అంతా అపరిశుభ్రంగా ఉంటటంవల్ల ఆ పెద్ద ఆవరణ ఆనందమయంగా కాక విచారకరంగా కనపడుతుంది. బిజూ భార్య వాస్తవంగానే ఎలాంటి ఆనందం వెల్లడించ కుండా నిదానంగా నడిచి వెళ్లింది. గ్రామస్తులు వాళ్లను గురించి ఏ విధంగా మాట్లాడు కొంటారో ఆమెకుతెలుసు, ఆమాటలు ఆమెకు రుచించవు.

గ్రామంలో ని వ్యక్తుల్లో చాలామంది ఏదో ఒక సమయంలో నిర్మాణంలో ఉన్న ఆ పెద్ద పడవను చూడటానికి వచ్చి, అక్కడ ఆగిపోయిన వాళ్లే, ఆ ఊళ్లో ఎవరికి అలాంటి పెద్ద పడవలేదు; ఎవరూ అలాంటి పడవను నిర్మించడానికి ప్రయత్నించలేదు. బహూశ వాళ్లు అసూయపడి ఉండవచ్చు. అందువల్లే ఒక్కరూదాన్ని గురించి ఒక్క మంచి మాటకూడా అనలేదు. ఆలీబాగ్

నుండి వచ్చిన పని వాళ్లచేత నిర్మింపబడటంవల్ల, బాగాపెద్దదిగాను, వికృతంగాను ఉండటంవలన, సముద్రం మీద అదిబాగా పనిచేయగలదన్న నమ్మకం వాళ్లకు కలగ లేదు. ఒక విధంగా చూస్తే, తుళ్‌లోని వ్యక్తి ఒకడు, యింకాచెప్పాలంటే నిజాయితీ లో పెంచిన వ్యక్తి అని అందరికీ తెలిసినా, బహుశ సరుకులు దొంగరవాణాచేసేవాడే అయినప్పటికీ బిజూ అలాంటి దాన్ని నిర్మిస్తున్నందుకు ఒక విధంగా ఆ గ్రామస్తులు గర్విస్తున్నారేమో.

"సరుకులు దొంగరవాణాచేసేవాడు, సరుకులు దొంగరవాణాచేసేవాడు, సరుకులు దొంగరవాణాచేసేవాడు" అని పడవ నిర్మాణాన్ని గమనిస్తున్న పిల్లలందరూ చేతులు నోటికి అడ్డంపెట్టుకొని మెల్లగానవ్వారు. బిజూ వాళ్లను, కేకలు వేసి, తరిమాడు,

ఆ పిల్లలందరూ అతన్ని అలాగొడవచేసినందుకు దండనార్హులే, కాని బిజూ మరీ లావుగా ఉండి, వృద్ధుడై పోవటం వల్ల వాళ్లను పట్టుకోలేక పోయాడు. అందువల్ల వాళ్లు, "బిజూ జైలుకు వెళ్తాడు! బిజూ జైలుకు వెళ్తాడు!" పాటలు పాడు కొంటూ పరుగెత్తారు.



బేల, కమల రాత్రిపూట మంచం మీద పండుకొని, నిద్రపోక ముందు, "హరీ, మన ఊళ్లో సరుకు దొంగ రవాణాచేసేవాళ్లు ఉన్నా రంటావా?" అని అడిగారు.

" ఆఁ ఉన్నారు."

"వాళ్లు ఏ వస్తువులను దొంగ రవాణాచేస్తారు?"

"వెండి, బంగారం."

"కాదు."

"అవును. అలాగే వాళ్లు ధనవంతులవుతారు."

"వాళ్లకు వెండి, బంగారం ఎక్కడినుండి వస్తుంది. సముద్రంలో దొరుకుతుందా?"

"కాదు, పిచ్చి మొహాల్లారా, వాటిని బంగారు, వెండి గనులున్న విదేశాలనుండి తెస్తారు. అక్కడ అవి చౌకగా లభిస్తాయి వాటిని ఆఫ్రికా, అరేబియానుండి పెద్ద పడవల్లో తీసుకొని వచ్చి, వాటిని కలుసుకోవటానికి సముద్రంలోకి వెళ్లిన చేపలు వేటాడే పడవల్లోకి చేర వేస్తారు. వాటిని సరుకులు దొంగ రవాణాచేసే పడవల్లో వేసి ఒడ్డుకు తీసుకొనివచ్చి, యిక్కడ అధిక ధరకు అమ్ముతారు."

"లేదు" అని హరి ఒప్పుకొన్నాడు. "నేను చూడలేదు, కాని మే మందరం వాటిని గురించి విన్నాం. మీ స్త్రీ లందరికి బంగారు, వెండి ఆభరణాలంటే చాలా యిష్టం. అందువల్ల వాటిని అధికంగా కొంటారు. దానివల్ల సరుకులు దొంగ రవాణాచేసే వాళ్లు బాగా డబ్బు సంపాదిస్తారు. బిజూ ఆ విధంగానే డబ్బు సంపాదించాడని భావించవలసి ఉంటుంది."

"తుళ్‌లోనే పెద్ద చేపలను వేటాడే పడవను నిర్మించబోతున్నాడని అనుకొంటున్నారు."

"చాలా శ్రేష్ఠమైంది కూడా. ఆ పడవ మీద నాకు ఉద్యోగం లభించాలని కోరు కొంటున్నాను."

"నీవా? బిజూ పడవ మీద?"

"అవును, ఏం?"

"ఛీ, వద్దు, బిజూ దగ్గర పనిచేయవద్దు, హరి, ఇప్పుడేగా నీవు అతను సరుకులు దొంగ రవాణాచేసే వాడని చెప్పావు. అతను నిన్ను కూడ సరుకులు దొంగ రవాణాచేసే వాడిగా మార్చేయవచ్చు."

"అప్పుడు నేను కూడ అతడిలాగే ధనవంతుణ్ణి అవుతాను మీకు బంగారు

నెక్లెస్‌లు, వెండి మెట్టెలు కొంటాను," అని హరి నవ్వాడు.

"వద్దు, వద్దు," అని వాళ్లిద్దరూ భయంతో అరిచారు. "పోలీసులు నిన్ను పట్టుకొని జైల్లో వేస్తారు."

"అప్పుడు నన్ను బొంబాయి తీసుకొని వెళ్తారు. నేను కనీసం బొంబాయన్నా వెళ్తాను."

"నీవు బొంబాయి వెళ్లి పోవాలను కొంటున్నావా?" అన్నారు వాళ్లు మెల్లగా, అతని స్వరంలో వ్యక్తం అయిన నిరాశవల్ల భయపడిపోతూ.

"అవును, నేను వెళ్లాలనే అనుకొంటున్నాను. మీరు రారా?"

"బేల, కమల, చిన్నగా మాట్లాడుకోవటం మొదలెట్టారు - వాళ్లిద్దరూ ఒకే మంచం మీద పండుకొన్నారు. కొంచెం సేపటి తర్వాత వాళ్లకు తమ తల్లి గదినుంచి చిన్న మూలుగు వినిపించింది. హరి వాళ్లను నిశ్శబ్దంగా ఉండమని చెప్పటంతో, వాళ్లు మాట్లాడటం మాని, త్వరలోనే నిద్రపోయారు. హరి మేల్కొనే ఉండి బేల, కమలలు నిద్రలో గాఢంగా శ్వాస పీల్చుతున్న శబ్దాలను, బయట అంతకంటె గాఢంగాను, పెద్దగాను సముద్రం నుండి వెలువడుతున్న శబ్దాలను వింటూ, దానిపై స్వేచ్ఛగా ప్రయాణించి వెళ్లాలను కొంటే బొంబాయి. ఆఫ్రికా అరేబియాకు వెళ్లగలిగిన పడవలను గురించి ఆలోచిస్తున్నాడు. తాను వాటిలో ఒక దానిలో సముద్రయానం చేయగలిగితే - కనీసం బొంబాయి వరకన్నా వెళ్లగలిగితే ఎంత బాగుంటుంది."

బొంబాయి! అతను ఆకాశంలో మెరుస్తున్న నక్షత్రాలను కిటికీ లోంచి చూచి, ఆ నగరం లోని దీపాలు యీ నక్షత్రాల్లాగ కాంతి వంతంగా ఉంటాయా లేక యింతకంటె అధిక కాంతి వంతంగా ఉంటాయా అని ఆశ్చర్య నిమగ్నుడయ్యాడు. అది సంపన్నమైన నగరం. అక్కడికి వెళ్లగలిగితే, తాను డబ్బుసంపాదించి, డబ్బు, తన అక్కాచెల్లెళ్లకు మిరు మిట్లుగొలిపే బంగారం వెండి ఆభరణాలను యింటికి తీసుకొని రాగలడు.

కాదు, అనుకొన్నాడు అతను కళ్లు మూసుకుంటూ. ఇదంతా వట్టి నిష్ప్రయోజన మైన కల. తాను కలల ప్రపంచంలో జీవించలేడు; ఆచరణ పూర్వకంగా ఉండే ఒక పథకాన్ని వేసుకోవాలి. అది అంత తేలికకాదు. ఆ విధంగా ఆలోచించటంతో అతను అలసిపోయి, ఆలోచించటంమాని, నిద్రపోయాడు.

తీరం వెంట వలతో చేపలు పట్టటంగాని, నిస్సారమైన పొలంలో త్రవ్వటంగాని చేయకుండా హరి తన సమయంలో చాలా భాగం ఊళ్లోని యితర కుర్రవాళ్లతో



పాటు నిల్చుని పడవ నిర్మాణం పనిని గమనిస్తూ గడుపుతున్నాడు. గరుకుగా ఉన్న చెక్కలను చిత్రిక పట్టి నున్నగాచేస్తున్నారు - చదునుచేయబడిన చెక్కలు సూర్య కాంతిలో ఎఱ్ఱని బంగారంలా మెరుస్తున్నాయి. ఆకలప మంచిది. తాము వాడే కొబ్బరి బోదెల లాంటిదికాదు; నిజమైన అందమైన కలప. ఆ కలప, ఊళ్లోని అన్నింటి లాగ చేపల వాసన, సముద్రపు వాసన వేయటం లేదు; నిజమైన కలప, రంపపుపొట్టు, అడవులు, దూరానికి సంబంధించిన, ఆశ్చర్యకరమైన వాసన వేస్తోంది - బాగా ఆరి, చిరకాలం మన్నే, విలువైన కలప. దాని వాసన హరి ముక్కులకు గమ్మగాఉంది.

బిజూ కూడ మడతకుర్చీలో అసౌకర్యంగా కూర్చొని గమనిస్తున్నాడు. అతనితో మాట్లాడటానికి ఎవరైనా తన దగ్గరకు వస్తే తాను నిర్మిస్తున్న పడవను గురించి గొప్పలు చెప్తున్నాడు. "దీనికి డీజెల్ యంత్రం, శీతలీకరణ యంత్రం, గాఢశీతలీకరణ సదుపాయం ఉంటుంది." అని మెల్లగాచెప్పూ, తన అపరిచితమైన మాటలకు యితరులకన్నా తానేముగ్దుడవుతున్నాడు. "వీటన్నింటి నీ అమర్చిన తర్వాత ఈ పడవ ఆరురోజులపాటు సముద్రం మీద ప్రయాణంచేయగలదు. పట్టిన చేపలను గాఢశీతలీకరణ సదుపాయంలో ఉంచవచ్చు; చెడిపోవు. బొంబాయి తీసుకొని వెళ్లినా తాజాగా ఉంటాయి."

"శీతలీకరణచేస్తే, తాజాగా ఉండవు," అన్నాడు హరి మెల్లగా. కాని బిజూకు ఆ మాటలు వినపడలేదు.

"ఎంత ఖర్చవుతుంది, బిజూ?" అని అడిగా డొక గ్రామస్తుడు, విస్తుపోతూ. అతనికి రెండు మేకలు, వంట పాత్రతప్ప మరేమీలేవు. అందువల్ల అతను బిజూ వద్ద ఎంత డబ్బు ఉందో ఊహించుకో లేక పోయాడు.

"ఆఁ రెండు లక్షలు - కాక పోతే రెండున్నర లక్షలు అవవచ్చు." అన్నాడు బిజూ, ఆ విషయాన్ని సాధారణమైన విషయంగా భావిస్తున్నట్లు; కాని వ్యయాన్ని

తలచుకొని భయంతో గుడ్లు మిటకరించాడు.

"అంతా!"

"ఫర్వాలేదు. అది సముద్రయానం ప్రారంభిస్తే, దానివల్ల రోజూ కనీసం ఏభై వేల రూపాయలు సంపాదిస్తుంది," అన్నాడు బిజూ గర్వంగా.

ఆ మాటలు వింటూ నిల్చొన్న హరి తన కాలి బొటన వ్రేలితో యిసుకలో బొమ్మలు గీస్తున్నాడు. కొద్ది సంవత్సరాలు బడిలో చదువు కొన్నప్పటికీ పరిజ్ఞానం లేని మేకల కాపరి లాగే తాను కూడా అంత ధనాన్ని వాస్తవంగా ఊహించుకో లేక పోయాడు. భవిష్యత్తును గురించి బిజూ చిత్రించటానికి ప్రయత్నించిన దృశ్యాన్ని అతను పూర్తిగా నమ్మలేక పోయినా, అది అతనికి కూడా విస్మయంకలిగించింది. సముద్రం మీద చాలా ప్రమాదాలు, చాలా గండాలు ఉన్నాయి. సముద్రం మీద ఎంత మంది మనుషులు ప్రాణాలు పోగొట్టుకొన్నారో ప్రతి వర్షాకాలంలోను ఎంత మంది మునిగిపోతారో, ఎన్ని పడవలు పగిలి తిరిగి రాలేదో, అతనికి తెలుసు, అయినప్పటికీ అతను చాలాదూరం సముద్రయానం చేయాలని, సముద్రంలో సుదూరం వెళ్లాలని, యిక ఎన్నటికీ తిరిగి రాకుండా ఉండాలని, అలా కాని పక్షంలో లెక్కలేనంత ధనంతో తిరిగి రావాలని అతనికి బలమైన కోరిక కలిగింది.

రాము తన సైకిల్ మీద అటువైపుగావచ్చి. "ఏయ్, హరి, నాతోరా," అన్నపుడు వెను దిరిగి, లోతైన వేడి యిసుకలో కాళ్లీడ్చుకొంటూ బిజూను సమర్థించాలా లేక బిజూ మాటలను నమ్మని వాళ్లను సమర్థించాలా అన్నవిషయాన్ని గురించి ఆలోచిస్తూ, అతని వెంట వెళ్లాడు.

రాము వాస్తవంగా బిజూ మాటలను నమ్మలేదు. "దానికి గాఢశీతలీకరణ సదుపాయం ఉన్నప్పటికి అది చేపలు వేటాడే పడవే. వర్షాకాలం ఎలా ఉంటుందో నీకు తెలుసుగా - ఒక్కతుఫానువస్తే ఆ పడవ అగ్గిపెట్టెలాగ ముక్కలవుతుంది. అది కూడ మిగతా పడవలన్నింటి లాంటిదే. అది వర్షాకాలంలో సముద్రయానం చేసేంత పటిష్ఠంగా ఉండదు. అటువంటప్పుడు ఉపయోగమేమిటి? అంతా మోసం," అన్నాడు.

"ఏమైనా చేపలు పట్టేకాలంలో అతను ఎక్కువ డబ్బు సంపాదిస్తాడు," అన్నాడు హరి.

"చేపలు పట్టేకాలం అయిపోయిన తర్వాత ఏంచేస్తాడు? సముద్ర తీరంలో కూర్చొని మిగిలిన వృద్ధులందరి లాగే వలలుబాగు చేస్తాడా? అలా కాకుండా ఏదో ఒక పని ఉండటం, దినసరి భత్యాలు ఉండటం మంచిది. ఇంకా యితర

ప్రయోజనాలన్నీ - కాంటిన్‌లో ఉచిత భోజనం, జబ్బుచేస్తే వైద్యంచేయటానికి డాక్టర్, జీతంతో సెలవులుంటాయి - అదీ జీవితం," అంటూ రాము తన సైకిల్ గంటను ఆనందంతో, పెద్దగా మోగించాడు.

"తుళ్‌లో నీకు అలాంటి ఉద్యోగం లభిస్తుందనుకొంటున్నావా?" అన్నాడు హరి, సందేహపూరితంగా. అలా అనటంలో అతనికి బిజూ పడవ గొప్పతనాన్ని గురించి కలిగిన సందేహం కంటె పెద్ద సందేహం కలిగినట్లు తోచింది.

"తప్పక! కర్మాగార నిర్మాణం పూర్తికానివ్వు. ఉద్యోగం కొరకు ప్రయత్నంచేసే వాళ్లలో రాము ప్రథముడిగా ఉంటాడు," అని రాము పెద్దగా అంటూ, మరో మారు సైకిల్ గంట మోగించాడు. అలా పెద్దగా మ్రోగించటంతో ఒక గేదెవీపు మీద కూర్చొని, దాని చెవులను పొడుస్తున్న కొంగ భయపడిపోయి, దాక్కోవటానికి కొబ్బరి తోటలోకి ఎగిరిపోయింది.

"నేను కూడా ప్రయత్నిస్తాను," అన్నాడు హరి. "నేను కూడ అలాగే చేస్తాను."

అతనికి యిప్పుడు రెండు, మూడు అవకాశాలున్నట్లు తోచింది. ఇప్పుడు తానుచేయగలిగింది చేపలు పట్టటం, కొబ్బరికాయలు అమ్మటం మాత్రమే అయినప్పటికీ, తరువాత తాను కర్మాగారంలో ఉద్యోగమో, బిజూకుసంబంధించిన పడవ మీద ఉద్యోగమో, ఎవరైనా తనకు బొంబాయి చేరటంలో సహాయంచేస్తే, అక్కడ ఉద్యోగమో ఎంచుకోవచ్చు. జీవితంలో యిన్ని అవకాశాలున్నాయని ఊహించటం ఉత్తేజకరంగా ఉన్నా ఆ ఆలోచన అతనికి భయాన్ని కూడా కలిగించింది. తుళ్‌లోని వ్యక్తులకు ఎప్పుడూ అలాంటి అవకాశాలను గురించి చర్చించ నవసరం లేదు; వాళ్లకు ఈ తీరం వెంట చేపలు వేటాడటం, వ్యవసాయంచేయుటం మినహా యితర విషయాలు ఆలోచించ వలసిన అవసరం ఎప్పుడూ లేదు. ఇప్పుడు అలాఉండటం కుదరదు. హరి, తానుకూడా బిజూ లాగే నూతన మార్గాన్ని ఎంచుకోవలసి ఉంటుంది అనుకొన్నాడు. ఆ మార్గం భిన్నస్థాయికి సంబంధించింది కావచ్చు. అయినప్పటికీ బిజూ లాగే యింతకుముందు ఎవరూచేయని విధంగా ఎంచుకోవలసి ఉంటుంది. ఎలాగ. తన కెవరు సాయంచేస్తారు? హరి వ్యాకులపడుతూ మౌనంగా నడుస్తున్నాడు.

ఇంతలో భారీగాసామానులతో నిండిన కారొకటి గడ్డి పెరిగిన ఒడ్డు మీద కుదుపులతో కొబ్బరి చెట్లను తప్పుకొంటూ, ఆ సన్నని మార్గంలో, మేఘంలాగ దుమ్ములేపుకొంటూ అటువైపుగా వచ్చి, సంవత్సరంలో చాలాకాలం ఖాళీగా ఉండే తెల్లని భవనం 'మాన్ రిపోస్' ముందు ఆగిపోయింది. దానివల్ల హరి ఆలోచనలకు అనుకోని అంతరాయంకలిగింది. అది అటు వైపురాకపోతే హరి

అలా వ్యాకులపడుతూనే ఉండే వాడు. ఆ కారులో వచ్చిన వాళ్లు డిసిల్వా కుటుంబం వాళ్లు. వాళ్లు అప్పుడప్పుడు సెలవులుగడపటానికి బొంబాయి నుండి వస్తారు. అప్పుడు ఆ భవనంలో అకస్మాత్తుగా జీవం తొణికిసలాడుతుంది. వాళ్లు 'మాన్ రిపోస్'ను తుళ్ సముద్ర తీరంలో మొట్ట మొదట, సెలవుల్లో విశ్రాంతి కొరకు ఉద్దేశించిన గృహాలను నిర్మించిన కుటుంబం, వకీల్ కుటుంబం వద్ద సంవత్సరం క్రితం కొన్నారు. వకీల్ కుటుంబం వాళ్లు ఆ భవనాన్ని నిర్మించారు కాని వాళ్లు చాలా వృద్ధులైపోయి, బల హీనులై పోవటం వల్ల ఎక్కువగా అక్కడికి రాలేకపోయారు. చాలా సంవత్సరాల వరకు ఆ భవనం ఖాళీగా ఉన్న తర్వాత, యౌవనంతో శక్తి వంతంగా ఉండి, సముద్ర తీర జీవనాన్ని అధికంగా ఆనందించేటట్లు తోచిన డిసిల్వాకుటుంబ సభ్యులకు వాళ్లు అమ్మి వేసారు. వాళ్లు వచ్చినప్పుడల్లా తమ చిన్న పూరింటిలోని కుటుంబం జీవనంలో కూడ మార్పు వచ్చేది. వెంటనే అలజడి, అన్నిరకాల ఉత్తేజాలు, ఆశలు ప్రారంభమవుతాయి; దానితో పాటు చేయటానికి పని ఉండేది, దానితో పాటు కూలి దొరికేది.

హరి, బేల, కమల తమ యింటి గుమ్మం ప్రక్కన ఉన్న ఎఱ్ఱ మల్లె చెట్టు క్రింద నిలబడి తీవ్రమైన ఉద్వేగంతో గమనిస్తూ, అపరిచితమైన కారును, క్రొత్త వ్యక్తులను చూడటంతో గొంతు జీరపోయే దాకా మొరుగుతున్న పింటోను పట్టుకొన్నారు. ఆ యింటినుండి తమ పూరింటిని వేరు చేస్తున్న చిత్తడికయ్యలో కూడ సంచలనం మొదలైంది. కొంగలు, బెగ్గురు పక్షులు, లకుముకి పక్షులు, అన్నీ రక్షణ కొరకు దట్టంగాను, పచ్చగాను ఉన్న మొగలి పొదలు, సరుగుడుచెట్లలోకి ఎగిరి పోతున్నాయి.

"వాళ్లు యిక్కడికి రావటం ప్రయోజనకరమేనంటావా?" అని అడిగింది, బేల, మెల్లగా. "హుఁ - బొంబాయిలో యిల్లు ఉంటే యిక్కడ ఎవరుంటారు?" అన్నాడు హరి వెటకారంగా.

"వాళ్ళు ఎంత సామాను తెచ్చారో చూడు - దాన్నిచూస్తే కొద్ది రోజులుండటంకోసం యిక్కడికి వచ్చినట్లు లేదు," అంది బేల. కారు యొక్క డిక్కీలో నుండి నమ్మశక్యం గానన్నిపెట్టెలు, బుట్టలు దించటం వాస్తవమే. వీటన్నిటిని చూస్తే వాళ్లు శాశ్వతంగా యిక్కడే ఉండి పోవటానికి వచ్చారని ఎవరైనా భావించే అవకాశం ఉంది.

కొత్తగా వచ్చిన వ్యక్తులు సంచులను తూలుకొంటూ యింటిలోకి మోసుకొని పోతూండటంచూసి, హరి వాళ్లకు సాయంచేసేందుకు వెళ్లాడు. వాళ్లు తమ



సామానంతా వసారాలోకి మోసుకొని వెళ్లారు. తరువాత హరి తమ పూరింటికి వెళ్లాడు. ఇంతలో ఆ యింటి చిన్న పిల్ల వాడొకడు అతన్ని పిలవటానికి పరుగెత్తు కొంటూ వచ్చాడు.

హరి వసారామెట్లు ఎక్కేటప్పుడు డిసిల్వా భార్య అక్కడ నిలబడి ఉండటం గమనించాడు. ఆమె తుళ్‌లోని స్త్రీలు ధరించే దుస్తులకన్న భిన్నమైన దుస్తులు వేసుకొని ఉంది. అందువల్ల అతను అటు చూడకుండా చూపులు క్రిందికి మరల్చుకొన్నాడు. ఆమె ఒక బుట్ట, కొంత డబ్బు హరి కిచ్చి, మార్కెట్టుకు వెళ్లి చేపలుకొని తెమ్మంది. "చేపలు బాగా తాజాగా ఉండాలి," అని మాటి మాటికీ చెప్పింది. "ఉదయం మాకు, పాలు, గ్రుడ్లుకావాలి. నీవు తెచ్చి పెట్టగలవా? - బాగా తాజాగా ఉండాలి," అందామె. క్రితం సంవత్సరం

వారాంతాల్లో వాళ్లుఎప్పుడు వచ్చినా హరి వాళ్లకు యిలాంటి చిన్న చిన్న పనులు చేసాడు. కాని ఆమె మరచినట్లో లేక ఆమెకు గుర్తు లేనట్లో ఉంది. నగరాల్లో వాళ్లకు జ్ఞాపక శక్తి తక్కువ అని హరి భావించాడు; బహుశ ప్రతిరోజు వీధుల్లో కొన్ని వందల ముఖాలను చూడటం వల్ల ఒక వ్యక్తికి, మరోవ్యక్తికి తేడాను గమనించరేమో! హరి ఆమె యిచ్చిన డబ్బు, బుట్ట తీసుకొని బయలుదేరాడు.

తరువాత కొద్దిరోజుల వరకు హరి, డిసిల్వాకుటుంబ సభ్యులకు చేపలు వేటాడే పడవలు సముద్రం నుండి తిరిగి వచ్చిన తర్వాత చేపలు కొనుగోలు చేయటం, ఊళ్లోని మార్కెట్ నుండి గ్రుడ్లు, పాలు తీసుకొని వచ్చే పనుల్లో మునిగిపోయాడు. వాళ్లు సాయంత్రం పూట బొంబాయి నుండి తెచ్చిన యినుప మడత కుర్చీల్లో ఆరుబయట కొబ్బరి చెట్ల క్రింద కూర్చొని మద్యం సేవిస్తుంటే అందులో కలుపు కోవటానికి సోడా సీసాలు కూడా హరి తెచ్చేవాడు.

వాళ్లు తమతో పాటు తమ సేవకులను కూడా తీసుకొని వచ్చారు - వాళ్లకు భోజనాలు తయారుచేసేందుకు ఒక వంట మనిషి, వాళ్ల బట్టలుతికి, చిన్న పిల్లలకు కావలసిన తువ్వాళ్లు, బకెట్లు పారలు పట్టుకొని, వాళ్లను సముద్ర తీరానికి తీసుకొని పోయేందుకు ఒక ఆయాని తీసుకొని వచ్చారు. సముద్రపు అలలు వాళ్లను తోసి వేస్తూ, నురగ వాళ్ల తలలను తడుపుతూంటే, వాళ్లందరూ ఆడుకుంటూ, సముద్రపు నీటిని ఒకరి మీద ఒకరు చల్లుకొంటూ, నవ్వుతూ, కేకలు వేస్తున్న దృశ్యం రమణీయంగా ఉంది. హరి, అతని అక్కాచెల్లెళ్లు తోపులోని పొదలు, చిన్న మొక్కల చాటునుండి వాళ్లను జాగ్రత్తగా గమనిస్తున్నారు, కాని తమపనులు మీద సముద్ర తీరంపై అటు యిటూ వెళ్తున్న తుళ్‌గ్రామస్తులు కొంచెం సేపు ఆగి, ఆదృశ్యాన్ని చూచి నవ్వుతున్నారు. తుళ్ గ్రామ ప్రజలు తమ పడవలను జల ప్రవేశం చేయించటానికో లేక చేపల వేటకో సముద్రంలోకి వెళ్తారు గాని, చేపలు, కప్పల్లాగ యీత వేసేందుకు, నీళ్లు చల్లుకోవటానికి గాని వెళ్ళరు. అందువల్ల ఆ గ్రామస్తులు బొంబాయి నుండి వచ్చిన డిసిల్వా కుటుంబ సభ్యులు వింతగా ప్రవర్తిస్తున్నారని భావించారు.

వాళ్లు ఆటలాడటం, ఎక్కడో ఒకచోట పండుకొని విశ్రాంతి తీసుకోవటం కంటె మరేమీచేయకపోయినా వాళ్లచుట్టూ ఉన్న వ్యక్తుల్లో ప్రతి ఒక్కరికి విరామం లేకుండా ఉండేటట్లు పని అప్పచెప్పేవారు. వంట మనిషి, ఆయా పనంతాచేయ లేక పోవటంతో వాళ్లు హరిని సాయంచేసేందుకు కుదుర్చు కొన్నారు. (ఇంతకు ముందు హరి నాన్న వాళ్ల యింట్లో పని చేసే వాడు.)

హరి చేపలు తెచ్చిన తర్వాత వంట మనిషి అతని చేత వాటిని శుభ్రంచేయించి, ముక్కలుగా కోయించింది; ఒక్కొక్కప్పుడు హరి కూరగాయలను కూడా ముక్కలుగా తరిగే వాడు. చాలా కాలంగా మూయబడి, ఖాళీగా ఉండటంవల్ల యింట్లో యిసుక, బూజు పేరుకు పోవటం వల్ల, ఆయా హరిని యింటిని శుభ్రంగా ఊడ్వమని చెప్పింది. అప్పుడు హరి లీలను సాయంచేయమని కోరవలసి వచ్చింది. లీల తన చీరెను పైకి దోపి, చీపురు తీసుకొని ఊడవటానికి వచ్చింది. లీల వేసుకొన్న మట్టిగాజులు, తలలో పెట్టుకొన్న పూల వల్ల ఆకర్షితులై యింటి వాళ్ల పిల్లలు ఆమె వెంట తిరిగారు. ఆమె ఊడవటం ఆపి వాళ్లను చూసి చిరునవ్వు నవ్వుతూంటే, వాళ్లు ఆమె ధరించిన అందమైన వస్తువులను చూసి, మెచ్చు కొనేందుకు దగ్గరగా వెళ్లేవారు, వాళ్లకు ప్రతిరోజు మార్చు కొనటానికి, కొన్ని సందర్భాల్లో రోజుకు రెండు సార్లు మార్చుకోవటానికి అవసరమైన దుస్తులున్నప్పటికీ, వాళ్లుఎలాంటి ఆభరణాలు వేసుకోలేదు. ఆమె వాళ్ళు తలలో పెట్టుకోవటానికి కావలసిన పూలు కూడ తెస్తానని చెప్పటంతో వాళ్లు ఆమెతో పాటు ఆమె ఉండే పూరింటికి వెళ్లారు.

"కమల, బేల - రండి వాళ్లకు కొన్ని పూలదండలుకట్టండి," అని లీల తన చెల్లెళ్లను పిలిచింది. వాళ్లిద్దరూ యింటి వాళ్ల పిల్లలు రావటం చూసి వసారాలోని స్తంభాలకు అతుక్కుపోయారు. వాళ్లు అక్కడినుండి నవ్వుకొంటూ యివతలికి వచ్చి, మల్లెపూలు కోయటానికి వెళ్లారు.

ఆ పిల్లలు, దండలను వాళ్ల అమ్మకు చూపించటానికి తీసుకొనిపోయారు.

మరుసటి రోజు వాళ్ల యిల్లు చిమ్మటానికి వెళ్లినప్పుడు లీల కొన్ని బంతిపూలు, పచ్చగన్నేరుపూలు, వాళ్లపూరింటి ప్రక్కన పెరుగు తున్న మందార చెట్టునుండి కొన్ని పూలు తీసుకొని వెళ్లింది. ఆ ఉదయం కోసిన మంచులాంటి తెల్లనిపూలు, నిదానంగా మధ్యాహ్నానికి గవ్వలాగా ఎఱ్ఱగాను, సాయంత్రానికి ముదురు గులాబీ రంగు, రాత్రి అయ్యేటప్పటికి, ముదురు ఎరుపు రంగుకు ఎలా మారేవి పిల్లలకు చూపించేందుకు ఆమె వాటిని తీసుకొని వెళ్లింది. వాళ్లు, లీల మేజాబల్ల మీద నీళ్లతో నింపినగ్లాస్‌లో పెట్టినపుష్పాల దగ్గరకు వెళ్ళినప్పుడల్లా ఆశ్చర్యంతో, "అపూర్వ పుష్పాలు, అపూర్వ పుష్పాలు," అని అరవటం విని ఆమె ముఖంపై చిరునవ్వు చిందుతుండేది. ఆమెకు అది తమ వంటగదికిటికీ లోంచి గమనించదగిన నిత్యం జరిగే సంఘటనే; తనకు మాత్రం చాలా అరుదుగాను, అద్భుతంగాను ఉన్నప్పటికీ, వాళ్లు తరచుగా సామాన్యమైన మిఠాయిలను తింటున్నట్లున్న సంఘటన లాంటిది.

ఒకరోజు సాయంత్రం సముద్రం నుండి గాలి బలంగా వీస్తూ, చలిగా ఉన్నపుడు వాళ్లు వసారాలో కూర్చున్నారు. వాళ్ల ప్రక్కన యిసుకతో నింపిన పాత్రఉంది. దానిలో సరుగుడు చెట్టుకొమ్మను గుచ్చారు. హరి వాళ్లకు సోడా తీసుకొని వెళ్లినప్పుడు ఆ కొమ్మ రంగుల కాగితాల ముక్కలతో అలంకరించి ఉండటం చూసి ఆశ్చర్య పోయాడు. అవి గాలిలో రెపరెపలాడుతున్నాయి. వాటితో పాటు వెండి రంగు నక్షత్రాలు, బంగారు రంగు బంతులు గుండ్రంగా తిరుగుతూ, పైకి క్రిందికి కదులుతూ నర్తిస్తున్నాయి. వసారాలో కూర్చున్న బృందం అసాధారణమైన రీతిలో ఆనందంగాను, ఉత్సాహ వంతంగాను, బిగ్గరగా శబ్దాలు చేస్తూంది. పెద్దవాళ్లు, చిన్నపిల్లలతో ఆటలు ఆడుతున్నారు. వాళ్లందరూ రాత్రి ప్రొద్దుపోయేవరకు పాటలు పాడుతూ, నవ్వు తూనే ఉన్నారు. వాళ్లు ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయిన తర్వాత భోజనంచేసారు. వంట గదిలో పాత్రలు శుభ్రం చేస్తూండగా వాళ్లు ఒక పళ్లెంలో బంతిలా ఉన్న ఆహారపదార్థానికి నిప్పంటించటం చూసానని హరి చెప్పాడు - అలాఎందుకు చేసారో అతను చెప్పలేక పోయాడు.

మరుసటి రోజు లీల యిల్లు ఊడ్చటానికి వెళ్లినప్పుడు ఆమె కుప్పల కొద్దీ నేల మీద పడి ఉన్న రంగు కాగితాల ముక్కలను తొలగించవలసి వచ్చింది. ఆ చిరిగిన రంగుకాగి తాలను జాగ్రత్తగా మడిచి, శుభ్రంగా కుప్పలాచేసేటప్పటికి ఆ పిల్లల తల్లి, అక్కడికి వచ్చి, "ఆఁ, వాటిని పారవెయ్ - క్రిస్మస్ అయిపోయింది," అంది ఆ మాటలకు లీల ఆశ్చర్యపోయి బేల, కమల, ఆకాగితాలనుచూసి, ఆడు కొనేందుకు తీసుకొనిపోయింది. "క్రిస్మస్, అయి పోయింది," అందామె. ఆమె ఆశ్చర్యపడేలాగ తన చెల్లెళ్లకు ఆ మాటంటే ఏమిటో తెలిసి తలలూపారు. "అవును, క్రిస్మస్." మా ఉపాధ్యాయిని మాకు బళ్లో దాన్ని గురించి చెప్పింది. అది చాలాకాలం పూర్వం పశువుల పాకలో ఒక బిడ్డ పుట్టినరోజు పండుగకు సంబంధించిన విందు," అంది బేల. లీల ఆశ్చర్యపోయి చూస్తోంటే, "కృష్ణుడు కారాగారంలో జన్మించినట్లే," అని కమల వివరించింది. అయితే వాళ్లు చెట్టును రంగు కాగితాలతో ఎందుకు అలంకరించారు?" అని అడిగింది లీల. దానికి వాళ్లు సమాధానం చెప్పలేకపోయారు. వాళ్ల ఉపాధ్యాయిని చెట్టును గురించి ఏమీచెప్పలేదు. అప్పుడే డిసిల్వాలు బసచేసిన యింటినుంచి పిల్లలు వచ్చి వాళ్లందరికీ ఒక్కోమిఠాయిల పొట్లం యిచ్చారు. వాళ్లు వాటిని మౌనంగా తీసుకొని తర్వాత అల్లరి చేస్తూ తిన్నారు.

"పింటోకు ఒకటి యివ్వండి, పాపం పింటో," అంది లీల, యిబ్బంది కరమైన పరిస్థితుల్లో ఉన్న పింటోను గురించి విచారం వ్యక్తం చేస్తూ. డిసిల్వా కుటుంబ సభ్యులు తమతో కుక్కను కూడా తీసుకొని వచ్చారు. అదిపెద్దదిగాను, బంగారు వర్ణంలోను ఉంది; తోక పక్షి పింఛంలాగా ఉంది; అది కథల్లోని రాజకుమారిలాగా ఉంది. అరుస్తూ, ఉద్వేగపడే పింటో, వాళ్ల కుక్కను కరుస్తుందే మోనని లీలా వాళ్లు భయపడ్డారు. వాళ్లు దాన్ని మీషా అని పిలుస్తున్నారు. బంగారు రంగులో, కాంతు లీనుతూ, పట్టులాగ మెత్తగా ఉన్న మీషా తోటలో తిరిగాడుతుంటే వాళ్లు హరి చేత పింటోను రోజంతా చెట్టుకో లేక వసారా స్తంభానికోకట్టి వేయించారు. మొదట్లో పింటో కొపంకొద్దీ మొరిగేది. తరువాత ఏమి ఉపయోగం లేదని మౌనంగా యిసుక మీద ముఖం మాడ్చుకొని పండుకొంది. దానికి చాల బాధకలగటం వల్ల బేల దాని కొక స్వీట్ యివ్వబోతే తల త్రిప్పుకొంది.

కాని త్వరలోనే పింటో విచారంతొలగింది. ఒకరోజు ఉదయం కారులో వస్తువులను నింపి బొంబాయికి తిరిగి వెళ్లటానికి సిద్ధంచేయటం జరుగుతోంది. డిసిల్వా హరి చేత ఒక బకెట్‌తో నీళ్లు తెప్పించి కారును కడిగించి, తుడిపించాడు. అతను పైపుతో పొగ త్రాగుతూ, గమనిస్తూ నిల్చొని, "ఆ! అలాగే, చూడు యీ యిల్లు అక్కడక్కడ కూలుతోంది. మేము లేనప్పుడు యీ యింటిని కని పెట్టి ఉండేందుకు మాకొక కాపలా మనిషి కావాలి. మళ్లీ మేము కొన్ని నెలల పాటు రాకపోవచ్చు. ఆ సమయంలో యీ యింటిని సంరక్షణ లేకుండా వదలి వేయకూడదు, మేము కొంచెం జీతంయిస్తాం - ఎక్కువ పని ఉండదుకాబట్టి ఎక్కువ జీతం ఉండదు. ఇంటిని గమనిస్తూ, అప్పుడప్పుడు తెరచి గాలి సోక నివ్వటం, మరమ్మతులు అవసరమైతే మాకు తెలియజేయటం. మీనాన్నయీపని చేయగలడా? అతను యీపరిసరాల్లోనే కనపడుతూ ఉండేవాడు. కాని యీసారి అతను నాకు కనిపించలేదు. అతనెక్కడ?" అన్నాడు.

హరికి ఉత్సాహం కలిగింది. తన తండ్రి ఓమూల చాప మీద నిద్రపోతున్నాడని తెలిసే త్వరగా యింటికి వెళ్లాడు. "నాన్నా," అని పిల్చాడతను జీర బోయిన కంఠంతో, అతను వాళ్ల నాన్నను చాలా అరుదుగా పలకరిస్తాడు. "నాన్న, ఆయన నిన్ను పిలుస్తున్నాడు. ఆయన నీకో ఉద్యోగంయిస్తాడట," అన్నాడు.

"హు, ఉద్యోగమా?" అన్నాడు హరి నాన్న, నేల మీదినుంచి లేచి, గుమ్మం వైపు వెళ్తూ. వాళ్ల నాన్న డిసిల్వా యింటికి వెళ్లటానికి హరిసాయంచేసాడు. డిసిల్వా, వాళ్ల యింటి ప్రక్కన కారు దగ్గరనిలబడి దాన్లో సామానులు వేయటాన్ని

గమనిస్తున్నాడు. కాని హరిని, వాళ్ల నాన్నను చూసే సరికి అతని ముఖంలో భావాలు మారాయి. అతను కొన్ని చిన్న ప్రశ్నలు అడిగాడు, కాని దీర్ఘమైన అస్పష్టమైన సమాధానాల పట్ల అసహ్యతను వ్యక్తం చేసి, అస్పష్టమైన సమాధానాలతోపాటు వెలువడిన, వేడిగాసారా వాసనతో కూడిన శ్వాసకు ఎడంగా తలత్రిప్పుకొన్నాడు. చివరిగా ఆయన తల ఊపుతూ, మెట్లెక్కి, వసారాలోకి వెళ్లి తన భార్యతో యిలా అన్నాడు. "పనికిరాని త్రాగుబోతు గ్రామస్తులు - ఉదయాన్నే పీకల దాకా త్రాగేవాళ్లు, వాళ్లకు మనమేం సహాయంచేయగలం? అందరూ నిష్ప్రయోజకులు," అన్నాడు.

హరి హృదయం రాయిలాగా మారి బరువెక్కి, చల్లగా మారిపోవటంతో అతను తన తండ్రిని తమ యింటికి తీసుకొని వెళ్లాడు. డిసిల్వా కుటుంబ సభ్యులు కారులో ఎక్కి కూర్చున్నారు. తమతో పాటు ముచ్చటగా ఉన్న కుక్కనుగూడ అందులోకి ఎక్కించారు. అది కారు కిటికీ లోంచి చూస్తూ, ఉత్సాహంతో పింఛంలాంటి తన తోకను ఊపుతోంది. అప్పుడు కూడ డిసిల్వా కారు కిటికీ లోంచి వంగి, హరికి కొంత డబ్బుయిచ్చి, "మంచివాడివి, కారును బాగా శుభ్రం చేసావు. నీవెప్పుడైనా బొంబాయి వస్తే నీకు కారు శుభ్రం చేసే ఉద్యోగం యిస్తాను," అన్నాడు. హరి నవ్వలేదు - నవ్వలేకపోయాడుకూడా. హరి డబ్బు తీసుకొని కారు యిసుకతో నిండిన మార్గంలో కుదుపులతో ప్రయాణం చేస్తూ కొబ్బరి తోపులోకి పోయి అదృశ్యమౌతుంటే మౌనంగా గమనిస్తూ నిల్చున్నాడు.

అప్పుడు లీల పింటోని స్వేచ్ఛగా వదలి వేసింది. అది ఆనందంతో ఒక్క అరపు అరచి కారు తుళ్దాటి వెళ్లేంత వరకు పిచ్చిగా వెంటాడింది.

కర్మాగార నిర్మాణం పూర్తయిందో లేదో చూడటానికి వెళ్లిన సమయంలో కూడ హరి, తన తండ్రి త్రాగుబోతు తనాన్ని గురించి బొంబాయి నుండి వచ్చిన డిసిల్వా అన్న అవమాన కరమైన మాటలను గురించి మౌన పూరిత ఆగ్రహంతో ఉన్నాడు. తానెప్పుడైన ఉద్యోగం కావాలని వెళ్తే కారు శుభ్రంచేసే ఉద్యోగం యిస్తానన్న వాగ్దానాన్ని డిసిల్వాజ్ఞాపకం ఉంచుకొంటాడో లేదో తనకు తెలియదు. పడవ నిర్మాణం పూర్తి అయిన తర్వాత బిజూ అతని పడవ మీద ఉద్యోగం యిస్తాడో లేదో కూడ తెలియదు. అందువల్ల అతను కర్మాగార నిర్మాణం పూర్తి య్యిందో లేదో, అక్కడ తనకు ఉద్యోగం లభిస్తుందో లేదో చూడాలి. అదే తన ముందున్న ప్రత్యామ్నాయాల్లో మంచిది లాగా తోస్తోంది.

అతను కొండ దిగువన కర్మాగార నిర్మాణానికి ఉద్దేశించిన స్థలానికి వెళ్లినప్పుడు

అక్కడ యినుపరేకులపాకకు తాళంవేసి ఉండటం, పసుపు పచ్చరంగు లారీ వెళ్లిపోయి, అక్కడ కర్మాగారం నిర్మించాలన్న ఆలోచనకు చిహ్నంగా చిందర వందరగా ఉన్నకొద్ది పాటి పెద్ద కాంక్రీట్ గొట్టాలు చూసి నిరుత్సాహ పడిపోయాడు. అలా తక్కువస్థాయిలో ప్రారంభమై నిర్మాణాలు పూర్తిగా రొదచేసే యంత్రాలతో, రాము, హరి లాంటి వాళ్లు పని చేయటానికి అనువుగా గొప్ప కర్మాగారాలుగా ఎప్పుడు ఎదిగి పోతాయో?

అతను అక్కడ ఉన్న కాంక్రీట్ గొట్టాలలో చలనం రావాలని ఆశిస్తున్నట్లు వాటి చుట్టూ గుండ్రంగా తిరిగాడు, కాని గోధుమ రంగు మిడత ఒకటి గడ్డి దుబ్బులోంచి కాంక్రీట్ గొట్టం మీదికి, మళ్లీ దాని మీదనుండి యివతలికి దూకటం తప్ప మరోకదలిక లేదు. అందువల్ల ఒక గులకరాయిని ఒకచేతి నుండి మరోచేతిలోకి మార్చుకొంటూ, తన నిరుత్సాహాన్ని యీల రూపంలో ఊదేస్తూ అతను కొండమీద దేవాలయం ఏమౌతుందోనని ఆలోచిస్తూ అటువైపునడవసాగాడు.

కొండను తేలిగ్గా ఎక్కటానికి ఎత్తుని, కంకరమట్టితో ఉన్న పార్శ్వంలో మెట్లు చెక్కటం జరిగింది, బాటకు యిరువైపులా పెరిగి, ఎండిపోయిన బంగారు రంగు గడ్డిని త్రోసుకొంటూ వెళ్తున్నప్పుడు మేకల మందతో కొండదిగి వస్తున్న మేకల కాపరి ఒకణ్ణి హరి కలిసాడు. అతను తెల్లని ధోవతి కట్టుకొని, ముదురు ఎరుపు రంగులో ఉన్న పెద్ద తలపాగాచుట్టు కొన్నాడు. అతని మేకలు నల్లగాను, తెల్లగాను, చాకొలెట్ గోధుమ రంగులోను ఉండి అరుస్తూ, ఒక దాన్ని మరొకటి పలకరించు కొంటూ, ధూళి మేఘంలో అతన్ని అనుసరిస్తున్నాయి. వాటిలో కొన్ని కొండ పొడుచుకొని వచ్చిన భాగం మీద నిలచి పోయి వెఱ్ఱిగా యింతకు ముందే కొండ దిగువకు చేరుకొన్న వాటిని పిలుస్తున్నాయి. చివరికి వాటిలో బాగా తెగువ గల మేక ఒకటి ముందుకు దూకటంతో మిగితా వన్ని ధైర్యం తెచ్చుకొని దాని వెంట పరుగెత్తుతూ, జాతీయ మార్గాన్ని దాటి కొద్ది కాలం క్రితమే వరి పంట కోయటం వల్ల ఎండి పోయిన పొలాల్లో ఉన్న మందను చేరుకోవటానికి ప్రయత్నిస్తున్నాయి. ఆదుమ్ములో మేకల కాపరి తలకు చుట్టుకొన్న ముదురు ఎరుపురంగు తలపాగా ఒక్కటే మెరుస్తూ చిన్న చుక్కలా కనిపిస్తోంది.

హరి పెద్ద గ్రద్దలను రెండింటిని చూసేందుకు తల వెనక్కు వాల్చి పైకి వెళ్లాడు. ఆగ్రద్దల జంట సాయంత్రపు ఆకాశంలో ఆటలాడు తున్నట్లున్నాయి - అవి గాలిలో తేలుతూ, గాలి ప్రవాహాల్లో దొర్లుతూ, నాట్యం చేస్తున్నట్లు ఒక

దానికొకటి దగ్గరగా ఎగురు తున్నాయి - అవి అలా ప్రశాంతంగాను, స్వచ్ఛంగాను ఉన్న గాలిలో దొర్లుతూ, క్రిందికి దిగుతూ బాలికల పాఠశాల ఉన్న మైదానం పైన, వాళ్ల యింటిని మరుగుపరుస్తున్న కొబ్బరిచెట్లు, అరటి చెట్లున్న సంపన్న ప్రాంతంపైన, రాజరికపు ఆడంబరాలతో నిద్రకుపక్రమిస్తున్నట్లు అస్తమిస్తున్న సూర్య కాంతిలో గంభీరంగా, రక్త నీలవర్ణంలో ఉన్న సముద్రం మీద ఎగురుతూ ఉంటే హరిని వాటిని గమనించాడు. తరువాత అవి అతని దృష్టికి కనిపించకుండా అదృశ్యమయ్యాయి.

త్రాగుబోతు తండ్రి, డిసిల్వా మాట్లాడిన అవమానకరమైన మాటలు, పని డబ్బు, రెండూ లేక పోవటం లాంటి యిబ్బందుల నన్నింటిని గురించి హరి ఆలోచించినప్పుడు తాను గూడ యీ భూమిని అంటి పెట్టుకొని ఉండి. అందంగా కూడ లేని దేవాలయం చుట్టూ తిరగటంకన్న ఆగ్రద్దల్లాగ ఆకాశంలోకి ఎగిరి పోయి అదృశ్య మైపోతే బాగుండునని అతనికి అనిపించింది. దేవాలయం యిటుకలతో కట్టిన చిన్నగది. అందులో రంగు వేసిన కృష్ణుని విగ్రహం, ఆయన గోవులు ఉన్నాయి. దేవాలయంలోకి ప్రవేశించ కుండ, తెరచి ఉంచిన ద్వారంనుంచి లోపలికి చూసి, కొద్దిసేపటి క్రితం తానుచూసిన మేకల కాపరిని జ్ఞప్తికి తెచ్చుకొని, అతనుగూడ కృష్ణునిలాగే మురళి వాయిస్తాడేమో అనుకొన్నాడు. అన్నియీ ప్రాంతానికి చెందినవే - తానుతప్ప - అన్ని ఏకీభావాన్ని పొందేవే. తనలోని అసంతృప్తి, యిబ్బందులు, ప్రశాంతరాహిత్యం వలన హరి తాను గూడ యీ ప్రాంతానికి సంబంధించిన వాడినేనని భావించ లేక పోయాడు.

తాను ఎప్పుడో ఒక రోజు యీ ప్రాంతాన్ని వదలి వెళ్లటం జరుగు తుందని అతని హృదయం చెప్తోంది. తుళ్ తనను ఎక్కువ కాలం బంధించ లేదు - కనీస పక్షంలో కొబ్బరి తోపులు చేపలు వేటాడే పడవలున్న తుళ్ తనను బంధించలేదు, బహుశ ఏదో ఒక రోజు యిది నిజంగానే కర్మాగార స్థలంగా మారిపోతే తాను నూతన తరహా జీవితాన్ని గడుపుతూ యిక్కడే ఉండిపోతాడు. లేని పక్షంలో తాను, తన కుటుంబ సభ్యులు తప్పనిసరిగా, నిదానంగా ఆకలితో బాధపడుతూ, తన తల్లిలాగ జబ్బుచేసి చనిపోతారు. లేదు! తాను వెళ్లిపోతాడు - పడవలో సముద్రాన్ని దాటి, ఎలాగో బొంబాయిలో, డిసిల్వా సహాయంతోనో లేక అతని సహాయం లేకుండానైనా, తన అదృష్టాన్ని పరీక్షించు కొంటాడు. అతన్ని అంతులేని ఒంటరి తనం ఆవరించింది.

అప్పుడు ఎవరో అగ్గిపుల్లగీసిన శబ్దంవిని, వెనుదిరిగి నోట్లో సిగరెట్ ఉన్న

వ్యక్తి ఒకడు తన వెనుక నిలబడి ఉండటం హరిచూసాడు. ఆ వ్యక్తి ఎవరో హరికి తెలియని వాడు - తెల్లని పైజామా మీద, నీలం రంగు చొక్కాధరించిన, బలిష్ఠమైన, నల్లని వ్యక్తి అతను గూడ విగ్రహం వైపే చూస్తున్నాడు.



తర్వాత అతను హరి వైపుచూసాడు. "నీవు ఈ గ్రామానికి చెందిన వాడివా?" అని అడిగాడు అతను, మరొక దిక్కుచేయి చూపిస్తూ.

"అవును, తుళ్ గ్రామం వాడినే," అన్నాడు హరి, కొబ్బరిచెట్ల సమూహాలను చూపిస్తూ.

"హుఁ," అన్నాడు అపరిచితవ్యక్తి "నేనుతుళ్ గ్రామస్తులను కొంత మందిని కలిసాను."

"మీరు యిక్కడ ఉంటారా?" అని అడిగాడు హరి, జిజ్ఞాసతో.

ఆ వ్యక్తి సమాధానం చెప్పకుండా, దిగువనున్న పాకను చూపించాడు.

"అక్కడా?" అని అడిగాడు హరి, ఆశ్చర్యంతో. "మీరు ఆ పాకలో ఉంటారా? మీరు బొంబాయినుండి లారీలో వచ్చారా?"

హరికి కలిగిన ఉద్వేగం పట్ల కొంచెం చిరు నవ్వుతో, ఆ వ్యక్తి అవునని తల ఊపాడు.

"అయితే మీరు - మీరు - నూతన కర్మాగారం."

"నేను కర్మాగారాన్ని కాదు," అని ఆ వ్యక్తి నవ్వాడు. "ఏమైనప్పటికి, యిక్కడ ఒక్క కర్మాగారం నిర్మాణం మాత్రమేకాదు - యీ ప్రదేశం మొత్తం కర్మాగారాల నగరంగా మారు తుంది. కర్మాగారాలు, యిండ్ల సముదాయాలు, దుకాణాల సముదాయాలు, బస్ డిపోలు, రైల్వే స్టేషన్లు, యింజనీర్లు, కార్మికులు - మొత్తం నగరం ఒకటి యిక్కడ నిర్మించటం జరుగుతుంది," అన్నాడతను.

"ఇక్కడ, తుళ్‌లోనా?" ఆశ్చర్యం వ్యక్తంచేసాడు హరి, తన చెవులను తానే నమ్మలేక.

"ఇక్కడే, తుళ్‌నుండి వైషట్‌కు, వైషట్‌నుండి రేవాస్‌కు, రేవాస్ నుండి ఉరాన్‌కు విస్తరిస్తుంది," అన్నాడా వ్యక్తి, గర్వంగా. అలా అంటూ అతను ఒక వ్రేలితో మొదట కొబ్బరి తోటలున్న కోస్తాను, తుళ్ లోకి వెళ్లేరోడ్ నుండి జాతీయ మార్గంవైపు వ్రేలు త్రిప్పి, తరువాత కొండనుండి వస్తున్నరోడ్‌కు అడ్డంగా ఉన్న పాత రాతిగని వరకు, తరువాత జాతీయ మార్గంవెంట తీర గ్రామం రేవాస్ ఉన్న ప్రాంతాన్నంతా చూపించాడు. "క్రొత్త తుళ్ - వైషట్ ఎరువుల సముదాయం," అన్నాడతను. ప్రతిధ్వనిస్తున్న స్వరంతో.

హరికి తెలుసు కోవాలన్న ఆసక్తి అధికంగా ఉండటం వల్ల, తనను అతను అమాయకమైన గ్రామస్తునిగా భావిస్తాడన్న విషయాన్ని గురించి కూడ అవమానపడకుండా, "ఏమిటది," అని అడిగాడు.

"అది ఏమిటో నీకు తెలియదా?" అని అడిగాడా వ్యక్తి, తృణీకారంగా. "నీకే తెలుస్తుంది. త్వరలోనే తెలుస్తుంది."

"కాదు, చెప్పండి," అన్నాడు హరి ఆత్రుతగా. "కర్మాగారంలో ఏమి తయారుచేస్తారు?"

"నేను చెప్పానుగా, ఎరువులు," అన్నాడా వ్యక్తి, అసహనాన్ని ప్రదర్శిస్తూ.

"అవేమిటి?" అని అడిగాడు హరి.

హరి అడిగిన ఆ ప్రశ్నకు నిష్ఠురంగా, ఆవ్యక్తి, ఈ గ్రామస్తులు వట్టి పనికి మాలిన వాళ్లు; వాళ్లకే మీతెలియదు. "రసాయనాలు," పంటలు పండించటానికి భూమిలో వేసే వేర్వేరు రసాయనాలు - నత్రజని, అమోనియా, యూరియా."

"ఓ ఎరువులా?" అన్నాడు హరి, తీవ్రంగా నిరుత్సాహపడి. ఈ పెద్ద,

ఆధునిక, విజ్ఞాన శాస్త్ర సముదాయం, పొలాలకు ఎరువులను ఉత్పత్తిచేయటానికి మాత్రమే నిర్మింపబడుతుందా?"

"కాదు, ఎరువు కాదు, మొద్దు, ఈ ఎరువుల ఉత్పత్తి, మనుషులు వాళ్లపొలాల్లో వేయటానికి, ఆవులు, గేదెలవెంట వెళ్లిపేడను ప్రోగుచేయటాన్ని ఆ పేందుకు. ఇక్కడ నెలకొల్పబోయే కర్మాగారాలు, దేశం అంతటికీ పంపించి, రైతులకు అమ్మేందుకు అవసరమైన రసాయనాలను టన్నులకొద్దీ ఉత్పత్తి చేస్తాయి. బాగా ఎక్కువ భూములున్న ధనిక వ్యవసాయ దారులకోసం, పెద్దవ్యవసాయక్షేత్రాలకు రసాయనాలు, మీపొలాల్లో ఎన్నడూకనీ విని ఎరగని రీతిలో పంటలు పండేటట్లు చేసే రసాయనాలు," అన్నాడు అతను హరి వేసు కొన్న చిరుగులచొక్కా, పాదరక్షలు లేని కాళ్లవంక తృణీకారంగాచూస్తూ.

"మాకొబ్బరి చెట్లకు మేము చేపల ఎరువు వాడతాం," అన్నాడు హరి, గ్రామస్తులు, వాళ్ల గేదెలను గురించిన పరిహాసపు మాటలకు బాధపడుతూ. "అది కొబ్బరి చెట్లకు చాలా మంచిది."

"ఫ్! ఎంత చేప ఎరువు ప్రోగుచేస్తావు? ఇక్కడ వేలటన్నులు, లక్షల టన్నులు ఉత్పత్తి చేసి, భారతదేశమంతటికీ పంపిస్తారు; ఎగుమతికూడా చేస్తారా?"

"నిజంగానా?" అన్నాడు హరి మర్యాదా పూర్వకంగాను, యీ నూతన భావాన్ని అర్థంచేసుకోవటానికి ప్రయత్నిస్తూను. "ఆ ఎరువులను చాలా కర్మాగారాల్లో ఉత్పత్తి చేస్తారా?"

"అవును, నిజమే ఒక్క కర్మాగారం కాదు చాలా కర్మాగారాలు. పారిశ్రామికవాడ - ఆ ప్రదేశం అలా మారిపోతుంది. బొంబాయి దగ్గర థానాలో ఉన్న దాన్నిచూసావా?"

నిజంగా హరి దాన్ని చూడలేదు. అందువల్ల అతను తల అడ్డంగా ఊపాడు, ఏమిమాట్లాడలేదు.

"ఇది అంత కంటె పెద్దదిగా ఉంటుంది. నీకేంతెలుసు," అంటూ ఆ వ్యక్తి ఒక్కసారిగా ముఖంలో కోపాన్ని వెల్లడిస్తూ కొండదిగటం ప్రారంభించాడు. కొండ ఏటవాలుగా ఉండటం వలన అతను ఒక మెట్టు నుండి మరొక మెట్టుకు దిగుతూన్నపుడు భారంగా అడుగులు వేస్తున్నాడు. అలా దిగటంలో ఎఱ్ఱని కంకరలో అతని బూట్లు జారుతున్నాయి. పాదరక్షలు లేని హరి, త్వరగా, తేలికగా, యింకా క్రొత్త విషయాలను తెలుసుకో వాలనే ఆసక్తితో అతన్ని అనుసరించాడు.

"ఎరువులను ఎలా ఉత్పత్తి చేస్తారు?" అని అడిగాడు హరి "యంత్రాలు ఎలా ఉంటాయి? అవి చమురుతో పని చేస్తాయా లేక బొగ్గు తో పని చేస్తాయా? వాటిని ఎవరు నడుపుతారు?" "వాటిని నడపటానికి మనుషులు కావాలి," అని ఆ వ్యక్తి అరిచాడు, తన భుజం మీదుగా "రైలు మార్గం వేస్తారు. అన్ని చోట్లనుండి తుళ్‌లో పని చేయటానికి మనుషులు వస్తారు."

"ఎక్కడ నుండి?" అని అడిగాడు హరి, ఒక మెట్టు నుండి మరో మెట్టు మీదికి, ఒక రాతి నుండి మరో రాతిమీదికి దూకుతూ, పడ కుండా ఉండటానికి చేతులను ఊపుకొంటూ.

"అన్ని చోట్లనుండి," అని అరిచాడా వ్యక్తి. "భారత దేశంలో అన్ని ప్రాంతాలనుండి. వాళ్లకు యిక్కడ ఉద్యోగాలు లభిస్తాయి."

అప్పటికి వాళ్లిద్దరు కొండ దిగువభాగానికి చేరటం వల్ల అతని వెంట పరుగెత్తి, "మరి మాకు లభించవా?" అని అడిగాడు హరి రాతి ముక్క తగిలి అతని పాదానికి గాయం అయ్యింది.

"మీకా?" అంటూ ఆ వ్యక్తి వెనుదిరిగి, తీక్షణంగాచూసాడు. "ఏయ్, కుర్రవాడా నీవు కర్మాగారంలో పని చేయగలవా?"

"నేను నేర్చుకోగలను," అన్నాడు హరి ధైర్యంగా, తనస్వరాన్ని నింపాదిగా ఉంచటానికి ప్రయత్నిస్తూ, "నేను నేర్చుకోగలను అనుకొంటున్నాను. నాకు ఉద్యోగం అవసరం."

అకస్మాత్తుగా ఆ వ్యక్తి తీక్షణంగా చూడటం, కేకలు వేయటం ఆపివేసాడు; అతని కళ్లలో దయనిండిపోయింది. "అయితే నీకు ఉద్యోగం కావాలి, అవునా? ఆకలితో బాధపడుతున్నారు, అవునా? ఇంట్లో తిండి లేదు. జబ్బుపడ్డ తల్లి, త్రాగుబోతు తండ్రి, పెళ్లికావలసిన అక్కా, చెల్లెళ్లు, కట్నాలకు డబ్బులులేవు, అవునా?" అని అడిగాడు అతను.

హరి బాగా విస్మయం చెందటంతో ప్రయాసపడి గాలి పీల్చవలసి వచ్చింది. ఈ అపరిచిత వ్యక్తి తన కుటుంబాన్ని గురించి ఎలా తెలుసుకొన్నాడు? ఇతను తనను గురించి విచారిస్తున్నాడా? హరిలో అతనికి భవిష్యత్తులో కర్మాగారంలో పని చేసే కార్మికుడు కనిపించాడా? హరికి అతను ఉద్యోగం యిస్తాడా? "మీకెలా తెలుసు?" అని అడిగాడు మెల్లగా.

ఆ వ్యక్తి అదేవిధమైన తిరస్కార భావంతో వెనుదిరిగాడు. "పల్లెటూరు మనుషులు - మీరంతా ఒకటే, పనికి రాని వాళ్లు సారాత్రాగుతారు; త్రాగి రోజంతా కొబ్బరి చెట్ల క్రింద నిద్రపోతారు. చేపలు పట్టటానికి వెళ్లి సముద్రంలో

మునిగి పోతారు. పనులు నిర్వహించటం స్త్రీలకే వదలి వేస్తారు. గ్రామంలోని వృద్ధస్త్రీలు, బాలికలు ఆకలితో మాడుతుంటారు. రాత్రిపూట ఊరకుక్కలు మొరుగుతుంటాయి. అబ్బ! ఏం ఊరయ్యా మీ తుళ్. ఎంత పనికి మాలిన మంద. అందరు ఒకే రకం. నేను యిక్కడి బాధ్యతలను ఎవరికైనా అప్పగించిన రోజు హాయిగా ఉంటాను," అంటూ నేల మీద గుట్టగా పడి ఉన్న కాంక్రీట్ గొట్టాల వైపు అతను చేయిచూపించాడు. "తరువాత బొంబాయిలో యింటికి వెళతాను!" అంటూ గాలిలోకి చేతులెత్తి పాడుతూ, తనపాక లోకి దూరి, దడాలున తలుపుమూసి వేసాడు.

హరి ఆ మూసిన తలుపు వంకే చూస్తూనిలబడ్డాడు. అతని మెదడులో తాను అడుగు దామను కొని, అడగ లేకపోయిన ప్రశ్నలన్నీ ఉరుకుతున్నాయి. ఆ వ్యక్తి పాకలో బొంబాయిలో తయారైన సినిమాలోని కోలాహలమైన పాటనొక దాన్ని బిగ్గరగా పాడటం వినిపించింది. తర్వాత తలుపు తెరచుకోవటంతో ఆ వ్యక్తి ముఖం కనుపించింది. "పనికి మాలిన వాడా! ఇంకా యిక్కడే నిలబడి చూస్తున్నావా? వెళ్లు, నామానాన నన్ను ఒంటరిగా ఉండనిస్తావా? నీ పనికి మాలిన ముఖం చూడలేను. అవతలికి వెళ్లు - పో - రసాయనాలు అంటే ఏమిటో, కర్మాగారాలు అంటే ఏమిటో, ఎరువులు ఏ విధంగా ఉపయోగపడతాయో తెలుసుకొన్న తర్వాతరా," అంటూ పెద్దగాకేకలు వేస్తూ మాట్లాడాడు.

దుమ్ము, గాళ్లతో నిండిన గ్రామంలోని రోడ్ మీద హరి తూలుతూ నడుస్తూంటే అతని ప్రక్కగా పెద్దగా గంట మ్రోగించు కొంటూ సైకిల్ ఒకటి దూసుకుపోయింది. అతను యింకెవరు. రామూయే; ఈరోజు అసాధారణ వేగంతో వెళ్తున్నాడు.

"నీవు విన్నావా?" అనికేక వేసాడు అతను వెనుదిరిగి హరి వైపుచూసి. "బిజాకు సంబంధించిన గాఢ శీతలీకరణ యంత్రం వచ్చింది. బొంబాయి నుండి ఒకలారీ తీసుకొని వచ్చింది."

అలా అంటూ రాము వేగంగా వెళ్లిపోయాడు. హరి తనకు తెలియదన్నట్లు తల ఊపటం అతను గమనించలేదు. అతనికి వృద్ధు డైన బిజా నిర్మించేసరుకు దొంగ రవాణా పడవ పట్ల ఆసక్తి పోయింది. అదిసముద్రం మీదికి వెళ్లి, వర్షాకాలపు తుఫానుల్లో మునిగిపోతుంది; గాఢ శీతలీకరణ యంత్రం మునిగి సముద్రం అడుగుకు చేరుకొంటుంది. మెరుస్తున్న కర్మాగారాలు, పొడవాటి పొగగొట్టాలు, వింత వాసన కొట్టే పొగమేఘాలు, పెద్ద ద్వారాల గుండా చీమల లాగా వెళ్లే మనుషులు - వాళ్ల మధ్యచిరిగిన చొక్కా, ఖాకీ నిక్కరు వేసుకొన్న కుర్రవాడు

- యింకెవరు, తనే - హరి మెదడు అంతా యీదృశ్యాలతో నిండిపోయింది.

కొబ్బరి తోటలోని మార్గంగుండా అతను వెళ్లేటప్పటికి చీకటి పడింది. పింటో మొరుగుతూ అతని దగ్గరకు వచ్చింది. అతను దాని వీపు తట్టటం గాని మాట్లాడటంగాని చేయకుండా నడుస్తుంటే అది అతనికి కాళ్లకురాసుకొంటూ దూకటం చూస్తూ ఊరు కొన్నాడు. తమ పూరింటిలో చిన్న మంట వెలుగు తుండటం అతనికి కనిపించింది. దాని చుట్టూ మూగిన తనముగ్గురు అక్కా చెల్లెళ్ల నల్లని ఆకారాలు గుమ్మం లోంచి కనపడుతున్నాయి.

అతను కయ్యకు అడ్డంగా ఉన్న కొయ్యదుంగ మీద అడుగు వేసి వాళ్ల వైపుచూసాడు. వాళ్లు చీకటిలో అతన్ని చూడలేక పోయారు. అందువలన అతను వచ్చినట్లు వాళ్లకు తెలియలేదు. వాళ్లు తలలు వాల్చుకొని , మౌనంగా ఉన్నారు. వాళ్ల స్థూలరూపాలు మాత్రమే పొగచిమ్ముతున్న చిన్న మంట వెలుగులో కనిపిస్తున్నాయి. ఆ అస్పష్టమైన చీకటిలో ముడుచుకు కూర్చొన్న స్థితిలో వాళ్లు భయపడి పోయినట్లు, అలసి పోయినట్లు, నిరాశాపూరితం గాను ఉన్నట్లు కనిపించారు.

లీల, బేల, కమల, వాళ్ల ముగ్గురు ఆ చిన్న పూరింటిలో సన్నిహితంగా జీవిస్తూ, ఒకేరకమైన జీవనాన్ని పంచుకొంటూ ఉండటం వల్ల అతను వాళ్లను గురించిగాని, వాళ్ల జీవితాలను గురించిగాని చాలా అరుదుగా ఆలోచించేవాడు, అతని జీవితం పూర్తిగా కష్టాలతో నిండిపోయింది. అందువల్ల వాళ్లను ఆ జీవితం నుండి ప్రజలుగా, వ్యక్తులుగా వేరుచేసి చూడ లేక పోయాడు. లీల, బేల, కమల - తన ముగ్గురు అక్కాచెల్లెళ్లు - ఒకతె తనకంటె పెద్ద, యిద్దరు చిన్న వాళ్లు. వీళ్లే వాళ్లు. తాను లేనప్పుడు వాళ్లకు ఓదార్పునివ్వటానికి వాళ్లకెవ్వరూలేరు. వాళ్ల పూరింటిలో వెలుగునింపటానికి పొగచిమ్ముతున్న చిన్న మంట తప్ప వాళ్లకు మరేమీలేదు.

వాళ్లు దేని కొరకు ఎదురుచూస్తున్నారు? ఏమి ఆలోచిస్తున్నారు? వాళ్లు తాను ఆశించినట్లు ఎప్పుడూ చేపలు వేటాడే పడవ మీద పని చేయాలనిగాని, లేక కర్మాగారం లో పని చేయాలనిగాని ఆశించలేరు. వాళ్లు ఎప్పుడో ఒక రోజున పెళ్లి చేసుకోవలసి ఉంటుంది. తన తండ్రి చేయలేదు కాబట్టి తానే ఆపని చేయవలసి ఉంటుంది. తాను వాళ్ల కొరకు భర్తలను వెదకి, పెళ్లిబట్టలు కొనవలసి ఉంటుంది - సిల్క్ చీరెలు, బంగారపు నగలు - వాళ్ల పెళ్లిళ్లు ఏర్పాటుచేసి గ్రామంమొత్తాన్ని ఆహ్వానించవలసి ఉంటుంది. పెండ్లికుమారులు కట్నం అడగవచ్చు - సైకిలో, స్కూటరో అడుగ వచ్చు, బంగారపు బొత్తాములు,

నాణాలు, నగలు, ఆవో, లేక గేదో, పొలమో అడుగవచ్చు. వధువుల తల్లి దండ్రులు తీర్చేపెండ్లి కుమారుల విచిత్రమైన కోరికలను గురించి తాను విన్నాడు. తాను ఆ కోరికలను ఎలా తీర్చగలడు? తనకు ఉద్యోగం వచ్చినా, వాళ్లకు అలాంటి ఖరీదైన కానుకలు కొనటానికి సరిపోయే డబ్బు సంపాదించలేడు. గ్రామంలో వడ్డీకి యిచ్చే షావుకారు దగ్గర డబ్బు అప్పు తీసుకొని, సంవత్సరాల తరబడి, బహుశా జీవితాంతం, తన జీతంనుండి చెల్లించవలసి ఉంటుంది. అది కూడ తనకు ఉద్యోగం అంటూ దొరికి, జీతం సంపాదిస్తే ఈ చీకటి నిండిన, విచారగ్రస్తమైన యింటినుండి తన అక్కా చెల్లెళ్లకు దారి చూపించాలంటే, రాత్రిపూట వ్యాపించే చీకటి లాగా వాళ్లను చుట్టు ముట్టిన అస్వస్థత, త్రాగుడు నిరాశ నుండి వాళ్లకు విముక్తి లభించాలంటే తనకు ఉద్యోగం ఒకటి ఉండాలి.

తుళ్‌లో తనకుటుంబం మొత్తానికి సహాయంచేయటానికి చాలినంత డబ్బును ఎప్పటికీ సంపాదించలేనని అతనికి తెలుసు. తాను బొంబాయి వెళ్ల వలసి ఉంటుంది. బొంబాయి గొప్పనగరం; సంపన్న నగరం; ఉద్యోగుల తోను, డబ్బు సంపాదించి. సంపదలు కూడబెట్టే వాళ్లతోను సమ్మర్దంగా ఉండే నగరం. తాను ఎలాగో లాగ అక్కడికి వెళ్లాలి. ఎలా? ఎప్పుడు? ఆ విషయం యింకా స్పష్టంకాలేదు.

పింటో తన ముందు దూకు తూండగా అతను తమ పూరింటిలోకి వెళ్లాడు. వాళ్లుతల ఎత్తి అతని వైపుచూసారు. విషాదంతోను, భయంతోను నిండిన వాళ్ల ముఖాలుచూసి, "ఏమ య్యింది?" అని అరిచాడు.

# మూడవ అధ్యాయం

వాళ్లు అలా ఉండటానికి కారణం వాళ్ల తల్లి. ఉదయం లీల ఆమెకు టీ తీసుకొని వెళ్లినప్పుడు ఆమె టీ త్రాగటానికి కూడా తల ఎత్తలేకపోయింది. అప్పటి నుండి వాళ్లకు ఆమెలో ఏదో మార్పుకనిపించింది. తలను కొంచెం పైకి లేపటానికి లీల తన క్రింద చేతులు ఉంచినప్పుడు ఆమె శరీరం జ్వరం వల్ల వేడిగాను, పొడిగాను ఉన్నట్లు తోచింది. లీల తన తల్లిని "అమ్మా" అని పిలిచింది. ఆ పిలుపుకు ఆమె కనురెప్పలు కదిల్చింది కాని కళ్లు తెరవలేదు, చిరునవ్వులేదు. "బేల, కమల," అని లీల తన చెల్లెళ్లను పిలిచింది. వాళ్లిద్దరూ పరుగెత్తు కొంటూ వచ్చిన తర్వాత వాళ్లకు వసారాలోని మట్టికుండలోంచి చల్లని నీరు, దానిలో తడపటానికి ఒక గుడ్డ ముక్కను తెమ్మని చెప్పింది. ఆమె తడిగుడ్డ ముక్కను తన తల్లి నుదుటి మీద వేసి, ఆమె ముంజేతిని పట్టుకొని, ప్రక్కనే కూర్చొంది. తన తల్లి ముంజేయి లీలకు బలహీనంగా తోచింది.

"ఏమైంది?" అని అడిగారు బేల, కమల, మెల్లగా, తమ తల్లి పండుకొన్న చోట వంగి, చూస్తూ. వాళ్లు పాఠశాలకు వెళ్లటానికి దుస్తులు వేసుకొని తయారయ్యారు, కాని తమ తల్లి వద్దనుంచి కదలలేదు.

"అమ్మకు యీ రోజు జ్వరం తీవ్రంగా ఉంది." అంది లీల, చిన్నగా "తీవ్రమైన జ్వరం. వెళ్లి చెప్పండి - వెళ్లుచెప్పు."

"ఎవరికి?"

"ఏమి చెప్పాలి?"

సమాధానాన్ని గురించి ఆలోచించటానికి ప్రయత్నిస్తూ లీల తన పెదవి నొక్కి పట్టింది. కొంచెం సేపటి తర్వాత ఆమె వణికే కంఠంతో మాట్లాడింది; మాట్లాడుతున్నపుడు కంఠంలోని వణుకును అదుపు చేయుటానికి

ప్రయత్నించింది. "వెళ్ళి హరి పొలంలో ఉన్నాడే మో చూడండి. అతన్ని ఊళ్లోకి వెళ్లి, వైద్యుణ్ణి రమ్మనమని - లేదు, అక్కడ వైద్యుడులేడు."

బేల లీలకు సాయపడటానికి ప్రయత్నిస్తూ, ఆందోళనతో, "అయితే హరి, ఆలీబాగ్ వెళ్లాలా?" అంది మెల్లగా.

"వద్దు, అదేం లాభంలేదు - ఆలీబాగ్ వైద్యుడెవరు యింత దూరంరాడు," అని లీల నిట్టూర్చింది. తర్వాత ఆమె, "మన పొరుగున ఉన్న ఖానేకర్‌ల యింటికి వెళ్లు, బేల. వెళ్లి హీరాబాయిని రమ్మని చెప్పండి. లేక పోతే వైద్యుణ్ణి పంపమని చెప్పండి ఆమెకు వైద్యులు తెలుసు. ఆమెకు మందులు, మాకుల పట్ల ఆసక్తి ఉంది. బహుశ ఆమే స్వయంగా రావచ్చు" అంది లీల.

"కాని," అంది బేల.

గదిలో బాగా చీకటిగా ఉన్న మూలచాప మీద త్రాగికుప్పలా గుర్రుపెడు తున్న తండ్రి వంకచూసి, "వాళ్లందరూ ఒక వేళ - నీకు తెలుసుగా?" అంది కమల.

"మీరు వెళ్ళాలి. మగ వాళ్లతో మాట్లాడకండి తిన్నగా హీరాబాయి దగ్గరకు వెళ్లండి."

"ఆమెకూడ త్రాగుతుంది, తెలుసా?" అని వాళ్లిద్దరూ హెచ్చరికగా అన్నారు.

"అన్ని వేళలా త్రాగదు," అంది లీల తీవ్రంగా. "ఏది ఏమైనా, వెళ్లిచూడండి."

బేల, కమల మారు మాట్లాడకుండా పరుగెత్తారు. అడ్డంగా పడి ఉన్న దుంగ మీదుగా వాళ్లు కయ్యను దాటు తూండగా, కయ్య ఒడ్డుల మీద పొడవైన గడ్డిలోంచి పింటో పరుగెత్తు కొంటూ వచ్చి, ఆనందంతో కూడిన శబ్దాలుచేస్తూ వాళ్లనుకలుసుకొంది. పింటో అలా పరుగెత్తి రావటంతో, రాతి మీద కూర్చొని, చిత్తడి నేల వైపు చూస్తున్న కొక్కెర దాన్ని చూసి భయపడి, బూడిద రంగు, గోధుమవన్నె కలిగిన రెక్కలు విదిల్చి, మొగలి పొదల తోపులోకి ఎగిరిపోయింది. మిగతా పక్షులు కూడా బెదరిపోయి, యితర పక్షులను హెచ్చరించటమో, ఎగిరి పోవటమో చేసాయి - ఎక్కడో దాక్కొన్న ముసలి జెముడుకాకి, "కూ-కూ-కూ," అని కూసింది. అక్కడ ఉన్న సముద్ర పక్షుల జంట కూడా పైకి ఎగిరిపోయాయి. అలా ఎగరటంలో వాటి నలుపు, నీలి వర్ణాలు సూర్యకాంతిలో ప్రస్ఫుటమయ్యాయి. అక్కడ ఉన్న పచ్చగన్నేరు వాళ్ల తలలపై వసుపు పచ్చని పూలు రాల్చింది.

బేల, కమల, ఆ చెట్ల కొమ్మల క్రిందవంగి, తమ పూరింటిని పొరుగు వారితోపునుండి వేరు చేస్తున్న దట్టమైన పొదల గుండా కాళ్లీడ్చు కొంటూ

నడుస్తున్నారు. అకస్మాత్తుగా కమలను రక్షించటానికి బేల తన చేతులు చాచి, ఆగిపోయింది. "అయ్యో! యిదికుబుసమేనా," అని నిట్టూర్చింది. కమల ఆమె భుజాల మీదుగా వంగి చూస్తే, బేల కాళ్ల దగ్గర ఉన్న చెట్లగుబురుల మీద అంద మైన మేలి ముసుగులాగా మెరిసే పారదర్శకమైన, ఆరడుగుల పొడవు ఉన్న పాము కుబుసం ఒకటి కనుపించింది. అది మెల్లగా వీస్తున్నగాలిలో కదుల్తూ, బ్రతికి ఉన్న పాములాగే కనపడుతోంది. ఆ కుబుసం నోరు తెరచి ఉంది; కళ్లు ఉన్న స్థానంలో రెండు చిన్న రంధ్రాలున్నాయి - అది అంత సమగ్రంగాను, నిర్దు ష్టంగాను ఉంది. అయితే అది వట్టి కుబుసమే. బహుశా క్రితం రాత్రి విడిచి ఉండవచ్చు. అందువల్ల బేల, కమల, చేతులు పట్టుకొని దాని ప్రక్కగా ఖానేకర్‌ల యింటికి వెళ్లారు.

ఖానేకర్‌లు, బాగా మొక్కలు పెరిగి, విశాలంగా విస్తరించిన, అపరిశుభ్రంగా ఉండే ఆవరణలో ఉన్న యింటి లో నివసిస్తున్నారు. పెరిగిన కలుపు మొక్కలు మట్టి గోడల దగ్గర దాకా వ్యాపించాయి. తీగలు పూరి కప్పు మీదికి ప్రాకాయి. ఆవరణ అంతావంటచెరకు గుట్టలు, ఖాళీమడతగుల్లలతో నిండి ఉంది; కొన్నికోడిపెట్టలు పిల్లలను పిలుస్తూ, శబ్దాలు చేస్తున్నాయి; కొన్ని చిరిగిన, బూడిదరంగు ఉతికిన బట్టలు ఆరటానికి పొదల మీద వేసి ఉన్నాయి. ఆవరణ అంతా నిర్లక్ష్యం కారణంగా మురికిగా ఉంది. వాళ్లకు ఒకప్పుడు తమల పాకు తోటలు, అరటి తోటలు, కోళ్లపెంపక కేంద్రాలు మంచి నీళ్ల చేపల చెరువులు ఉండేవి. కాని భూమి మీద ఉమ్మడి యాజమాన్యం ఉన్న ముగ్గురు సోదరులు వ్యవసాయాన్ని గురించి గాని, చేపల పెంపకాన్ని గురించి శ్రద్ధ చూపలేదు. తండ్రి చనిపోయిన తర్వాత వాళ్లు పూర్తిగా పనిచేయటం మానివేసి వాళ్లే తయారుచేసిన సారా త్రాగుతూ మిగిలింది యితర త్రాగుబోతులకు అమ్ముతున్నారు. వాళ్ల భార్యలు ఆముగ్గురిని వదలి, యితర గ్రామాల్లో ఉన్న వాళ్ల తల్లి దండ్రుల వద్దకు వెళ్లిపోయారు. వృద్ధురాలైన ఆ సోదరుల తల్లి హీరాబాయ్ మాత్రమే యింటి బాధ్యతలను నిర్వహిస్తోంది. ఆమెకు కూడా సారా అంటే యిష్టమే.

అయితే బేల, కమలల అదృష్టంకొద్దీ ఆమె యింటి బయట మలక మంచం మీద బాచీపట్టు వేసుకు కూర్చొని. కుప్పగా పోసిన వక్కలను చిన్న ముక్కలుగా చీల్చి తన ప్రక్కన ఉన్న యిత్తడి పెట్టెలో వేస్తోంది. ఆమె నోరు రోజంతానమిలే తమలపాకులు, వక్కల వల్ల ముదురు ఎరుపురంగులో ఉంది. వాళ్లను చూడగానే ఆశ్చర్యంగా నవ్వుతూ ఎఱ్ఱని నోరు తెరిచి, యింటికి

ఎవరైనా వచ్చినపుడు స్త్రీలు తల మీద చీరెను సరిచేసుకొనే లాగే ఆమె తన పండిన తల మీద రక్త నీలవర్ణపు చీరె అంచును యాంత్రికంగా సరిచేసుకొంది.

"ఏం బేలా, ఏం కమలా, ఏమిటి పని మీద వచ్చారు? మీనాన్న ఉదయంపూట యింత పెందలాడే మిమ్మల్ని సారాకోసం పంపించాడా?" అంటూ ఆమె కేకవేసి, బిగ్గరగా నవ్వటం ప్రారంభించింది. ఆ నవ్వుకు మనిషి కనిపించకుండా ఒకతను యింటి లోంచి, "ఏమిటి. అమ్మా, సంగతి?" అని అడిగాడు.

బేల, కమల ఆమెకు కొంత దూరంలోనే ఆగిపోయారు, కమల తన కాళ్లు మెలిక వేసుకొని, నోట్లో వేలు వేసుకొంది. బేలకూడ అలాగే చేసింది.

హీరా బాయి బిగ్గరగా నవ్వింది. "అవునని చెప్పటం యిష్టం లేదా? సారా అడగటం యిష్టం లేదా? సిగ్గు పడకండి. మగ వాళ్లు ఎలా ఉంటారో మనకు తెలుసు. మీకు తెలుసు, నాకు తెలుసు. ఇంకా సిగ్గు పడటం ఎందుకు?"

బేల, కమల ఆ మాటలకు మాటాడకుండా, తల అడ్డంగా ఊపారు.

"అయితే సారా అవసరం లేదన్నమాట! అయితే మీకేంకావాలి? సారా కొరకు డబ్బు కావాలా?"

ఆ మాటలకు వాళ్లిద్దరూ జడలు గాలిలో ఊగి పోయేలాగ తలలు అడ్డంగా ఊపారు.

"సారా కొరకు డబ్బు అవసరం లేదా? అయితే మీ అమ్మ మిమ్మల్ని పంపించిందా? బియ్యం కొనటానికి డబ్బు కోసం పంపించిదా? లేక టీ కొరకా? అదేనా? ఇంట్లో బియ్యం లేవా? చూడండి, అమ్మాయిలు, మీరేదైనా అడగ బోయేముందు, మిమ్మల్ని నేను హెచ్చరించటం మంచిది."

ఉన్నట్లుండి బేల ఆమె మాటలను ఎక్కువసేపుసహించ లేక పోయింది. ఆమె కమల నుండి విడిపోయి, హీరాబాయి దగ్గరకు వెళ్లి, వేగంగా, బొంగురు గొంతుతో, "మాకు డబ్బు వద్దు; బియ్యం వద్దు. మేము అవేవి అడిగేందుకు రాలేదు. మా అమ్మకు జబ్బు చేసింది. మా అక్క మీకు చెప్పమని పంపించింది."

"జబ్బు చేసిందా?"అంటూ ఆవృద్ధురాలు బేల వైపుచూసి, నవ్వటంనిలిపి వేసింది.

"ఆమె అనారోగ్యంగా ఉందని నాకు తెలుసు. ఆమెకు ఎప్పుడూ అనారోగ్యమే. ఇప్పుడు మరింత ఎక్కువయ్యిందా?"



భేల వేగంగా అవునన్నట్లు తల ఊపింది. "ఆమెకు జ్వరంగా ఉంది మాయింట్లో మందులేదు. ఆమెను చూడటానికి వైద్యుణ్ణి పిలిపించ గలరా?"

ఆవృద్ధురాలు మళ్ళీ పదునైన కత్తెరతో ముక్కలు కత్తిరించటం మొదలెట్టింది. అలాచేస్తూ ఆమె తనలో తాను అస్పష్టంగా గొణుగుకొంది. తర్వాత ఆమె గట్టిగా ఉన్న ఆ వక్కలను కత్తిరించటం మాని వేసి, భిన్నమైన స్వరంలో మాట్లాడింది. "ఏం చేయాలో నేను చెప్పాను. ఈ రోజు ప్రొద్దుటే ఆవును వెంట బెట్టుకొని, మద్దెల వాయిస్తూ, ఒక వృద్ధుడు శంఖం ఊదటం విన్నాను. అతను ఎక్కువ దూరం వెళ్ళి ఉండడు. అతన్ని వెనక్కి తిరిగి రమ్మని కబురు చేస్తాను.

అతన్ని మీ యింటికి పంపిస్తాను. అతని దగ్గర మంచి మూలికలు, భస్మాలు, చెట్ల బెరళ్లు ఉన్నాయి. వెళ్లి, లీలకు చెప్పండి." అందామె ప్రోత్సాహంగా. ఆమెతల ఊపుతున్నప్పుడు తల మీద ఉన్న చీరెజారి పోవటంతో ప్రకాశవంతమైన, నారింజ, గోరింటాకు రంగులో ఉన్న ఆమె పండిన జుత్తు కనిపించింది.

బేల, కమల వెనుదిరిగి, తమ యింటికి సురక్షితంగా చేరుకోవటానికి దారిలో ఉన్న పొదల మధ్యగా, జాగ్రత్తగా నడిచారు. వాళ్లు కయ్యకు అడ్డంగా ఉన్న దుంగను చేరేలోపే వాళ్లకుక్క బాధతో అరవటం వినిపించింది. వెనక్కు తిరిగి చూస్తే పింటో కనుపించింది. పింటోను వాళ్లు గూట్లో కోడి పిల్లనో లేక యింటి ప్రక్కన ఉన్న చేపల ముళ్లో వాసన చూసేందుకు యింటి దగ్గరే వదలి వచ్చారు. ఇప్పుడు ఆ పింటో తోక కాళ్ల మధ్యకు చేర్చి, చెవులు ముడుచుకొని, కుంటు కొంటూ, మూలుగుతూ వాళ్లను వెంబడిస్తోంది. ఆ వృద్ధురాలు గాని లేక యింట్లోని ఏ వ్యక్తైనాగాని పింటో మీదకు రాయిగాని లేక కొబ్బరి కాయ గాని విసరటంతో కాలికి దెబ్బతగిలి ఉండవచ్చు. అది బాధతో మూలుగుతూ వాళ్ల దగ్గరకు వచ్చింది; మరికాసిని రాళ్లు విసరకముందే వాళ్లు త్వరగా యింటికి చేరు కొన్నారు.

వాళ్లు యింటికి చేరుకొన్న తర్వాత వేచి ఉండటం తప్ప, చేయాటానికి మరోపనే మీలేదు. లీల మౌనంగా యింటి పని చేసుకొంటూ వాళ్ల తల్లిని చూడటం చేస్తోందిగాని, బడికి వెళ్లే విషయాన్ని గురించి ఏమీ మాట్లాడటం లేదు. అందు వల్ల వాళ్లు మౌనంగా యిసుకలో లతలుగీసి, ఆ లతలకు పూరేకులతో అలంకారాలను దిద్దుతూ యింటి బయటనే ఉండిపోయారు. అప్పుడప్పుడు లీల వాళ్లకు ఏదో పని చెప్తే, వాళ్లు ఆపనిని వెంటనే ఎదురాడకుండా పూర్తి చేస్తున్నారు. వాళ్లు బావి నుండి నీళ్లు తోడి తెచ్చారు, టీకాచిన పాత్రను శుభ్రం చేసారు. మధ్యాహ్న భోజనానికి కావలసిన బియ్యాన్ని కడిగి, వంట చెరకు కొరకు చుట్టూ ఉన్న పొదల్లో పుల్లలకోసం వెదికారు.

కొంత సమయం తర్వాత వాళ్లకు మద్దెల వాయించిన శబ్దాలు, దీర్ఘమైన వింత బాకా శబ్దాలు వినిపించటంతో వైద్యుడు దగ్గరకు వచ్చాడని వాళ్లు భావించారు. అతని వెనుక పొట్టి ఆవు ఉంది. దాన్ని అతను కుచ్చులతోను, పూసలదండలతోను అలంకరించాడు; మూపురం మీద కుట్టు పని చేసిన గుడ్డ వేసాడు. అతను ఆ ఆవును తనతో పాటు చాలా సార్లు ఊర్లో త్రిప్పటం వాళ్లు చూసారు. అలాత్రిప్పేటప్పుడు అతను గ్రామస్తులకు గడ్డి కట్టలను అమ్మ జూపేవాడు.

గ్రామస్తులు కొంత మంది వాటిని కొని, ఆ ఆవుకు మేతగా వేసేవారు. ఆవుకు మేత వేయటం పవిత్రమైందిగా భావించటం వల్ల గ్రామస్తులు కొద్దిపాటి డబ్బులు చెల్లించి, ఆ పవిత్రకార్యాన్ని నిర్వహించేవారు. దానివల్ల అతనికి కొంత ఆదాయం వస్తుండేది, కాని సరిపోయేంతగా ఉండేదికాదు. అందువలన యీ పవిత్రమైన ఆవును గ్రామాల్లోకి తీసుకొని పోవటంతో పాటు, తనకు అడవుల్లో లభించే మూలికలతో తయారుచేసిన మందులను అమ్మటం, రోగులకు యివ్వటం కూడ చేస్తుంటాడు. అతని స్వభావం తీవ్రమైంది. అతను అన్ని రకాల భస్మాలు, మాత్రలను పొట్లాలుగా కట్టి తెల్లని తన ధోవతి మడతల్లోను, గులాబిరంగు తలపాగా లోని ముడి వేసి ముడి వేసి ఉంచేవాడు. వాటితో గ్రామస్తులకు కురుపులు, నొప్పులు, జ్వరాలకు వైద్యం చేస్తుంటాడు. తన భస్మాలతో ఆరోగ్యంకుదుట బడక అధిక రోగ గ్రస్తులైన పిచ్చి వాళ్లకు, మృత్యు ముఖంలో ఉన్న వాళ్లకు అతను ప్రత్యేకంగా పూజలు కూడ నిర్వహిస్తుండేవాడు. వీటన్నింటివల్ల అతను భూతవైద్యం చేసే మాంత్రికుడిలాగ కనిపించే వాడు. అందువల్ల అతను వస్తున్నట్లు శబ్దాలు వినపడటంతో వాళ్లు భయంతో కొంచెం కంపించారు.

కయ్యకు అడ్డంగా వేసి ఉన్న దుంగ మీదుగా నడుస్తూగాలి లోకి చేయెత్తి, ఎముకతో చేసిన బాకాతో మరోసారి దీర్ఘంగా ఊదాడతను. అదేమి ఎముకో అని వాళ్లు ఆందోళనగా ఆలోచించారు.

లీల యింటి నుండి బయటకి వచ్చింది. బేల, కమల పవిత్రమైన ఆవు మీద దూకకుండా ఉండేందుకు పింటోను పట్టుకొన్నారు. వాళ్లిద్దరూ దగ్గరగా వెళ్లి ఆ పొట్టి ఆవును పరిశీలించాలను కొన్నారు. కాని లీల తాను అతనితో మాట్లాడుతున్నంత సేపు పింటోను పట్టుకొని ఉండమని చెప్పింది వాళ్లిద్దరికి.

"మా అమ్మకు జబ్బు చేసింది. ఆమె చాలా రోజులుగా రోగంతో బాధపడుతోంది. ఇప్పుడు జ్వరం కూడా వచ్చింది. ఆమెకు మీ దగ్గరేమైనా మందు ఉందా? ఆమెకు బలం రావటానికి మీ దగ్గర మందేమైన ఉందా? ఆమె చాలా బలహీనంగా ఉంది." అని లీల వివరించింది.

"నిదానం, అమ్మాయ్. తొందరేమిటి మొదట నా ఆవుకు నీళ్లు పెట్టాలి - తాజాబావినీరు. తరువాత దానికి గడ్డివేయాలి. తాజా, మెత్తనిగడ్డి. అప్పుడు నేను మీ అమ్మను చూస్తాను." అన్నాడతను.

అతను చెప్పినట్లే వాళ్లు ఆవుకు కావలసిన ఏర్పాట్లు చేయవలసి వచ్చింది. ఆవు అవసరాలు తీరిన తర్వాత అతని విషయంలో శ్రద్ధచూపవలసి వచ్చింది.

లీల అతని కొరకు ఓగ్లాస్ టీ వేడిచేసి అతనికి యివ్వటంతో అతను ఎఱ్ఱమల్లె పూలచెట్టు క్రింద నులక మంచం మీద కూర్చొని, టీ త్రాగుతూ, ఆ ముగ్గురు అక్కాచెల్లెళ్లు వాళ్ల తల్లి ఎలా రోజుకూ కృశించిపోతూ, ఆహారం తీసుకోవటానికి నిరాకరిస్తూ, లేవ లేకుండా ఉందో చెప్తూంటే వింటున్నాడు. "ఇప్పుడు ఆమె శరీరం జ్వరంతో మాడిపోతోంది," అంది లీల, నిదానంగా, మాట్లాడ లేక, ఒక్కమారుగాఏడుస్తూ.

లీల తల్లికి ఎలా ఉందో అర్థంచేసుకొంటూ ఆ వైద్యుడు తన తీక్షణమైన కళ్లతో లీల వైపుచూసాడు. తర్వాత అతను కూర్చొన్నచోటనుండి త్వరగా లేచి ఏకాగ్రతతో పని చేయటం మొదలెట్టాడు. లీలా వాళ్లు, వైద్యుడు యింట్లోకి వెళ్లి తమ తల్లిని చూస్తాడని అనుకొన్నారు. కాని అతను అలా చేయకుండా, యింటి గుమ్మంలో మంట ఏర్పాటుచేయమని చెప్పాడు. అతను వాళ్లను జాగ్రత్తగా పరిశీలిస్తూ, పనులు పురమాయిస్తున్నాడు. అతను ఓ ప్రత్యేక రకమైన కట్టెలు కావాలని, వాటిని ఒక పద్ధతిలో అమర్చాలని చెప్పాడు. అలా అమర్చిన కట్టెలు చిటపటలాడుతూ పొగ చిమ్ముతోంటే అతను ఆవు వీపుమీద వ్రేలాడ దీసిన సంచి లోంచి తీసిన మల్లె, బంతి, మందార, ఎఱ్ఱ మల్లెపూలు ఆ మంటల్లోకి విసిరాడు. అలా చేస్తూ అతను మంద్ర స్వరంలో పాట పాడుతున్నట్లు సంస్కృతంలో దీర్ఘమైన ప్రార్థన చేసాడు. అతను అలా చేస్తున్న సమయంలో మంట చిటపట లాడుతూ, సెగలు చిమ్ముటం మొదలెట్టింది. ఆ ముగ్గురు అక్కాచెల్లెళ్లు, అరచేతుల మీద గడ్డాలను ఆనించి, మంటచుట్టూ కూర్చుని గమనిస్తూ ఉన్నారు. మంట ఆరిపోయిన తర్వాత అతను పొడవాటి కర్రతో, బొగ్గులు ఆరిపోయేందుకు వాటిని ప్రక్కకు చిమ్ముతున్నాడు. తర్వాత అతను మంటలోని మసిని దోసిట పట్టి తీసుకొని, నీళ్లుకావాలని అడిగాడు. వాళ్లుగ్లాస్‌తో నీళ్లు తెచ్చారు. అతను కొద్ది నీళ్లును అరచేతిలో పోసుకొని బొటన వ్రేలితోను, చూపుడు వ్రేలితోను కలిపాడు. చివరికి అతను వాళ్ల అమ్మను చూసేందుకు లోపలికి వెళ్లాడు.

ఆమె కళ్లు మూసుకొని ప్రక్కకు తిరిగి పండుకొంది. వైద్యుడు ఆమెను పలకరించాడు - ఆమె అతని వైపు తిరిగి, కళ్లు తెరచి చూచి భయపడింది. లీల తల్లి నుదుటి మీద చేయి వేసి ఉపశమన పూర్వకంగా మాట్లాడింది. వైద్యుడు లీల తల్లిని నాలుక చూపమని అన్నాడు. ఆమె అలాగే నాలుక చాపిన మీదట నాలుక మీద కొంత బూడిద వేసాడు. "తిను, చెల్లెమ్మా. పవిత్రమైన బూడిద, శుద్ధిచేయబడిన బూడిద. అది నీ అంతరంగాన్ని శుద్ధి

చేస్తుంది. అది జ్వరకారణాలైన భూతాలను తరిమి వేస్తుంది. మ్రింగు," అతను వ్రేళ్లతో బూడిదను చిన్న, చిన్న మాత్రలుగా చేసి, వాటిని ఆమె నోట్లోవేసి, మ్రింగిస్తున్నాడు. తర్వాత అతను చప్పట్లుకొట్టి, బిగ్గరగా ప్రార్థనలు చేసి బయటకు నడచి వెళ్లాడు.

ఆ ముగ్గురు అక్కాచెల్లెళ్లు, మ్రాన్పడిపోయి అతన్ని అనుసరించారు.

"ఆ బూడిద అంతా ఊడ్చి, ప్రోగుచేసి నా దగ్గరకు తీసుకురండి," అని అతను చెప్పటంతో, వాళ్లు అలాగేచేసారు. అతను తనసంచిలోంచి కొన్ని ఆకులుతీసి, వాళ్లను ఆ బూడిదను ఆ ఆకుల మీద వెయ్యమన్నాడు. వాళ్లు అలా చేయటంతో ఆకులనుచుట్టి , తన తలపాగాలోంచి తీసిన దారాలతో చక్కగా పొట్లాలుగా కట్టాడు. "ఇదిగో," అన్నాడు అతను, వాటిని వాళ్లకిస్తూ, "వెళ్లి, ఒక పొట్లం ఆమె దిండు క్రింద పెట్టండి. అది జ్వరం తెచ్చే భూతాన్ని తరిమి వేస్తుంది. మిగతా వాటిని మీ దిండ్ల క్రింద ఉంచుకోండి. అది మిమ్మల్ని భూతాలనుండి రక్షిస్తుంది. నేను ఆ భస్మాన్ని పవిత్రీకరించాను. హరి ఓం, హరి ఓం, హరి ఓం," అని ఒక్క మారుగా అరుస్తూ, బాకా ఎత్తి, దీర్ఘమైన శబ్దం చేసాడు. ఆశబ్దం విని, స్తంభానికి కట్టి వేసిన పింటో కోపంగా అరచింది.

తన బాకాను దించేసి, అతను వాళ్ల ముఖాలవైపు చూసాడు. అలా చూసేటప్పుడు అతను భయంకరంగా కనిపించాడు. అతని కుంచెలాంటి మీసాలకు పొగాకు రంగు అంటి ఉన్నట్లు వాళ్లు గమనించారు. "ఇంక అయిపోయింది గాదా?" అని వాళ్లవైపు చూసి బిగ్గరగా అన్నాడు. "ఇప్పుడేంచేస్తారు? నాముఖం వంక చూస్తారా? నాకివ్వటానికి మీకు చూపులు తప్పమరేమీలేవా? వాటితో నా పొట్ట నింపుకోగలనను కొంటున్నారా? ఇదంతా ఉచితంగా చేస్తానను కొంటున్నారా?" అన్నాడు.

లీల నేరం చేసినట్లు భావించి యింట్లోకి పరుగెత్తింది. ఇంట్లో డబ్బు లేదని తెలిసిన బేల, కమల బాధగా ఆమె వైపుచూసారు. ఇంతలో లీల బయటికి రావటంతో ఆమె చేతిలో ఏదో ఉండటం వాళ్లు గమనించారు. అది అమ్మ ఆరోగ్యంగా ఉన్నపుడుపెట్టుకొన్న ఉంగరం. ఇప్పుడు అనారోగ్యంగా ఉండటం వల్ల తీసి, కొయ్య చెక్కమీద అద్దం వెనుక పెట్టింది. అదివెండి ఉంగరం; కొంచెం నల్లబడి, వంకలుపోయినా వెండిదే! బేల, కమల ఆశ్చర్యంతో నోరు తెరిచారు, కాని అతను ఆ ఉంగరాన్ని లీల చేతిలో నుంచి తీసుకొని చూసి, తనసంచిలో వేసుకొని, కృతజ్ఞతా పూర్వకంగా ఒక్కమాట అయినా మాట్లాడకుండా, తన ఆవువైపు నడచివెళ్లాడు.

అతడు తన దగ్గర ఉన్న మద్దెల వాయించటంతో దీర్ఘమైన వింతశబ్దాలు వెలువడ్డాయి. తర్వాత బాకా ఉంది. ఆకారంవైపు చూసి, "హరి ఓం, హరి ఓం," అన్నాడు. ఈ శబ్దాలకు పక్షులు భయపడిపోయి, అతను చేసేశబ్దాలు వినిపించకుండా పోయేంతవరకు అరుస్తూ, గుండ్రంగా తిరుగాడాయి.

ఆ అక్కాచెల్లెళ్లు తమ చేతిలోని పొట్లాలవైపు చూస్తూ ఉండి పోయారు.

"వీటిని ఏం చేద్దాం?" అని బేల, కమల, అడిగారు.

లీల తన చేతిలో పొట్లాన్ని చించి వేయాలనో లేక పారవేయాలనో భావించినట్లు పట్టు కొంది. "మనమేంచేస్తాం?" అని అరిచిందామె. "మనం యింతకంటె ఏమీచేయలేం - మనం అతని మాటలు వినాలి. మనం అమ్మను తీసుకొని వెళ్లేందుకు ఆసుపత్రి లేదు. ఏ వైద్యుడురాడు. మనకు సాయంచేయటానికి మంత్రగాడు తప్ప మరెవరులేరు. మంత్రశక్తులు," అని తీవ్రంగా అంటూ, వెను దిరిగి, అతను చెప్పినట్లు చేయటానికి యింట్లోకి వెళ్లింది, లీల.

ఈ సంఘటనల వల్ల ఆ అక్కా చెల్లెళ్లు భయపడి పోయారు ఆ రోజు వాళ్లకు విపత్కరమైన దినంగాను, మరింత వ్యాకులతను, భయాన్ని కలుగ జేసేటట్లు తోచింది.

మధ్యాహ్నం పూట పూరింటిలో చల్లని నేల మీద చాపలపై పండుకొని వాళ్లు నిద్రపోతున్న సమయంలో పింటో అకస్మాత్తుగా మొరగటమూ, దానితోపాటు సమీపంలో ఉన్న చాలా యితర కుక్కలు మొరగటంతో వాళ్లు మేల్కొన్నారు. పింటోను మొరగకుండా చేయటానికి ప్రయత్నిస్తూ కమల వెంటనే లేచింది. కాని బయట యితర కుక్కలు చేస్తున్న శబ్దం అధికం అయ్యింది. పింటో మరింత ఉద్రేకపూరితం కావటంతో ఆమె దాన్ని పట్టి ఉంచలేకపోయింది. అది ఆమెను విడిపించుకొని పరుగెత్తింది. ఆమె దాని వెనుకనే వెళ్లి, తెల్లని మధ్యాహ్నపు ఎండను, వసారాలోని చిరిగిన కప్పుక్రింద నిలబడి చూస్తోంది.

కయ్యచుట్టూ ఉన్న దట్టమైన పొదలను పెద్ద వాళ్లు, కుర్ర వాళ్లతో పాటు, ఊర కుక్కలు కూడా చుట్టు ముట్టాయి. ఆ పొదల్లో ప్రశాంతంగా జీవించేకొంగలు, లకుముకి పక్షులు, కొక్కెరలు, అన్నీ ఎగిరి పోయాయి. అక్కడ చేరిన వ్యక్తులు, పురాతనకాలంలో గుహల్లో జీవించిన మనుషుల్లాగా తమ చేతుల్లో ఉన్న పొడవాటి కర్రలతో జమ్ము, తుంగ మొక్కలను బాదుతూ, మొగలి పొదలను త్రొక్కుతూ, సన్నని సరుగుడు మొక్కలను విరగ త్రొక్కుతున్నారు. సాధారణంగా

సముద్రతీరంపై మాగన్నుగా నిద్రపోతూ పడిఉండే ఊరకుక్కలు ఉద్రేకంతో గోలగా అరుస్తున్నాయి. ఈ రోజు వాటిని కర్రలతో కొట్టి తరిమి వేయకుండ వేట కొరకు ఉపయోగించటం జరుగుతోంది.

తన చెల్లెలు ప్రక్కన నిలబడి, భయంతో గమనిస్తున్న బేల, "ఏం చేస్తున్నారు వాళ్లు?" అని అడిగింది. కమలను.

"నాకు తెలియదు," అని సమాధానం చెప్పింది కమల, మెల్లగా "వాళ్లు అరవటం చూస్తుంటే అక్కడేవో ఏనుగో, మనుషులను చంపే పులో ఉన్నట్లుంది, బహుశ త్రాచుపామేమో."

మంచు లాగ చల్లగా ఉన్న వ్రేలు తన వెన్నెముకను క్రిందిదాకా తడిమినట్లనిపించి, బేల కంపించిపోయింది.

"పింటో చూడు," అని ఉన్నట్లుండి అరిచిందామె "పింటో వాళ్లతో పాటు వెళ్తోంది - దాన్నిపట్టుకో."

బేల అలా అనటంతో కమల పింటో వెంటపడింది - తమ బృందం లోనిది కాదని భయంకరంగా మొరుగుతూ, గుర్రుమంటున్న ఊరకుక్కలు దాని మీద దాడి చేయటమూ, ఎవరైనా కర్రనో, రాయినో విసరటమూ ఆమెకు యిష్టంలేదు. మనుషులు పాదాల తోను, కుక్కలు కాళ్లుతోను త్రొక్కటంతో కయ్య ఒడ్డు అంతా ఆకు పచ్చగా మారిపోయి బురదతో నిండి పోయింది. కమల, పింటోను ఆ కయ్య ఒడ్డున పట్టుకోగలిగింది. అక్కడ వేటగాళ్ల బృందం మొగలి పొదలతోపును చుట్టు ముట్టి, ముందుకు తోసుకొని పోతున్నారు. ఆ ప్రదేశంలో కుక్కలు ఆవేశంతో దూకుతూ ముందుకు ఉరుకు తుంటే, ఆ వేటగాళ్లు, కర్రలతో శబ్దం చేస్తూ, అమితకోలాహలంతో తామువేటాడేజంతువుపై విరుచుకు పడ్డారు.

ఆ దృశ్యంచూచి భయంకలిగి నప్పటికి కమల తన ఆత్రుతను అణచుకోలేక, నవ్వుతూ కాలుగోక్కొంటూ జనసమూహానికి వెలుపల ఉన్న ఒక వృద్ధుణ్ణి, "ఏమిటది? దేన్ని పట్టు కొన్నారు?" అని అడిగింది.

"చూడు, చూడు," అన్నాడు ఆవృద్ధుడు నవ్వుతూ, కుక్కలు చీలుస్తున్న జంతువును చూపిస్తూ. ఆ తర్వాత అక్కడ ఉన్నమనుషులు దాన్ని కుక్కల నోళ్లనుండి లాగి వేసి, విజయచిహ్నం లాగ, ఒక గడమీద గ్రుచ్చి పై ఎత్తారు.

"అయ్యో!" అంది కమల విచారంగా, తన పిడికిళ్లు. బిగించి, కళ్లనీళ్ల పర్యంతమవుతూ, "చిన్నముంగిసేనా,"

ఆ వృద్ధుడు కమల వైపుచూసి, "అది చెడ్డది చాలా చెడ్డది," అని ఆమెతో

అన్నాడు, "అది మన కొబ్బరి కాయల్లోని నీళ్లు త్రాగుతుంది. అవి ఆకు పచ్చగాను తాజాగాను ఉన్నపుడు అది చెట్లెక్కి, కొబ్బరి కాయలో చిన్న రంధ్రం చేసి, కొబ్బరి కాయలు ఎండి పోయేలాగ దానిలోని తియ్యని రసాన్ని త్రాగుతుంది." అలా అంటూ అతను తన తొడ చరచి, ముంగిసను పట్టుకొని, చంపటంతో ప్రారంభమైన ఉత్సవంలో పాల్గొనటానికి నవ్వుతూ వెళ్లి పోయాడు.

కమల కయ్య ప్రక్కన ఉన్న దిబ్బమీద ఆశ్చర్యంతో పింటో మెడపట్టుకొని నిలబడిపోయింది. పాపం, చిన్న నిస్సహాయమైన ముంగిస, పనికిరాని ముంగిస - అది అంత చెడ్డపని చేస్తుందంటే ఆమెనమ్మ లేదు. ఒక వేళ అది కొబ్బరి నీళ్లు త్రాగి, కొబ్బరి కాయలను పాడుచేస్తున్నా, దాన్ని ఢజను కర్రలతో, ఊరకుక్కల గుంపులతో కేకలు వేస్తూ మనుషులు అంత ఘోరంగా వేటాడ వలసిన అవసరం ఉందా? ఆ చిన్న జంతువును క్రూరంగా వేటాడటం చూస్తే ఆమెకు భయంకలిగింది.

ముంగిసను అంత మొందించటంతో, కాంతు లీను తున్న తెల్లని సముద్రతీరం మీదుగా వెళ్తున్న మనుషులను, కుక్కలను చూసేందుకు బాట మీద నడుస్తూ, తన దగ్గరకు వస్తున్న బేలను చూసి, కమల యింటికి పోవటానికి వెనక్కుతిరిగి, "రా పింటో,రా" అంటూ కన్నీళ్లతో పింటోను పిలిచింది.

ఆసాయంత్రం చాలా సేపటి వరకు హరి యింటికి తిరిగి రాలేదు. వాళ్ల నాన్న అంతకు ముందే బయటికి వెళ్లాడు. ఆ అక్కాచెల్లెళ్లు తమ తల్లి జ్వరం ఎందుకు తగ్గ లేదోనని విచారిస్తూ ఆమె చుట్టూ చేరారు. అదేసమయంలో మరో వ్యక్తి తన కాళ్లతో కొయ్యలాగా, గట్టిగా, ఎఱ్ఱగా ఉన్న మొగలికాయలను తన్నుకొంటూ దట్టమైన కంచె దాటి వచ్చాడు.

ఆ వచ్చిన వ్యక్తి ప్రక్కతోపులో నివసిస్తున్న త్రాగుబోతు సోదరుల్లో ఒకడు. అదిచూసి, యీసారి చెల్లెళ్ల నిద్దరినీ తన వెనక్కు నెట్టి లీల లేచి నిల్చొంది, అతను అడ్డదిడ్డంగా నడవటం, జుట్టుచిందర వందరగా ఉండటం కళ్లు ఎఱ్ఱగా ఉండటం చూస్తే అతను అప్పటికే మద్యం సేవించి ఉన్నాడని సులువుగా గ్రహించటానికి వీలవుతుంది. ఆకాశం యింకా సాయంత్రపు సూర్యరశ్మిని ప్రసరిస్తోంది. సముద్రం యింకా ప్రశాంతంగానే ఉంది. వీటన్నింటినీ పురస్కరించుకొని గ్రామంలోని చాలా మంది వ్యక్తులు మద్యం త్రాగటం మొదలెట్టేసమయంకాదని తెలుస్తుంది. కాని యీ వ్యక్తి తనసారా తానే తయారుచేసుకొని, రోజంతా త్రాగుతూ యింటిలోనే ఉండి ఉంటాడని లీలకు

తెలుసు. ఆమె అతన్ని చూసి భయపడింది.

అతను కయ్యి మీద ఉన్న దుంగ ప్రక్కన తడబడే కాళ్లతో నిలబడి, "ఓహో, నువ్వా! ఆదుర్మార్గుడి కూతురువా నీ తండ్రి ఎక్కడ? ఆ దుర్మార్గుడు ఎక్కడ?" అని ఆమె మీద కేకలు వేసాడు.

"మానాన్నా? ఆయన - ఆయన బయటికి వెళ్లాడు," అంది లీల, బెదరిపోయి.

"బయటికి వెళ్లాడా లేక భార్య మంచం క్రింద దాక్కొన్నాడా? నేను వచ్చి బయటకు లాగేదా?"

లీల చిన్నగా అరవటంతో ఆమె వెనుకనిలబడి ఉన్న బేల, కమల కూడ అరిచారు. దాంతో యింటికి వచ్చిన వ్యక్తి పై పడకుండా ఉండేందుకు పట్టుకొన్న పింటో కూడా గుర్రుమంది. "ఆయన యిక్కడ లేడు," అంది ఆమె పెద్ద గొంతుతో "లోపలికి రాకండి మా అమ్మకు జబ్బుగా ఉంది."

"ఓ, చాలా బాగుంది, చాలా బాగుంది," అంటూ అతను ఎర్రని తమల పాకుల రసంతో గార పట్టిన పచ్చని పళ్లు కనపడేటట్లు క్రూరంగానవ్వాడు. "తల్లికి అనారోగ్యం - తండ్రి బయటకు వెళ్లాడు - చిన్న పిల్లలకు ఏమీ తెలియదు. కనీసం డబ్బు ఎక్కడ దాస్తాడో మీకుతెలుసా?" అంటూ అతను ఒక్కసారిగా సింహంలాగా గర్జించాడు. దానితో లీల భయంతో వెనుకడుగు వేసింది.

"డబ్బా?" మెల్లగా అంది ఆమె, పిడికిలి బిగిస్తూ, హరి వస్తే బాగుండునను కొంటూ, "మాదగ్గర డబ్బు లేదు."

"డబ్బులేదు - మా దగ్గర డబ్బు," అంటూ అతను ఆమెను అవహేళన చేసాడు. "చాలా మంచి సమాధానం నాకు యిలాచెప్పమని అతను - ఆదుర్మార్గుడు, మీనాన్న నేర్పాడా? తండ్రి లాగేకూతురు. అబద్ధాలకోరు కుటుంబం, పనికి మాలిన వాళ్లు. డబ్బులేదు - మీరందరు పనికి మాలిన వాళ్లు, నేను వాణ్ణి పట్టుకొంటాను. వాడిమెడ విరిచి డబ్బు రాబడతాను," అన్నాడు.

వాళ్ల యింటి ముందు ఊగిసలాడుతూ, చేతులూపుతూ కేకలు వేస్తున్న మనిషి పట్ల ఆపుకోలేని కోపంతో అరుస్తూ తనను పట్టుకొన్న బేల, కమల పట్టునుండి విడిపించుకొని, లీల ప్రక్కగా దూకి, బాట మీదికి వెళ్లి, కాలిగోళ్లతో యిసుకచిమ్ముతూ, పింటో మంచి కాపలాకుక్కలాగా కోరలు బయటపెట్టి మొరుగు తోంది. అది అతని దగ్గరకు దూకి, కరవటానికి ప్రయత్నిస్తూంటే, ఆవ్యక్తి చేతులెత్తి, "కుక్కను వెనక్కుపిలవండి. దాన్ని దూరంగా ఉంచకపోతే

నేను దాన్ని చంపేస్తాను," అని అరిచాడు.

బేల, కమల యిరువురూ అరుస్తూ పింటో వైపుపరుగెత్తి, ఆ త్రాగుబోతునుండి దాన్ని కాపాడటానికి ప్రయత్నించారు. ఇలా వాళ్లు బాటలోకి వెళ్లి దెబ్బలాటకు సిద్ధమౌతుండగా లీల వాళ్ల వేపుపరుగెత్తి, "పింటో-పింటో- వెనక్కిరా. బేల, కమలా, దాన్ని పట్టుకోండి. అది కరవదు," అంటూ అరిచింది.

"అది కరిస్తే, నేను, నేను," అంటూ బిగ్గరగా అరిచాడావ్యక్తి.

ఈకోలాహలం మధ్య వాళ్లకు అనుకోకుండా కొంత సహాయం లభించింది, ఆ రోజు ఉదయం వాళ్ల యింటికి మంత్రగాణ్ణి పంపించిన వృద్ధురాలు, అక్కడికి వచ్చిన వ్యక్తి తల్లి అక్కడ ఏమి జరుగుతుందో చూడాలని కుంటు కొంటూ, కంచెలోని ఖాళీలోంచి వచ్చి అక్కడికి చేరుకొంది. తన కొడుకు త్రాగిన మైకంలో కేకలు వేస్తూ గుండ్రంగా తందనాలు తిరుగుతోంటే ఆమె అతని చేయిపట్టుకొని వేగంగా ఒక్క ఊపు ఊపింది.

"ఒరేయ్," అంది ఆమె తీవ్రంగా "ఓరి, మూర్ఖుడా ఏం చేస్తున్నావిక్కడ? ఆ చిన్న అమ్మాయిలను భయపెడుతున్నావా? ఇంటికి వెళ్లు - వింటున్నావా? వెళ్లు, నీవు బయటికి వెళ్లటానికి గాని, ఎవరితోనైనా మాట్లాడటానికిగాని తగిన వాడినికావు. వెళ్లి, నీ మురికి పూరింటి లో దాక్కో. నీ తల సారాకుండలో ముంచుకో - నీముఖం యిక్కడ చూపించకు. వెళ్లు." అంటూ ఆమె అతన్ని నెట్టింది. దాంతో అతను నోరుమూసుకొని, అక్కడ ఉన్నమొగలి కాయల మీద పడిపోతున్నట్లుగా, "వెళ్లు, వెళ్లు, అంటారు అందరు. ఎక్కడికి వెళ్లేది. నాకు నా డబ్బులు కావాలి. నేను నా డబ్బు రాబట్టుకొంటాను. నేను ఆ దుర్మార్గుడ్ని చంపుతాను, అతని కుక్కను చంపుతాను," అంటూ తనలో తాను గొణుక్కొంటూ, తూలుతూ వెళ్లిపోయాడు.

"మాట్లాడకు," అంటూ అతని తల్లి అరిచింది. కర్రనొకదాన్ని తీసుకొని ఒకచెట్టు బోదె మీద గట్టిగా కొడుతూ, "మాట్లాడకు," అని చెప్పానా, అంటూ ఆమె మరోసారి కేకవేసి, యిసుకలో ఉన్న కొబ్బరి చెట్ల ప్రక్కన బొమ్మల్లాగా నిల్చున్న అమ్మాయిలవైపు చూడకుండా అతని వెనకనే వెళ్లిపోయింది.

ఆ పైని వాళ్లు మౌనంగా యింట్లోకి వెళ్లి పోయారు. ఆ రాత్రి అతి ప్రమాదకరం గాను, భయంకరం గాను తోచిన నీడలను తరిమి వేసేందుకు లీల త్వరగా పొయ్యి వెలిగించింది. "ఏం జరిగింది," అని అడగటానికి వచ్చేసరికి వాళ్లు చిన్న మంట చుట్టూ కూర్చొని ఉన్నారు. వాళ్లు ఒక్కసారిగా ఏడుస్తూ జరిగిన విషయాన్ని హరికి చెప్పారు. అతనుగూడా చేయగలిగిందే

మీలేదు - వాళ్ల తల్లి ఆరోగ్యం కుదుటపడటానికి, పొరుగింటి త్రాగుబోతును దూరంగా ఉంచటానికి లేక అతని బెదరింపులను నివారించటానికి అతని బారినుండి పింటోను కాపాడటానికి, చుట్టూరా ఉన్న భయంకరమైన వాతావరణాన్నుండి రక్షించటానికి అతను చేయగలిగిందేమీ లేదు అని వాళ్లకు తెలుసు. కాని అతనికి గూడ వాళ్ల భయాలు తెలియటం, వాళ్ల యిబ్బందుల్లో పాలు పంచుకోవటం వాళ్లకు కొంచెం ఓదార్పు నిచ్చింది.

# నాలుగవ అధ్యాయం

తాను తన అక్కా చెల్లెళ్లతో నిశ్శబ్దంతో నిండిన సీడనిచ్చే పూరింటిలో కూర్చొని ఉండటమూ తన వద్ద ఉన్న ఖాళీపలతో సముద్ర తీరం వెంట తిరుగాడటం కాని కొన్ని సంవత్సరాల వరకూ వచ్చే అవకాశం లేని ఉద్యోగాన్ని ఆశిస్తూ దిగువభాగాన దేవాలయం ఉన్న కోష్ఠం చుట్టూ తిరగడం ఇక సాధ్యం కాదని హరికి ఈ పాటికి తెలిసిపోయింది. ఇప్పుడు ఏదో ఒకటి చేయవలసిన అవసరం ఏర్పడటం వలన తన కుటుంబంలో అలా చేసేవ్యక్తివేరొకరు లేక పోవటం వల్ల తానే ఏదో ఒకటి చేయాలి.

మరునాటి ఉదయం చాలాపరకు తయారైనట్లు కనిపిస్తున్న బిజూ పడవ చుట్టూ చేరిన కుర్రవాళ్ళ బృందంలోచేరి పోవటానికి హరి సముద్ర తీరం మీద వెచ్చని తెల్లని యిసుక మీరుగా నడచివెళ్లాడు. పడవలోగాఢ శీతలీకరణయంత్రాన్ని అమర్చటంతో బిజూ రాత్రింబవళ్లు దాన్నివదలటంలేదు. ఆ పడవ సముద్రంపై ప్రయాణం చేస్తున్నట్లు ఊహించుకుంటూ తను దాని ఉపరితలం మీద నిద్రిస్తున్నా నని అనుకుంటున్నారు. ఇప్పుడు పనిమనుషులు పడవ చుట్టూ తిరుగుతూ చిత్రిక పెడుతూ మెరుగులు దిద్దుతూ రంగులు వేస్తూంటే ఉదయపు కాంతిలో మోకాళ్ల మీద చేతులు ఆనించి బిజూ మడత కుర్చీలో కూర్చుండి పోయాడు. ప్రకాశవంత మయిన నీలిరంగు వేసిన యినుపరేకు మధ్య భాగంలో గులాబీ, తెలుపు రంగుల్లో చిత్రించ బడిన జలకన్య చిత్రం ఒకటి పడవను నడిపే అధికారి ఉండే గది ద్వారంపైన అమర్చబడింది. ఆ జలకన్య చిత్రం క్రింద ఒక వ్యక్తి ఆ పడవ పేరు 'జలపరి', 'జలకన్య' అని జాగ్రత్తగా రాస్తున్నారు. ఆపేరు అర్థం స్పష్టం కాపటంతో చుట్టూ మూగిన ఆ గ్రామం కుర్ర వాళ్లు నవ్వటంతో బిజూ వాళ్లవైపు తీవ్రంగా చూసాడు.

ఆ కుర్ర వాళ్లు ఎందుకు నవ్వుతున్నారో తెలుసు కునేందుకు హరి ఆగిపోయాడు. వాళ్లు ప్రకాశవంతమైన నీలి సముద్రంలో ఊగు తున్న గులాబీ తెలుపు రంగులో ఉన్న జలకన్యను చూపించి. దాన్ని గురించి మొరటుగా హాస్యోక్తులాడు కుటున్నారు. తాను వెళ్లి ఆ జలకన్యను పట్టు కోవటానికి బిజూ యీ పడవను నిర్మిస్తున్నాడు అని అంటూ వాళ్లు కన్నుగీటారు. కాని హరికి చిరునవ్వైనా నవ్వాలని పించలేదు. హరి వాళ్ళను వదలి నిదానంగా, తిన్నగా బిజూ వద్దకు నడచి వెళ్లాడు. ఆ రాత్రి పడవ మీద ఉద్యోగం కొరకు బిజూని అడగాలని అతను నిర్ణయించుకున్నాడు.

కాని ఆదేక్షణంలో ఎవరో తన దగ్గరకు రావటంతో వాళ్లతోమాట్లాడటానికి బిజూ తలత్రిప్పాడు. ఆ వచ్చినవ్యక్తి కర్మాగార నిర్మాణాన్ని పర్యవేక్షిస్తూ యినుప గొట్టాలకు కాపలా కాస్తూ యినుప రేకుల పాకలో ఉండే కాపాలా మనిషి అని హరికి తెలిసి పోయింది.

"ఆ వ్యక్తి ముట్టించని చౌకబారు సిగరెట్‌తో బిజూ వైపు నడుస్తూ" "తుళ్ గ్రామస్తుల కొరకు చేపలు పట్టటానికి మరోపడవ అన్నమాట" అన్నాడు హాస్యంగా.

ఆ మాటలతో బిజూ ముఖం నల్లబడి పోయింది. అతను తన అయిష్టతను తెలియజేస్తూ "ఇది మామూలుగా చేపలు వేటాడే పడవకాదు" అని కోపంగా అన్నాడు. ఆ విషయం నీకళ్లకు కనపడటంలేదా? దానికి డీజెల్ యంత్రం ఉంది. గాఢ శీతలీకరణ యంత్రం ఉంది. రోజుకు యాభై మైళ్లు ప్రయాణించే శక్తి ఉంది. అన్నాడు.

''ఓహో'' అంటూ నవ్వాడు ఆ వ్యక్తి. అలా అంటూ సిగరెట్ ముట్టించుకోవటానికి అగ్గిపుల్ల వెలిగించి పడవవైపు చూసాడు.

అలా అంటున్న సమయం లోనే పడవ పేరును సూచించే ఫలకం మేకు నుంచి జారి శబ్దం చేస్తూ పడవ పై భాగం మీద పడిపోయింది. దాన్ని తీసుకుని మళ్లీ తగిలించవలసి వచ్చింది. ఆఫలకానికి వేసిన రంగు చెరిగి కారి పోతుంది. దాంతో అక్కడ చేరిన కుర్రవాళ్లు బిగ్గరగా నవ్వటంతో బిజూ రంగు వేసే వ్యక్తిపట్ల కోపాన్ని వెల్లడించాడు. అప్పుడు అతను చిన్నగుడ్డ ముక్కతో దాన్నితుడిచి కంగారుగా పాడైపోయిన భాగాన్ని సరిచేస్తున్నాడు.

"అయితే ఇక్కడ శక్తి వంతమైన మరపడవ నిర్మింప బడుతోందన్న మాట అవునా" అంటూ ఆక్రొత్త వ్యక్తి వ్యంగ్యంగా నవ్వాడు. "ఇది యాభైమైళ్లు వెళుతుందా? అం చేపలు పట్టాలంటే వెళ్లాలి మరి" అన్నాడు.

"మీరనేది ఏమిటి? ఈ చుట్టు ప్రక్కల చేపలు సమృద్ధిగానే ఉన్నాయి."

అంటూ మడత కుర్చీలో అసౌకర్యంగా కదులుతూ బిజూ కోపంగా అన్నాడు. "లేదు ఇక్కడేమీ లేవు" అన్నాడు ఆ అపరిచిత వ్యక్తి చతికిలపడి యిసుక మీద సుఖంగా బాచీపట్టు వేసి కూర్చొంటూ "ఇక్కడ లభించే చేపలు పరిమితం. నిన్ననేను రాత్రి భోజనం లోకి చందువా చేపను కొందామనుకుంటే ఓ చిన్న పనికిరాని చేప లభించింది. బొంబాయి లో ఎవరూ అంత చిన్న చందువా చేపను తినరు" అన్నాడతను తృణీకారంగా. దాంతో అక్కడ ఉన్న గ్రామస్థులు మౌనంగా మారిపోయి అతని మాటలు వింటూ ఉండి పోయారు. "పెద్ద రొయ్యలు కావాలంటే  పనికిరాని చిన్న రొయ్యలు లభిస్తాయి. బొంబాయిలో వాళ్లకు యివి చాలవు - యివి మీగ్రామస్థులకు కూడా చాలవు. మీరు మీ పడవలను, వలలను వదిలివేసి ఏదైనా క్రొత్తదాన్ని చేపట్ట వలసిన సమయం ఇదే అన్నాడతను."

"మేము ఎప్పుడూ యిక్కడే ఈ సముద్రం లోనే చేపలు వేటాడాం" అన్నాడు బిజూ గట్టిగా. ఆ గ్రామంలోని జాలరులలో ధనవంతుడూ, పెద్దవాడూ అయిన బిజూ మాటలకు హరి, మిగతా కుర్రవాళ్లు కొంచెం గర్వపడ్డారు. ఇక ముందు కూడా యిక్కడే చేపలను వేటాడతాం మాకు సరిపడా చేపలు లేకపోతే సమృద్ధిగా ఆహారం ఉంది - వరి, ధాన్యం, కూరగాయలు, కొబ్బరి కాయలు ఉన్నాయి. ఈ దేశంలో యిలాంటి మంచి పంటలు యింకెక్కడున్నాయి. కొబ్బరి కాయలు చాలా పెద్దవి తియ్యగా ఉంటాయి. వాటికి బొంబాయిలో మంచిధర లభిస్తుంది. ఇక్కడి భూమి చాలా సారవంతమైనది. మేము సంవత్సరానికి రెండు పంటలు పండిస్తాం మాకు మంచి వరి ధాన్యం లభిస్తుంది. మీ రెప్పుడైనా మా మంచి బియ్యం తిన్నారా? అన్నాడు బిజూ.

"అవును అవును" అన్నాడతను, పొగాకు ముక్కలను ఊసివేస్తూ "నేను మీ బియ్యం తిన్నాను. నేను మీ పొలాలను చూసాను. ఇవి త్వరలోనే పోతాయి. ఇక్కడి భూమి నంతా కొనుగోలు చేసి కర్మాగారాలను నిర్మించటం జరుగు తుంది. అప్పుడు మీ బియ్యం కూడ మాయమైపోతాయి."

అక్కడ చేరిన కుర్రవాళ్లు మెరుస్తున్న కళ్లతో ఒకర్ని మరొకరు చూసుకొని తలలు ఊపారు. ఈ విషయాన్నే వాళ్లు గ్రామంలోని పెద్దలకు చెబుతున్నారు. వాళ్ల మాటలను మాత్రం నమ్మటం జరగలేదు. అప్పుడు ఆ మాటలనే దానికి సంబంధిత వ్యక్తి నుంచి వినటం జరిగింది. వాళ్లు వాటిని నమ్మవలసి ఉంటుంది. నల్లగా తీక్షణంగా ఉన్న వృద్ధుడైన బిజూ ముఖంలో వ్యక్తమైన భయమూ ఆందోళనను గమనించి వాళ్లు చాలా సంతోషించారు.

చేపలు పట్టే పడవలకు తోడు మూడెకరాలు వరిపండించే పొలం రెండెకరాల కొబ్బరి చెట్లు, పోకచెట్లు ఉన్న బిజూ "మాభూమిని ఎవరూ కొనలేరు. అదిమాది, మేము అమ్మం" అన్నాడు.

"ప్రభుత్వం మీరు అమ్మాలి అంటే మీరు బాగానే అమ్ముతారు. అన్నాడా కొత్త వ్యక్తి వ్రేళ్లతో చిటికిలు వేస్తూ" "ఇలాంటి ప్రశ్నలకు తావే ఉండదు. మీరు అమ్మవలసి ఉంటుంది. ప్రభుత్వం ఈ ప్రదేశం కర్మాగాలకు అనుగుణంగా ఉంటుందని ఎంపిక చేసింది; యిక్కడ కర్మాగారాలు నిర్మింపబడతాయి" అన్నాడు.

"ఇక్కడెందుకు," అన్నాడు బిజూ అతన్ని సవాలు చేస్తున్నట్లు. "వెళ్లి మీ కర్మాగారాలను చవిటి భూముల్లోను, రాళ్లు, ముళ్లు తప్పమరేమీ పండని భూముల్లో నిర్మించండి" అంటూ అతను తన చేతిని తీరం వెంబడి ఉన్న పచ్చని పొలాలను తీరానికి వెనుక ఉన్న నిస్సారమైన భూమిని వేరు చేస్తున్న కంకేశ్వర్ కొండల వైపు చూపాడు. "మామంచి వ్యవసాయం భూముల్ని కర్మాగారాల కొరకు ఎందుకు అమ్మాలి" అని అన్నాడు.

"మీరు అమ్మవలసి ఉంటుంది. యిది ప్రభుత్వం ఎంపిక చేసిన స్థలం."

"మమ్మల్ని అడుగకుండా ప్రభుత్వం ఎలా ఎంపిక చేస్తుంది?"

"నిన్నెవరు అడుగుతారయ్యా వృద్ధుడా?" అన్నాడా కొత్తవ్యక్తి. వాళ్లు సరియైన ప్రదేశాన్ని ఎంపిక చేయటానికి నిపుణులను పంపించారు. వాళ్లు ఎంపిక చేసిన ప్రాంతం ఇదే. ఈ ప్రదేశం రేవాస్ ఓడరేవుకు దగ్గరగా ఉంది. అందువల్ల బొంబాయికి రవాణా సౌకర్యం ఉంటుంది. అది బొంబాయికి దగ్గరగా ఉంది. పధ్నాలుగు కిలోమీటర్ల దూరమే. ఇక్కడ రైల్వే మార్గాన్ని తేలికగా నిర్మించవచ్చు. ఇప్పటికే రోడ్డు ఉంది. దాన్ని వెడల్పు చేయవలసి ఉంటుంది. రవాణా సౌకర్యాలు బాగున్నాయి. ఈ ప్రదేశం సముద్రానికి దగ్గరలో ఉంది. వ్యర్థపదార్థాలను అందులోకి పంపించవచ్చు. ఇక్కడ కర్మాగారాలకు, గృహ సముదాయాలకు. యిక్కడ పనిచేయటానికి వచ్చే వాళ్లందరికి చాలినంత భూమి ఉంది.

"మనుషులా? ఇక్కడికి ఎవరు వచ్చి పని చేస్తారు?"

"వేలమంది" అంటూ ఆ వ్యక్తి నవ్వాడు, వేలమంది వస్తారు. వాళ్ల కొరకు గృహ సముదాయాలు నిర్మించవలసి ఉంటుంది. బస్‌లు, ట్రామ్‌లు వేయవలసి ఉంటుంది. మార్కెట్‌లు ఏర్పాటు చేయవలసి ఉంటుంది.

"మరి ఇక్కడ ఉండే మా సంగతి ఏమిటి?"

ఆ మాటలకు క్రొత్త వ్యక్తి సవ్వి గడ్డి పరకలు కోసి వేస్తున్నట్లు గాలిలో చేతిని ఊపాడు "ఇలా - మీ గ్రామం అంతర్ధాన మౌతుంది. దాని స్థానంలో కర్మాగారాలు నెలకొంటాయి. ఎరువులు ఉత్పత్తి అవుతాయి. గాస్ ఉత్పత్తి అవుతుంది. అనేక ఉద్యోగాలు సృష్టించబడతాయి. అని ప్రభుత్వం చెప్తోంది. అన్నాడా వ్యక్తి బిగ్గరగా అక్కడ చేరిన, కోపంతో నిండిన గ్రామస్థుల చూపులను గమనించి."

"జాలరులు, రైతులు యిప్పుడు కర్మాగారాలలో కార్మికులుగా మారాలా" అంటూ అరిచాడు బిజూ. అంటే ఈ కుర్ర వాళ్లు వాళ్ల తండ్రుల నుంచి సంక్ర మించిన భూములు, పడవలను వదిలి నగరవాసుల్లాగా కర్మాగారాల్లో పని చేయటానికి వెళ్లాలా?" అన్నాడు.

"ఈ కుర్రవాళ్లు?" అంటూ ఆ వ్యక్తి తన తల త్రిప్పి, అక్కడ నిలబడి శ్రద్ధగా వింటున్న కుర్రవాళ్ల వైపు నిబ్బరంగా చూసాడు "ఈ కుర్రవాళ్ళను గురించి నాకు తెలియదు. ఇతర ప్రాంతాలనుంచి కర్మాగారాలను నడిపేందుకు తీసుకొని వచ్చే ఇంజనీర్లు, మెకానిక్ లని గురించి మాత్రమే తెలుసు."

"అయితే మేమో?" అని అరిచాడు రాము, ఆకస్మాత్తుగా, మాట్లాడాలను కొన్నప్పటికీ, గొంతు ఎండి పోయినట్లు ఉండటంవల్ల మాట్లాడటానికి అవరోధం ఏర్పడిన హరికి బదులుగా.

"నీవా?" అంటూ ఆవ్యక్తి అతని వంక తృణీ కారంగా చూసి "ఈ వృద్ధుడు నిన్ను తన పడవలో నియమించి, చేపలు పట్టటానికి పంపించగలడు. ఏభైమైళ్లదూరం" అంటూ నవ్వాడు. "చాలా, చాలాదూరం అని బిగ్గరగా అంటూ తెల్లని సూర్య కాంతిలో మెరుస్తూ ఎగిరి పడుతున్న సముద్రం వైపు తన చేతిని చూపాడు."

గ్రామస్థులందరికి కోపం వచ్చింది. హరి గ్రామంలోని సన్నని మార్గం గుండా దేవాలయానికి నడిచివెళ్లేటపుడు గ్రామస్థుల ఆగ్రహాన్ని పసిగట్ట గలిగాడు. జ్వరంతో మండి పోతున్న వాళ్ల అమ్మ కొరకు ఐస్ లభిస్తే తీసుకుని వస్తానని హరి లీలకు చెప్పాడు. రంగు రంగుల చీరెలు ఆరటానికి వసారాలోని కమ్మలపై వేసి ఉన్నాయి . తమ గుమ్మాల ప్రక్కన ఉన్న తులసి మొక్కలకు స్త్రీలు నీళ్లు పోస్తున్నారు. మార్కెట్లో పూలను అమ్మే స్త్రీలు పూల దండలను చక్కగా అమర్చుతున్నారు. కొంత మంది స్త్రీలు తమ ముందున్న ఆకులమీద అరటి పండ్లను అమర్చుతున్నారు. ఇలా పరిస్థితి యధావిధిగా ప్రశాంతంగా ఉన్నప్పటికి వాతావరణంలో ఏదో మార్పు కనిపిస్తోంది. ఆసక్తిలేకుండా మంద

కొడిగా ఉన్న వాతావరణంలో నిర్బంధం, అయిష్టత, కోపము చోటు చేసుకున్నాయి.

హరిలో కూడ అలాంటి స్పష్టమైన బలమైన భావాలే చోటు చేసుకొన్నాయి. అందువల్ల ఇటుకలతో కట్టిన దేవాలయపు చావడి బయట చాలామంది మనుష్యులు పెద్ద గుంపుగా గుమి కూడటం అతనికి ఆశ్చర్యంగా కనిపించలేదు. సోమరిగా తిరిగే కుర్రవాళ్లు, పనేమీలేని జాలరులు మాత్రమే కాక పెద్ద కొబ్బరి తోటలు, పోకచెట్లు ఉన్న వ్యవసాయ దారులు, స్త్రీలు ఆడపిల్లలు కూడ గుంపుగా నిలబడి దేవాలయానికి వెళ్లే పైమెట్టు మీద నిలబడ్డ యువకుని మాటలు వింటున్నారు. అతను ఉపన్యాసం యిస్తూండటంతో అదివినటానికి హరి దగ్గరగా వెళ్లాడు.

"నేను ఆలీబాగ్ నుండి మిమ్మల్ని మాతో చేరమని అడగటానికి వచ్చాను. తీరం. వెంబడి రేవాస్ నుంచి ఆలీబాగ్ వరకు ఉన్న పధ్నాలుగు గ్రామాల్లో నివసించే మనందరికీ యీ విషయం ఆందోళన కలిగించేదే. మనమందరమూ భయపడి పోయాం. మన భూమిని తీసుకోవటం జరుగుతుంది. మనకుటుంబాల కొరకు మంచి వరిధాన్యమూ కొబ్బరి కాయలనూ పండించే భూముల్లో ప్రభుత్వం వారు కర్మాగారాలను నిర్మిస్తారట. వాళ్ల కర్మాగారాలను నెలకొల్పటానికి మన పంటలను నాశనం చేస్తారట. ఎరువులు తయారు చేసేటప్పుడు అధికంగా మాలిన్యాలుత్పన్నమౌతాయి. కాబట్టి వాటిని తొలగించవలసి ఉంటుంది. వాళ్ల కర్మాగారాల్లోని మాలిన్యాలన్నింటిని సముద్రంలోకి వదులుతారు. అవిచుట్టు పట్లకొన్ని మైళ్ల వరకు ఉన్న చేపలను నాశనం చేస్తాయి. మన భూమి, సముద్రం లేకుండా మనం ఎలా జీవించగలము?" అంటూ అతను యీ సందేహాస్పద సమస్యలో వాళ్లను కూడా చేర్చుకొనటానికి మారు మ్రోగుతున్న కంఠస్వరంతో ప్రసంగిస్తున్నాడు.

"మనం ఎలాబ్రతకటం?" అంటూ అందరూ ఏకకంఠంతో అరిచారు. హరి గూడా "ఎలా" అని అరిచాడు. అలా తాను అరవటం తనకీ ఆశ్చర్యం కలిగించింది.

"మిమ్మల్ని శాంతింప జేయటానికి అంటే అబద్ధాలతో శాంతింప జేయటానికి వాళ్లు వాళ్ల మనుష్యులను పంపిస్తారు. వాళ్ల మనుష్యులు మీకు ఉద్యోగాలు వస్తాయని చెప్తారు. వాళ్లు మనందరికీ ఉద్యోగాలు ఇవ్వలేరని నేను చెప్పగలను. కర్మాగారాలు, శిక్షణ పొందిన ఇంజనీర్లు నగరంలోని కళాశాలల్లో పట్టభద్రులైన వారిచే నిర్వహింపబడతాయి. ఎప్పుడూ పాఠశాలకు వెళ్లకుండా యితరుల కొరకు ఆహారధాన్యాలనుత్పత్తిజేయటంతో జీవితాలు గడిపిన మన లాంటి సామాన్యవ్యక్తులకు

కొద్దిపాటి ఉద్యోగాలుండవచ్చు. ఊడ్చేవాళ్ల ఉద్యోగాలు, కూలీలుగా ఉద్యోగాలు, హీనమైన ఉద్యోగాలు, అతితక్కువవేతనం లభించే ఉద్యోగాలు లభించవచ్చు. అవును అలాంటి వాటినే మనకు ఇస్తారు. కాని నగరం నుంచి వచ్చిన యింజనీర్లకు మాత్రం మంచి జీతాలు ఉంటాయి. వాళ్లు ఉండేందుకు మంచి యిళ్లు ఇస్తారు. వాళ్లు కర్మాగారాలకు ఐదువందల ఎకరాలు మాత్రమే అవసరం అవుతాయని చెప్తున్నారు. కాని వాళ్ల గృహ సముదాయాలకు మరికొన్ని వేల ఎకరాలు అవసరమవుతాయి. అలాగే పెద్ద కర్మాగారాల చుట్టూ నెలకొల్ప బడే చిన్న కర్మాగారాలకు గూడా కొన్ని వేల ఎకరాలు అవసరం అవుతాయి. వాళ్లు మనవద్ద ఉన్న మంచి భూముల్లో కనీసం పదిహేను వందల ఎకరాలు-మహారాష్ట్రలో అతి సారవంతమైన భూమిని - తీసుకుంటారు, దానికి ప్రతిఫలంగా పొడవాటి మన కొబ్బరి చెట్లను నరికి వేస్తారు. మన వరిపంటను నాశనం చేస్తారు. సముద్రంలోని చేపలను చంపివేస్తారు. ఆ తరువాత మనం వాళ్లకు ఉపయోగకరంగా ఉండం కాబట్టి మనల్ని కూడా తరిమివేస్తారు. మనం మనకు యిలా జరగటాన్ని అనుమతించగలమా?" అంటూ అతను బిగ్గరగా అరిచాడు.

" లేదు, లేదు, లేదు" అంటూ అందరూ సమాధానంగా అరిచారు. "మనం అనుమతించం! మనం అనుమతించం!"

" అయితే ముఖ్యమంత్రి గారికి ఆయన పథకాలను గురించి మన భావాలను తెలియ జేయటానికి మాతోపాటు బొంబాయి రండి. మేము యింతకు ముందే ఆలీబాగ్ లోని జిల్లా కమీషనర్‌తో మాట్లాడాం. ఆయన మనకేమీ చేయ లేదు. ఒక మంత్రిగారు వచ్చి మనతో మాట్లాడుతారని చెప్పటం జరుగుతోంది. వాస్తవ మేమిటంటే మేము ఆయన కొరకు వేచి ఉండటం గమనించి ఆయనకు భయం పట్టు కొని పోలీసులను మనతో సంప్రదించమని చెప్పి కార్లో ఎక్కి కూర్చుని బొంబాయి వెళ్లి పోయాడు. పోలీసువాళ్లు లాఠీలతో తరిమి వేశారు. మనం యీ ప్రవర్తనను సహించకూడదు. మనం పోలీసు పాలనను సహించ కూడదు." అంటూ తన పొడవాటి జుత్తు భుజాలమీద ఎగిరి పడుతూంటే, చేతులు ఆకాశంవైపు ఎత్తి అతను అరిచాడు.

"పోలీసు రాజ్యంవద్దు, పోలీసు రాజ్యంవద్దు" అన్నారు శ్రోతలందరు. అలా అంటున్నవారిలో హరి ఒకడు. అతను ఆమాటలు ఆవేశపూరితంగా అన్నప్పుడల్లా తన ముందున్న కుర్రవాని వీపు మీద గుద్దుతూండటం జరిగింది.

"ఇప్పుడు మనం తిన్నగా ముఖ్యమంత్రి దగ్గరకు వెళ్లాలి. ఆయన వచ్చి

మనం చెప్పేది వినకపోతే, మనం వెళ్లి బొంబాయిలో ఉండే కార్యాలయంలో మన మాటలు వినేటట్లు చేద్దాం" అంటూ ఆయువకుడు గర్జించాడు. "నాతో మీలో ఎవరు వస్తారు? నీవువస్తావా?" అని అడిగాడు.

వస్తాం, వస్తాం, వస్తాం అంటూ అరిచారు జనం అలా అరిచిన వారిలో ఎప్పుడూ ఆలీబాగ్‌ను దాటి ప్రయాణం చేయని స్త్రీలు, పిల్లలు, తమ జేబుల్లో బస్ ఛార్జీలు కాని, పడవ ఛార్జీలు కాని లేనివారు కూడా ఉన్నారు.

"అయితే నన్ను రేపు ఉదయం రేవాస్‌లో పడవలు దిగేస్థావరం దగ్గర కలుసుకోండి. మనమందరం చేపలు వేటాడే పడవల్లో బయలు దేరుదాం మనం పడవల్లో బొంబాయి వెళదాం. మనం మంత్రిగారిని ఆయన కార్యాలయంలో కలిసి మన మాటలు వినేలా చేద్దాం. మనం రావటం చూసివాళ్లు భయపడిపోయి ప్రశాంతంగా కూర్చొని వినవలసి ఉంటుంది. మనం మన భూమిని వాళ్లు తీసుకోకూడదని సముద్రాన్ని మనకు నిరుపయోగ కరంగా చేయ గూడదని చెబుదాం - భూమి మనది, సముద్రం మనది" అన్నాడతను.

అందరూ భూమి మీద కొబ్బరి ఆకుల్లాగాను, సముద్రం మీది అసంఖ్యాకమైన తెరచాపల్లాగాను చేతులూపుతూ "మనదే, మనదే, మనదే" అన్నారు.

ఎట్టకేలకు ఆలీబాగ్‌లోని ఐస్ కర్మాగారాన్నుండి జాలరులకు అమ్మేందుకు అప్పుడప్పుడు ఐస్ తెప్పించే దుకాణం చేరాడు హరి. వాళ్లు అతనికి ఐస్ రాలేదని చెప్పారు. ఎరువుల కర్మాగార నిర్మాణానికి వ్యతిరేకంగా రైతులు, జాలరులు జాతీయ రహదారి మీద పెద్ద ఆందోళన చేస్తూ ఊరేగింపుగా వెళుతూండటం వల్ల రాకపోకలు ఆగిపోయి ఆలస్యమైంది అని చెప్పారు.

హరి తల ఊపాడు. అతనికి ఆవిషయ మంతా తెలుసు కాని అతనికి ఐస్ అవసరం. ఆరోజు అతను చేయవలసిందేమీ లేదు. అందువల్ల అతను ఐస్ కొరకు ఎదురు చూస్తూ దుకాణం దగ్గర ఉన్న మందారపొద ప్రక్కదుమ్ములో కూర్చున్నాడు. ఆఖాళీ దుకాణం చుట్టూ నెలకొన్న ప్రశాంతతకు, నీడకు అతను సంతోషించాడు. పరిస్థితులను గురించి తనకు తాను ఆలోచించు కొనటానికి అతనికి ఏకాంతం అవసరం.

ఉదయం తాను ఇంటి నుండి బయలు దేరినప్పటినుంచి వాస్తవంలో అంతకంటే ముందే, గతరాత్రి నుంచి తన అక్కా చెల్లెళ్లు తనతో మాట్లాడకుండ ఏదో అడుగుతున్నట్లుగా ఉన్నప్పటి నుంచి, అతను జన సమూహం చేత త్రోయ బడినట్లు యిటు అటు నెట్టి వేయబడినట్లు భావించాడు తాను ఏమార్గాన్ని ఎంచుకోవాలో తేల్చుకోలేక పోతున్నాడు.

ఆరోజు ఉదయం ప్రారంభంలో సముద్ర తీరం మీద బిజాకు నగరం నుండి వచ్చిన వ్యక్తికి మధ్య జరిగిన సంభాషణవల్ల హరి, బిజాను ఉద్యోగం అడగటానికి అవరోధం ఏర్పడింది. వాళ్ల సంభాషణ వింటున్న హరికి వృద్ధుడూ, కోపదారి అయిన బిజాకన్నా పడవమీద పనిచేసే పల్లెటూరి పనివాళ్ల కన్నా పాఠశాల మానివేసి అక్కడా యిక్కడా నిలబడి చతురోక్తులు విసురు కుంటూ నవ్వుకునే సోమరి కుర్రవాళ్లుకన్నా, నగరం నుంచి వచ్చి అన్ని తెలిసినట్లు వ్యంగ్యంగా వ్యవహరించే కాపలాదారుడు తెలివిగల వాడుగాను, సునిశితమైన వాడిగాను కనిపించాడు. హరి బిజాను ఉద్యోగం కావాలని అడగాలన్న ఆలోచనను విరమించుకుని గ్రామంలోని పనికి మాలిన, సోమరి వికారపు కుర్రవాళ్లు పక్షంవదలి ఆనగరవాసి పక్షం వహించాలని అనిపించింది. నగరం నుండి వచ్చిన ఆవ్యక్తి మాట్లాడే విధానం తనను గాయ పరచి, వృద్ధులైన గ్రామస్థులలాగే అతనికి వ్యతిరేకంగా ప్రవర్తించేటట్లు చేసినప్పటికి అతని మాటల్లో అర్థమూ విచక్షణ ఉన్నట్లు తోస్తోంది.

తర్వాత ఆలీబాగ్ నుంచి వచ్చిన యువకుని శక్తి వంతమైన ఉపన్యాసం వింటున్న సందర్భంలో అతని పేరు అదార్కర్ అని, గత ఎన్నికల్లో తామెన్నుకొన్న మహారాష్ట్ర శాసన సభ్యుడని ఎవరో చెప్పారు. పోరాటాన్ని నిర్వహించేందుకు అతనికి భూమి గాని, పడవగాని లేక పోయినప్పటికీ అతను తన తోటి గ్రామస్తులకు మద్దతుగా నిలబడి సాంప్రదాయిక పద్ధతుల్లో తమ జీవిక కొరకు శ్రమిస్తున్న రైతులు, జాలరుల హక్కుల కొరకు పోరాటం జరపాలని భావించాడు.

తాను ఏం చేయాలి? తాను గ్రామస్తులతోచేరి బొంబాయి వెళ్లి తమ భూములను తీసుకొని వృత్తులను నిర్మూలించటానికి వ్యతి రేకంగా జరిగే నిరసన ప్రదర్శనలో పాల్గొనాలా? లేక ప్రభుత్వపక్షమూ, కర్మాగార నిర్మాణ పక్షమూ వహించి దూరంలో ఉన్న నగరం నుంచి వింత పద్ధతిలో తమకు ఉద్యోగాలను కల్పించబోతున్న నూతన వ్యవస్థలో ఉద్యోగం చూసుకోవాలా? ఈ ప్రశ్నలను గురించి తనమనసులో వితర్కించు కొంటే బొంబాయి వెళ్లాలన్న భావన తనకు ఉత్తేజపూరితంగా తోచింది. కొంత, యితర గ్రామస్తులతో పాటు తమ భూముల కొరకు పోరాడాలన్న భావన పట్ల ఆకర్షణ, కొంత, ఎట్టకేలకు బొంబాయి వెళ్లాలన్న భావన వల్ల అతనికి అలా అనిపించింది. ఇంత కాలం పాటు బొంబాయి వెళ్లాలని ఎదురు చూస్తున్న అవకాశం యిప్పుడు వచ్చింది. ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లని, చేతిలో చిల్లిగవ్వలేని తనలాంటి

కుర్రవాడు ఈ అవకాశాన్ని వినియోగించు కోగలడా?

అతను నీడలో తలవంచుకుని చిన్న కొమ్మతో యిసుకలో గీతలు గీస్తూ కూర్చున్నాడు. చివరకు ఎలాగైతేనేం గోనె సంచిలో చుట్టిన ఐస్ దిమ్మెతోపాటు కిరోసిన్, పంచదార, చక్కెరనుంచి వెలువడే ద్రావణం, గోధుమలు తీసుకొని లారీ వచ్చింది. హరి త్వరగా లేచి నిలబడి ఐస్ దిమ్మెకు దగ్గరగా నిల్చున్నాడు దుకాణం దారుడు దాన్ని తన ఐస్‌ను భద్రపరచే పెట్టెలో పట్టే విధంగా ముక్కలు చేస్తున్నాడు. హరి తన వద్ద ఉన్న గుడ్డలో ఆ ఐస్ ముక్కలను కట్టి దుకాణం దారునికి అందజేసి అతనికి కోపం రాకుండా ఉండేందుకు ఒక చిన్న ముక్కను ఖరీదు చేసి అదికరిగి పోకముందే ఇంటికి చేరటానికి సముద్ర తీరం మీద త్వరగా నడిచాడు. తన తల్లికి, లీలకు యిలా ఐస్ తీసుకుని పోవటం అతనికి కొంత సంతోషం కలిగించింది. దానితోపాటు కొంతసేపటి వరకు అతని ఆందోళనలు అదృశ్యమయ్యాయి.

అతను కయ్య ప్రక్కనున్న మార్గం మీదికి చేరగానే జరగరానిదేదో జరిగిందని తెలిసి పోయింది. ప్రశాంతంగా ఉన్న ఇంట్లో నుంచి బిగ్గరగాను, స్పష్టంగాను తన అక్కా చెల్లెళ్ల ఏడ్పులు వినిపించటంతో తన తల్లికి ఏదో జరిగి ఉంటుందని పరుగిడ నారంభించాడు.

"లీలా! లీలా! ఏమి జరిగింది" అని అతను కేక వేసాడు. ఆమె గుమ్మానికి తల ఆనించి నిలబడి తన చెల్లెళ్ల వలె కాకుండ నెమ్మదిగా గుండె పగిలేటట్లు ఏడుస్తోంది. "అమ్మా? అమ్మేనా? ఇదుగో ఆమె కొరకు ఐస్ పట్టుకొని వచ్చాను - యిదిగో ఐస్" అంటూ అతను లీల దగ్గరకు త్వరగా వెళ్లి ఆమె చేయి పట్టు కొన్నాడు.

ఆమె తల అడ్డంగా ఊపి కళ్ళు మూసు కొని పూరింట్లో ఓమూలకు చేయి చూపింది. అతని మోకాళ్లు వణుకు తున్నాయి. ఆమె పింటోను చూపించి నట్లు గ్రహించాడు పింటో నేలమీద పడి ఉంది. అది తీరం మీద కనిపించే అట్టముక్కలాగ బిగుసుకొని పోయి ఉంది. శరీరం మీద రోమాలు అట్ట కట్టకొనిపోయి, కళ్లు తెరిచి చూపులేకుండా పడిఉంది. అతను వెళ్లి కుక్క ప్రక్కన మోకరిల్లి తాకటానికి భయపడుతూ చూస్తూ ఉండి పోయాడు.

తర్వాత బేల, కమల అతని మీద పడిపోయి, దుఃఖంతో నిండిన తమ ముఖాలను హరి భుజాల్లో దూర్చి అతని చేతిని లాగారు. "ఏం జరిగింది" అని అడిగాడతను మెల్లగా "ఈరోజు ఉదయం బాగానే ఉందిగా?"

లీల ఏడుస్తూవచ్చి అతని వెనుక నిలబడి "దానికి విషం పెట్టారు"

అంటూ మరోసారి ఏడ్చింది. అకస్మాత్తుగా జబ్బు చేసింది - యిక్కడే యింటి ముందరే వాంతి చేసుకోవటం మొదలెట్టింది రక్తం - వాంతుల్లో రక్తం పడింది. ధాంతో క్రిందపడి పోయి చచ్చి పోయింది. దానికి విషం పెట్టారు. నాకు తెలుసు - నాకు తెలుసు అంటూ ఆమె భయంతోను, విచారంతోను రోదించింది.

"పింటోకు ఎవరు విషం పెడతారు?" అని అడిగాడు హరి. అలా అంటూ ఐస్ ముక్కను కింద విసిరేసి తడిగాను అట్ట కట్టకొని పోయినదాని రోమాలను తాకి యింకా ఏమైనా దాని శరీరంలో ప్రాణం ఉందేమోనని చూసాడు.

"ఇలా చేసిందెవరో నాకు తెలుసు" అని కమల కీచుగొంతుతో అన్నది. "ఇది అతనే - ఆభయంకర వృద్ధుడే - అక్కడ ని వసించే త్రాగుబోతే అంటూ తమ పొరుగు వాళ్ల యింటిని చూపిస్తూ అరచింది."

"అవును, అతనే మమ్మల్ని భయపెట్టాడు" మనల్ని శిక్షిస్తానని అతను అన్నాడు - పింటోను చంపుతానని అన్నాడు. అంది లీల విచారంగా.

హరి కూడా కొంచెం ఏడుపుముఖం పెట్టి "ఎందుకు?" మనపింటోను అతనెందుకు చంపుతానన్నాడు? అని అడిగాడు కోపంగా.

అతనికి, మనం అంటే ద్వేషం అంటూ బేల, కమల ఏడ్చారు.

"అతను మనల్ని శిక్షిస్తానని అన్నాడు" అంది లీల జ్ఞాపకం చేసుకుంటూ నాన్న అతనికి సారాకు డబ్బులు ఇవ్వలేదట, నాన్న అతనికి కొంత డబ్బు బాకీ పడ్డాడు; నాన్న అప్పుచేసాడు.

"అప్పు, అప్పు, అప్పు" అంటూ హరి పళ్లు కొరికాడు. నాన్న ఎప్పుడూ సారా కోసం అప్పుచేస్తూంటాడు, అంటూ అతను అక్కడి నుంచి లేచి చచ్చిన కుక్క దగ్గరినుంచి ఏడుస్తున్న అక్కా చెల్లెళ్ల దగ్గర నుంచి వెనుదిరిగి ఇంటి బయటకు వెళ్లాడు. తానువెళ్లిపోతాడు. తాను రేవాస్ వెళ్లిపోతాడు. అక్కడినుంచి బొంబాయి వెళతాడు. ఆతర్వాత యీ విచారంతో నిండిన యింటికి భయపడి పోయిన అక్కా చెల్లెళ్ల దగ్గరకు, అనారోగ్యంతో ఉన్న తనతల్లి దగ్గరకు త్రాగుబోతు తండ్రి దగ్గరకు, యిక ఎన్నడూ రాడు. తాను వాళ్లను వదిలి పరిగెత్తుతాడు, వీలయినంతదూరం పరుగెత్తి పోతాడు.

# ఐదవ అధ్యాయం

మరునాడు ఉదయం సూర్యోదయంతో పాటు అలలు ప్రారంభమైన సమయంలో బిజూ తయారు చేయించిన పడవను జలప్రవేశం చేయించటం జరుగుతుందని హరికి తెలియదు. పచ్చని చెట్లమధ్యదాగి ఉన్న పూరిళ్లల్లోంచి ఆ పడవ జల ప్రవేశాన్ని చూడటానికి గ్రామస్తులు కాంతితో నిండిన తెల్లని సముద్ర తీరం మీదికి బిల బిల మంటూ చేరారు. బిజూ భార్య పడవ ఉపరితలం మీద కాగితాలు, జెండాల సముదాయాన్ని అలంకరించింది అలా అలంకరించిన వాటిలో పొడవాటి జెండాలు ఉన్నాయి. వాటిని ఆమె తన పాత చీరలను చించి కుట్టించింది. అవి గులాబీ, ఆకుపచ్చ, ఊదానీలం రంగులో ఉన్నాయి. ఇవికాక లతలు, పుష్పాలతో పాటు గళ్లగళ్ల కాషాయ రంగు, చింత గింజ రంగు, నీలిరంగు చీరెలతో కలిపికుట్టిన జెండాలు కూడా ఉన్నాయి. నూతనంగా ప్రకాశవంతమైన నీలి, గులాబి రంగుల్లో వ్రాయబడిన పేరును సూచించేఫలకం పడవ ముఖ్యాధికారి ఉండేగది గోడకు అమర్చబడి ఉంది. గర్వంతో ఎగిసిపడుతున్న వక్షస్థలానికి అడ్డంగా పెట్టుకొన్న చేతులతో బిజూ తన మడత కుర్చీలో దేదీప్య మానంగా ఉన్నాడు.

అంతకు ముందురోజు సాయంత్రం పడవను నిర్మించే వాళ్లు రెండు బరువులు లాగే యంత్రాలను బలమైన మోకులతో పడవకు బిగించి యిసుకలో అమర్చారు. ఈ రోజు ఉదయం పడవ దగ్గర నుంచి సముద్రం అంచువరకు యిసుక మీద కొబ్బరి చెట్ల బోదెలను వేసారు. నల్లని నూనె నిండిఉన్న డబ్బానొక దాన్ని ఒక మనిషిపట్టుకొని పడవ తేలికగా జారేందుకు ఆనూనెను బోదెలకు వ్రాస్తున్నాడు. బిజూ భార్య అతని కుమార్తె పడవ సముద్ర ప్రవేశం చేయగానే పంచటానికి పళ్లాల్లో మిఠాయిలతో సిద్ధంగా నిలబడి ఉన్నారు. బిజూ భార్య పడవ ముఖ భాగంలో తెలుపు, నలుపు రంగుల్లో ఓ జత కళ్లను



చిత్రించిన చోట కొబ్బరి కాయ కొట్టటానికి ముందుకు వెళ్లింది. ఆమె కొబ్బరి కాయ కొట్టటమూ, దానిలోని నీళ్లు చిలకటమూ జరగటంతో అక్కడ జేరిన వాళ్లందరూ ఆనందంతో కేకలు వేసారు.

తరువాత పడవను ఎత్తి నూనె పూసిన చెట్లబోదెల మీద ఉంచటం జరిగింది. బరువును లాగే యంత్రాలనుండి బయటకు పొడుచుకు వచ్చినట్లు కనిపించే వెదురు గడలను చెమటోడుతున్న కండలుతేలిన పనివాళ్లు గట్టిగా పట్టుకొని బరువు లాగే యంత్రానికి చుట్టబడిన మోకును ఉత్సాహవంతంగా విప్పటంతో పడవ నూనె పూయబడిన చెట్ల బోదెల మీదుగా అతి వేగంగా ముందుకు దొర్లింది. అలా దొర్లి అది ప్రమాదకరంగా ఒక వైపుకు వంగి పోవటంతో అందరూ మేకులను వదలి ప్రాణ రక్షణ కొరకు పరుగెత్తారు. ఆ పడవ యిసుకలో త్రాగిన వ్యక్తిలాగ ఒకవైపుకు వంగి ఒక పార్శ్వం మీద కూలి యిసుకలో పడి పోవటానికి సిద్ధంగా ఉంది.

బిజూ ముఖం మీద సంతోషంతో నిండిన నవ్వు తుడిచి పెట్టుకొని పోయి, దాని స్థానంలో ఉరమటానికి సిద్ధంగా ఉన్న నల్లని మేఘం లాంటి నిరుత్సాహం చోటు చేసుకుంది. ఏం జరిగిందో చూడటానికి అతను తన మడత కుర్చీలోంచి దిగి ఊగులాడు కుంటూ వెళ్లాడు. అతని భార్య, కూతురు మౌనంగా దిగులుగా మిఠాయిలున్న పళ్లాలు పట్టుకొని నిలబడ్డారు. ఆదృశ్యాన్ని చూడటానికి వచ్చిన అక్కడ చేరిన కుర్రవాళ్లందరూ అపహాస్యంగా కేకలు వేస్తూ నవ్వారు. బిజూపనివాళ్లను తీవ్రంగా నిందిస్తూ తిట్ల వర్షం కురిపించాడు. "ఆలీబాగ్ నుంచి యీ పని చేయటానికి నాపని వాళ్ళను తీసుకొని రావలసింది.

మీరంతా పొలంపని చేసే మొద్దులు. మీకు పడవలను గురించి ఏమి తెలుసు?" అన్నాడతను.

"మీరు చెప్పే ఆలీబాగ్ మనుష్యులు యీ రోజు ఎక్కడ ఉన్నారు" అని ఒక వ్యక్తి చేతులు కట్టుకొని యధాలాపంగా అడిగాడు.

"వాళ్ళందరూ ఈ రోజు పడవలో బొంబాయి వెళ్లటానికి రేవాస్ వెళ్లారు" అన్నాడు చిన్న కుర్రవాడొకడు నవ్వుతూ. "వాళ్లు ప్రభుత్వంవారు. యిక్కడ ఎరువుల కర్మాగారాన్ని నిర్మించ కుండా ఉండేందుకు తమ వంతు ప్రయత్నాలు చేయ బోతున్నారు. వాళ్లు వ్యవసాయదారులు, జాలరులు అవటం వల్ల, జీవిత మంతా మూర్ఖులుగా ఉండటం వల్ల, వాళ్లు అలా చేయబోతున్నారు;" అని నిరాశాపూరితంగా వంగిపోయిన పడవ చుట్టూ నెలకొన్న అయోమయ దృశ్యం వైపు చేయి ఊపుతూ అపహాస్యంగా కేకలు వేశాడు బిజూ. "మాజీవిత కాల మంతా యిక్కడ ఇలాంటి పడవలను నిర్మించి వాటిలో సముద్రం మీద ప్రయాణించి మునిగి పోవాలి కాబోలు," అన్నాడొక కుర్రవాడు.

"ఓ అలాగేం?" అంటూ బిజూ అతని వైపు దూకాడు. మీకు పడవలు నిర్మించట మెలాగో, చేపలు పట్టట మెలాగో, సముద్రం మీద ఎలా ప్రయాణం చేయాలో తెలియదు. "మంద బుద్ధీ" నీకేమీ తెలియదు. మీకు కావలసిందల్లా మంచి దెబ్బలే అన్నాడు.

"మాకు అంత కంటె బాగా తెలుసు వృద్ధ బిజూ," అన్నాడొక చిన్న కుర్రవాడు తొణకకుండా - అలా మాట్లాడింది హరి స్నేహితుడు రాము. "మాకు ఇక్కడి కర్మాగారంలో ఉద్యోగాలు లభిస్తాయి. నీవు కొద్ది పాటి దుర్వాసన కొట్టే చేపలను పట్టు కోవటానికి సముద్రంతో పోరాటం జరుపుతూ ఉంటే మాకు మంచి సురక్షితమైన ఉద్యోగాలు లభిస్తాయి. మా జేబుల్లో నిండుగా డబ్బులుంటాయి. అప్పుడు మాకు బాగా తెలుసో నీకు బాగా తెలుసో నీకే అవగాహన అవుతుంది. అన్నాడు రాము. యీవిధంగా మాట్లాడు తుంటే మెచ్చుకోలుగా అతని ప్రసంగాన్ని వింటూ అతని చుట్టూ నిల్చోన్న కుర్ర వాళ్లందరూ వృద్ధ బిజూ పడవను "పనికి రాని చిల్లిగవ్వ" అని "ఖాళీ కొబ్బరి కాయ" అని అంటూ అతన్ని చూచి నవ్వటం మొద లెట్టారు. దాంతో అతను కండరాలు తేలిన తన చేతిని గాలిలోకి ఎత్తి "వెళ్లండి. నేను కర్ర తీసుకునివచ్చి మీ వీపులు వాయించక ముందే యిక్కడి నుండి వెళ్లండి" అంటూ గర్జించాడు.

ఆ మాటలకు కుర్రవాళ్లు నవ్వు కొంటూ వెనుతిరిగారు. వాళ్లలో ఒకడు

"హరి ఎక్కడ?" ఈ తమాషా చూడటానికి అతను రాలేదు" అన్నాడు.

"తెలియదు" ఆలీబాగ్ నుండి వచ్చిన మనుష్యులతో రేవాస్ వెళ్లాడను కుంటున్నా?"అన్నాడు రాము.

"అలా వెళ్తేవాడొక మూర్ఖుడవుతాడు" అన్నాడుమరొకడు.అలా మాట్లాడు కుంటూ వాళ్లు వెళ్తూ వెళ్తూ యిసుకను కాళ్లతో చిమ్ముతూ తలా ఒకవైపు వెళ్లారు. పనివాళ్లు మోకులు లాగి, పడవను సరి చేయటానికి ప్రయత్నించి విరమించు కోవటాన్ని చూస్తూ కొంత మంది కుర్రవాళ్లు అక్కడే నిల్చి పోయారు. "సముద్రంలో అలలు పెరిగేంత వరకు వేచి ఉందాం" అన్నారు. పనివాళ్లు ముఖాల మీద చెమటను తుడుచు కుంటూ" అలలు ఎత్తుగా వస్తే పడవను సరిచేస్తాయి. అప్పుడు పడవ దానంతట అదే జల ప్రవేశం చేస్తుంది. అని బిజూకు వివరించి తాము అలసి పోవటం వల్ల టీ త్రాగాలని చెప్తూ వెళ్లి పోయారు.

నూతన వస్త్రాలు ధరించిన బిజూ అతని భార్య కుమార్తె నిస్సహాయంగా సముద్ర తీరం మీద మిగిలి పోయారు. కొంచెం సేపటి తరువాత ఎండ వాళ్ళను కూడా తరిమి వేసింది.

సముద్రంలో అలలు పడవను సరి చేయటానికి అవసరమైన ఎత్తు వరకు రాలేదు. మరుసటి రోజు పని వాళ్లు పడవను మళ్లీసరిచేసి జల ప్రవేశం చేయించటానికి ప్రయత్నంచేసారు. వాళ్లు నిరుత్సాహంగాను యిష్టం లేకుండాను ప్రయత్నం చేయటంవల్ల విఫలమయ్యారు. వాళ్లు చాలా రోజుల వరకు మళ్లీ మళ్లీ ప్రయత్నించవలసి వచ్చింది. బిజూ వాళ్ల చేత అలా చేయించినందుకు వాళ్లకు అతనిపై కోపం వచ్చింది. వాళ్లు విఫలమైనందుకు బిజూకు వాళ్ల మీద కోపం వచ్చింది ఎలాగైతే నేం చిట్ట చివరకు వాళ్ళు దాన్ని కొంచెం కొంచెంగా సముద్ర తీరం మీద అలల వరకు తీసుకుని పోవటంతో దాన్ని రాత్రి పూట చీకటిలో అగౌరవ కరంగాను ప్రశాంతంగాను జలప్రవేశం చేయించటం జరిగింది.

ఆసమయానికి హరి తుళ్ గ్రామానికి చాలా దూరంలో ఉండటంతో అతను 'జలపరి' అన్న పడవనుగురించి పూర్తిగా మర్చి పోయాడు.

# ఆరవ అధ్యాయం

హరి రేవాస్ చేరుకొనే సమయానికి ప్రాతఃకాల మౌతోంది. రాత్రి పూట అక్కడకు చేరిన మనుష్యులు పడవలు ఆగేస్థలం ప్రక్కన అటూ ఇటూ ఈగు తున్న చేపలను వేటాడే చిన్న పడవల్లోకి ఎక్కుతున్నారు.

హరి తాను రాత్రి గడిపిన ఎద్దుల బండి నుండి దిగి బండివానికి బాడుగ యిచ్చేందుకు నాణాల కొరకు తన జేబు వెదుకుతున్నాడు కాని బండి వాడు గాలిలో చేతులు ఊపుతూ "వెళ్లు పరుగెత్తు నీవు ఎక్కాలనుకొన్న పడవలు అక్కడ ఉన్నాయి. మా మనుష్యులు తరువాత వస్తారు. ఇంతలో నేను ఓగ్లాస్ టీ త్రాగివస్తాను. నాకేమీ ఇవ్వవద్దు నేను ఎలాగూ యిక్కడికి వస్తూనే ఉన్నాను" అన్నాడు. అలా అంటూ అతను బండికి పూన్చిన ఎద్దు నొకదాన్ని కొరడాతో అదిలించటంతో బండి ముందుకు కదిలి, శబ్దం చేసుకొంటూ దారి ప్రక్క నున్న ఒక షాపు వైపు వెళ్లింది.

రాత్రి అంతా బండి మీద, వట్టి చెక్కల మీద గడపటంతో హరికి శరీరం బిగుసుకు పోయినట్లనిపించింది. అతను రేవాస్‌కు వెళ్లే బస్‌లో ఎక్కాలను కున్నాడు. అందుకు అతను చీకటిలో ఒంటరిగా తుళ్ ప్రక్క నున్న జాతీయరహదారి మార్గం మీద నిలబడి ఒక గంట గడిపాడు తర్వాత రేవాస్ వెళ్లే ఆఖరి బస్ వెళ్లి పోయి ఉంటుందని గ్రహించాడు. అందువల్ల అతను ఓ ఎద్దుల బండిని కేక వేసి తనను ఎక్కనివ్వమని అడగటంతో బండి వాడు తన బండిలో ఎక్కించు కొన్నాడు.

"రా ఎక్కు - తెల్లవారక ముందు నేను రేవాస్ చేరాలి నేను మన గ్రామానికి బొంబాయి నుండి సరుకులు తెచ్చే మనిషి ఒకడ్ని కలుసు కోవాలి అతను తనను కలుసు కోమని చెప్పాడు. అతను తన భూములకు ఆహారం అని చెప్పాడు - ఎరువులట, అవేమిటో నీకు తెలుసా?" అనిఅడిగాడు.

అలాంటి వినటానికి అవకాశం లేని పదాన్ని అర్ధరాత్రి ఎద్దుల బండి మీద వినటంతో హరి ఆశ్చర్యపడ్డాడు కాని తనకు బండి వానికి వివరించేంతగా వాటిని గురించి తెలియదని భావించి మౌనంగా బండిలో ఎక్కాడు. బండి మీద ఏమీ లేవు, అటూ యిటూ కదులుతూ, కిర్రుమంటున్న చెక్కల మీద గోనె పట్టా కూడా లేదు. ఎద్దుల బండి శబ్దం చేస్తూ ముందుకు పోతూంటే, హరి గూడ ముందుకు వెనక్కు కదుల్తున్నాడు. అతను ఒకవైపు నుండి మరోవైపుకు కదుల్తూండటంతో, సమతలంగా లేని చెక్కలు రుద్దుకు పోయాయి, బండి చెక్కలు పగిలి అంతటా ముదులు, బుడిపెలతో ఉన్నాయి. జారి పోకుండా ఉండటానికి కాళ్లు పక్కలకు తన్ని పెట్టి, బండి పార్శ్వాలను పట్టు కొన్నాడు "ఎరువులు అంటే ఒకరకమైన బలం అనుకొంటాను" అని చెప్పాడు హరి, బండి వానితో ఆవుపేడ మిశ్రిత ఎరువు లాంటిది. కాని భిన్నమైనవి, మనం కొను క్కోవాలి" అన్నాడు.

"అవునవును, నిజమే ఇప్పుడు మనకు అన్ని సిద్ధంగా తయారు చేసినవి దుకాణం నుండి రావాలి, నూలు తీయటం లేదు; యింటిలో గోధుమలు విసరటం లేదు ఆవుపేడతో పిడకలు చేయటం లేదు, మిశ్రిత ఎరువు తయారు చేయటం లేదు. ఈ క్రొత్త రోగం ఏమిటో? అది మాత్రం ఖరీదైంది" అంటూ బండి వాడు అసంతృప్తిగా అన్నాడు. అలా అనటంలో దృఢమైన భావాలను వ్యక్తం చేయటం కంటె రాత్రి పూట తన మాటలను తానే వినాలనుకొని మాట్లాడు తున్నట్లుంది. అతనికంతం నీరసంగాను నిద్రమత్తులోను మాట్లాడుతున్నట్లుంది.

"బహుశ అది యిప్పుడు చాలదు," అన్నాడు హరి. వెనుదిరిగి సమాధానంగా " సరిపోదు, సరిపోదు," అంటూ హరి మాటతో అంగీకరించాడు బండివాడు.

"ఏదీ సరి పోదు, ఇప్పుడు భూమి మీద చాలా మంది మనుషులం ఉన్నాం అందరికీ సరిపడే వంట చెరకులేదు. సరిపోయే ఆహారం లేదు, సరిపోయినన్ని ఉద్యోగాలు లేవు - పాఠశాలలుగాని, వైద్యశాలలుగాని, రైళ్లుగాని, బస్సులుగాని, యిళ్లుగాని, లేవు ఉన్నా సరిపోయేవి లేవు, మనుషులు చాలామంది ఉన్నారు. పంచు కోవాడానికి సరిపడినంత భూమిలేదు. ఇంతకు ముందు అట్లా కాదు. అంటూ అతను నిట్టూర్చి, భుజాలు వంచి గడ్డాన్ని వక్షస్థలం మీదికి వంచి, కళ్లు మూసుకొని, పొలాల్లోంచి, తిన్నగా పోతున్న రోడ్డు మీద బండిని పోనిచ్చాడు."

కొంత సేపటి వరకు బండి క్రింది వైపు వెన్నెల కాంతిలో ప్రవాహంలాగున్న

తెల్లని దుమ్ముతో నిండిన రోడ్‌ను, చలికాలంలో కోతకువచ్చే గోధుమ పంటను కోయటం వల్ల యిరువైపులా ఖాళీగా ఉన్న పొలాలను, కంకేశ్వర్ కొండల మీదుగా ఉదయించిన చంద్రుని కాంతిలో, భూతాల్లాగా ఉన్న, కోసిన పంట దుబ్బులను చూస్తూ కూర్చున్నాడు, బండి దగ్గరవు తూంటే తీతువు పిట్టలు, కర్కశంగా అరుస్తూ రోడ్డు మీద ఎగిరి పోతున్నాయి. చీకటిలో గుడ్లగూబలు అరుస్తూన్నాయి. అప్పుడప్పుడు వాళ్లు పొలాల్లో వేసిన నల్లటి పెద్ద గుడారాల వలే ఉన్న మామిడి తోపుల ప్రక్కగా, గుడ్డిగా వెలుగు తున్న లాంతరున్న దుకాణం ప్రక్కగా ప్రయాణం చేసారు. అలాంటి పాకల్లో ఒకదాన్లోంచి కుక్క ఒకటి బయటకు దూసుకువచ్చి, పిచ్చిగా మొరుగుతూ, కొంత సేపటివరకు బండి ప్రక్కగా పరుగెత్తింది. ఆ తరువాత అది వెనక్కు వెళ్లి పోయింది. నిర్మాణంలో లోపం ఉన్న ఆ బండి రోడ్డు మీద కిర్రుమంటూ ముందుకు పోతున్న శబ్దం తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడు హరి పండు కొని, నిద్ర పోయాడు.

రేవాస్ లో పడవలు ఆగేస్థలం వద్ద అతనిని వదలి వేయటంతో ఆ స్థలం జనంతో నిండి ఉండటం చూచి ఆశ్చర్య చకితుడయ్యాడు. ఇంత మంది బొంబాయి వెళ్తారని అతను అనుకోలేదు, అతను తాను చాల సాహసంతో కూడిన పని చేస్తున్నానని అనుకొన్నాడు - వాస్తవంగా చెప్పాలంటే, అతనికి ఉత్తేజంతోను. భయంతోను కంపించి పోతునట్లనిపించింది. కాని యిక్కడ, అన్ని - వయసుల్లోను, ఎత్తుల్లోను, పెద్దవాళ్లు, కుర్రవాళ్లు ఉన్నారు. వాళ్లు పరి శుభ్రమైన దుస్తులు వేసుకొని, బల్లపరుపుగా కాఫీరంగు సముద్రంలోకి చొచ్చుకు పోయిన పడవలు ఆగే ప్రదేశం పొడవునా నిలబడి, ఒకర్నొకరు పలుకరించు కొంటూ నవ్వుతున్నారు. అక్కడ చేపలు వేటాడే పడవలు అలల మీద పైకి క్రిందికి తీవ్రంగా ఊగుతున్నాయి. అక్కడ చేరిన జనం పడవల్లోకి ఎక్కేందుకు వేచి ఉన్నారు.

ఆలీబాగ్ నుండి వచ్చిన నిర్వాహకుడు అదార్కర్, అక్కడ చేరిన జనసమూహం పడవల్లోకి ఎక్కుతుంటే మెట్ల మీద నిలబడి ఆజ్ఞలు జారీచేస్తున్నాడు. హరి కూడ పడవ ప్రయాణానికి టిక్కెట్లు అమ్మే స్థలం ప్రక్కగాను ప్రయాణంలో ఉపయోగించు కొనేందుకు జనం అరటిపండ్లు, కమలాపండ్లు కొంటున్న పండ్ల విక్రయశాల ప్రక్కగా యింకా ఖాళీగానే ఉన్న బల్లల ప్రక్కగాను, అక్కడి నుండి పడవలు ఆగే స్థలం అంచువరకు, తరువాత మెట్ల మొదటి - భాగానికి మెల్లగా చేరు కున్నాడు. తాను చేపలను

వేటాడీ, తుళ్ గ్రామానికి చెందిన వాడైనప్పటికి పడవలో ప్రయాణం చేసి చాలా కాలం అవటంవల్ల హరి సందేహించాడు. ఆ తర్వాత అతను, "పదండి, పదండి, మీరు మీగ్రామం కొరకు, మీజీవనోపాధి కొరకు పోరాడాలని ఉంటే పడవ ఎక్కండి" అంటూ అదార్కర్, బిగ్గరగా చెప్పటం విన్నాడు. అప్పుడు హరికి ఇరువైపులా ఉన్న జనం తనను నెట్టటంతో తన ప్రమేయం లేకుండానే అక్కడ ఉన్న పడవల్లో ఒకదానిలో కూలబడ్డాడు.

సూర్యుడుదయించి కాంతి హీనంగా ఉన్న సముద్రాన్ని నెమలిపింఛం రంగులోకి, మరకతపు ఆకుపచ్చ రంగులోకి మారుస్తూ దూర తీరంలోని బొంబాయి నగరంపై తన వెలుగును ప్రసరింప జేసి యిసుకతోనో, ఉప్పుతోనో నిర్మింపబడిన తెల్లని కోటలాగ మార్చి, వెచ్చని, నీలి ఆకాశం క్రింద మిరి మిట్లు గొలిపేలాగా మారుస్తున్నా సమయంలో పడవలన్నీ జనంతో నిండిపోయి. అలల మీద ఎగురు తున్న - డాల్ఫిన్ చేపల్లాగ ప్రయాణ మౌతున్నాయి.

రేవాస్ నుండి బొంబాయికి పధ్నాలుగు కిలో మీటర్లుంది. ఈ పధ్నాలుగు కిలో మీటర్ల దూరమూ, వ్యవసాయ దారులు, జాలరులు, కేకలు వేస్తూ, పాటలు పాడు తూనే ఉన్నారు. వాళ్లంతా చాలా ఉత్సాహంగా ఉన్నారు. వాళ్లు తమ గ్రామాలను వదిలివేసి, సాధారణంగా ఒక రోజు కూడా పని మానరు. అందువలన ఆప్రయాణం వాళ్లకు అరుదైన ప్రయాణంలా తోచింది. అదిచాల వరకు సెలవు దినంలాగాతోచింది. వాళ్లు బొంబాయి ఎందుకు వెళుతున్నది జ్ఞాపకం చేస్తూ అదార్కర్, మాటి మాటికీ కేకలు వేస్తున్నాడు. అలా అరుస్తూ ఉండటంతో అతనిగొంతు బొంగురు పోతోంది. అప్పుడు అతనితో పాటు ఉన్న వృద్ధ జాలరి ఒకడు ధోవతి మీద ధరించిన, చెమటతో తడిసిన చొక్కా పట్టుకొని లాగి "కూర్చోబాబు, కొంచెం సేపు కూర్చో" బొంబాయిలో ఎలాగూ అరవవలసి ఉంటుంది. కాబట్టి సేద దీర్చుకో. మనం బొంబాయి చేరిన తరువాత నగరంలో ప్రతి వ్యక్తికి వినపడేంత పెద్దగా మేము అరుస్తాం నీకాభయం అవసరం లేదు, కూర్చొని కొంచెం సేపు విశ్రాంతి తీసుకో. మన సోదరుడు త్రాగటానికి కొంచెం టీ తీసుకురండి," అంటూ పడవలోని మనుషులను ఉద్దేశించి అన్నాడు. వాళ్లలో ఒకడు మట్టి కప్పు తెచ్చాడు. ఆ కప్పులో ఉన్న టీ యింతకుముందే ఒలికి పోవడం వల్ల సగం మాత్రమే ఉంది. వాళ్లు దాన్ని కూర్చుని ఉన్న వాళ్ల నాయకునికి అందించటంతో, అతను కృతజ్ఞతలు తెలిపి, త్రాగాడు. మరొకడు బత్తాయి తీసి వొలిచి, తొనలను అందించాడు. దానికి అతను కృతజ్ఞతలు తెలియజేసి వాళ్ల సలహా పాటించాడు.

హరి పడవలు నిలిచే ప్రదేశంలో పండ్లూ కొనలేదు, టీ త్రాగలేదు. రాత్రి యింటి నుంచి బయలు దేరినప్పుడు తినటానికి ఏమీ తెచ్చు కోలేదు. అందువల్ల అతను పడవలో మౌనంగా కూర్చొన్నాడు, అతని గురించి ఎవరూ పట్టించు కొనలేదు. తాను ప్రయాణంచేస్తున్న పడవలో తుళ్ గ్రామం వాళ్లు ఎవరూలేరు; ఆపడవలో తీరం వెంబడి ఉన్న గ్రామాలకు చెందిన అపరి చితులు ఉన్నారు. తనకు బాధవేసింది. కోపం వచ్చింది. అది వరకు లాగే తుళ్‌లో మరొక్క రోజు కూడా జీవించలేని స్థితికి చేరు కొన్నాడు. దారిలో ఆలోచించకుండా, తాను ఈప్రయాణానికి సిద్ధం అయ్యాడు అందు వల్ల భయపడుతూ కూర్చొన్నాడు. మార్పుకు సమయం వచ్చిందని అతను భావించాడు. ఇన్ని రోజులుగా సుదీర్ఘంగా ఆలోచించిన విధానానికి అనుగుణంగా తాను ఆమార్పును ప్రారంభించాలి. తానేమైనా పొరపాటు చేసాడా?

అయినా వెనుదిరిగే ప్రశ్నేలేదు. దీన్నుండి బయట పడాలంటే సముద్రంలోకి దూకి యీదుతూ యింటికి చేరటం తప్ప మరోమార్గం లేదు. బొంబాయి చేరిన తరువాత తాను అక్కడే ఉండిపోయి, పనిచేసి, డబ్బు సంపాదించవలసి ఉంటుంది. తాను దానికి సిద్ధంగా ఉన్నాడా? ఆ విషయంలో తాను అనిశ్చితంగా ఉన్నాడు. అపుడు అతను వెనుదిరిగి బల్ల పరుపుగా చిత్తడిగా ఉన్న రేవాస్ తీరం వైపు చూచాడు, అది తనకు అందుబాటులో లేనంత దూరంలో ఉంది. అతను మోకాళ్ల మీద తల ఆనించి నిరుత్సాహంతో కళ్లు మూసుకున్నాడు.

"ఆ అబ్బాయిని చూడండి" అన్నాడొకవ్యక్తి. "ఇతను ఎవరబ్బాయి? నీకు తింటానికి ఏమీ లేదా బాబూ? ఇదుగో, యిది తీసుకో," అంటూ అతనికి, ముక్కోణంగా మడిచిన చల్లని, ఎండి పోయిన చపాతీ ఒకటి అందించాడు. తన గొంతు ఎండి పోయినట్లున్నప్పటికీ హరి దాన్ని తీసుకున్నాడు. అతను దాన్ని తినటంగాని, మింగటంగాని సాధ్యంకాదు, అని భావించాడు. అయినా మర్యాద కొరకు దాన్ని కొరకటంతో అతనికి కొంత ఆహారం లభించి కొంచెం సత్తువ వచ్చినట్లు అనిపించింది.

ఆ రోజు తన జీవితంలో అత్యంత శ్రమ పూరితమైంది కావటంవల్ల అతనికి ఆ ముక్క అవసరమైనట్లు తోచింది.

వాళ్లు ప్రయాణించే పడవల్లోంచి, చమురుతో పచ్చగా నున్న అలల మీదుగా దూరంగా కనిపిస్తున్న బొంబాయి నగరాన్ని చూడటంతో హరిలో సంభ్రమంతో కూడిన మౌనం నెలకొంది. బాగా సమ్మర్ధంగా ఉన్న పడవలోచాలా దూరం ప్రయాణం చేసిన తరువాత సాసూన్ ఓడరేవులో పడవ దిగు తున్నప్పుడు

హరికి ఒళ్లుంతా నెప్పులు పెడుతూ, బిగుసుకొని పోయినట్లున్నప్పటికీ కొంచెం సేపునిలబడి పరికించాలన్నా, అందుకు సమయమూ తీరికా లేదు, తనతోటి ప్రయాణీకులు తన ప్రక్కగా నెట్టు కొంటూ త్రోసుకొంటూ వెళ్తూండటంతో తనను గూడా వాళ్లతో పాటు నెట్టి వేయటం జరిగింది. ఓడరేవుకు చేరుకొన్న బొంబాయి జన సమూహాలు వాళ్లను నెడుతూ, త్రోయటంతో, వాళ్లు కూడా నెట్టుకొంటూ, త్రోసుకొంటున్నారు. ఆ ప్రదేశంలో గుమికూడిన జనం ఏదోపనిని చేయించుకోవాలనే తొందరలో ఉన్నారు. హరితో పాటు వచ్చిన గ్రామస్థులు ఎన్నడూ అంతమంది జనాన్ని చూడలేదు. జనం చాల తొందరలో ఉన్నారు. హరి అలా నెట్టి వేయబడకముందు స్వల్పకాలం పాటు తన కళ్లచివరల నుండి ఓడరేవులో లంగరు వేయబడిన ఆవిరి ఓడల ఎత్తైన పార్శ్వాలను, పెద్దపెద్ద బేళ్లను ఎత్తి, దించుతున్న క్రేన్లను, పెద్ద పెట్టెలను మోస్తూ చొక్కాలు తొడుక్కోకుండా చెమటోడ్చుతూ బుట్టలను, పెట్టెలను తలలమీద, భుజల మీద మోస్తూ, ఆ పనిని త్వరితంగా చేయటంలో మూలుగుతున్న పని వాళ్లను చూసాడు. అలాగే తన గ్రామంలో, గడ్డి మట్టి, చేపపొలుసులతో ప్రమాదకరంగా జారుడుగా మారిన నేలమీద, తాము కట్టు కొన్న గులాబీ, ఆకుపచ్చరంగుల చీరెలను కాళ్లమధ్య ఎగదోపి, మెరుస్తూ, జారిపోతున్న చేపలతో నిండిన తట్టలను చేపలు పట్టే పడవలనుండి మార్కెట్‌కు తీసుకుపోతూ పరుగెత్తుతున్న జాలరిస్త్రీల లాంటి స్త్రీలను చూసాడు. ఈ శబ్దాలకు తోడు చిరపరిచితమైన సముద్రపు వాసన చేపలవాసన తోపాటు, నగరానికి సంబంధించిన వాసన కూడా మిళితమై ఏదోవింత వాసన వెలువడు తోంది. ఇంకా నగరానికి సంబంధించిన శబ్దాలతో పాటు బిగ్గరగా, ప్రతిధ్వనిస్తున్న జాలరుల స్వరాలు వినిపిస్తున్నాయి. తుళ్‌లో అరుదుగా మాత్రమే వినిపించే రాకపోకల శబ్దాలు ఇక్కడ అధికస్థాయిలో ఉన్నాయి.

అటు పిమ్మట వాళ్లు బయటకు వెళ్లే మార్గం ద్వారా బయటకు చేరి వీధిలోకి రావటంతో అధిక రద్దీలో చిక్కుకున్నారు. ఆక్షణంలో ఆ వీధిలో చూసినంత రద్దీ హరి తన జీవితంలో చూడలేదు. తుళ్ గ్రామంలో ప్రధాన రహదారి మీదుగా జాతీయ మార్గంవైపు అప్పుడప్పుడు వెళ్లేబస్, చాలా అరుదుగా దుమ్ము కొట్టుకొన్న కారు ఒకటి మాత్రమే కనిపించేవి. తాను అలీబాగ్ వెళ్లి నప్పుడు ప్రధానంగా సైకిల్ రిక్షాలు, వాటి తోపాటు బస్‌లు, లారీలు, కనిపించేవి. కాని యిక్కడ సైకిళ్లు, రిక్షాలు, చేతులతోలాగే బండ్లు, టాంగాలు, బస్సులు, కార్లు, టాక్సీలు, లారీలు తన ప్రక్కన, చుట్టూరాను,

హారన్ మోతలతో కీచుమంటూ బిగ్గరగా ధ్వనులు చేస్తూ వెళ్తాంటే, ప్రపంచాలలోని రద్దీ అంతా బొంబాయి వీధుల్లోనే ఉన్నట్లు. అన్ని ఒకేసారి కనిపిస్తున్నాయి. అతను భయం కొద్దీ తన ప్రక్కనున్న వ్యక్తి చేయి పట్టుకొని, ఆ వ్యక్తి తుళ్ గ్రామానికి చెందిన మాహే అన్న రైతు అని తెలుసు కొని, ఉపశమనం పొందాడు.

"త్వరగా నడుపు తమ్ముడూ - ఆగిపోకు రా మనం - నల్లగుట్టం, దగరకు వెళ్లాలి," అన్నాడు మాహే వగరుస్తూ. వాళ్లిద్దరూ కలిసి రద్దీని తప్పించుకొంటూ, తిన్నగా పెద్ద రెండంతస్తుల ఎర్రని బస్‌కు అతి సమీపంగా వెళ్లటంతో ఆ బస్సుకీచు మంటూ నిలిచి పోయింది. బస్‌డ్రైవర్ కిటికీలోంచి వంగి చూచి వాళ్లను కేకలు వేసాడు. వాళ్లు వణికి పోతూ స్తంభించి పోయారు.

అప్పుడు బొంబాయి పోలీసులు ప్రత్యక్షమయ్యారు. బొంబాయి పోలీసులు చాలా ప్రసిద్ధులు, వాళ్లు తమ లాఠీలూపిగాని, యీలలూదేసాధనంతోగాని రద్దీని ఆపివేయగలరు; ఒక మార్గం మీదుగా ముందుకుగాని, వెనుకకుగాని పంపించగలరు; ఊరేగింపులను నియంత్రించగలరు. ఆలీబాగ్ నుండి వచ్చిన ఈ జాలరులవలె జన సమ్మర్దంతో నిండిన యీనగరంలో ప్రదర్శన కారులను ఒకే చోట నిలబెట్టగలరు.

"ఎక్కడి నుండి వచ్చావు, మూర్ఖుడా?" అని పోలీసు హరిని కేకలు వేసాడు. "ఎప్పుడు రద్దీకి సంబంధించిన దీపాలు చూడ లేదా? వీధి నెలా దాటాలో తెలియదా? తిన్నగా పనికి మాలిన పొలాలనుండి వచ్చినట్లున్నావు అవునా?" అన్నాడ తను.

"ఇతన్ని అక్కడికే పంపించండి - గుమ్మడికాయలు పండించుకోమనండి యిలాంటి వాళ్లను బొంబాయి వీధులకు దూరంగా ఉంచండి," అనిబస్ డ్రైవర్ - కోపంగా అరిచాడు.

ఆమాటలకు పోలీసు వాడు నవ్వి, బస్‌ను ఆపివేయటానికి చేయిఎత్తి ప్రదర్శనకారులు రోడ్ దాటేందుకు చేయి ఊపాడు.

"మేము ఆలీబాగ్ నుండి వచ్చిన వ్యవసాయదారులం, జాలరులం," అన్నాడు. మాహే, అక్కడినుండి కదలటానికి ముందు, ప్రశాంతంగా. "మేము ముఖ్య మంత్రితో మాట్లాడటానికి వచ్చాం," అన్నాడు.

"అలాగే మాట్లాడండి," అన్నాడు పోలీసు. "అలాగే మాట్లా డండి ఆయన మీ అందరికోసం టీలు, పూలదండలు, మిఠాయిలతో ఎదురు చూస్తున్నాడు," అంటూ అతను మరోమారు పగలబడినవ్వాడు. అలానవ్వుతూ

బస్ డ్రైవర్‌ను చూసి, కన్నుగీటి, వాళ్లు కదలి పోయేందుకు కీచుమంటూ యీల ఊదాడు. హరి అతని సహచరుడు, నొచ్చుకొని, బాధపడుతూ ముందుకు కదలి పోయారు.

"ఈ బొంబాయి లోని వాళ్లు ఈ ప్రపంచంలోని వాళ్లందరి కంటే మొరటు వాళ్ళు" అన్నాడు, మాహే మెల్లగా. దానికి హరి కూడ అంగీకార సూచకంగా తల ఊపాడు.

ఇవి ఆరోజుకు సంబంధించిన మొదటి పరిహాసాలు. వాళ్లు అద్భుతమైన. 'నల్ల గుఱ్ఱం' వైపు వీధుల గుండా నడచి పోతూండగా యిలాంటివె మరెన్నోవినవలసి వచ్చింది. పది అంతస్తులు, ఇరవై అంతస్తులుతో ఎత్తుగా ఉన్న భవనాల వంక, పెద్ద దుకాణాల వంక భయం, భయంగా చూస్తూ నడుస్తున్నాడు హరి. ఈ పెద్ద భవనాల కిటికీలు వాళ్ల ఊళ్లో ఉన్న పూరిళ్ల కంటె పెద్దవిగాను, వాటి కంటె ప్రకాశ వంతంగాను ఉన్నాయి. సముద్రం లోని చేపల కంటే అధికసంఖ్యలో వీధుల్లో సమ్మర్ధంగా ఉన్న జనం ప్రక్కగానడచి వెళ్తూ "నల్ల గుఱ్ఱం" గురించి ఆలోచిస్తున్నాడు, హరి. ఈ అద్భుతమైన నగరానికి ఓ పెద్ద నల్ల గుఱ్ఱం దేవత లాగానో, దేవుని లాగానో ఉందా? అది చుట్టు పక్కల ఎక్కడైనా కనపడు తుందేమోనని కుతూహలంతోను, ఆదుర్దాగాను చూసాడు. కాని అతనికి జనం, భవనాలు, రద్దీ కనిపించటం జరిగింది. హారన్‌ల మ్రోత, కార్లు అటూ యిటూ వెళ్తున్న శబ్దం, రెండంతస్తుల పెద్దబస్‌ల శబ్దం, టాక్సీలు, కార్ల శబ్దం మాత్రమే వినిపించింది. జనం తన ప్రక్కగా మార్కెట్‌కు ఉపయోగించే సంచులు, చేతిసంచులు, చిన్న సూట్‌కేస్‌లు పట్టుకొని, గొణుక్కుంటూ, త్రోసుకుంటూ వెళ్తున్నారు. "మమ్మల్ని నిలిపి వేయటానికి యిక్కడ మరో ఊరేగింపు తటస్థమైంది." "ఈ అరుపులు కేకలు దేనికొరకు? మాకు బస్ తప్పిపోతుంది. పనికి ఆలస్యం అవుతాం ఏయ్, నాదారి నుండి తప్పుకో," అన్నాడొకతను.

మరో ప్రదర్శనకు సంబంధించిన ఊరేగింపు, వాళ్ల ఊరేగింపుకు ముందుగా వెళ్లటంతో, హరి వాళ్లు ఆగిపోయి, అది వాళ్లను దాటి వెళ్లేంతవరకు వేచిఉండవలసి వచ్చింది. ఆ ఊరేగింపులో వ్యక్తులందరు స్త్రీలు కావటం హరికి పూర్తిగా ఆశ్చర్యం వేసింది. వాళ్లు జెండాలు పట్టుకొని, బిగించిన పిడికిళ్లు గాలిలోకి ఎత్తి "ధరలు తగ్గించండి! మాకు నూనెలు కావాలి! పంచదార కావాలి మాకు చౌకధరలో బియ్యం కావాలి! స్త్రీల స్వేచ్ఛాన్యాయ సమాజం వర్ధిల్లాలి," అంటూ నినాదాలు చేస్తున్నారు. తర్వాత స్త్రీలందరూ

ఒకే కంఠ స్వరంతో "జై!" అంటూ, ముందుకు సాగిపోతున్నారు. ఆ ఊరేగింపు అగ్రభాగంలో పండు జుత్తు స్త్రీ ఒకామె ఉంది. ఆమె తన పిడికిలి ఊపకుండా, కొయ్య అప్పడాల కర్రను గాలిలో ఊపుతోంది. మిగతా వాళ్లు నవ్వుతూ, ఆమెను అలా చేయటాన్ని ఆనందంగా ప్రోత్సహిస్తున్నారు. కొంత మంది వంట పాత్రలను పట్టుకొని వాటిమీద, పొడవుగా ఉన్న కొయ్య తెడ్లతో కొడుతూ పెద్ద శబ్దం చేస్తూ పూర్తిగా ఆనందిస్తున్నట్లు కనపడు తున్నారు.

హరి, ఆలీబాగ్ నుండి వచ్చిన ఇతర గ్రామస్థులు, ఆశ్చర్యంతో నోళ్లు తెరచి అలా నిలబడి పోయారు. వాళ్లు తమతోపాటు ఒక్కస్త్రీని కూడా తీసు కొని రాలేదు; వాళ్లు స్త్రీలు అవసరమని భావించ లేదు; వాళ్లు పురుషులే అన్ని విషయాలు నిర్వహించుకోగలరని, స్త్రీలు ఇబ్బంది కరంగా ఉంటార ని భావించారు. ఇక్కడ బొంబాయిలో స్త్రీ లు, తమ వ్యవహారాలను పురు షులు నిర్వహించగలరనే విషయంలో నమ్మకం లేనట్లు, వాళ్లను నమ్మ కుండా తమ విషయాలను తామే నిర్వహించు కోవటానికి నిర్ణయించుకొన్నట్లు కనిపిస్తోంది. ఈ భావం హరికి వింతైన నూతన భావంగా తోచటంతో అత ను, ఆస్త్రీ లు వెళ్లిన తరువాత విరిసిన నవ్వులుగాని, హాస్యోక్తుల్లోగాని పాల్గొ నకుండా అతని తల్లి, లీల, యీ విషయం వింటే ఏమి అనుకుంటారో అను కొంటూ గంభీరంగా నడుస్తున్నాడు.

ఈ సమయానికి పోలీసు వాళ్ళు హరి, అతనితో పాటు వచ్చినవాళ్లకు యిరువైపులా నిలబడి లాఠీలూపుతూ, వాళ్లందరినీ వరుసల్లో నిల్చోబెడు తున్నారు. పోలీసు వాళ్లు యిలాంటి ప్రదర్శనలకు అలవాటు పడిపోయి, వాళ్లను ఎలా అదుపు చేయాలో, ఎలా నిర్దే శించాలో ఖచ్చితంగా తెలిసిన ట్లుంది. వాళ్లను ఓ పెద్ద కూడలి చుట్టూ నడిపిస్తున్నట్లు హరి గ్రహించాడు. కూడలి చుట్టూ పెద్ద గుమ్మటాలున్న భవనాలు, వాటిచుట్టూ ఉద్యాన వనా లు, చెట్లు ఉన్నాయి. "చూడండి, చూడండి వస్తు ప్రదర్శన శాల" అని ఒక వ్యక్తి అరిచాడు.

"మనం దాన్ని చూడటానికి వీలవుతుందా?" అంటూ మరోవ్యక్తి ఉత్తేజంగా అరిచాడు. కాని వాళ్లకు ఆ అవకాశం లేదు. వాళ్లను, పెద్ద, పెద్ద పురాతనమైన కార్యాలయ భవనాలున్న కూడలి వైపు నడిపించుకు పోతున్నారు. ఆకూడలి మధ్య ఖాళీ దిమ్మె ఉంది. "నల్ల గుఱ్ఱం," "నల్లగుఱ్ఱం" అంటూ ఎవరో- అరవటం హరి విన్నాడు. "ఎక్కడుంది?" అని అతను అడిగాడు. "నీకు తెలియదా?" అని మరొక వ్యక్తి అడిగాడు బ్రిటిష్ వాళ్లు ఈ దేశం నుండి

వెళ్లి పోయినప్పుడు దాన్ని తొలగించారు - బొంబాయి ప్రజలు స్వాతంత్ర్యం తరువాత విదేశీ పరిపాలకుణ్ని - రాతి రూపమైనా చూడదలుచుకోలేదు. "హరి గుఱ్ఱం - మీద కూర్చొని ఉన్న చక్రవర్తిని చూడటానికి బాగా యిష్టపడేవాడు." అందువలన అతను నిరుత్సాహంతో, "అయ్యో," అన్నాడు. అతను ఖాళీ దిమ్మెను చూస్తూ, దానిమీద నల్లగుఱ్ఱాన్ని ఊహించుకొంటూ, నిశ్చలంగా నిలబడ్డాడు. ఇంతలో గ్రామస్థుల్లో యితర సభ్యులు అతని ప్రక్కకు వచ్చి నిలబడ్డారు. వాళ్లు ఎందుకు వచ్చారు, లేక వాళ్లు అక్కడేమి చేస్తున్నారు. అన్న విషయాన్ని గురించి ఖాతరు చేయకుండా రాకపోకలు వాళ్ల చుట్టూ సాగిపోతూనే ఉన్నాయి.

అక్కడ ఉన్న దిమ్మె ప్రక్కన, ఒక కొయ్య వేదికను అమర్చటం జరిగింది. సన్నగా, తెల్ల గడ్డం ఉన్న వయోధికుడు ఆవేదిక మీదికి ఎక్కాడు. అతను ఆలీబాగ్ మనుష్యులకు అపరిచితుడు. అతను శబ్ద విస్తరణ సాధనాన్ని తన నోటి దగ్గర ఉంచుకొని మాట్లాడటం ప్రారంభించాడు. హరి రద్దీని, మ్రోగుతున్న హారన్‌లను అటూ యిటూ తిరుగుతున్న వాహనాలను పట్టించుకోకుండా, అతని ప్రసంగంలోని కొన్నిమాటలను వినటానికి ప్రయత్నించాడు.

"నాకు మీజీవిత విధానం పట్ల నమ్మకం ఉంది. కాబట్టి మీపచ్చని పొలాలు, సముద్రమూ మీకెంత విలువైనవో మాకూ అంతే విలువైనవి కాబట్టి, నేను మీతో మాట్లాడటానికి, మీతరపున మాట్లాడటానికి యిక్కడికి వచ్చాను. మనచెట్లు, చేపలు, పశువులు, పక్షులు, రక్షింపబడాలి..." అన్నాడతను.

అతను ఎవరో, ఎందుకు అలా ఉద్రేకపూరితంగా మాట్లాడు తున్నాడో, హరికి అర్థంకాలేదు. అతను స్వచ్ఛంగాను, శుభ్రంగాను, చదువు సంధ్యలున్న నగరవాసిలాగా కనిపిస్తున్నాడు. ఎండలోను, దుమ్ములోను, మొరటుపనికి అలవాటు పడిన గ్రామవాసిలాగా కనిపించటంలేదు. అయినప్పటికీ అతను చేపలు, పశువులు, చెట్లను గురించి బాధతోను, ఆందోళనతోను, ఆవేశపూరితంగాను, మాట్లాడటం జరిగింది. అతను ఎందుకు యింత శ్రద్ధ చూపుతున్నాడు?"

అతను హరి ఆలోచవలను విన్నట్లుగా. "బొంబాయి పౌరుడినైన నేను గ్రామాలకు చెందిన నాసోదరులతో కలిసి, వాళ్ల విషయాలను గురించి ఎందుకు మాట్లాడు తున్నానని, మీరు ఆశ్చర్యపడవచ్చు. మీగురించి నేను మాట్లాడటాన్ని మీరు నమ్మకపోవచ్చు. ఒక విధంగా చూస్తే, నాకు స్వార్థపరమైన కారణాలున్నాయి కాబట్టి మీ ఊహసరియైంది కావచ్చు. బొంబాయి పౌరులందరూ

యీ విషయాన్ని గురించి ఆందోళన పడుతున్నారు. తుళ్-వైషట్‌లో నెలకొల్పబడే యీ కర్మాగారాలు ప్రాణాంతకమైన రసాయనాలను గాలిలోకి విసర్జిస్తాయి. చుట్టు ప్రక్కల మైళ్ల కొలదీ గాలిని కలుషితం కాకుండా ఎరువులను తయారుచేయటం జరుగదు. సల్ఫర్‌డై ఆక్సైడ్, అమ్మోనియా దుమ్ము విశాల ప్రాంతంమీద విరజిమ్మబడతాయి. ఇటీవలే అధికారంలో ఉన్న ప్రభుత్వం, పెద్ద నగరాలకు ఏభైమైళ్ల పరిధిలో ఎరువుల కర్మాగారాలు నెలకొల్పరాదనే నియమాన్ని విధించింది. అయితే రేవాస్, బొంబాయి నుంచి ఎంత దూరంలో ఉందో మీకు తెలుసు; విహంగ మార్గంలో చూస్తే పధ్నాలుగు కిలోమీటర్ల దూరం మాత్రమే ఉంది. ఇప్పటికే బొంబాయిలో భారీగా పారిశ్రామికీకరణ జరిగింది, జన సమ్మర్ధమూ, కాలుష్యమూ ఉన్నాయి. మనం ఇంకా ఎంత కాలుష్యాన్ని తట్టుకోగలం? జపాన్లో సేంద్రీయ పాదరసం సముద్రంలోకి పంపించటంతో అది చేపలకు విషంగా పరిణమించి వాటిని తిన్న దురదృష్ట వంతులైన జనానికి విషపూరితంగా పరిణమించటం మీకు తెలుసా...?" అన్నాడు.

హరి ఆ మాటలు వినటానికి ప్రయత్నించాడు, కాని అపరిచితమైన రద్దీకి సంబంధించిన శబ్దాలు అతని ఏకాగ్రతను భంగం చేసాయి. అతను కార్లు, బస్సులు తిన్నగా తన మీదికే వస్తున్నట్లు, తాను జాగ్రత్తగా చూసుకొనకపోతే వాటి క్రింద పడిపోవటం తధ్యం అని భావించాడు. అతను అసౌకర్యంగా అటూ యిటూ కదిలాడు, అతని చుట్టూ ఉన్న మనుష్యులు తన మీదికి త్రోసుకుంటూ వచ్చి తన తల మీదిగా పరస్పరం సంభాషించు కొన్నారు. ఉపన్యాసకుని ఉన్నత విద్యాభ్యాసంతో కూడిన ఉచ్చారణను అర్థం చేసుకోవటం కష్టమనిపించింది, హరికి.

"మీరు వ్యవసాయాన్ని, చేపలు పట్టటాన్ని వదలి వేయవలసి వస్తే మీ గ్రామాన్ని వదలి, బొంబాయి వచ్చి, పని చూసుకోవలసి ఉంటుంది." అంటూ అతను చెప్తున్నాడు. "మీరు యిప్పుడు ఇక్కడకు వచ్చారు కాబట్టి నగరాన్ని చుట్టూరా చూడండి. అదనంగా ఇరవై వేలమందినుండి. ఏభై వేల మంది వరకు ఉండటానికి జాగాఉందా? చాలినన్ని ఉద్యోగాలు, యిళ్లు ఉంటాయని మీరు భావిస్తున్నారా? పేదవాళ్లు, నిరుద్యోగులు, ఎలా నివసిస్తున్నారో చూడండి. మీరు గ్రామ ప్రాంతంలో మీ వరి పండించే పొలాలు, కొబ్బరి తోటల మధ్య గడిపే జీవితాన్ని, నగరంలో కాలి బాటల మీద జీవించే బిచ్చగాళ్ల జీవితం కొరకు వదులు కోవాలని కోరు కొంటున్నారా?

ఆమాటలకు హరి కంపించి పోయాడు. అతను, గడ్డం పెంచుకొన్న ఆవ్యక్తి

తనతోనే మాట్లాడు తున్నట్లు, తననే ప్రశ్నిస్తున్నట్లు భావించాడు. ఇతనికి ఎలా తెలిసిందా అన్నట్లు అతను ఆశ్చర్యంతో నోరు వెళ్ల బెట్టాడు. హరి యిక్కడ పని చూసుకోవడానికి వచ్చాడని అతనికి ఎలా తెలిసింది? హరి ఎవరికీ చెప్పలేదు. తనమనసే తనకు పూర్తిగా తెలిసినట్లు లేదు. కాని యీఉపన్యాసకుని గురించి తనకు తెలిసిన దానికంటె ఎక్కువ తెలిసినట్లుంది. తన ప్రక్కన నిలబడి నోరు తెరచి వింటున్న మాహేను "ఎవరతను?" అని అడిగాడు హరి.

"సయ్యద్ - అతని పేరు సయ్యద్ ఆలీ, అని చెప్తున్నారు. అలాగన్నారు." అన్నాడు, మాహే. "రాజకీయ నాయకుడు కాదు, మనతో మాట్లాడడానికి యితనిని ఎందుకు ఆశ్రయించారో తెలియదు."

"అతను బాగా మాట్లాడుతున్నాడు, చాలా బాగా" అన్నాడు హరి. తర్వాత అతను అక్కడ చేరిన జనానికి వంగి నమస్కరించి, వేదిక నుండి దిగి రావటంతో, రంగు వెలిసిన చొక్కా వేసుకొని, సన్నని ఫ్రేమ్ ఉన్న కళ్ళ జోడు పెట్టు కొన్న పొట్టి వ్యక్తి ఒకతను అతి జాగ్రత్తగా అతని స్థానంలో నిలబడ్డాడు. అతనికి శబ్ద విస్తరణ సాధనాన్ని యివ్వటంతో, అతను కీచుగొంతుతో, ఉచ్ఛస్థాయిలో మాట్లాడటం ప్రారంభించాడు.

అతని కంఠస్వరాన్ని వినటం కూడా హరికి కష్టంగా ఉంది, అలాగే అతను మాట్లాడుతున్న విషయాన్ని అర్థం చేసుకోవటం కూడా కష్టమనిపించింది అదంతాక్రొత్తగా, అపరిచితంగాను ఉంది. ఈ అపరిచితులకు, యీ నగరవాసులకు తుళ్ను గురించి, తీరం వెంట ఉన్న జాలరుల గ్రామాలను గురించి, తన కంటె ఎక్కువ ఎలా తెలిసింది? ఆక్షణంలో హరి తనను యావజ్జీవితంలోను ఏమీ తెలియని వ్యక్తిలాగ భావించుకొన్నాడు.

"మీరు ఆలీబాగ్ నుండి వచ్చారు," అంటూ ఆవ్యక్తి మాట్లాడటం ప్రారంభంచాడు. "ఆప్రదేశం మీకు స్వస్థలం; కాని అది అక్కడి వాతావరణ పరిశోధనా శాలలో పనిచేసేమాకు ప్రపంచ ప్రఖ్యాత భూఅయస్కాంత పరిశోధనలకు స్థావరంగా కనిపిస్తోంది. ప్రపంచంలో ఇలాంటిది మరొకటిలేదు. దాన్ని 1841 లో బొంబాయిలో, మీరు నిలబడ్డ ప్రదేశానికి కొంచెం దూరంలోనే నెల కొల్పారు. కాని 1904 లో బొంబాయి లోని ట్రామ్‌లను విద్యుత్ సహాయంతో నడపాలని నిర్ణయించటంతో, యీపరిశోధనా శాలకు సంబంధించిన పరిశీలనల విషయంలో యిబ్బంది కలుగుతుందని, దాన్ని ఆలీబాగ్‌కు మార్చారు..." అన్నాడు.

"హు!" అంటూ గొణిగాడు, మాహే తలపాగాఎత్తి, తలగోక్కుంటూ "ఏమిటి యితను చెప్తున్న పరిశీలన, గిరిశీలనం, అన్నాడు మాహే."

"తెలియదు," అన్నాడు హరి మెల్లగా విని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తూ.

"ఇప్పుడు ఎరువుల కర్మాగారాన్ని ఆలీబాగ్ సమీపంలో నెలకొల్పితే విద్యుచ్ఛక్తి ప్రవాహాలు, ఆపరిసరాల్లోకి తీసుకొని పోయే ఇనుము మళ్లీ అయస్కాంత పరిశోధనలకు ఆటంకంగా పరిణమిస్తాయి," అన్నాడు.

హరికి ఏమీ అర్థం కాక పోవటంతో విసుగు పుట్టింది.

"మేము భారతీయ సర్వే విభాగానికి, చమురు, సహజవాయువు సంఘానికి, సమాచారాన్ని అందిస్తాం. మాకార్య నిర్వహణకు భంగం ఏర్పడకుండా ఉండటంగాని, అవరోధం కలుగకుండా ఉండటంగాని అత్యవసరం. 1846 నుంచి యిది అవరోధం లేకుండా కొనసాగుతోంది. మేము ఇప్పుడు దానికి భంగం కలగటం అనుమతించలేము," అంటూండగా అతని స్వరం ఆగిపోవటంతో మాట్లాడటం మాని వేసి పెద్ద చేతి రుమాలుతో ముఖం తుడుచుకొన్నాడు. అతన్ని చూస్తే ఆవ్యక్తి కార్యాలయాల్లో పనిచేసే వ్యక్తి అని, ప్రజాసమావేశాల్లో మాట్లాడటం అలవాటు లేని వ్యక్తి అని ఎవరికైనా తెలుస్తుంది. "మేము, మీరు, మనమంతా దాన్ని గురించి గర్వపడాలి. దాన్ని-ఎలాగైనా రక్షించు కోవాలి," అంటూ అతను శబ్ద విస్తరణసాధనాన్ని వదలి వేసి, వేదిక దిగి జనంలో కలిసి పోయాడు. దాంతో అతని ప్రసంగం పూర్తి అయినందుకు జనం సంతృప్తితో ఆనందాన్ని వ్యక్తం చేసారు. ఆ ప్రసంగించిన వ్యక్తి గూడ సంతృప్తిగా, చిన్నగా నవ్వుకుంటున్నాడు.

"ఎవరతను? మనకు ఏవిషయం తెలియజేయడానికి ప్రయత్నిస్తున్నాడు?" అని ప్రతి ఒక్కడూ మరోవ్యక్తిని అడుగుతున్నాడు.

"ఆలీబాగ్ లోని యీ పరిశోధనా శాలను నీవుచూసావా?" అని ఒక వ్యక్తి అడిగాడు. "అదెక్కడ ఉందోనాకు తెలియదు."

"అవునౌను, నాకు తెలుసు, అది సముద్రం వద్ద ఉన్న చిన్న భవనం" అన్నాడు, మరో వ్యక్తి. "కాని దానికి అంత ప్రాముఖ్యం ఉన్నట్లు నాకు తెలియదు."

"ప్రపంచ ప్రఖ్యాతి వహించింది" అన్నాడతను.

"అతను చెప్తున్నాడు కాబట్టి అయి ఉండవచ్చు."

"అవునౌను, చాలా ప్రాముఖ్యమైంది," అన్నారందరూ ముగ్ధులై.

"పాడైపోయిన పూరాతన పరిశోధనా శాలను - అది చాలా పురాతనమైంది.

కాబట్టి పరిరక్షించాలా? మన వ్యవసాయ క్షేత్రాలు, మన పంటలు, మన పడవల సంగతేమిటి? వాటి కొరకు మనం యిక్కడికి వచ్చాం ఆయనకు సంబంధించిన, దుమ్ము పేరుకుపోయిన పురాతన కార్యాలయంలేక ఫైళ్లు, లేక అతని ఉద్యోగం కొరకు కాదు," అంటూ, పొడవుగా లావుగా ఉన్న యువకు డొకడు అరిచాడు.

"అవునౌను, వాటి విషయం గూడా," అంటూ అధిక వయస్కుడొక వ్యక్తి, అతన్ని శాంతింప జేస్తూ, "ఇదిగో, సిగరెట్ త్రాగు, తర్వాత మన భూములు, పడవలను గురించి ఆలోచిద్దాం" అన్నాడు.

తర్వాత మూడో వ్యక్తి వేదిక నెక్కాడు. అతను వాళ్ల నాయకుడు అదార్కరె కావటం వల్ల, అతను వాళ్లకు విసుగుకలిగించేలా ప్రసంగించటం ప్రారంభించినా, వాళ్లు బిగ్గరగా అభినందించారు.

అతను వాళ్ల గ్రామీణ భాషలో మాట్లాడటం వల్ల, వాళ్లకు అధికంగా తెలిసిన విషయాల గురించి మాట్లాడటం వల్ల అతని ప్రసంగం వాళ్లకు నూతన చైతన్యాన్ని కలిగించింది. అతను వాళ్ల భూముల సారవంతమైన స్వభావాన్ని గురించి, వాళ్ల పంటల ఉత్కృష్టతను గురించి, వాటిని కర్మాగారాల కొరకు ఎందుకు వదులుకో కూడదో లేక నాశనం చేయరాదో వాళ్లు ఏవిధంగా డబ్బు లేక ఉద్యోగాలకు సంబంధించిన వాగ్దానాలవల్ల ఎలా మోసపోకూడదో, వాళ్లకు ఏమీ లభించవని, యింతకు ముందు చెప్పిన వాటిని గురించే మాట్లాడటం వల్ల, ప్రతి ఒక్కరూ మెచ్చు కోలుగా తల ఊపి చప్పట్లు కొట్టారు.

"మన భూమి మనకు చాలా విలువైంది అనీ, వాళ్లు ఇవ్వజూపే హేయమైన డబ్బు మనకు అవసరం లేదని ప్రభుత్వానికి చెప్పటానికి మనం ఇక్కడికి వచ్చాం. వాళ్ల కర్మాగారాల్లో పని చేయటం ద్వారా బానిసలుగా మారటం మనకు యిష్టం లేదు. మనం ఎప్పుడూ స్వతంత్రంగా పని చేసుకుంటూ, స్వంతంత్రంగా బ్రతికి, మనకి మనమే యజమానులుగా ఉన్నాం, ఇప్పుడు మనం మంత్రాలయానికి వెళ్లి ముఖ్యమంత్రి గారికీ విన్నపాన్ని సమర్పిద్దాం. రండి సోదరులారా!" అంటూ అతను చేతులెత్తి చివరి మాటలను బిగ్గరగా అన్నాడు.

అక్కడ సమావేశమైన ప్రజానీకపు కోలాహలం సముద్రంలో ముందుకు పయనించి, శిలల మీద విచ్ఛిన్నమయ్యే అలల శబ్దం లాగా మొత్తం సమూహంలో వ్యాపించింది. ఆకస్మాత్తుగా కలవరం తగ్గిపోయి, అక్కడి జన సమూహం చెదరి పోనారంభించటంతో, తన ప్రక్కన నిలబడిన వ్యక్తులు వెళ్లి పోతున్నట్లు హరి

గ్రహించాడు. వాళ్లు ఎక్కడికి వెళుతున్నారో అంటూ ఆలోచిస్తూ, తాను వాళ్ళను అనుసరించాలా, వద్దా అని ఆలోచిస్తూ అతను మొదటి ఒక వర్గం వైపు, తర్వాత మరోవర్గం వైపు త్వర త్వరగానడిచాడు.

ఎత్తుగా లావుగా ఉన్న యువకుడి చేయి పట్టుకొని, హరి అతన్ని ఆదేశాలగురించి అడిగాడు. "మనం అంతా ఇప్పుడు మంత్రాలయంవైపు వెళ్లాలా?" అని ప్రశ్నించాడు.

అదేసమయంలో అతనికి శబ్ద విస్తరణ సాధనంలో ఓ స్వరం వినిపించింది. "స్నేహితులారా, సాసూన్ ఓడరేవుకు తిరిగి వెళ్లండి. అక్కడ మన పడవలు మన కొరకు ఎదురు చూస్తున్నాయి. ఐదుగురు వ్యవసాయ దారులు మాత్రమే విన్నపంతో మంత్రాలయానికి వెళతారు. ఆ ఐదుగురిలో నేనొకణ్ణి మేము ముఖ్య మంత్రిగారిని కలుసుకొన్న తర్వాత మిమ్మల్ని సాసూన్ ఓడరేవులో కలుస్తాం. అప్పుడు మనం కలిసి తిరిగి వెళదాం."

"అదిగో నీకు కావలసిన సమాధానం లభించిందికదా." అంటూ, ఆ యువకుడు హరి చేతిని నెట్టి వేసి, ముందుకు నడచి వెళ్లాడు.

హరి, జన సమూహం రోడ్డుకు దిగువ అదృశ్యమవుతూంటే చూస్తూ నిలబడ్డాడు. హరి తనను అందరూ వదలి వేసినట్లు, మిత్రులు ఎవరూలేనట్లు భావించాడు. గ్రామంనుంచి తన స్నేహితుల్లో ఒక్కడూ రాలేదు - వాళ్లు ఎరువుల కర్మాగారం నెల కొల్పబడాలని, వాళ్లను నియమించు కోవాలని ఎదురు చూస్తూ, గ్రామంలో సుఖంగా కూర్చొని ఉన్నారు. తాను తుళ్‌ను వదిలి బొంబాయికి చేరుకోవటానికి ఆప్రదర్శనతో కలిసి వాళ్లను వదిలి వచ్చాడు. వాస్తవంగా తనకు ఆప్రదర్శనకు సంబంధం లేదని అతనికి తెలుసు. పోరాడేందుకు తనకు పొలాలుగాని, చేపలు వేటాడే పడవలుగాని, లేవు. ప్రదర్శకుల్లో ముఖ్యులైన వ్యవసాయదారులూ, జాలరులు ఎవరూ తనకు తెలియదు. వీళ్లంతా భూమిలేని, పడవలేని, ఉద్యోగంలేని, తన తండ్రిని గురించి తెలుసు కోవటానికి యిష్టపడరు. అందువలన ఆ సమయంలో తాను ఏవర్గానికీ చెందని వ్యక్తినని భావించుకొన్నాడు హరి. తాను ఎవరికీ చెందడు. ఏ ప్రదేశానికీ చెందడు. మిగిలిన వాళ్లు తనను వెనుకనే వదలి వెళ్లారు. తాను బొంబాయిలో ఒంటరిగా ఉన్నాడు.

తుళ్ గ్రామంలోని హరి వాళ్ల పూరింటిలో ఎవరూ ఆ ప్రదర్శనను గురించిగాని, లేక బిజూ పడవను జలప్రవేశం చేయించటాన్ని గురించి కూడా ఆలోచించలేదు. హరి యింటి నుండి వచ్చివేసిన తరువాత అతని

అక్కా చెల్లెళ్లు తమ తల్లి మంచం దగ్గరకు వెళ్లి, రాత్రంతా వంతుల వారీగా ఆమె దగ్గర కూర్చొని, ఆమెకు కొంచెం కొంచెంగా నీళ్లు త్రాగిస్తూ నుదుటి మీద తడిబట్టలు వేసారు. అప్పుడప్పుడు. బేలో, కమలో, మాగన్నుగా నిద్రపోతూ, "హరి తిరిగి వచ్చాడా?" అంటూ గొణిగితే లీల మౌనంగా, తల అడ్డంగా ఊపేది.

ఆ దీర్ఘ మైన రాత్రిలో అలా మేల్కొని ఉండటంవల్ల వాళ్లు బాగా అలసిపోయి, సూర్యోదయం కాబోయే సమయానికి కొద్దిగా ముందు గాఢ నిద్రలో మునిగి పోయారు. మంచుతో తడిసిన గడ్డిలోకి పరుగెత్తి, మొరుగుతూ, కొంగలను చిత్తడి నేలలోకి తరమడానికి ఆరోజు పింటోలేదు. లీల కూడా సముద్రం లోని శిలను గురించి, సాధారణంగా ఉదయంపూట చేసే ప్రార్థలను గురించి పూర్తిగా మరచిపోయి. తల్లి మంచం అంచున తల ఆనించి నిద్రపోయింది.

నిద్రలేచి, బాగా వెలుగు వ్యాపించటం చూసి, ఆమె భయపడిపోయింది. ఉదయం పూట ప్రసరించే తెల్లనికాంతి ఆమెకు దిగ్భ్రమకలిగించింది. పింటో లేనందు వలన ఏర్పడిన నిశ్శబ్దం, వింతగా హరి అదృశ్యమవ్వటం గూడా ఆదే విధంగా తోచాయి. తన కోపం ఉపశమించేంతవరకూ నడిచిన తరువాత అతను తప్పకవచ్చి ఉంటాడని భావించింది, కాని అతను చుట్టు ప్రక్కల ఎక్కడా కనిపించలేదు. లేచినిలబడు తోన్నపుడు ఆమెకు కొంచెం కోపం వచ్చింది కాని వెంటనే తన తల్లివైపు తిరిగింది. మంచంలో యింకాజ్వరంతో మండిపోతున్న, పాలిపోయి చలనంలేని తల్లి రూపం యితర ఆలోచనలను, విచారాలను, ఆమె మనస్సు నుండి తరిమి వేసింది.



"కమల, బేల" అంటూ తన చెల్లెళ్లను మేల్కొల్పి, టీ యిచ్చిన తర్వాత, బజారుకు వెళ్లి అమ్మ కోసం కొంచెం ఐస్ తీసుకురండి. హరి అక్కడేమైనా కనిపిస్తాడేమో చూడండి. అతన్ని రమ్మని చెప్పండి. దేవాలయంలో నాటకం చూడటానికని రాత్రి గ్రామంలో ఉండి ఉండవచ్చు. అతన్ని యింటికి రమ్మని చెప్పి కొంచెం ఐస్ తీసుకురండి," అని వాళ్లకు చెప్పింది లీల."

బేల, కమలకు వంట గదిలోని అల్మారాలో కొద్దిపాటి నాణాలు దొరకటంతో వాళ్లు బిజూకు సంబంధించిన పడవను జలప్రవేశం చేయించే ప్రయత్నాలను గమనించటానికి కూడా ఆగకుండా సముద్ర తీరం వెంట పరుగెత్తారు. గ్రామంలో అధికసంఖ్యాకులు బిజూకు సంబంధించిన పడవ పట్ల ఆసక్తిని కోల్పోయినట్లు తోస్తోంది. బరువులను లాగే యంత్రాన్ని నడపటానికి, మోకులు లాగటానికి బిజూ నియమించు కున్న కుర్రవాళ్లు తప్పమరెవరూ అక్కడ ఉన్నట్లు కనిపించలేదు. బేల, కమల, ఎక్కడా, ఆగకుండా తిన్నగా మార్కెట్లోని దుకాణానికి వెళ్లారు. సంచితో కూరగాయలు యింటికి తీసుకొని వెళుతున్న లీల స్నేహితురాలు, మీనా, వాళ్లకు తటస్థ పడింది.

"మీరు విన్నారా?" అని వాళ్లను అడిగిందామె. "గ్రామంలోని వ్యక్తులందరూ ప్రభుత్వానికి విన్నపం యిచ్చేందుకు బొంబాయి వెళ్లారు. హరి గూడ వాళ్లతో వెళ్లాడని నాకు ఎవరో చెప్పారు."

"హరి?" అంటూ ఆమెవేపు చూస్తూ నిలిచిపోయి అడిగారు. "హరి బొంబాయి వెళ్లాడా? అహ, కాదు ఖచ్చితంగాకాదు. అతను యిక్కడే ఎక్కడో ఉండి ఉంటాడు."

"ఎక్కడ? నాకు అతను కనిపించలేదు. మీరు రాజుని అడగండి. అతను నాకు చెప్పాడు."

"కాదులే, మా అమ్మ కోసం ఐస్ కొనాలి. ఆమెకు జ్వరంగా ఉంది. మేం త్వరగా వెళ్లాలి," అంటూ వెళ్లి పోయారు.

వాళ్లు ఇంటికి వెళ్ళేటప్పటికి లీల అప్పుడే ఎర్రమల్లెపూల చెట్టు వెనక త్రవ్విన చిన్న గుంతలో పింటోను పూడ్చటం పూర్తిచేసింది. ఆమె మట్టిని చదరం చేసి పాదాలతో త్రొక్కుతోంది. వాళ్లు వస్తున్న సవ్వడివిని ఆమె తన చేతులకు, చీరెకు అంటిన దుమ్ముదులుపు కొంది. బేల, కమల ఆమె వసారాదగ్గరకు నడిచివెళ్లి, మెల్లగా మెట్ల మీద కూర్చోవటాన్ని మౌనంగా చూస్తూనిలబడిపోయారు. ఆమె ఏడుస్తూండటం వాళ్లుగమనించారు, కాని ఆమెను ఓదార్చటానికి ఏమని ఓదార్చాలో తెలియలేదు. వాళ్లకు కూడా

తమకళ్లలో కన్నీరు పొంగుతున్నట్లనిపించింది.

అప్పుడు బేల దుఃఖాన్ని దిగమ్రింగి "లీలా, ఇతర వ్యక్తులతో కలిసి హరి బొంబాయి వెళ్లాడని మీనా చెప్పింది. ఆమెకు రాజుచెప్పాడట అంది."

లీల ఆమాటను అర్ధం చేసుకోలేకపోతున్నట్లు అనిష్టతను వ్యక్తం చేసింది. ఇంటిని వదలి వెళ్లి పోయేంతగా హరికి కోపం వచ్చి, అసంతృప్తి చెంది ఉంటాడా? ఆవిషయాన్ని ఆమె అవగాహన చేసుకోలేకపోయింది. తానైతే, అలా ఎప్పుడూ వెళ్లి ఉండదు. ఆమె తల ఊపింది. ఇదంతా భయం కలిగించేటట్లు, కష్టంగాను ఉంది. ـ ـ ـ ـ ఇక్కడ ఉంది. తన చెల్లెళ్లు, తల్లి తన సంరక్షణలో ఉన్నారు. ఎలాగోలాగ ఆమె ఈ భాధ్యతను నిర్వహించవలసి ఉంది. మారు మాటడకుండా ఆమె లేచి నిలబడి యింట్లోకి వెళ్లింది. హరి ఇక్కడ లేకపోతే తానే వైద్యుడి కొరకు ఆలీబాగ్ వెళ్లి, తల్లి కొరకు మందు తెస్తుంది. తనతల్లి బస్సెక్కి వెళ్ళలేదు. అందువల్ల వైద్యుడికి తాను అంతా వర్ణించి చెప్పి మందు కావాలని అడుగు తుంది. హరి యిక్కడ ఉన్నట్లయితే, అతన్ని తనకు బదులు ఆలీబాగ్ పంపించ గలిగి నట్లైతే ఈవిషయాలను నిర్వహించటం ఎంత తేలికగా ఉండేదో ఊహించు కొంటూ నిట్టూర్చింది.

ఆమె వెళ్లటానికి సిద్ధమౌతుండగా, బయట సన్నని సందు మీదుగా మోటారు వాహనం ప్రయాణం చేస్తున్న శబ్దం వల్ల బయట కోలాహలం వినపడింది. ఆతర్వాత గడ్డి మీదుగా తెల్లని బంగళా 'మాన్‌రిపోస్' దగ్గర కారు ఆగిన ఆశ్చర్యకరమైన దృశ్యంకనిపించింది.

"ఓ బేల, కమల, చూడండి" అంటూ లీల అరచింది.

"డిసిల్వా కుటుంబ సభ్యులు బొంబాయి నుండి వచ్చారు."

# ఏడవ అధ్యాయం

చాలా గంటలపాటు హరి నల్లగుఱ్ఱం చుట్టూరా ఉన్న ప్రదేశంలో తిరిగాడు. అతనికి యీ ఒక్క ప్రదేశం మాత్రమే తెలియటం వల్ల అప్రదేశాన్ని వదలి వెళ్లటానికి ధైర్యం చేయలేకపోయాడు. గ్రామస్థులందరూ ఓడరేవుకు వెళ్లే రోడ్ల మీదుగా అదృశ్యమయ్యారు. ఎవరూ అతన్ని తమతో రమ్మని పిలవలేదు, ఎవరూ పట్టించుకోలేదు. అందువల్ల అతన్ని యిక్కడేవదలి వేయటం జరిగింది.

తాను ఒంటరిగా ఉండటంవల్ల అతనికి అమితంగా దాహం వేస్తున్నట్లనిపించింది. అక్కడ ఉన్న కూడలి చుట్టూ ఉన్న పెద్ద భవనాల్లో ఒక దాని ముందు కొబ్బరి బొండాలు. కుప్పగాపోసిన రెండు చక్రాల బండి ప్రక్కన ఒక వ్యక్తి కూర్చొని ఉన్నాడు హరి తన జేబులో ఉన్న డబ్బులు తడుము కొంటూ అతని దగ్గరకు వెళ్లాడు. "ఎంత?" అని అడిగాడు, హరి అతన్ని స్వగ్రామంలో అవసరం అయినప్పుడు తాను కొబ్బరి చెట్టెక్కి, మొత్తం గెలనే కోసేవాడు. అందువలన ఎప్పుడూ కొబ్బరి బొండాంకొనలేదు; దాని ధరతెలియదు. ఆ కొబ్బరి బొండాలను అమ్మే వ్యక్తి, "రెండు రూపాయలు," అని చెప్పటంతో, హరికి మూర్ఛపోయినంత పని అయ్యింది. ఆవ్యక్తి ముఖం, నల్లగా తీక్షణంగా ఉంది; అతను నోట్లోసిగరెట్ పెట్టుకొని మాట్లాడు తున్నాడు. హరి ముఖం వైపుచూడగానే అతను స్నేహపూర్వకంగా నవ్వాడు, "ఏమిటి విషయం? ఇవి బొంబాయిలో ఎంత అమ్ముతారో తెలియదా? నీకు తెలియదని స్పష్టమౌతూనే ఉంది. ఉండు, నీకు కొంచెం చౌక బొండాం ఒకటి యిస్తాను," అతను ఆగుట్టలో చిన్న కొబ్బరి కొరకు వెదకి, చేతిలో ఉన్న వంకర కత్తితో, దాని పైభాగాన్ని ఒక దెబ్బతో నరికి, హరికి అందించాడు. హరి కొబ్బరి బొండాంలోని నీళ్లు త్రాగుతూంటే అతను వినోదంగా గమనిస్తూ, "నిన్నుచూస్తే రోజంతా ఏమీతినటంగాని, త్రాగటంకాని చేయనట్లు కనిపిస్తోందే," అన్నాడు.

"అవును" అన్నాడు హరి అంగీకరిస్తూ. హరి మూతితుడుచుకొని, కొబ్బరి బొండాం పెచ్చు ఒకటి అందుకొంటూ, "నాకు బాగా ఆకలిగా ఉంది, దప్పిక వేస్తోంది," అన్నాడు హరి.

"నాకు అర్థం అవుతోంది," అన్నాడు ఆ కొబ్బరి బొండాలను అమ్మే వ్యక్తి. ఆసమయంలో ఖాతాదారు లెవరు లేక పోవటంవల్ల కొంచెం సేపు ఆకుర్రవాడితో మాట్లాడవచ్చునని అతను అనుకున్నాడు. "మీ ఊరినుండి పారిపోయి వచ్చావు, అవునా?" అన్నాడు.

"నేను ప్రదర్శనకారులతో వచ్చాను," అన్నాడు హరి, సగర్వంగా. "ఇంతకు ముందు యిక్కడ ఉన్న కారులను చూసారా? మేము యీ ఉదయం ఆలీబాగ్ నుండి వచ్చాం," అన్నాడు.

" ఓ హో ! ప్రభుత్వాన్ని ఏం కావాలని అడగటానికి వచ్చారు ఆహారమా, భవనాలా, నగలా?"

హరి వాళ్లకోరికలు ఏమిటో వివరించటానికి ప్రయత్నించాడు. కాని కొబ్బరి బొండాలను అమ్మే వ్యక్తి ఆసక్తి చూపుతున్నట్లు కనిపించలేదు. అతను మరో సిగరెట్ వెలిగిస్తు, "అడగండి, అడగండి, ప్రభుత్వాన్ని మీ యిష్టమైన వాటినన్నింటినీ అడగండి. ప్రభుత్వానికి చెవులున్నాయని మీరు చెప్పేవన్నీ వినగలుగు తుందనుకొంటున్నారా? ప్రభుత్వానికి కళ్లుండి, చూడగలుగు తుందనుకొంటున్నారా? ప్రభుత్వానికి తినటానికి నోరు మాత్రమే ఉందని



చెప్తున్నాను - అది పన్నుల వల్ల లభించే ఆదాయాన్ని, మన భూమిని, పేద వాళ్ళను కూడా మింగుతుంది. నాసలహా విని, ప్రభుత్వానికి దూరంగా ఉండండి దాన్ని ఏమీ అడగొద్దు; ఏ విషయంలోను దాని మీద ఆధారపడకండి. ప్రభుత్వమే మీకు తల్లి తండ్రి అనిచెప్తారు. నేను చెప్పేదేమిటంటే నాకు ఆరు సంవత్సరాల వయసున్నపుడు నా తల్లి, తండ్రి నన్ను బయటకు నెట్టి నన్నే సంపాదించు కోమన్నారు. ఇప్పుడు నాకు వాళ్ల అవసరంలేదు. - నా ఏర్పాట్లు నేనే చేసుకొంటున్నాను - నేను స్వశక్తి మీద ఆధారపడిన వ్యక్తిని. అబ్బాయ్, అదే ఉత్తమమైన విధానం - స్వేచ్ఛగా, స్వతంత్రంగా ఉండు. దయచేసి అని అర్థించకు, కృతజ్ఞతలు తెలుపవద్దు. నీకు కావలసినవి తీసుకో. వ్యక్తిగా జీవించు; స్వతంత్రంగా ఉండు." అన్నాడతను.

హరి అతని మాటలు విని, అంగీకారసూచకంగా తల ఊపాడు. కొబ్బరి బొండాలు అమ్మే వ్యక్తి వివేక వంతుడు, దృఢమైన వాడు, మెచ్చుకోదగిన వాడు అని హరి భావించాడు. హరి అతని కాళ్ల దగ్గర కూర్చొని మరిన్ని విషయాలు నేర్చుకోవటానికి సిద్ధంగా ఉన్నాడు. కాని అతనికి హరికి బోధించటంలో ఆసక్తి ఉన్నట్లు కనిపించలేదు; అతని తల్లి, తండ్రి ఎలా అవసరం లేదో, అలాగే విద్యార్థిగాని, అనుచరుడుగాని అవసరంలేదు. ఇంతలో నవ్వు కొంటూ పెద్ద భవనపుమెట్లుదిగి వచ్చి ఓయువకుడు, యువతి కొబ్బరి బొండాలున్న బండి ముందర ఆగారు. కొబ్బరి బొండాలు అమ్మే వ్యక్తి కొబ్బరి బొండాలు కొట్టియివ్వటానికి వాళ్లవైపుమళ్లాడు. వాళ్లు భుజాలకు తగిలించుకొన్న సంచుల్లో డబ్బుల కోసం వెదుకుతున్నారు. చిరుగుల దుస్తులు వేసుకొని, ఆకలితో పీక్కుపోయిన ముఖంతో ఉన్నతాను అక్కడి నుండి వెళ్లటం మంచిదని హరి అనుకొన్నాడు తనలో.

అలా భావించిన మీదట అతను అక్కడి నుండి కదలి, కాలిబాట మీద వెళ్తున్నాడు. ఆకాలిబాట మీద, దానిమీద ఏర్పడిన చిన్న గుంటల్లోను చాలా చెత్తా, చెదారం, గుట్టలుగా పేరుకు పోయింది. వాటిని తప్పించు కొంటూ జాగ్రత్తగా నడుస్తూంటే హరికి ఓ స్వరం వినిపించింది. ఆ స్వరం. "ఆ బిల్లూ మాటలు వినవద్దు. అతనికి దూరంగా ఉండు; అతను చాలా ప్రమాదకారి. పగటి పూటతన కత్తిని కొబ్బరి బొండాలు నరకటానికి ఉపయోగిస్తాడు; రాత్రిపూటదాన్ని... మీద ప్రయోగిస్తాడు," అని చెప్తున్న స్వరం వినిపించింది. ఆ మాటలు విన్న హరి వెను దిరిగి, అలా చెప్పిన వ్యక్తి, చిరిగిపోయిన చాప మీద కూర్చొన్న బిచ్చగాడు అని తెలుసు కొన్నాడు. ఆ బిచ్చగాడు

అలా చెప్తూ, తానుచెప్తున్న భావాన్ని వివరించేందుకు, తననోటికి అడ్డంగా ఒక వైపునుండి, మరో వైపుకు వ్రేలిని పోనిస్తూ, తమలపాకులు నమలటంతో ఎఱ్ఱబడిన నాలుకను బయట పెట్టాడు. హరి ఆ మాటలకు ఆకస్మికంగా భయపడ్డాడు. అది చూచి బిచ్చగాడు నవ్వాడు. అలా నవ్వటంతో అతని నోరంతా స్పష్టంగా కనిపించి, తమలపాకుల రసంతో అంతా ఎఱ్ఱబారినట్లు వెల్లడయ్యింది.

"అలా అంటే నీకు ఆశ్చర్యం కలుగుతుందా? కాలి బాటల మీద నివసించే వాళ్లు అలాగే జీవిస్తారని నీకు తెలుసా? పోలీసు వాళ్లను మోసం చేయటానికి బయటికి కనిపించే సురక్షితమైన పని ఒకటి దాని వెనుక జీవనో పాధి కొరకు ప్రమాద భరితమైన పని ఒకటి. ఎవరైనా కొబ్బరి బొండాలు అమ్మటం ద్వారాగాని లేక భిక్షాటన వల్లగాని యిబ్బంది లేకుండా జీవితాన్ని గడపవచ్చునను కొంటున్నావా? ఎవరికైనాగడవదని నేను చెప్తున్నాను. నగరంలో ఎలా జీవించాలి అన్న విషయాన్ని గురించి కొన్ని చిట్కాలు కావాలంటే నన్నడుగు, నేను నీకు కొద్దిపాటి పారితోషికంతో చెప్తాను," అన్నాడతను కన్నుగీటి, హరి కూర్చోవటానికి వీలుగా, చాపమీద ఒక వైపుకు జరుగుతూ.

కాని హరికి అలాంటి ప్రమాదకరమైన పనులను ఎవరినుండి నేర్చుకోవటం యిష్టం లేక పోవటంతో అతను తల ఊపుతూ త్వర, త్వరగా నడిచి వెళ్లాడు. అలానడిచి వెళ్తూండగా ఆ బిచ్చగాడు తానుకూర్చొన్న చిరుగుల బట్టల క్రిందనుండి ఒక సీసాను తీసుకొని దానిలోని సారాను త్రాగటానికి నోటి దగ్గర పెట్టుకోవటం అతను చూడలేదు. తాను బిచ్చగాడి లాగానో, మోసగాడి లాగానో లేక హంతకుడి లాగానో ఉండటానికి యీనగరానికిరాలేదు. తాను యింటి నుండి పారిపోయి భవిష్యత్తు తనకేమిస్తుందో తెలిసికోవటానికి వచ్చాడుకాని, యితర విషయాలు తనకు వాస్తవంగా తెలియవు. ఎలాగైతేనేం తాను బొంబాయి చేరుకొన్నాడు కాబట్టి యిప్పుడు తెలిసుకొంటాడు.

అక్కడ ఉన్న పెద్దకూడలి ప్రతిఛాయలో భయంకరమైన వ్యక్తులు తారట్లాడు తున్నట్లు అనిపించటంతో ఆ కూడలిని గురించి కూడ హరి భయపడటం ప్రారంభమైంది. ఖాళీగా ఉన్న దిమ్మెకూడ హరికి భయంకరంగా తోచింది; ఆ దిమ్మె మీద చక్రవర్తి విగ్రహంలేకుండా ఉండటం ఏదో సందేశాన్నిస్తున్నట్లు హరికితోచింది. ఆభయాన్నిపురస్కరించుకొని, హరి ధైర్యం తెచ్చుకొని ప్రక్క వీధిలోకి తిరిగి, త్వరగా ఆ కూడలి నుండి దూరంగా వెళ్లిపోయాడు. అలా వెళ్తున్నప్పుడు వరుసలుగా కొబ్బరి చెట్లుండి, విశాలంగా ఉన్న ఉద్యాన

వనం ఒకటి కనిపించింది. అతను అక్కడికి వెళ్లి, ఫుట్‌బాల్, క్రికెట్, ఆడేవాళ్లను గమనిస్తూ, ఆ చెట్ల క్రింద గడ్డి మీద కూర్చొని విశ్రాంతి తీసుకోవచ్చని అనుకొన్నాడు. ఉద్యాన వనానికి సమీపానికి వెళ్లగా ఎదురుగా రోడ్డు చివర సముద్రం నుండి వెలువడే ప్రకాశవంతమైన వెలుగు ప్రసరిస్తున్నట్లు అతను గ్రహించాడు. అతను సముద్రానికి సంబంధించిన వాసనలను, తీవ్రంగా ఉండే చేపల వాసనను కూడా పసిగట్టాడు.

అకస్మాత్తుగా అతనికి యింటిని గురించిన బెంగ, పరిచితమైన వాటి పట్ల అభిలాష కలగటంతో అతను ఆ ఉద్యానవనాన్ని గురించి మరచిపోయి, త్వర త్వరగా ముందుకు నడిచాడు. అలా అతను ముందుకువెళ్లి, తానునడుస్తున్న రోడ్డు అఖాతంచుట్టూరా వంపు తిరిగి ఉండటం గమనించాడు. హరి తానింత వరకుచూసిన దృశ్యాలన్నింటిలోను అదిచాలా అద్భుతంగా ఉంది. అతను అలా నిలబడిపోయి రోడ్డుకు ఒకవైపున వరుసలుగా ఉన్న భవనాలను చూస్తూ ఉండి పోయాడు. అవి ఒక దాని ప్రక్కన మరొకటి చెట్లకన్న ఎత్తుగా ఉన్నాయి. అలాగే రోడ్‌కు, భవనాలకు ఆవలి వైపున, మెరుగుపెట్టిన లోహంలాగ ప్రశాంతంగా, కాంతివంతంగా, మెరుస్తున్న సముద్రాన్ని చూస్తూ నిలబడిపోయాడు. ఇక్కడ పడవలుగాని, జాలరులుగాని లేరు; రోడ్డు మీద, సముద్రం వెంట నిరంతరాయంగా శబ్దాలు చేస్తూ రాకపోకలు కొనసాగుతున్నాయి.

అతను సముద్రానికి, భవనాలకు మధ్యగానడుస్తూ, యిసుకతో నిండిన చిన్న సముద్ర తీరం ప్రాంతానికి చేరుకొన్నాడు. ఆ ప్రాంతమంతా జనంతోను, రంగు రంగుల పానీయాలు, కొబ్బరి బొండాలు తినుబండారాలు విక్రయించే దుకాణాలతో క్రిక్కిరిసి, సముద్రతీరంకంటె సంతలాగ ఉంది. వాస్తవం చెప్పాలంటే సంత జరుగుతున్నట్లే అనిపించింది - వెదురు కర్రలకు కట్టిన బెలూన్‌లు కాలిబాటల మీద పూల దండలు, ప్లాస్టిక్ ఆట బొమ్మలు, పత్రికలు అమ్మే దుకాణాలున్నాయి. పిల్లలు ఉత్సాహంగా యిసుక మీదుగా సముద్రం లోకి పరుగెత్తు తున్నారు. అక్కడ చేరిన జనం దుకాణాల చుట్టూమూగి, హరి తన గ్రామంలో ఎన్నడూ చూడనటువంటి వింత తినుబండారాలను తింటున్నారు. అలా చూస్తూ ప్రక్కననిలబడి ఉండగా అతని వెనుక కారొకటి వచ్చి ఆగింది. ఆకారులోంచి ఆనందంతో కేకలువేస్తూ, అరుస్తూ ఓ పెద్దకుటుంబం దిగింది - రంగు రంగులబట్టలు వేసుకొన్న పిల్లలు, అందమైన చీరెలు కట్టు కొన్న స్త్రీలు, నవ్వుతూన్న పురుషులు వారిలో ఉన్నారు. పురుషులు వాళ్లందరికి అల్పాహారాలు బొమ్మలు కొనిపెట్టటానికి వాళ్లను దుకాణాలదగ్గరికి

తీసుకొనిపోయారు.

వాళ్లను చూడటంతో ఒకప్పుడు తనకు ఉద్యోగం యిస్తానని చెప్పిన డిసిల్వాల బొంబొయి చిరునామా ఉన్న కాగితం ముక్కతన జేబులో ఉన్నట్లు హరికి అకస్మాత్తుగా జ్ఞా పకం వచ్చింది. తన దగ్గర బొంబాయి చిరునామా ఉందని జ్ఞాపకం రావటం, తనకు సహాయం చేసేందుకు తనకు తెలిసిన వ్యక్తులున్నారన్న భావం వల్ల కలిగిన ఉపశమన భావం, చల్లగా, స్నేహ పూర్వకంగా, సేదదీర్చే సముద్ర కెరటం లాగ హరిని ఆవరించింది.

అక్కడ ఉన్న ఓ దుకాణం యజమాని గులాబీ, అరటి, నారింజ, నిమ్మవాసన కలిగిన ద్రవాన్ని, రంగును ఐస్ ముద్దల మీద చల్లి ఉత్సాహంతో కేకలు వేస్తున్న పిల్లలకు యిస్తున్నాడు. హరి ఆదుకాణ దారుని వద్దకు వెళ్లి ఆకాగితం ముక్కమీద చిరునామా అతనికి తెలుసునేమో విచారించాడు.

తెల్లని, చిన్న టోపి క్రింద కనిపించే కళ్లను, హాస్య ధోరణిలో హరివైపు త్రిప్పుతూ, "ఓ హో" అంటూ ఆదుకాణాదారుడు నవ్వాడు. "నీదగ్గర మంచి చిరునామా ఉంది. బాబు. నీవు మారువేషంలో ఉన్న రాజకుమారుడివి కావచ్చు." అంటూ ఒక పిల్లవానికి పచ్చని ఐస్ ముద్ద యిచ్చి, కొన్ని నాణాలు జేబులో వేసుకొని, "ఈ రోడ్ మీద తిన్నగా వెళ్లు. అది నిన్ను తిన్నగా మలబార్ కొండ మీదికి తీసుకుపోతుంది. అక్కడ నీకొక మహలు కనపడుతుంది. అది వ్రేలాడే ఉద్యానవనాలకు కొంచెం తక్కువస్థాయిలో ఉంటుంది. బహుశ అక్కడ నీకొరకు ఓ రాజకుమార్తెపూలదండతో ఎదురు చూస్తూ ఉండవచ్చు." అని హరికి చెప్పి, నవ్వుతూ కన్ను గీటాడు.

హరికి అతని నవ్వుగాని, హాస్యోక్తిగాని నచ్చలేదు; అందువలన అతను వీలైనంత హుందాగా ఉండటానికి ప్రయత్నిస్తూనడవటం మొదలెట్టాడు; అయితే అతని ముఖంలో సాధారణంగా కనిపించని తీవ్రతకనిపిస్తోంది. హృదయం ఉత్తేజంతో కొట్టుకొంటోంది.

ఆ దుకాణదారుడు చెప్పినట్లే ఆరోడ్ కొండపైదాకా ఉంది. దానికి యిరువైపులా పెద్ద భవనాలు కమ్ముకొని ఉన్నాయి; వాటి వెనుక చెట్లు, ఉద్యాన వనంలో ఉన్నత ప్రదేశంలో తోటలు ఉన్నాయి. నగరం తానూహించిన కంటె పెద్దదిగాను, గొప్పగాను ఉంది. ఈ నగరంలో తనకు తెలిసిన వ్యక్తులు నివసించే యిల్లు ఉందన్న విషయం అతనికి నమ్మశక్యం కాకుండాఉంది.

అతని ఆశలు ఎక్కువ సేపు కొనసాగలేదు. అతను ఆప్రాంతానికి చేరేటప్పటికి సాయంత్రమైంది. గులాబీ ఎర్రదనంతో సూర్యుడు అఖాతంలో

మునిగి పోయాడు. సముద్రంలోని ద్వీపం మీద నిర్మింపబడిన బొంబాయి నగరం పై చీకటి వ్యాపించింది. అతను ఆ కొండ ఎక్కుతూంటే విద్యుద్దీపాలు వెలిగాయి; అప్పుడు ఆ కొండంతా నక్షత్రాలకంటె అధికమైన వెలుగును ప్రసరిస్తూ ఆకాశం క్రింద ఉన్న రత్నాల గుట్టలాగా ప్రకాశిస్తోంది. అక్కడి నుండి వెనుదిరిగి చూస్తే యిరువైపుల విద్యుద్దీపాలతో ప్రకాశవంతంగా ఉన్నరోడ్డు అఖాతంచుట్టూ పరచుకొని ఉండటం కనుపించింది. ఇదేనా తాను విన్న ప్రసిద్ధమైన రాణీగారి కంఠాభరణం? ఇది, అదే అయి ఉంటుందని అతను అను కొన్నాడు. అతను అలా చూస్తూ నిలబడి పోయాడు. అక్కడ ఎత్తైన ప్రదేశంలో నియోన్ లైట్లతో రూపొందింపబడిన వ్యాపార ప్రకటనలు ఆరిపోతూ, వెలుగుతూ, ఆకు పచ్చ, నీలం, నారంజ రంగులను వెదజల్లు తున్నాయి. అతని హృదయం ఉత్తేజంతోను, భయంతోను కొట్టుకొంది.

తాను వెదుకు తున్న భవనం కనిపించేసరికి రాత్రి అయి పోయింది కాని వాస్తవం చెప్పాలంటే చీకటిగా లేదు. వీధులవెంట ఉన్న వందలకొద్దీ దీపాలు, ప్రతిభవనపు కిటికీల నుండి వెలుగును ప్రసరింపజేస్తున్న దీపాలు ఆ ప్రాంతాన్ని పగలులాగా మార్చివేస్తున్నాయి. తన యావజ్జీవితంలోను యిన్ని విద్యుద్దీపాలను చూడలేదు. ఈ రాత్రి తనకు తెలిసిన యితర రాత్రుల్లాగా లేదు. రాత్రిమరింత అంధకారంగా మారితే తాను దాక్కోవచ్చు; అలా మారితే, 'సముద్రపు పక్షి' అన్న అని పేరున్న ఎత్తైన తెల్ల భవనపు ముందరిచావడిలోకి తాను ఎవరి కంటపడకుండా నడచి వెళ్లవచ్చు.

హరి తనకు తెలిసిన ఆకుటుంబం వాళ్లు ఒక్కరే ఆభవనంలో ఉంటున్నారని భావించాడు, కాని ఆభవనం అపరిచితులతో బస్ డిపోలాగాను, రేవులాగాను సమ్మర్దంగా ఉంది. ఒకవ్యక్తి లోపల ఒక ద్వారం దగ్గర నిలబడి మనుషులను లోపలికి అనుమతించిన తర్వాత దాన్ని మూసి వేయటంతో వాళ్లు అకస్మాత్తుగా అదృశ్యమౌతున్నారు. తర్వాత ఎంత అకస్మాత్తుగా మూసి వేస్తున్నాడో అంత త్వరగా తలుపు తెరవటంతో భిన్నమైన వ్యక్తులు సమూహంగా దాన్నుండి బయటకు వస్తున్నారు. హరి అది ఏమిటో అర్థం చేసుకోలేక పోయాడు. అతను ఆ వ్యక్తి దగ్గరకు వెళ్లి తనకు తెలిసిన కుటుంబం వాళ్లు అక్కడ నివసిస్తున్నారా? అని అడిగాడు. దానికి అతను, "లోపలికిరా - పదవ అంతస్తు," అని చెప్పి, పన్నెండు మంది యితరులతో, హరిని ఓ చిన్న గదిలోకి నెట్టాడు. తర్వాత అతను తలుపుమూసి వేసి, గోడలో అమర్చిన ఓ మీటనొక్కటంతో, ఆ చిన్న కొయ్యగది, అనారోగ్యకరమైన కుదుపులతో పైకి కదిలింది, హరి ఆ దిగ్భ్రమనుండి

తెరుకొనకముందే అది ఆగిపోయి, తలుపు తెరచుకోవటంతో, దానిలో ఉన్న వ్యక్తి బయటకు వెళ్లమని చేయిచూపి, "నూట రెండు," అని చెప్పి, తలుపుమూసి, అదృశ్యమయ్యాడు.

ఇప్పుడు హరి ఆ భవన మధ్య భాగంలో ఉన్నాడు. అతను చుట్టూరా చూస్తే మూసి ఉన్న తలుపులు తప్పమరే మీ కనిపించలేదు. అతను ఆద్వారాల మీద ఉన్న సంఖ్యలను దగ్గరగా వెళ్లి పరిశీలించిన మీదట ఒక ద్వారం మీద 102 వసంఖ్య యిత్తడి అక్షరాల్లో బిగించబడి ఉండటం చూసాడు. అతను ఆతలుపును కొంచెం సేపు తట్టిన తర్వాత తెల్లని పంట్లాము, ఎత్తైన కాలర్ ఉన్న తెల్లని కోటువేసుకొన్న పొడవాటి వ్యక్తి తలుపు తెరిచాడు, "మూర్ఖుడా, ఎందుకు తలుపు తడుతున్నావు - గంట నీకు కనిపించటం లేదా?" అంటూ అరిచాడు.

ద్వార బంధం మీద ఎక్కడైనా గంట ఉందేమోనని హరి పరికించి చూసాడు కాని అతనికి అక్కడ ఏమీ కనిపించలేదు.

"లేదు," అని అన్నాడతను చిన్నగా. "ఎక్కడుంది, అది?"

"మొద్దు, యిక్కడ ఉంది." అన్నాడా మనిషి కోపంగా. అలా చెప్పి ద్వార బంధంకమ్మి ప్రక్కన ఉన్న తెల్లని మీట మీద చేయివేసి, అది అకస్మాత్తుగా కీచుమంటూ శబ్దంచేసేటట్లు మ్రోగించాడు. "నీ వెవరు? నీకేంకావాలి?" అని అడిగాడతను.

"నేను అయ్యగారిని కలవాలి," అన్నాడు హరి మెల్లగా. అలా అంటూ అతను, తివాచీ పరచి, ఎక్కువ కాంతితో నిండి. పెద్ద పెద్దకుర్చీలు, మేజాబల్లలు, కాంతివంతమైన పటాలు అద్దాలు, పుష్పాలున్న గదిలోకి చూసాడు. దుమ్ముకొట్టుకొన్న చెప్పులు వేసుకొన్న తన పాదాలు జ్ఞాపకం రావటంతో, అలాంటి స్థితిలో తాను ఆగదిలో ఎలా ప్రవేశించగలను అని అనుకొన్నాడు.

ద్వారం దగ్గర ఉన్న వ్యక్తికి అతన్ని లోపలికి పంపించాలన్న ఉద్దేశంలేదు.

"అయ్యగారా? ఆయనను కలవటానికి నిన్ను ఎవరు పంపించారు? నీదగ్గర ఉత్తరం ఏమైనా ఉందా?" అని అడిగాడు.

హరి తన జేబులోని కాగితం ముక్కకొరకు వెదకాడు. "ఇదుగో, నా దగ్గర ఆయన పేరు, చిరునామా ఉన్నాయి."

"నీ కెవరు యిచ్చారు?"

"ఆయనే యిచ్చాడు."

"అబద్ధాలు చెప్పకు."

"నిజమే. ఆయన తుళ్ వచ్చినప్పుడు నేను ఆయన కారుకడిగి, శుభ్రంచేసాను. అప్పుడాయన నేను బొంబాయి వచ్చినప్పుడు, తన దగ్గరకు వచ్చి, తనను కలుసుకోమన్నాడు."

"తుళ్ గ్రామమా?" అంటూ అతను తన అయిష్టతను వ్యక్తం చేసాడు. ఆ పేరు అతనిలో ఏవోభావాలు కలిగిస్తున్నట్లుంది. హరి ఆశగా అతని ముఖాన్ని గమనించాడు కాని అతను చెప్పిన మాటలు హరికి మరో ఆఘాతంలాగా పరిణమించాయి.

"అయ్యగారు యిక్కడ లేరు, ఆయన మీ గ్రామం తుళ్ వెళ్లారు - ఆయన యీ ఉదయమే వెళ్లారు. వాళ్లందరూ వేసవి సెలవులు గడపటానికి వెళ్లారు. వాళ్లు అక్కడినుండి తిరిగి వచ్చిన తర్వాత అయ్యగారు విదేశాలు వెళతారు. ఆయన పెద్ద వ్యాపారవేత్త, నీకు తెలియదా? ఆయనకు ఇంగ్లండ్, అమెరికాల్లో వ్యాపారాలున్నాయి. అక్కడినుండి ఒక నెల వరకు తిరిగిరారు," అంటూ అతను హరిని సన్నిహితంగా పరిశీలించాడు, "అయితే నీవు తుళ్ గ్రామస్తుడివి, అవునా? వంట మనిషి, ఆయా దాన్ని గురించి చెప్పారు. అదో అడవి అని వాళ్లు అన్నారు. నీవు యిక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

"నేను ఉద్యోగం కొరకు ప్రయత్నిస్తున్నాను. ఇక్కడే ఉండి పోవాలను కొంటున్నాను," అన్నాడు హరి మెల్లగా.

ఆ మాటలు ఆ వ్యక్తికి కోపాన్ని, భయాన్ని కలిగించినట్లు అనిపించింది. "వెళ్లు, వెళ్లిపో," అని అతను అరిచాడు. "నీకు యిక్కడ పనేమీలేదు - అయ్యగారికి యిప్పటికే చాలామంది సేవకులు ఉన్నారు. ఆయనకు మరొకళ్లు అవసరం లేదు. వెళ్లు ఉద్యోగంలేదు. నీవు ఎక్కడా ఉండటానికి గూడా వీలులేదు," అంటూ అతను కర్కశంగా మళ్లీ చెప్తూ, వెనక్కు అడుగువేసి, గట్టిగా తలుపు మూసి వేసాడు.

హరి చేయగలిగిందే మీలేదు. అతను మీటను నొక్కి పెద్దగా గంటను మ్రోగించ బోవటంలేదు; అలాగే మళ్లీ తలుపు తట్ట బోవటం లేదు. ఇప్పుడు ఏం చేయాలి, రాత్రి ఎక్కడ గడపాలి అంటూ ఆలోచిస్తూ, తలుపు వంక నిరాశాపూరితంగా చూస్తూ నిలబడి ఉన్న సమయంలో, పైకి క్రిందికి కదులుతున్న కొయ్య పెట్టెలో తనను అక్కడికి తీసుకొని వచ్చిన వ్యక్తి అకస్మాత్తుగా తలుపు తెరచి, క్రిందికి వస్తున్నావా? ఎవరైనా క్రిందికి వస్తున్నారా?" అంటూ కేక వేసాడు. దానితో హరి వెను దిరిగి వేగంగా ఆ పెట్టెలో ప్రవేశించాడు. అదిరాకెట్ వేగంతో క్రిందికి వచ్చి, హరిని మరల అధికకాంతితో నిండి, సమ్మర్ధంగా ఉన్న చావడిలో వదలి

వేసింది.

ఇప్పుడు ఎక్కడికి వెళ్లాలో అని ఆలోచిస్తూ, యిలాంటి భయంకరమైన, స్నేహితులులేని ప్రదేశానికి తానెందుకు వచ్చానా అని ఆలోచిస్తూ నిలబడి పోయయాడు. ఇంతలో ప్రవేశ ద్వారంలో ఎత్తైన పీట మీద కూర్చొన్న వ్యక్తి అతన్ని పిలిచి, "నీకేంకావాలి? నీ వెవర్నికలవాలని వచ్చావు?" అని అడిగాడు.

"వాళ్లు యిక్కడ లేరు," అన్నాడు హరి తల ఊపుతూ-102లో ఉండే కుంటుంబం వాళ్లు - వాళ్లు వెళ్లిపోయారు."

తర్వాత ఆవ్యక్తి హరి పట్లఎలాంటి శ్రద్ధ చూపకుండా వచ్చేపోయే వాళ్లతో మాట్లాడుతూ ఉండిపోయాడు. అలాగే కొంత మంది చిన్న కుర్రవాళ్లు గోలీలతో మెట్లమీద ఆడుకొంటూంటే, అక్కడికి వచ్చే పోయే వాళ్లు వాటిమీద కాళ్లువేసి జారిపడుతుంటే, వాళ్ళను కేకలు వేస్తున్నాడు. ఎక్కడి కైనా మరోచోటికి వెళ్లి ఆడుకోమని కేకలు వేస్తున్న వ్యక్తి కళ్లల్లో స్నేహపూరిత భావం ఉంది. అతని మాటలకు ఆడుకొంటున్న చిన్న కుర్రవాళ్లు నవ్వారు. మరి కొంత సేపటి తర్వాత ఆచావడి ఖాళీగా ఉన్నసమయంలో అతను యిటువైపు తిరిగి, హరి, యింకా అక్కడే నిలబడి ఉండటం చూసి, అతని దగ్గరకు నడిచి వచ్చారు.

"నీవు ఎక్కడికి వెళ్లటానికి వీలులేదా?" అని అడిగాడు అతను.

హరి మాట్లాడకుండా తల అడ్డంగా ఊపాడు - అతను బాగా అలసిపోయాడు - బాగా ఆకలిగా కూడా ఉంది, కదలటానికి, మాట్లాడటానికి కూడా వీలు లేనంత బలహీనంగాను, భయపడిపోయి ఉన్నాడు.

"హుమ్," అంటూ ఆవ్యక్తి హరిపట్ల ఆలోచనా పూరితంగా చూసాడు. "అయితే నీవేంచేయాలో చెప్తాను," అన్నాడతను. ఊహించని స్నేహ భావంతో. "రాత్రిపూట డ్యూటీ చేసే కాపలా దారుడు. నా దగ్గర డ్యూటీ ఒక అరగంటలో తీసుకొంటాడు. అప్పుడు నేను ఉండే గోవాలియా ప్రాంతానికి వెళతాను, నేను వెళ్లేటప్పుడు నిన్ను నా స్నేహితుడొకని దగ్గరకు తీసుకొని వెళ్తాను. అతను నీకు భోజనం పెడతాడు. నీకు బాగా ఆకలిగా ఉంది. అవునా?"

ఎవరో అపరిచిత వ్యక్తి యీ విధంగా దయ జూపి సహాయ కారిగా ఉండటాన్ని గురించి నమ్మలేక హరి అతని వైపుచూసాడు. అవ్యక్తి చెయ్యి చాచి హరి భుజంతట్టి, "కొంచెం ఆగు," అన్నాడు.

అతని పేరు హీరాలాల్. అతను పన్నెండు సంవత్సరాలుగా 'సముద్రపుపక్షి'కి

కాపలా గారుగా పనిచేస్తున్నట్లు, వాళ్లిద్దరూ ఆరాత్రి ప్రొద్దుపోయిన తర్వాత రోడ్లకు మధ్యగా, రద్దీలో గుండా, దారి చేసుకొంటూ, పెద్ద దుకాణాలు, అల్పాహారశాలల ప్రక్కగా కొంత దిగువ వరకు నడిచేసమయంలో అతను చెప్పాడు. అక్కడ తక్కువస్థాయి చిన్న దుకాణాల వరుసలో హీరాలాల్ స్నేహితుడు, జాగు నడుపుతున్న చిన్న హోటలు ఉంది. హరికి భోజనం పెట్టి, ఆ రాత్రికి అతన్ని అక్కడే నిద్రపోనివ్వమని హీరాలాల్ జాగూకు చెప్పాడు, "నేను ప్రతిరోజు రాత్రి యీదారిలోనే వెళతాను. నేను మళ్లీ రేపు నిన్ను కలుస్తాను," అని అతను హరికి చెప్పి, చేయి ఊపుతూ వెళ్లిపోయాడు.

తన ఖాతా దార్లకు సత్తుపళ్లాల్లో రొట్టె, నీరు, నీరుగా ఉన్న చిక్కుడు కూరను యిస్తున్న జాగు హరి వైపుచూసి, మాట్లాడ కుండా, అతనికి ఆహారపు పళ్లాన్ని యిచ్చాడు. అతను మంచి దుస్తులు వేసుకొని, మంచి స్వభావం గల, 'సముద్రపు పక్షి,' కాపలా దారు లాగా చూసేందుకు బాగా లేడు. వాస్తవంగా చెప్పాలంటే అతను వేసుకొన్న దుస్తులు అతిస్వల్పం. నడుంచుట్టూ చుట్టుకొన్న మురికి లుంగీ తప్పమరేమీ అతని వంటి మీద లేవు. అతని వక్షస్థలమూ, వీపుమీద ఏమీ లేకుండా చెమటపట్టి ఉన్నాయి. అయినా అతను హరికి ఉదారస్వభావంగల, వ్యక్తిగా కనిపించాడు. హరి, జాగు తన కిచ్చిన పళ్లెంతోకూర్చొని, అందులో ఉన్న పదార్థాన్ని త్వరగా తింటానికి తలవంచుకొన్నాడు. ఆ దీర్ఘమైన, ప్రయాసతో కూడిన రోజు చివరా అతను తింటున్న మొదటి భోజనంఅది. పళ్లెంలో ఉన్న పదార్థాన్ని రొట్టె ముక్కలతో తుడవటం పూర్తి చేయగానే, జాగు వచ్చి అతని పళ్లెంలో మరోచపాతీ వేసాడు. హరికి బాగా ఆకలిగా ఉండటంవల్ల దాన్ని గూడాతినేసాడు. ఇంటి దగ్గర అతనికి యిలాంటి దానికంటె మంచి ఆహారం లభించేదికాదు. తాను తన జీవితంలో యింతగా ఆకలిగొనలేదు, అలసిపోలేదు.

ఖాతాదార్లలో చివరివ్యక్తి వెళ్లిపోయిన తర్వాత పొడవాటి కొయ్య బల్లల్లో ఒక దాని మీద పండుకొమ్మని సూచిస్తూ జాగు తన చేత్తో సూచించినప్పుడు, హరి వెంటనే అతను చెప్పినట్లు చేసాడు. ఆ బల్లగట్టిగా ఉంది; వీధిలోంచి వెలుగు, ధ్వనులు వెలువడుతున్నాయి. అయినప్పటికీ వెంటనే గాఢంగా నిద్రపోయాడు, హరి.

# ఎనిమిదవ అధ్యాయం

హరి బాగా అలసిపోయి, బలహీనంగాను, ఆదుర్దాతోను ఉండటం వల్ల తాను బొంబాయిలో మొదటి రాత్రి ఎక్కడగడిపిందీ వాస్తవంగా తెలియలేదు. మరుసటి రోజు ఉదయం మేల్కొన్నప్పుడు, ఆప్రదేశాన్ని మొట్ట మొదటి సారి చూసాడు.

శ్రీకృష్ణాఫలహారశాల హరి చూసిన వాటన్నింటిలోను అతి తక్కువ స్థాయిలో, మురికిగా ఉన్న ఫలహారశాల. తుళ్లోను, ఆలీబాగ్-రేవాస్ మధ్య ఉన్న జాతీయ మార్గం వెంటగూడా యింత కంటె బాగున్నహోటళ్లున్నాయి. సాధారణంగా అవి మామిడి చెట్టు లేక ఎర్రమల్లె చెట్టు కింద కొయ్యతో నిర్మింపబడిన పాకల్లో-ఉంటాయి. వాటిల్లో పిడికెడు బంతి పూలు, మందారపూలు, పాతసిరా సీసాల్లో కూర్చబడి పూలకుండీలకు బదులు అమర్చి ఉంటాయి; రంగు రంగుల సిగరెట్ పెట్టెలు, గాస్ నింపిన పానీయాల సీసాలు ఆకర్షణీయంగా అలమర అరల్లో అమర్చి- ఉంటాయి; యింకా గోడకు విభిన్నమైన రంగుల్లో దేవుళ్లు, దేవతల పటాలు ఉంటాయి; వాటి చిత్రం చుట్టూ చమ్కీ దండలుంటాయి. వాటి ముందు బాగా సువాసన వెదజల్లు తున్న అగరొత్తులు వెలుగుతుంటాయి.

కాని బొంబాయిలోని గోవాలియా చెరువు ప్రాంతంలో ఉన్న శ్రీకృష్ణా అల్పాహార శాలలో ఏపత్రిక నుండైనా కత్తిరించి గోడకు అంటించిన కృష్ణుని చిత్రం గూడా లేదు. లేకపోతే బహుశ అలాంటిది ఉంటే గోడలనిండా పేరుకు పోయిన దుమ్ము, మసిపొరలక్రింద అది అదృశ్య మయ్యిందేమో? "కప్పంతా సాలెగూళ్లు దట్టంగా అల్లుకొని ఉన్నాయి. అవి ఆహోటలునుంచి వెలువడే మసిని ఆకర్షించటంతో తలల మీద ఉన్ని దుప్పటి లాగా కనిపిస్తున్నాయి. వెనుక గదిలో బాహాటంగా ఉండే పొయ్యిల మీద అల్యూమినియమ్ పాత్రలో రోజంతా చిక్కడు గింజల కూరలాంటి దాన్ని వండటం, చేత్తో చేసిన చపాతీలను

కాల్చటం వల్ల అక్కడి గచ్చు, కొయ్య బల్లలు గూడ నల్లగా మారిపోయి ఉన్నాయి."

అది ఖచ్చితంగా బొంబాయిలోని అల్పాహార శాలలన్నింటిలోకి చౌక అల్పాహారశాల- బిచ్చగాడు గూడ అక్కడ భోజనం చేయగలడు. సాధారణంగా అక్కడికి వచ్చే ఖాతాదారులు, బిచ్చగాళ్లు, బొగ్గుబస్తాలు, గాస్‌స్తంభాలు మోస్తూ మధ్యలో ఆగి ఫలహారం చేసేకూలీలు, చేతులతో లాగే పొడవాటి కొయ్యబళ్ల మీద వస్తువులను నగరంలో ఒక చోటినుండి మరోచోటికి చేరవేసే వాళ్లూను. వీళ్లకు నిర్ణీతమైన పనిగంటలు ఉన్నట్లు లేదు-తెల్లవారక ముందు కొంత మంది భోజనం కొరకు రావటంతో, రాత్రిమిగిలిన పదార్థాలును వాళ్లకు వడ్డించారు; అలాగే చివరి ఖాతాదారు, నగరం మొత్తం అలసిపోయి, కలత నిద్రలోకి జారుకొన్నపుడు, మధ్య రాత్రి తర్వాత వచ్చాడు. అందువలన యజమానికి తన అల్పాహారశాలను ఊడ్చటానికి గాని, తుడవటానికి గాని, దాన్ని బొమ్మలతోను,



పుష్పాలతోను అలం కరించటానికి సమయం, డబ్బూ లేవు.

అతను గూడ రోజంతా కష్టపడి పని చేస్తాడు. పెద్ద పళ్లెంలో పిండి కలిపి, వాటిని చపాతీలుగా తయారుచేసి, పగలు, రాత్రి మండు తూండే పొయ్యిల మీద వాటిని కాల్చటంలో అతనికి సాయం చేసేందుకు యిద్దరు కుర్రవాళ్లున్నారు.

మరుసటి రోజు ఉదయం అతను అడగ కుండానే అల్పాహారశాల యజమాని చపాతీని, ఒక గ్లాస్ టీని ఇచ్చినపుడు, "నీవు యిస్తున్న యీ ఆహార పదార్థాలన్నింటికి చెల్లించేందుంకు నాదగ్గర డబ్బులేదు. దానికి బదులుగా మీ వంట గదిలో పనిచేయనిస్తారా?" అని హరి అడిగి నప్పుడు ఆయజమాని, ఒక క్షణం మాత్రమే ఆలోచించాడు! అలా ఆలోచిస్తూ కొంచెం అయిష్టత వ్య క్తం చేసినట్లు కనిపించాడు. తర్వాత అతను "అవును వంటగదిలో యింకో కుర్రవాని అవసరం ఉంది. ఈ పాత్రలను శుభ్రం చేయటంతో ప్రారంభించు, తర్వాత పిండి కలిపి, వాటిని చపాతీలుగా చేయటంలో సహాయంచేసి, నీకు యిష్టమైతే నీవు ఇక్కడ ఉండి, నీభోజనం కొరకు పనిచేయవచ్చు. యితర కుర్రవాళ్లు లాగే రోజుకొకరూపాయి," అన్నాడు.

దానిని పురస్కరించుకొని హరి ఆ అల్పాహారశాల వెనుక భాగాన ఉన్న వంట గదిలో పని చేయటానికి వెళ్లాడు. పాత్రలను గీరటానికి నల్ల బడిన కొబ్బరికాయ పెంకులు, - వంటపొయ్యినుండి వెలువడిన మసి తప్ప వేరేమీ లేవని తెలుసుకొని, హరితోనే వీలయినంత చక్కగా పాత్రలను శుభ్రం చేసాడు; లీల అయితే తనపని చక్కగా ఉందని భావించేది కాదు అనుకొన్నాడు. తరువాత వెడల్పాటి పెద్ద పళ్లాల్లో గుట్టల్లా ఎత్తుగా పోసిఉన్న పిండిని కలపటంలో వంటగదిలోని కుర్ర వాళ్లకు సహాయంచేశాడు. ఆపని చాలాకష్టం కావటంచేత వాళ్లు మూలుగుతూ, చెమటపట్టే లాగ చేయవలసివచ్చింది. అలాపనిచేస్తున్న సమయంలో వాళ్లు పరస్పరం మాట్లాడుకోలేదు. చివరకు మిగిలిన యిద్దరు కుర్రవాళ్లు మాట్లాడింది తాను అర్థం చేసుకోలేని తమిళ భాష అని హరి అర్థంచేసుకొన్నాడు. వాళ్లకు తనకు తెలిసిన రెండు భాషలు, హిందీ, మరాఠీ ఏమీ తెలిసినట్లు లేక పోవటంతో నిశ్శబ్దం నెలకొంది. వాళ్లకు హరి పట్ల స్నేహభావంగాని, ఆసక్తిగాని ఉన్నట్లు కనిపించలేదు. అలా కాని పక్షంలో వాళ్లు మాట్లాడటానికి గూడా శక్తి లేనంతగా అలసిపోయి ఉండవచ్చు, లేకపోతే మాట్లాడటానికి వీలు కానంత విచారగ్రస్తులై ఉండవచ్చు, వాళ్లు పొయ్యి ముట్టించారు. వీరిలో ఒకడు చపాతీలు తయారు చేస్తుంటే, యింకొకడు వాటిని పట్ట కారుతో పొయ్యిమీద కాలుస్తున్నాడు. అలాకాల్చిన

చపాతీలను ముందున్నగదిలో అల్పాహారాన్ని సేవించే బల్లల దగ్గర ఖాతాదార్లకు సరఫరా చేసేపనిని హరికి అప్పగించటం జరిగింది. ఆ చిన్న స్థలంలో చాలపని, అధికమైన వేడి ఉండటం వల్ల ఒక్కరికి కూడ మాట్లాడే శక్తిగాని, సమయం గాని ఉన్నట్లు కనిపించలేదు. హరి గూడ మౌనంగా ఉండిపోయాడు.

ఆ అల్పాహార శాల ప్రక్కన ఉన్న దుకాణం లోని మనిషి స్నేహభావంతో ప్రవర్తించకపోయినట్లైతే హరి గూడ మౌనంగా ఉండి పోవలసి వచ్చేది. ప్రక్కనున్న దుకాణం చేతి గడియారాలు బాగుచేసేది. దాని తలుపు మీద 'డింగ్ డాంగ్ చేతిగడియారాల దుకాణం' అని వ్రాయబడి ఉంది. రోడ్డు ప్రక్కన వ్యర్థ పదార్థాలు పోయటానికి నిర్మించిన పెద్ద కాంక్రీట్ చెత్త కుండీలో వ్యర్థ పదార్థాలను వేయటానికి, వ్యర్థపదార్థాల పాత్రను పట్టుకొని హరి బయటకు వచ్చి నపుడు, నల్లని చిన్న టోపీ ధరించి, కంటికి వస్తువులను పెద్దవిచేసి చూపించే సాధనాన్ని పెట్టుకొని, అరచేతి లోని చేతి గడియారాన్ని మరమ్మత్తు చేస్తూ, బల్ల దగ్గర నిలబడ్డ వ్యక్తి, హరి వైపు చూసి చిరు నవ్వునవ్వాడు. హరి గూడ తిరిగి చిరునవ్వు నవ్వాడు. ఆవృద్ధుడు అన్ని విధాలా 'నల్ల గుఱ్ఱం' దగ్గర సమావేశంలో చక్కగా మాట్లాడిన సయ్యిద్ ఆలీ లాగ కనిపించటం వల్ల వెంటనే యిక్కడ తాను నమ్మదగిన, తనను అర్థంచేసుకొని, సహాయపడటానికి ప్రయత్నించే మరొక మంచివ్యక్తి, ప్రభావితం చేయగల వ్యక్తి ఉన్నాడని భావించాడు.

"అయితే శ్రీకృష్ణాఅల్పాహార శాలలోకి మరో క్రొత్త కుర్రవాడు వచ్చాడన్నమాట," అన్నాడు ఆ వృద్ధుడు. అలా అంటూ తన చేతిలో ఉన్న చిన్న చేతి గడియారాన్ని పరిశీలించటం కొనసాగించాడు. అలాదాన్ని బాగుచేస్తూనే, తన దుకాణం గోడలకు తగిలించిన గోడగడియారాలు టిక్, టిక్ అంటూ శబ్దం చేస్తూండటంతో వాటి వంక, ప్రదర్శన కొరకు గ్లాసులు బిగించిన పెట్టెల్లాంటి బీరువాల్లో ఉన్న చేతి గడియారాలు మెరుస్తూ ఉంటే వాటి వంక నోరు తెరచి చూస్తున్న హరితో మాట్లాడటం ప్రారంభించాడు. "నగరానికి కొత్తా?" అని అడిగాడు అతను, బొంగురుగా కీచుమంటున్న పెద్ద గొంతుతో.

హరి అవునంటూ తల ఊపాడు.

"ఏ ఊరు నీది? జాగు ఊరా?"

"అహఁ, కాదు. జాగు నాకసలు తెలియదు. నాది ఆలీబాగ్ దగ్గర ఉన్నతుళ్ గ్రామం," అన్నాడు హరి ఆదుర్దాగా. అలామాట్లాడినపుడు హరి నోటినుండి వెలువడిన మాటలు, సముద్రంలో పుట్టిన, ప్రకాశవంతమైన, ఆనందాన్నిచ్చే

చిన్న అలల్లాగే వెలువడ్డాయి. అలా మాట్లాడి నందుకు హరి గర్వపడ్డాడు. అలా హరి ఎందుకు గర్వపడ్డాడో "నల్లగుఱ్ఱం" దగ్గర తటస్థపడిన సయ్యిద్ ఆలీ అర్థం చేసుకొని ఉండేవాడు. ఈ వ్యక్తికి ఆలీబాగ్‌ను గురించి ఏమీ తెలియనట్లుంది. అందువల్ల అతను ఆశ్చర్యపడినట్లు, ఆసక్తిగాను ఉన్నట్లు స్పష్టమౌతోంది. 'మలబార్' కొండ మీది పెద్ద భవనపు కాపలా మనిషి భోజనం చేయటానికి నన్ను ఇక్కడికి తీసుకొని వచ్చాడు - నేను యిక్కడ పని చేసేందుకు ఉండి పోయాను."

"ఇతర వ్యక్తులు కూడా సహాయం కొరకు జాగు దగ్గరకు వచ్చారు," అంటూ ఆవృద్ధుడు, పొడవాటి, సన్నని సూదితో చేతి గడియారపు యంత్రాన్ని పొడిచి చూస్తున్నాడు. "అతను మౌనంగా ఉండే వ్యక్తి, ఎపుడూ ఎవరితోను మాట్లాడడు కాని అతను చాలా మందికి మంచి సహాయం చేసాడు. అతని దగ్గర పనిచేసే కుర్రవాళ్లిద్దరికీ సహాయం చేసినట్లు చెప్పాడు. వాళ్ల తలిదండ్రులు రైలు ప్రమాదంలో చని పోయారు. పనికోసం నగరానికి వచ్చే వాళ్లందరిలాగే వాళ్లందరూ రైల్వేప్లాట్ ఫారం మీద నివసిస్తూండే వారు. ఒకరోజు వాళ్ల తలిదండ్రులు కుళాయి నుండి నీరు తెస్తూ పట్టాలు దాటుతూ రైలు క్రింద పడ్డారు. అది జరిగిన స్టేషన్ అదిగో అక్కడే ఉంది," అంటూ అతను సన్నసూదిని పట్టుకొని ఉన్న సున్నితమైన, పచ్చని చేతిని వీధి దిగువ వైపు చూపించి, మళ్లీ మాట్లాడటం కొన సాగించాడు. ఆ సమయంలో ఉదయం తాను పని మీద వెళ్తూంటే యీ కుర్రవాళ్లు జాగుకు కనిపించారు. అతను వాళ్లను తిన్నగా ఇక్కడకు తీసుకొని వచ్చి వాళ్లకు తిండి, ఆశ్రయంతో పాటు పని కూడా కల్పించాడు.

చేతి గడియారాలు బాగు చేసే వృద్ధుడు చెప్పిన కథ విని హరి దెబ్బ తిన్నట్లు అయిపోయాడు. తాను గూడ జాగు సంరక్షణలో ఉన్నమరో అనాధగా భావింపబడటం అతనికి యిష్టంలేదు. తన తల్లిదండ్రుల్లో తండ్రి త్రాగుబోతు, తల్లి అశక్తురాలై నప్పటికీ మొత్తం మీద తనకు తల్లిదండ్రులున్నారు. అలాగే రైల్వే ప్లాట్ ఫారమ్ మీది స్థలం కాకుండ సరియైన యిల్లుంది. వాటిని గురించి ఆలోచిస్తూ అకస్మాత్తుగా "పోస్ట్ కార్డ్ కొనాలను కొంటున్నాను. తపాలా కార్యాలయం ఎక్కడ ఉందో చెప్పగలరా?" అని అడిగాడు.

"ఆ-హా," అంటూ వృద్ధుడైన గడియారాలు మరమ్మతు చేసే వ్యక్తి నవ్వాడు, కంటికి పెట్టుకొన్న సాధనం క్రిందుగా కన్ను గీటుతూ. "అయితే ఆకస్మాత్తుగా నీకు ఉత్తరం వ్రాయవలసిన వ్యక్తి ఉన్నాడని జ్ఞాపకం వచ్చింది; అవునా? అవును

నీవు తప్పక వ్రాయాలి. నిజమే తప్పక వ్రాయాలి. ఈ రోడ్ మీద తిన్నగా వెళ్లి, ఎడమ వైపుకు తిరిగితే అక్కడ విద్యుచ్ఛక్తి ఉపకేంద్రం ప్రక్కన తపాలా కార్యాలయం ఉంది. పోస్ట్ కార్డ్ కొనటానికి డబ్బులున్నాయా, లేక నేను అప్పుయిచ్చేదా?" అని అడిగాడు.

జాగు తనకు జీతం చెల్లించిన వెంటనే తిరిగి యిస్తానని చెప్పి, హరి అతని దగ్గరి నుండి కృతజ్ఞతా పూర్వకంగా, అతనిచ్చిన నాణాన్ని తీసుకొని తపాలా కార్యాలయానికి పరుగెత్తాడు. కార్డ్ కొన్న తరువాత అతనికి వ్రాయటానికి కలం అవసరమైంది. అందుకు తాను పని చేస్తున్న అల్పాహారశాల యజమానికంటే చేతి గడియారాలు బాగు చేసే వ్యక్తి దగ్గర ఒకటి కంటె ఎక్కువ ఉంటాయని అతని దగ్గరకు తిరిగి వెళ్లాడు. బాగా ఉక్కపోస్తున్న మధ్యాహ్న కాలంలో హరి పోస్ట్‌కార్డ్ కొరకు వెళ్లటం జరిగింది. అల్పాహారశాలలో ఎవరూ లేరు, ఇద్దరు అనాధ కుర్రవాళ్లు కూడా ఎక్కువ వేడి వల్ల అలసటవల్ల మేజా బల్ల క్రింద నిద్రపోయారు. వారి డింగ్ డాంగ్ చేతి గడియారాలు మరమ్మతు దుకాణంమెట్లు మీద కూర్చొని అతను యిచ్చిన బాల్ పాయింట్ కలంతో జాగ్రత్తగా ఉత్తరం వ్రాశాడు.

"ప్రియమైన అమ్మకు,

నేను బొంబాయిలో ఉన్నాను, ఇక్కడ ఉద్యోగం చేస్తున్నాను. నేను సంపాదించిన డబ్బులు నీ కొరకు తెస్తాను. నీవు ఆరోగ్యంగానే ఉన్నావని ఆశిస్తున్నాను, నేను బాగానే ఉన్నాను. అక్కా చెల్లెళ్లను అడిగినట్లు చెప్పు."

కార్డ్ చివర, మిగిలి పోయిన ఖాళీని నిరపేందుకు, హరి తన పేరును పెద్ద అక్షరాలతో వ్రాసాడు కాని, తన చిరునామా వ్రాయకుండా, తపాలా పెట్టెలో వేయటానికి వెళ్లాడు. అలా చేయవలసినది చేసినందుకు సంతోషము, యిలా ఉత్తరం వ్రాయటం అంటే యింటికి వెళ్లకుండా బొంబాయిలో ఉండటం జరుగుతుంది కాబట్టి భయమూ కలిగాయి.

బేల, కమల, డిసిల్వాలు కారునుండి దిగుతుంటే చూసేందుకు బయటికి వచ్చి లీల ప్రక్కన నిలబడ్డారు. వంట మనిషి అప్పటికే కయ్యకు అడ్డంగా దుంగ అవతలివైపు నుండి పిలుస్తూ, వాళ్ల పూరింటి వైపు నడుస్తున్నాడు. అలా నడవటంలో ఒరాతి మీద ముడుచుకొని కూర్చొన్న ముసలి, బూడిద రంగు కొక్కెర భయపడిపోయి సరుగుడు, మొగలి పొదల్లోకి, రెక్కలాడించు కొంటూ ఎగిరి పోయింది.

"మీ సోదరుడెక్కడ?" అని అడిగాడు వంటవాడు. "వచ్చి సామాన్లు యింట్లోకి

చేరవెయటానికి సాయం చేయమని అతనికి చెప్పండి," అన్నాడు.

"అతను యిక్కడ లేడు" అని చెప్పాలని మొదలెట్టి, అలా అనటం మానివేసి, బేల, కమలను కొంచెం నెట్టి "వెళ్లి సాయం చేయండి. వాళ్ల సామాన్లులోపల పెట్టండి-నేను యిప్పుడే వస్తున్నానని వాళ్లకు చెప్పండి." అంది మెల్లగా తన తల్లికి ఏమైనా అవసరమేమో అని తెలుసు కొనేందుకు ఆమె వాళ్ల యింట్లోకి వెళ్లి, తల్లికి మంచినీళ్లిచ్చి, చీరె, బొడ్లో దోపుకొని, కయ్యి దాటి డిసిల్వాలకు సాయం చేయటానికి వెళ్లింది. ఆరోజు ఉదయం సహాయం కొరకు ఆలీబాగ్ వెళ్లాలన్న తన ఉద్దేశాన్ని త్వరగా విరమించుకొని, ఆమె డిసిల్వాలనుండి ఎక్కువ సాయం లభించ వచ్చునని భావించి. వాళ్లను అడగాలని నిర్ణయించుకొంది. డిసిల్వాలు ధనవంతులు, వాళ్లకు కారుంది; అందువల్ల వాళ్లు సాయం చేసే అవకాశం ఉంది. సాయం పొందటానికి ప్రయత్నించాలని లీల అనుకొంది.

లీల యిల్లు ఊడ్చింది; మూలల్లో అల్లుకు పోయిన సాలెగూళ్లను దులిపి, వంటగదిలో వాడు కోవటానికి బావి నుండి నీళ్లు తెచ్చింది. ఆ తర్వాత అక్కడ నిలబడి గమనిస్తూ, చిరాకుపడుతూ పర్యవేక్షిస్తున్న వంట వాణ్ణి "వీళ్లు ఎన్ని రోజులు ఇక్కడ ఉంటారు?" అని అడిగింది.

"పూర్తిగా పదిహేను రోజు లుంటామని చెప్పారు," అంటూ అతను గొణిగినట్లు చెప్పాడు. "ఇది వాళ్లకు సెలవుల సమయం - పాఠశాలలు మూసి వేశారు - విదేశాలకు వెళ్లే బదులు వాళ్లు మొదట పదిహేను రోజులు యిక్కడ గడపాలను కొంటున్నారు. ఇక్కడ ఈ అడవిలో ఎలా గడపాలో నాకు తెలియదు. దుకాణా లేవీ?" అని వాళ్లను అడిగాడు. "నీ సోదరుడు మాకు దుకాణాల నుండి సరుకులు తెచ్చేవాడు - యిప్పుడేమో అతను యిక్కడ లేడని చెప్తున్నావు. మేము రొట్టె, తాజాగ్రుడ్లు, కూరగాయలు ఎక్కడ తెచ్చుకోవాలి?"

"ఇక్కడ ఎలా పనులు చేసుకోవాలో నాకు తెలియదు. కాని వాళ్లు ఆనందిస్తుంటే నేను పనులు ఎలాగో నిర్వహించాలి," అంటూ కొబ్బరి చెట్ల క్రిందికి పేము కుర్చీలు, దిండ్లను తీసుకుని వెళ్తున్నకుటుంబ సభ్యులవైపు బొమ్మ బకెట్లు, పారలు రబ్బరు బంతులతో చుట్టూరా పరుగిడుతున్న పిల్లల వైపు చూసాడు.

లీల పాదాల మీద గొంతు కూర్చొంటూ, వంటవాడి వైపు చూసింది. "నాచెల్లెళ్లు, నేను, సాయం చేస్తాం మేము బజారుకు వెళ్లి, నీకు కావలసినవి తెచ్చి పెడతాం. తుళ్‌లో చాలా వరకు అన్నీ లభిస్తాయి. కాని అప్పుడప్పుడు మీ అయ్యగారు కారులో ఆలీబాగ్ వెళ్లి యిక్కడ దొరకనివి కొనుక్కోవచ్చు." అంది.

"అవును అలాగే చేయవలసి ఉంటుంది" అన్నాడతను అసంతృప్తిగా. "మధ్యాహ్న భోజనానికి కావలసిన కూరగాయలివిగో - వాటిని కడిగి, తొక్క తీయండి. సాయంత్రం నీవు వెళ్లి చేపలు తెస్తావా?" అని అడిగాడు.

"నేను నీకు సముద్ర తీరం మీద, చేపలు వేటాడే పడవలు తిరిగి వచ్చినప్పుడు లభించే తాజా చేపలు తెస్తాను," అని లీల వాగ్దానం చేసింది. "ఇక్కడ మా బజారులో ఏదో ఒక రొట్టె దొరుకుతుంది. కాని నగరంలో లభించే కర్మాగారాల్లో తయారైన రొట్టెలు కావాలంటే వాటిని కొనటానికి బహుశ మీ అయ్యగారు కారు నడపు కొంటూ ఆలీబాగ్ వెళ్లవలసి ఉంటుంది," అంది.

"ఆయన వెళ్ల వలసే ఉంటుంది. - నేను యిప్పుడే వెళ్లి ఆయనతో చెప్తాను," అన్నాడు వంటవాడు.

కాని డిసిల్వాతో వంటవాడు ఆ విషయం చెప్తే, యిప్పుడే యిక్కడికి చేరి, దుమ్ము నిండిన మార్గంలో చాలా దూరం ప్రయాణం చేసి విశ్రాంతి తీసుకొంటున్న సమయంలో మళ్లీ కారెక్కి ప్రక్క పట్టణానికి వెళ్లడానికి అతను యిష్టపడలేదు. ఆయన అప్పటికే స్నానం చేసే దుస్తులు వేసుకొని, సముద్రంలో యీదటానికి తీరం మీద నడుస్తున్నాడు. మిగతా కుటుంబ సభ్యులు అప్పటికే స్నానం చేసే దుస్తులు ధరించి వాళ్లమీదికి ఎగిరి పడుతున్న అలల్లో కేకలు వేస్తూ నవ్వుతూ దూకుతున్నారు. వాళ్ల అందమైన, బంగారురంగు కుక్క, మెరుగుతూ యిసుక చిమ్ముతూ నురగలు చిమ్మే అలలు తనవైపు వస్తూంటే వాటికి దూరంగా, పరుగెడుతూ తీరంవెంట అటూ యిటూ తిరుగుతోంది.

వంటవాడు యిదంతా నిల్చొని గమనిస్తూ, గుర్రుమన్నాడు. "వాళ్లను చూడండి, వీళ్లు యింత దూరం వచ్చింది యిందుకేనా? వాళ్లు యింట్లోయింతకంటే సౌకర్యంగా స్నానంచేయవచ్చు. కాని వాళ్లు పిచ్చివాళ్లు- వాళ్లు అలాంటి వాళ్లే - పిచ్చి" అన్నాడు.

అయితే మరుసటి రోజు రొట్టె అయి పోవటంతో డిసిల్వా కారులో వెళ్లి ఆనందంగా రొట్టెలు తీసుకురావలసిన అవసరం ఏర్పడింది. "నీకు కావలసిన వన్ని చెప్పు. నీవు నన్ను యిబ్బంది పెట్టకుండా ఉండేందుకు నేను వెళ్లి నీవు చేయవలసిన కొనుగోళ్లు యీరోజు నేను ఆలీబాగ్‌లో కొంటాను," అన్నాడు.

ఈ మాటలు విన్న లీల వంటగది నుండి దూసుకువచ్చి డిసిల్వాముందు చేతులు కట్టు కొని నిలబడి, సిగ్గుతో క్రిందకి చూస్తూ, ఆమె అతన్ని అడగాలని

నిర్ధయించుకొన్నమాట అడిగింది. "అయ్యగారు మా అమ్మను ఆలీబాగ్ లోని ఆసుపత్రికి తీసుకొని వెళ్లగలరా? మీరు కారులో వెళ్తుంటే ఆమె, నేనూ మీతో రావచ్చా? ఆమెకు బాగా జబ్బుగా ఉంది; యిక్కడ ఆసుపత్రి లేదు వైద్యుడూ లేడు," అంది.

డిసిల్వా దిగ్భ్రమ చెంది ఏమి చెప్పాలో తోచక కొంచెం తడ బడ్డాడు. ఇంతలో ఆయన భార్య వసారాలోకి పరుగెత్తుకుంటూ వచ్చి లీల చెప్తున్న మాటలు వింటూ నిలబడింది. "ఆమెకు జబ్బుగా ఉందని నాకెందుకు చెప్పలేదు అని అడిగిందామె." నేనెప్పుడూ నాతోపాటు కొన్ని మందులు తెస్తాను - నేను కొంచెం సాయం చేసి ఉండేదాన్ని" అంది.

లీల ఆమె పట్ల కృతజ్ఞతా భావంతో చూసి, "ఆమె దీర్ఘకాలంగా అనారోగ్యంగా ఉంది - ఆమె చాల చిక్కి, బలహీన పడి పోయింది. ఆమెకు ఏమందు తీసుకొని రావాలో నాకు తెలియదు. వైద్యుడు ఆమెను చూడాలి. ఆలీబాగ్‌లో ఆసుపత్రి ఉంది - మీరు ఆమెను అక్కడకు తీసుకొనిపోతే మీ యింట్లో పని చేయవచ్చునని భావించాను - అప్పుడు మీరు నాకు యిచ్చే డబ్బు - ఆ డబ్బు వైద్యుడికి, మందులకు సరిపోతుందను కొన్నాను" అన్నది.

"అలాగే," అన్నాడు డిసిల్వా. "అలాగే మేము మందులకు డబ్బిస్తాం వెళ్లి మీ అమ్మను తీసుకొనిరా," అన్నాడు.

ఆరోజు చాలా ఉత్సాహంగా ఉంది. ఆ ఉత్సాహంతో పాటు కలిగిన శ్రమ ఆందోళన లేక పోయిన పక్షంలో లీల ఆనందించేది. ఆలీబాగ్ రెండుమైళ్ల దూరంలోనే ఉన్నా యింతకు ముందు లీల ఎన్నడూ ఆలీబాగ్ వెళ్లిన దాఖలాలులేవు; అంతకంటె నిశ్చయంగా యింతకు ముందెన్నడూ కారులో కూర్చోలేదు. అయినా ఆమె కారెక్కినప్పుడు, వెనుక సీటులో తన ఒడిలో తల పెట్టుకొని మూలుగుతూ పండుకొన్న తల్లిని గురించే లీల బాధ పడుతూ కూర్చుంది. ఆమె బాగా పాలిపోయి జబ్బుతో బాధపడుతూండటం వల్ల లీల ఆమె సజీవంగా ఆలీబాగ్ చేరుతుందా అని అనుకొంది. లీల తల్లికి దుప్పటి కప్పి, ఆమె తలను జాగ్రత్తగా పట్టుకొని నిమ గ్నమై ఉండటంవల్ల, వాళ్లు కారులో ప్రయాణం చేస్తూండగా, కారులోంచి రోడ్డుగాని, చెట్లను గాని, ఎద్దుల బండ్లను గాని, బస్‌స్టాప్‌లను గానీ చూడలేదు. లీల తల్లిని సజీవంగా ఆసుపత్రికి తీసుకుపోలేమోనని భయపడినట్లు డిసిల్వా కారును ఎక్కువ వేగంగా తోలాడు. అందువల్ల కొద్ది సేపటిలోనే వాళ్లు ఆసుపత్రికి వెళ్లే వెడల్పాటి, ప్రశాంతమైన

రోడ్ మీదికి చేరుకొన్నారు.

తాను వాళ్లు ఆసుపత్రికి చేరిన తరువాత లీల నిస్సహాయు రాలిగా భావించింది. డిసిల్వా ఆమెతో పాటు ఉండి సహాయం చేసి ఉండని పక్షంలో ఏమి చేయాలో ఆమెకు తెలిసేది కాదు. "ఇక్కడే ఉండు - నేను వెళ్లి రోగులను మోసుకొని వెళ్లే చట్రాన్ని, నర్సును తీసుకొనివచ్చి తర్వాత వెళ్లి డాక్టర్‌తో మాట్లాడతాను," అంటూ కారు వెనుక సీటులోంచి చూచి, నగరంలో ఉండే వ్యక్తి లక్ష్యపూరితంగా పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ వెళ్లేవిధంగా, ఆ ఆవరణలో ఓపికగా వరుసల్లో వేచి ఉన్న గ్రామస్తుల ప్రక్కగా నడచివెళ్లాడు.

అతను అన్ని ఏర్పాట్లు చేసాడు. కొద్ది సేపట్లో తెల్లని దుస్తులు వేసుకొన్న యిద్దరు వ్యక్తులు రోగులను మోసుకొని పోయే చట్రాన్ని తీసుకొని వచ్చి, లీల తల్లిని మెల్లగా దాని మీదికి చేర్చి ఆసుపత్రి లోకి తీసుకొని పోయారు. శాలువా, తువ్వాలు, దువ్వెన, యిత్తడిగ్లాసు ఉన్న మూటతో లీల వాళ్ల వెంట పరుగెత్తింది. తరువాత మెట్లు ఎక్కి వసారాలో ఆమె తల్లి వెంట వెళ్లింది. అలావెళ్లి రెండు వరుసలుగా మంచాలు, మెల్లగా తిరుగుతున్న విద్యుచ్ఛక్తి పంకాలున్న గదిలో ప్రవేశించింది. ఆగదికి ఉన్న కిటికీల అద్దాలకు ఆకుపచ్చ రంగు వేసి ఉండటం వల్ల వెలుతురు తక్కువగా ఉంది. చల్లగా ఉంది. రోగులను మోసుకొని పోయే చట్రాన్ని తెచ్చిన వాళ్లు లీల తల్లిని అక్కడ ఉన్న ఒక మంచం మీదకి మార్చారు. ఒక నర్సు త్వరగావచ్చి, ఆమెకు సౌకర్యంగా ఉండేలాగ చేసింది.

"ఇక్కడే ఉండు నేను డాక్టర్‌తో మాట్లాడతాను; తర్వాత నేను నిన్ను యింటికి తీసుకొని పోతాను" అన్నాడు డిసిల్వా, లీల ఆమాటలకు సమ్మతించినట్లు తలఊపి, భయంతోను, కంగారుతోనూ కంపిస్తూ, మంచం ప్రక్కన కూర్చొంది.

"అలా భయపడకు," అంటూ చిరునవ్వు నవ్వింది. నర్సు, మంచం మీద దుప్పట్లు సరిచేసి, చిన్నమేజాబల్ల మీద వస్తువులను అమర్చుతూ, "మేము ఆమెకు పరి చర్యలు చేస్తాం - యిక్కడ మంచి డాక్టరులు ఉన్నారు - నీవు యిప్పుడు విచారించ నవసరము లేదు," అంది.

తర్వాత డాక్టర్ వచ్చి కళ్లు తెరవకుండా, మాట్లాడకుండా నిశ్చలంగా పాలి పోయినట్లున్న లీల తల్లిని పరీక్షించాడు. ఆయన డిసిల్వాతో ఇంగ్లీషులో చెప్పిన విషయాలను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తూ, పంటితో పెదవిని నొక్కిపట్టి లీల డాక్టర్ వంక చూస్తూ నిలబడింది. చివరకు ఆయన వెనక్కు తిరిగి ఆమెతో మరాఠీలో మాట్లాడాడు. "ఈమెను ఇక్కడే ఉంచండి. ఆమె చాలా కృశించిపోయింది. ఆమెకు నయం చేయటానికి చాలా కాలం పడుతుంది. జబ్బేమిటో తెలుసుకొని,

వైద్యం ప్రారంభించటానికి మేము చాలా పరీక్షలు చేయవలసి ఉంటుంది. ఇవి అన్ని చాలా రోజులు పడతాయి. మేము మీకు నివేదిక పంపుతాం - లేకపోతే వారం తర్వాత వచ్చి, తీసుకోవచ్చు, ఏమి ఆందోళన పడకండి మేము నయం చేయలేని రోగమేదీలేదు," అన్నాడు.

దానికి అసమ్మతి సూచకంగా లీల తల అడ్డంగా ఊపింది. ఆమెకు తన తల్లిని వదలి వెళ్లటం యిష్టంలేదు. కాని డిసిల్వా "ఇంటిదగ్గర నీ చెల్లెళ్లున్నారు - నీవు తప్పకరావాలి. నేను మళ్లీ కొద్ది రోజుల్లో నిన్ను ఇక్కడికి తీసుకొనివస్తాను. నేను మాటయిస్తున్నాను వెళ్దాంరా," అన్నాడు.

లీలకు అతనితో వాదించే ధైర్యంలేదు. అందువల్ల ఆమె అతనితో పాటు కారు ఎక్కింది. కాని యింటికి వచ్చేదారి పొడవునా ఏడుస్తూనే ఉంది.

ఆరాత్రి లీల తండ్రి వాళ్ల యింట్లోంచి బయటకు వెళ్తూ, పుల్లలతో పొయ్యి ముట్టించటానికి ప్రయత్నం చేస్తున్న లీల వైపు చూసి, ఆగి "మీ అమ్మ ఎక్కడికి వెళ్లింది," అన్నాడు గుర్రుమంటున్నట్లు.

మోకాళ్లు నేలమీద ఆన్చి కూర్చొన్న లీల, పైకి చూసేధైర్యం లేక "నేను ఆమెను ఆలీబాగ్ లోని ఆసుపత్రికి తీసుకొని వెళ్లాను" అంది మెల్లగా.

ఆమాటలకు అతను కోపంతో ఊగిపోతూ లీల దగ్గరకి వచ్చినప్పుడు, చెట్టు క్రింద పడిపోతున్నప్పుడు వచ్చే శబ్దంలాగ పెద్ద శబ్దం వినపడింది. మిణుకు, మిణుకు మంటున్న కొద్దిపాటి మంటల వెలుగులో గోడమీద అతని నీడ చాలా పెద్దదిగా కనిపించింది. "నన్ను అడగకుండా ఆమెను ఎందుకు పంపించావు?" అంటూ అతను అరిచాడు.

"మీరు - మీరు నిద్రలో ఉన్నారు, నాన్నా" అంది లీల మెల్లగా అతను మరోసారి అరిచాడు, "నేను ఆమె దగ్గరికి వెళ్తాను," అన్నాడు పెద్దగా. "నాకు చెప్పకుండా ఆమెను నీవెందుకు తీసుకెళ్లావు?" నేను ఆలీబాగ్ వెళ్తాను - నేను ఆమె ఎక్కడుందో తెలుసుకొంటాను. ఓసి మందమతి, ఆమెను ఒంటరిగా వదలివేయ కూడదు," అన్నాడు.

తన తండ్రి ఆస్పత్రికి వెళ్లి అక్కడ త్రాగి గొడవ చేస్తాడేమోనని భయపడి, "నర్సులు, వైద్యులు, ఆమెకు పరి చర్యలు చేస్తారు," అంది లీల.

"తిరిగి సమాధానం చెప్పకు," అంటూ అరిచాడు, లీల తండ్రి. "నీకేమి తెలుసు. అన్ని విషయాలు చూసుకోగలనని ఎందుకు అనుకొంటున్నావు. నీవు చూసుకోలేవు," అంటూ కోపంతో మట్టి కుండను తన్నటంతో అది క్రింద పడి ముక్కలవటంతో, అవివంటగది అంతటా పడిపోయాయి. దానితో అతనికి కోపము

యింకా ఎక్కువై, కుండ పెంకులను యింకాచిన్న ముక్కలుగా త్రొక్కుతూ, "నీవు ఆమెను ఒంటరిగా ఎలా వదలి వేయగలవు? ఆమెకు ఏమైనా అవసరమైతే ఏంచేస్తుంది? ఆమె నన్ను అడిగితే? నీవుదాన్ని గురించి ఆలోచించావా?" అంటూ కేకలు వేసాడు. అలా కేకలు వేస్తూ పైఅరలో ఉంచిన ఒక కుండను తీసుకొని లీలకు సమీపంలో నేల మీద కొట్టటంతో ఆమె భయంతో క్రుంగి పోయింది.

"త్వరగా ఏదో ఒక ఆహారం తీసుకురా - నేను దాన్ని ఆమె దగ్గరికి తీసుకు వెళతాను," అన్నాడు.

"ఆలస్యం అయింది, నాన్నా" అంది లీల ఏడుస్తూ.

"ఆలస్యమేమీ కాలేదు. తిరిగి సమాధానం చెప్పకు," అని కేకలు వేస్తూ, పై అరమీద వరుసగా పేర్చిన గ్లాసులను క్రిందికి త్రోసాడు.

"వెంటనే భోజనం తయారు చెయ్యి నేను ఆలీబాగ్‌లో ఉన్న ఆమెకు భోజనం తీసుకు వెళుతాను," అంటూ బిగ్గరగా అరుస్తూ, వస్తువులన్నీ చిందర వందర చేస్తూ, యిల్లంతా కోపంతో తిరుగుతుంటే కళ్లలో నీరు నిండి, సరిగా చూడలేకపోతున్నా లీల త్వరగా చపాతీలు చేసి, వాటిని కాల్చనారంభించింది.

వంట చేయటానికి ఇంటిలో సరుకులు నిండు కొన్నాయి. అయినా లీల ఎలాగో భోజనం తయారుచేసి, మూటకట్టి వాళ్ల నాన్నకు యిచ్చింది. అది తీసుకొని అతను చీకటిలో దారివెంబడి కోపంతో బుసలుకొడుతూ, వాళ్లనందరినీ తిడుతూ నడిచి వెళ్లాడు. అలా అతను వెళ్తూంటే తుళ్ గ్రామంలో ఊరకుక్కలు లేచి, మొరగ నారంభించాయి.

అకస్మాత్తుగా లీలకు ఏదోజ్ఞాపకం వచ్చింది. వంటగది గోడకు తగిలించిన లాంతరును తీసుకొని, ఆమె కయ్యకు అడ్డంగా ఉన్న, కొయ్య దుంగ దగ్గరకు పరుగెత్తి "ఖానేకర్ సోదరులు డబ్బు కొరకు మళ్లీ వస్తే ఏంచేయమంటావు," అని అడిగింది.

ఆమెకు చీకటిలో తన తండ్రి ముఖం కనిపించలేదు. అతనేమి చెప్పింది అర్థం కాలేదు. కాని అతను ఒక్క క్షణం ఆగినట్లు తెలిసింది. అప్పుడు అతను చీకటిలో అటూయిటూ ఊగిసలాడి తలమీదికి చేయెత్తి ఊపుతూ "ఏం చేయాలా? వాళ్లను నాపొలం ఖాళీ చేయమని చెప్పు, అంతే," అన్నాడు బిగ్గరగా.

"నాన్నా," అంటూ అరిచిందామె, కంపిస్తున్న స్వరంతో "నీవు వాళ్లకు సారాకు డబ్బు బాకీ ఉన్నావని పోయిన సారి వాళ్లు పింటోను చంపి వేశారు," అంది.

"అది అబద్ధం నేను వాళ్ల కేమీ బాకీ లేను," అని అరిచాడతను పెద్దగా,

మొగలితోపు ప్రక్క భూతంలాగా కదుల్తూ. తర్వాత కంఠస్థాయిని తగ్గించి" వెళ్లేటపుడు వాళ్ల యింటికి వెళ్లి, వాళ్లకు యివ్వవలసిన డబ్బు చెల్లిస్తాను మీ తమ్ముడు వచ్చేంత వరకు మిమ్మల్ని చూస్తూంటమని వృద్ధురాలు హీరాబాయ్‌కి చెప్తాను. ఆవెధవ ఎక్కడున్నాడు? "అంటూ అస్పష్టంగా మాట్లాడుతూ తోపులోని మొక్కలను త్రొక్కుకొంటూ, ఖానేకర్లయింటికి వెళ్లాడు."

లీల తగాదా పడుతున్నట్లు శబ్దాలేమైనా వినిపిస్తాయేమోనని క్షుభితమైన మనస్సుతో నిలబడింది కాని అలాంటి శబ్దాలేమీ వినిపించలేదు. అయితే వాళ్లు రాత్రి పూట యీసమయంలో యింట్లో ఉండరు; బయటకు వెళ్లి మద్యం సేవిస్తూంటారు. బహుశ వృద్ధురాలు హీరాబాయి యింట్లో ఉండవచ్చు.

ఆమె ఆయింటిలోని మగవాళ్లంత చెడ్డదికాదు. తనతండ్రి తప్పక అలవాటు ప్రకారం తిన్నగా సారాషాపుకే వెళ్తాడని భావిస్తూ లీల తమయింట్లోకి తిరిగి వెళ్లింది.

లీల తండ్రి మరుసటి రోజుగానీ, ఆమరుసటి రోజుగాని తిరిగి రాలేదు. డిసిల్వా, లీలను వాళ్ల తల్లిని చూచి, నివేదికలు సేకరించు కోవటానికి తీసుకొని వెళ్లినపుడు, తనతండ్రి తల్లి ఉన్నగది ముందు వసారాలో కూర్చొని ఉండటంచూచి భయపడింది. వాళ్లిద్దరూ రావటం చూచి లేచి అతను ద్వారంలో మౌనంగా నిలబడ్డాడు. లీల మాట్లాడకుండా లోపలికి వెళ్లింది. అలా లోపలికి వెళ్తున్నప్పుడు ఆస్పత్రిలో ఉన్న ఈసమయంలో మాత్రం తన తండ్రి దగ్గర సారాయి వాసన రాకపోవటం గమనించింది. ఆయన వెంట్రుకలు అకస్మాత్తుగా తెల్లగా మారి పోయినట్లు, వృద్ధాప్యం ఆవహించి, వంగిపోయినట్లు కనిపించటంతో లీల మొదటి సారిగా ఆయన దుస్థితికి విచారించింది. తర్వాత ఆమె తన తల్లి ఉన్నగదిలోకి వెళ్లింది. లీల తల్లిమేల్కొనే ఉంది. స్నానం చేయించటంతో ఆమె పరిశుభ్రంగా ఉంది.

నర్సు లీలను చూచి, ఆగి, చిరునవ్వు నవ్వింది. "మీ తల్లి యింకా యిక్కడే ఉంది - మేము ఆమెను దాచి పెట్టలేదు. ఆమె యిప్పుడు ఆరోగ్యంగా లేదూ? ఆమె మందులు తీసుకుంటోంది. ఆమె యిప్పటికే కోలుకొంది," అన్నది.

లీల తల్లి మంచం మీద కూర్చొని, ఆమె చేయి పట్టు కొని, ఉపశమన భావంతో చిరునవ్వు నవ్వింది. ఆమె తల్లి గూడ మౌనంగా బదులుగా చిరునవ్వు నవ్వింది.

డిసిల్వా డాక్టర్ దగ్గరకు వెళ్లి, నివేదికలు సేకరించుకొని వచ్చి, కారులో యింటికి వెళుతున్నపుడు వాటిని వివరించాడు. "ఆమె రక్త హీనతతో బాధ

పడుతోంది. చాలా యిబ్బంది కరమైన విషయం అని డాక్టర్ చెప్పాడు. అదృష్టంకొద్దీ ఆమెను సరియైన సమయంలో యిక్కడికి తీసుకొని వచ్చాం. వాళ్లు చాల రకాల పరీక్షలు చేసారు - ఎక్స్‌రేలు, రక్త పరీక్ష, యింకా చాలా చేసారు - అలా పరీక్షలు చేసిన మీదట ఆమెకు కొంచెం క్షయ వ్యాధి లక్షణాలున్నట్లు తెలిసింది. చాలా స్వల్పస్థాయిలో ఉంది. కాబట్టి మందులతో నయమౌతుంది. ఆమెకు యింజక్షన్లు, మంచి ఆహారం యిస్తున్నారు. ఆమె వాటితో కోలుకొంటోంది. అయితే కొంచెం సమయం పడుతుంది. ఆమెను కొంత కాలం పాటు యిక్కడే ఉంచాలని చెప్పారు. మీ నాన్న తాను యిక్కడే ఉండి ఆమె సంరక్షణ స్వీకరిస్తానన్నాడు. నీకు యిష్టమేనా?" అని అడిగాడు.

కారులో వెనుక, జారుతున్న సీట్లో కూర్చోవటంగాని, కారుకుదుపులు కాని అలవాటు లేక యిబ్బంది కరంగా కూర్చొన్న లీల తల ఊపి, అంగీ కరించ వలసి వచ్చింది. వేయి విధాలైన విచారాలు ఆమె మనస్సును నల్లని మేఘాల్లా ఆవరించటం వల్ల, ముఖాన్ని మౌనం చేయటంవల్ల ఆమె అంతకంటె ఏమీచేయలేని స్థితిలో ఉంది.

డిసిల్వా కారుకు ముందు అద్దానికి బిగించి ఉన్న అద్దంలోంచి లీలను గమనిస్తున్నట్లుంది. "అంతగా బాధ పడకు," అన్నాడతను జాలివ్యక్తంచేస్తూ. "మీనాన్న ఆస్పత్రి దగ్గర ఉంటానంటున్నందువల్ల ఆయనకు కొంచెం డబ్బు ఇచ్చాను. మేము మందులకు డబ్బు ఇస్తున్నాం గదా - ఆస్పత్రిలో ఉచితమేకదా, నీవు నీ చెల్లెళ్లు మాయింటిలో పనిచేసినందుకు డబ్బులు ఇస్తాం. వాటితో యిల్లు గడవటానికి డబ్బు లభిస్తుంది," అన్నాడు.

"కాని - మీరు త్వరలో వెళ్లిపోతారుగా;" అన్నది లీల అస్పష్టంగా.

"అవును మేము వెళ్తాం; కానీ నాస్నేహితుడొకడు కొన్ని నెలల పాటు 'మాన్ రిపాస్'లో ఉండేందుకు బొంబాయి నుండి వస్తాడు. అతను ఒంటరి వాడు. మేము మాసేవకుణ్ణి మాతో పాటు తీసుకు పోతున్నాం. అతనికి పనులు చేసిపెట్టటానికి సేవకుడొకడు అవసరం. అతని బట్టలుతికి యిల్లుఊడ్చి, వంట చేస్తే అతను మీకు జీతం యిస్తాడు," అన్నాడు.

"కొద్ది నెలలా?" అని అడిగింది, అతని మాటలు నమ్మనట్లు. "ఎవరూ మాన్ - రిపాస్ లో అంత దీర్ఘ కాలం ఉండలేదు. ఇంతలో వర్షకాలం వస్తుంది కదా?" అన్నది.

"అవును, అతను వర్షకాలం తుళ్లో గడపాలను కొంటున్నాడు. అతను అధ్యయనం చేయాలని అనుకొంటున్నాడు - ఆఁ నీకే తెలుస్తుంది. అతనో

వింతవ్యక్తి," అంటూ డిసిల్వా నవ్వాడు. అలా అంటుండగా రోడ్డు మీద అడ్డంవచ్చిన ఎద్దులబండిని తప్పించటానికి కారును ప్రక్కకు మళ్లించాడు. మళ్లీ కారు రోడ్డు మీద కుదుపులు లేకుండా ముందుకు పోతూంటే, "అందువల్ల యిక దిగులు పడటం మానేయి - మీకు పని దొరుకుతుంది - నీవు డబ్బు సంపాదించవచ్చు. నీ తల్లికి ఆస్పత్రిలో జాగ్రత్తగా వైద్యం చేస్తారు, ఆవిషయంచూడటానికి మీ నాన్న అక్కడే ఉన్నారు," అంటూ ప్రతి సమస్య పరిష్కారమైనట్లు, సంతోషంగా యీల వేయటం ప్రారంభించాడు. అతను చెప్పిన విషయాలను నమ్మదగినవిగా భావించలేదు కాని చెప్పటానికి ఏమీ లేనందుకు సంతోషించి కారు కిటికీలోంచి పైరు లేమీ లేకుండా ఎండి పోయిన పొలాల వంక మౌనంగా చూస్తూ, భవిష్యత్తును గురించి ఆలోచిస్తోంది లీల. హరి వెళ్లినప్పటి నుండి అంతా అనిశ్చితంగా ఉంది.

హరిని గురించి ఆమె ఎంతో అభిమానంగా ఆలోచించటంతో ఆమె కళ్లలో నీళ్లు తిరిగి చేతి వ్రేళ్లు ముడుచుకొన్నాయి. హరి ఎక్కడున్నా అతనికి యివన్నీ తెలిసినట్లే ఉంది. వాళ్లు కారు దిగుతూండగా బేల, కమల, కయ్యమీది దుంగమీద నిలబడి "హరి నుంచి వచ్చింది! హరి పోస్ట్ కార్డ్ రాశాడు," అంటూ పచ్చని పోస్ట్‌కార్డ్‌ను గాలిలో ఊపుతూ అరుస్తున్నారు.

కారు నుండి ఒక్క ఉదటున దూకి లీల, వాళ్లవైపు పరుగిడుతూ, "హరా? ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు?" అని అడిగింది.

# తొమ్మిదవ అధ్యాయం

రోజు గడిచే కొద్దీ మరింత వేడిగా తయారై, రాత్రి పూట గూడ చల్లారని కట్టెల పొయ్యి ఉన్న శ్రీకృష్ణా అల్పాహారశాలలో పని చేయటం తేలికకాదు, ఆ అల్పాహారశాల ఎప్పుడూ మూయటం జరుగదు. ఖాతా దార్లకు పగలైనా, రాత్రైనా వాళ్లు అడిగినప్పుడు టీతో పాటు రొట్టె లేక పోతే రొట్టె, పప్పు ధాన్యాలకూర సరఫరా చేయవలసి ఉంటుంది. జాగు, హరికి రోజుకు రూపాయి యిస్తానన్న వాగ్దానం నిలబెట్టు కోవటంతో వారానికి ఏడు రూపాయలయ్యాయి. పనిలో క్రొత్తగా చేరిన కుర్రవాడికి యిది మంచి జీతమే అందుకు హరి కృతజ్ఞత వెల్లడించాడు. అతనికి భోజనం గూడ ఉచితంగా నే లభిస్తుంది; కాబట్టి యీ డబ్బంతా యింటికి తీసుకొని పోయేందుకు పొదుపు చేయవచ్చు. అలా కుటుంబ సభ్యుల కొరకు ఆదాచేస్తున్న డబ్బును తలచుకొని హరి గర్వపడ్డాడు. పని అంతా అయిపోయిన తర్వాత అల్పాహార శాలను వదిలి యింటికి పోలేక పోవటాన్ని గురించే అతను బాధపడ్డాడు. పగలు, రాత్రి, అతను అల్పాహారశాలలోనే ఉండటం జరుగుతోంది. అతను వంట గదిలోను. ముందర గదిలోను పని చేస్తున్నాడు. వెనుక ఉన్ననీటి కొళాయి దగ్గర బట్టలు ఉతుక్కొని, స్నానం చేస్తున్నాడు. ఖాతాదారు లెవరూ లేనప్పుడు మేజా బల్ల దగ్గర భోజనం చేస్తున్నాడు. రాత్రిపూట బల్ల మీదో, అప్పుడప్పుడు దుమ్ము పేరు కొన్న నల్లటి నేల మీదనో నిద్రించే వాడు. ఇదే అన్నింటికంటే కష్టం.

అల్పాహారశాలకు బయట రాత్రంతా రొద వినపడుతూనే ఉంటుంది. రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత నగరంలో తిరిగే బస్‌లు ఆగి పోయిన తర్వాత కూడా రైల్వే స్టేషన్ నుండిగాని, గిడ్డంగులనుండిగాని మార్కెట్లకు చేరవేయటానికి, సరుకులు చేరవేయటానికి చేత్తోలాగే బండ్లు వీధుల్లో కర్కశమైన శబ్దాలు చేస్తూండేవి.

చివరి ప్రదర్శన తర్వాత సినిమా హాళ్లు మూసి వేసిన అనంతరం, వందల కొద్దీ మనుషులు కేకలు వేస్తూ, కాగితంతో చేసిన హారన్ లూదుతూ, సినిమాలో విన్నపాటలు పాడుతూ, ఆ అల్పాహారశాల ప్రక్కగా వెళుతూంటారు. రాత్రిపూట నగరం లోని విద్యుద్దీపాలు ఎలాంటి పరిస్థితుల్లోను ఆర్పకపోవటం వల్ల ఎప్పుడూ కాంతులు ప్రసరిస్తూండటంతో అలసిపోయిన హరికళ్లు సముద్ర తీరంలోని గాఢాంధకారాన్ని, ప్రశాంతమైన రాత్రులను అభిలషించేవి. అతనికి సముద్రం నుండి వెలువడే మంద్రశబ్దాలు సరిగా జ్ఞాపకం రావటం లేదు. అలాగే కొబ్బరి చెట్లను సుతారంగా కదిలించే గాలి తన చేతివ్రేళ్ల మధ్య కాళ్ల కిందనలిగే యిసుక వల్ల కలిగే అనుభూతిగాని సరిగా జ్ఞాపకం రావటం లేదు - అవి అన్ని చాలా రోజుల క్రితం జరిగినట్లు చాలా దూరానికి సంబంధించినట్లు హరికి తోచింది. అతను శీతాకాలం, వేసవి మధ్యనున్న కొద్ది నెలలపాటు, ఒక్కఋతువులోనే యింటికి దూరంగా ఉన్నాడు, అయినా అదే జీవితకాలంలాగ అతనికి తోచింది. అల్పాహారశాల మంటలవల్ల వేడిగాను, మాగుడువాసనతోను, ధారాళమైన గాలి లేకుండా ఉంటుంది. బయటకాలి బాటమీద కొంచెం చల్లగా ఉంటుంది. అందువల్ల ఓ రాత్రి నిద్రలేచి, కాలిబాటమీద కూర్చునేందుకు హరి వెళ్లాడు అలా వెళ్లి ఉండకపోతే హరి నిద్రలేమి వల్ల యీపాటికి అస్వస్థతకుగురై ఉండే వాడు. వృద్ధుడైన చేతిగడియా రాలు మరమ్మతు చేసేవ్యక్తి తాను మరమ్మతు చేసి, సిద్ధంచేస్తానన్న చేతిగడియారపు పనిని పూర్తిచేయటానికి రాత్రి ప్రొద్దుపోయేంత వరకు ఉన్నాడు. తన దుకాణపు ఉక్కుతలుపు మూసిన తర్వాత, హరి దగ్గరకు వచ్చి, "ఏమిటి సంగతి, హరి? అస్వస్థతగా లేదు గదా?" అని అడిగాడు.

అలసటవల్ల, నిద్రలేక పోవడం వల్ల హరి చాలా కలవరపడి పోయాడు. చేతిగడియారాలు మరమ్మతు చేసేవ్యక్తి ప్రశ్నకు అతను తల అడ్డంగా ఊపి అలాంటి దేమీ లేదన్నాడు.

"అక్కడ నిద్రపోలేక పోతున్నావు, అవునా? చాలా వేడిగాను గాలి లేకుండాను ఉండి ఉండాలి. వర్షాకాలం రాబోయేముందు యీమేనెల చాలా యిబ్బందిగా ఉంటుంది," అంటూ అతను నిట్టూర్చి, పెద్ద ఆకు పచ్చరుమాలుతో తన బట్టతలను తుడుచుకోవటానికి నల్లని టోపీని తొలగించాడు. "నాగది కూడ దుకాణంలాగే వేడిగా ఉంటుంది. అది పై అంతస్తులో ఉంది - అటుచూడు, గ్రాంట్ రోడ్ స్టేషన్‌కు ఎదురుగా ఉన్న ఒక భవనంలో ఉంది," అంటూ అతని నిర్విరామంగా ఉండే కూడలివైపు తన రుమాలును ఊపి తర్వాత



దాన్ని మడిచి, జేబులో పెట్టుకొన్నాడు. "ఏంచేయాలో చెప్పేదా? ఆ ఉద్యానవనంలోకి వెళ్లి అక్కడ నిద్రపోగూడదా? నేను అక్కడికి వస్తే బాగుంటుందను కొంటున్నాను. అక్కడ చాలా చల్లగా ఉంటుంది. కాని నా పిల్లి నా కొరకు ఎదురు చూస్తూ ఉంటుంది." అంటూ, అతను సంతోషంగా నవ్వి, అస్తవ్యస్తంగా నడిచి వెళ్లాడు.

ఉద్యానవనం తన జీవితాన్ని మార్చివేసి, ఓర్పువహించటాన్ని సుగమం చేయటం వల్ల, హరి ఎప్పుడూ వృద్ధుడైన చేతిగడియారాలు మరమ్మతు చేసేవ్యక్తిపట్ల కృతజ్ఞతాభావం కలిగే ఉన్నాడు. అదినగరాల్లో ఉండే ఉద్యాన వనాల్లాంటిదే - నలిగినగడ్డి ఉన్న కొన్ని భాగాలు, ఇనుప బల్లలు, నారింజ రంగు లిల్లీపూల మొక్కల వరుసలు, కొద్ది పాటుకొబ్బరి చెట్లతోచుట్టూ చాలా పాతగా మురికిగా ఉండే భవనాలతో, దుమ్ముతో నిండిన కూడలి. దాన్నితన

గ్రామంలోని సముద్ర తీరం, కొబ్బరి తోపులతో పోల్చటానికి వీలులేదు. అయినప్పటికీ దానిలో పండుకోవటానికి ఓ బల్ల ఉంది, చూడటానికి చెట్లు, గమనించేందుకు కొన్నిపావురాలు. కాకులు ఉంటాయి. నగరం ఎప్పుడూ చల్లబడినట్లు అని పించకపోయినా. లక్షలకొలది నగర వాసుల ఉచ్ఛ్వాస నిశ్వాసాలవల్ల రాత్రిపూట గాలిలో పగటి పూటకంటె తాజాదనం లోపించినా, ఆ ఉద్యావనం అల్పాహారశాల వంటగది కంటె బాగానే ఉంటుంది.

బల్ల మీద, కొయ్య చెక్కల పైన విశ్రమించిన హరి దృష్టికి దుమ్ముతో నిండి, చిరిగిన కొబ్బరి ఆకులుకనిపించేవి. నగరాన్ని ఆవరించి ఉన్న దుమ్ము, పొగనుచీల్చుకొని మెరవటానికి ప్రయత్నిస్తున్న ఒకటి, రెండు నక్షత్రాలు కూడ కనిపించేవి. బల్ల మీద నిద్రపోయి మేల్కొన్న తర్వాత కాళ్లు క్రింద ఉంచితే నగరంలో కనిపించే గట్టి, నిర్దాక్షిణ్యమైన కాంక్రీట్ కాకుండా, మెత్తని గడ్డిని స్పృశించటం జరిగేది.

ఆ ఉద్యాన వనాన్ని ఖాకీ దుస్తులు ధరించిన ఓ పోలీసు కాపలా కాస్తూంటాడు. అతను భీకరంగా కనిపించే యువకుడు అతనికి పొడవుగా కొసదేరిన మీసాలున్నాయి. అతను చేతి క్రింద లాఠీ ఉంచుకొని, ఉద్యానవనంలోకి వచ్చే పోయే వాళ్లను తీక్షణంగా గమనిస్తూ, మీసాలను మెలిపెడ్తూ నిలబడి ఉంటాడు. హరి మొదటి రాత్రి నిద్రపోవటానికి ఉద్యాన వనంలోని బల్ల మీద పండుకొన్నప్పుడు ఆ పోలీసు పెద్ద అంగలు వేసుకొంటూవచ్చి, "కుర్రవాడా, లేచి నిలబడు, యింటికి వెళ్లు, ఈ ఉద్యానవనంలో నిద్రపోకూడదు త్వరగా లేచి నిలబడు, లేకపోతే నిన్నుపోలీస్ స్టేషనుకు తీసుకుపోతాను నీవు అక్కడ నీ యిష్టంవచ్చినంత సేపు నిద్రపోవచ్చు," అంటూ గుర్రుమన్నాడు. అల్పాహారశాలలో రోజంతాకష్టపడి పని చేసిన తర్వాత హరి ఉద్యానవనంలోకి వెళ్లి అప్పుడే బల్ల మీద పండుకొని కాళ్లు కూడ దీసుకొన్నాడు. పోలీసు అలా అనటంతో అతను అసంతుష్టంగా లేచికూర్చుని," నాకు వెళ్లటానికి యిల్లు లేదు; నేను యిక్కడే ఉంటాను అన్నాడు.

"నీవు వెళ్లటానికి యిల్లు లేదా? నీవు ఎక్కడికి వెళ్లాలో నేను చూపిస్తాను," అంటూ, పోలీసు భీకరంగా అంచాడు, హరితల మీద లాఠీ త్రిప్పుతూ. అలా ఊపుతూ హరి మీద లాఠీ ప్రయోగించబోతూండగా కర్రపోటు వేసుకొని, అటు ప్రక్కగావస్తున్న వృద్ధుడొకడు వచ్చి, ఆగిపోయి పోలీసుతో మాట్లాడాడు.

"ఏమీ హానిచేయని కుర్రవాణ్ణి ఎందుకు భయపెడతావు? శక్తి వంతమైన పోలీసుగారు," అంటూ అతను చిన్న పిల్లవానిలాగా కీచుగొంతుతో అన్నాడు.

"ఈ నగరంలో గజదొంగలు, హంతకులు. దొంగలు, జూదగాళ్లు, త్రాగుబోతులు, చాలామంది చెడ్డవాళ్లున్నారు. ఇతనికి బదులు వాళ్లనెందుకు పట్టుకోవటానికి ప్రయత్నించవు? అక్కడ ఆమూలపేకాట ఆడుతున్న త్రాగుబోతులతో ఎందుకు ప్రారంభించ గూడదు? వాళ్లు యీప్రాంతంలో నివసించే మాకు జీవితంలో భద్రత లేకుండా చేస్తున్నారు. మేమంతా వాళ్లవలన యీ ఉద్యానవనానికి రావటానికి భయపడుతున్నాం - యిల్లులేని, ఎక్కడా నిద్రించటానికి జాగాలేని యీపేదకుర్రవాడి వల్ల కాదు," అన్నాడు.

పోలీసు ఏం చేయాలో తోచక నములుతూ నిలబడ్డాడు, "హుమ్," అంటూ మూల్గాడు ఆ పోలీసు ఏం చేయాలో తోచక. నగరంలో నిజమైన నేరస్తులను పట్టుకొనే యువకులు చేయవలసిన పని ఉన్నప్పుడు చిన్న పిల్ల వాణ్ణి భయపెట్టినందుకు ఆ పోలీసును వృద్ధుడు సిగ్గుపడేటట్లు చేసాడు. "హుమ్," అన్నాడను మళ్లీ, మరింత బిగ్గరగా "ఎవరు వాళ్లు? ఎక్కడ ఉన్నారు? నేను వెళ్లి చూస్తాను," అంటూ అతను వెళ్లిపోయాడు. అక్కడికి వచ్చిన వృద్ధుడు మృదువుగా నవ్వి హరిని చూసి కన్నుగీటి, కఱ్ఱ టకటకలాడించుకొంటూ, తూలుతూ వెళ్ళాడు.

ఇలా జరిగిన తర్వాత ప్రతిరోజు పని పూర్తి అయిన తర్వాత హరి, ఉద్యానవనంలోకి ప్రవేశించినప్పుడు ఆ పోలీసుకుశల ప్రశ్నలు వేసేవాడు. దానితో హరి తాను సురక్షితంగా ఉన్నట్లు, తాను నిద్రపోతున్నప్పుడు పోలీసు కాపలా ఉండటంవల్ల పూర్తిగా గొప్పవాడైపోయినట్లు భావించాడు. ఉదయంపూట నిద్రలేచి కళ్లు తెరచి చూడగానే దుమ్ము కర్మాగారాల్లోంచి వెలువడిన మసితో నిండిన బూడిద రంగు ఆకాశంలో గిరికీలు కొడుతున్న పావురాలు కనిపించాయి. ఉద్యానవనం మధ్యనున్న విగ్రహం దగ్గర ఓవ్యక్తి నిలబడి పిడికిళ్ల కొద్దీ ధాన్యం చల్లటంతో అవి రెక్కలల్లాడిస్తూ, శబ్దంచేస్తూ, విగ్రహం మీద వాలాయి. గులాబీరంగు కాళ్లతో అవి ధాన్యాన్ని ఏరుకొంటూ, ఒక దాన్నొకటి పొడుచు కొంటూంటే వాటిని ఆనందంతో గమనిస్తున్నాడు హరి. ఆవ్యక్తి ప్రతిరోజు ఉదయం పావురాలకు ధాన్యం వెదజల్లటానికి వచ్చేవాడు; ఆవ్యక్తి చల్లిన ధాన్యం ఏరుకొని తినటానికి వచ్చేపావురాలను గమనిస్తూ ఉండే వాడు హరి. ఈ వ్యక్తేకాక, వితంతువులు ధరించే తెల్లని చీరెకట్టు కొన్న వృద్ధురాలు ఒకామె ఉద్యానవనంలోకి ఒక సంచిలో పిండి తీసుకొని వచ్చి, చాలా శ్రమించి, బాటల ప్రక్కన ఉన్న ప్రతిచీమల పుట్ట మీద వ్రేళ్లతో పిండి చిలకరించేది. వృద్ధాప్యంవల్ల వంగిపోయి, గూనితో, పిండి చల్లటానికి చీమలను

వెదకటంలో ప్రయాసపడుతూ చూడటంవల్ల కళ్లు పెద్దవి చేసుకొని నడుస్తూంటే, ఆమె ముసలి చెదపురుగు లాగా కనిపించేది. హరి ఆమెను ఆశ్చర్యంతో గమనించేవాడు. అతను తన డబ్బును ఎంత మాత్రం పక్షులను, చీమలను పోషించటానికి ఖర్చు పెట్టడు. అతను తన కుటుంబాన్ని గురించి పట్టించుకోవలసి ఉంది. అందుకు తాను సంపాదించిన ప్రతి రూపాయిని పొదుపుచేస్తున్నాడు.

కొంచెం సేపటి తర్వాత ఉద్యాన వనంలోని పొదల దగ్గర ఒక మూల ఉన్న కొళాయి దగ్గర స్నానం చేయటానికి వెళ్లినప్పుడు భుజాలకు సంచులు తగిలించుకొని అటు ప్రక్కగా బడికి వెళుతున్న పిల్లలను హరి చూడటం తటస్థించింది. వాళ్లందరూ ఒకే విధమైన దుస్తులు వేసుకొన్నారు. వాళ్లు బూడిద రంగు నిక్కర్లు లేక పొట్టిలంగాలు, నీలిరంగు చొక్కాలు లేక బ్లౌజ్‌లు వేసుకొన్నారు. అవి రంగు వెలిసిపోయి బాగుచేయబడి ఉన్నాయి. అందరూ తలలకు నూనె రాసుకొని నున్నగాదువ్వు కొన్నారు. కొందరు నవ్వుతూ, జట్లుగా పరుగెత్తు తున్నారు. కొంతమందిని తల్లులో లేక తాతయ్యగాని, నాయనమ్మలుగాని, ఉద్యానవనం చివర ఉన్న పాఠశాల భవనందగ్గరికి తీసుకొని పోవటం జరుగు తోంది. వాళ్లను చూస్తుంటే హరికి తన చెల్లెళ్లు, బేల, కమల, జ్ఞాపకం వచ్చారు. వాళ్లు నీలిరంగు పొట్టిలంగాలు వేసుకొని, గ్రామంలోని రోడ్డు మీద పరుగెత్తు కొంటూ కొండ ప్రక్కన ఉన్నబడికి వెళుతూంటారు. హరి వాళ్లను, మళ్లీ ఎప్పుడు చూడగలనో అనుకొన్నాడు. వాళ్లు ఉత్తరంవ్రాసి, యింటి దగ్గర విషయాలను గురించి తెలియజేయటానికి వీలుగా తన చిరునామా యిచ్చినట్లైతే బాగుండేదని భావించాడు.

వంటగదిలో కుర్రవాళ్లు, హరి తమకుసాయంచేయటానికి వచ్చాడు కాని పనినిగాని, ఆహారాన్నిగాని లేకుండాచేయటానికి రాలేదని తెలుసుకోవటంతో వాళ్లకు అతని పట్ల శత్రుత్వం మభావం తగ్గాయి. జాగుకూడ హరిపనిపట్ల సంతృప్తి పడినట్లుతోచింది. అప్పుడప్పుడు రోజు మధ్యలో హరికి ఓ గ్లాస్ టీ యిచ్చేవాడు. కొన్నిక్షణాలు విశ్రాంతి లభించినప్పుడు అతను పొడవాటి మేజాబల్లల దగ్గర కూర్చొని, వాటి మీద దరువువేస్తూ, హరికి తెలియని భాషలో పాటపాడుతూ పాటకు అనుగుణంగా తల ఊపుతూ, కళ్లు త్రిప్పుతూ ఉండేవాడు. హరి, తన పాటవిని, చిరునవ్వునవ్వుతూండటం చూసి అతను గూడ చిన్నగా నవ్వేవాడు. అప్పుడు హరికి తన స్వగ్రామ మనుకోవటానికి వీలైన గ్రామం ఎక్కడో ఉంది అనిపించి, తన స్వగ్రామాన్ని తలచుకోవటంతో, ఆ జ్ఞాపకాలు

అతనికి హాయినిచ్చేవి. అతను యిక్కడ మాత్రం మౌనంగా, కష్టపడి పనిచేస్తూ, విచారంతో నిండిన వ్యక్తి. అతనికి యితరులకు మిత్రుడి లాగానో, లేక సహాయపడే వ్యక్తిగానో ఉపయోగ పడటానికి వీలైన సమయంగాని, మాట్లాడేశక్తిగాని లేవు.

చేతిగడియారాలు బాగుచేసే పాన్ వాలా నిజంగా యితరులకు సహాయంచేసే వ్యక్తి, దయార్ద్రహృదయుడు, అందరి కంటె మంచి సహాయంచేసే గుణం ఉన్న వ్యక్తి. ఒక రోజు మధ్యాహ్నం బాగా వేడిగాను, ప్రశాంతంగాను, ఖాతాదార్లు ఎవరూ లేకుండా ఉన్న సమయంలో, యిక పనే మీ చేయలేనంతగా అలసి పోవటం వల్ల, హరి కొంచెం మార్పుకోసం అల్పాహారశాల ముందు ఊరకే నిలబడి రాకపోకల రద్దీని గమనిస్తున్న సమయంలో పాన్‌వాలా హరిని దగ్గరకు పిలిచి, దుకాణంలో ముందున్న తన బల్లప్రక్కన ఉన్న బల్ల మీద కూర్చోమన్నాడు.

"సాయంచేస్తావా?" అని అడిగాడు, పాన్‌వాలా. "గడియారాన్ని ఎలా మరమ్మతు చేయాలో నేర్చుకోవాలని ఉందా? నాకు పురాతనమైన పార్శీ కుటుంబం వాళ్లు మరమ్మతు కోసం పంపించిన గోడగడియారాన్ని యిప్పుడే ఊడదీయబోతున్నాను - అది ఎలాపనిచేస్తుందో స్పష్టంగా చూడవచ్చు. ఇప్పుడు యిలాంటి గోడగడియారాలు, ఎలక్ట్రానిక్ పరికరాలు లభించటంలేదు. ఈ పరిమాణంలో ఉన్న దీన్ని చూపించగలగటం నిజంగా అదృష్టమే. చూడు," అంటూ అతను గడియారం వెనుక ఉన్న మూతతీసాడు. అలా తీయటంతో లోపల ఉన్న యంత్రం అంతా కనపడింది. దాంతో హరి, ఒక నూతనమైన వింత యింటి తలుపులు తెరచినట్లు, దానిపట్ల ఆకర్షితుడయ్యాడు. పాన్‌వాలా ఆగడియారంలో లోపం ఏమిటో, ఎందుకు ఆగిపోయిందో హరికి చూపించాడు. "ఆసక్తి కరంగా ఉందిగదూ? నీవుకూడా నేర్చుకొంటావా? ఏం చేయాలో చెప్ప మంటావా? నీకు మధ్యాహ్న సమయాల్లో పని లేనప్పుడు, నిన్ను నేను, పనినేర్చుకొనే సహాయకుడిగా తీసుకొంటాను. నీకు మధ్యాహ్నం రెండు గంటలనుండి, నాలుగు గంటల వరకు ఎక్కువ పని ఉండదు, అవునా? అయితే, నీవుముందు జాగూను అడగవలసి ఉంటుంది. నేను కూడ నీకు కొంచెం డబ్బు యిస్తాను. అంత ఎక్కువ కాదు. నీవు రోజు రెండు గంటల పాటు నాకు సాయంచేయవచ్చు. బహుశ, నిన్ను, నేను చేతిగడియారాలు బాగుచేసే వ్యక్తిగా తయారు చేయగలనేమో. ఈ వృత్తిని గురించి చాలా మందికి తెలియదు. ఏమంటావు?" అని అడిగాడు.

పాన్ వాలా వాస్తవంగా అలా సహాయంచెయ్యటానికి ప్రయత్నిస్తాడన్న విషయాన్ని, పనికిమాలిన వంటగదిలోని వంట వానికి సహాయకుడిగా పనిచేసే గ్రామ ప్రాంతానికి చెందిన తనలాంటి కుర్రవాడికి, పాన్‌వాలా తనవృత్తికి సంబంధించిన రహస్యాలను తెలియ జేయటానికి సిద్ధంగా ఉండటం నమ్మలేకపోయాడు, హరి. పాన్‌వాలా దయార్ద్రస్వభావం గల వ్యక్తి. అతని సహాయంతో తన జీవితాన్ని ఉపయోగకరంగా రూపొందించుకోవచ్చు. అలాగే తన చేతులతో సున్నితమైన, చిన్నపరికరాలను ఉపయోగిస్తూ, క్లిష్టమైన యంత్రాలను మరమ్మతు చేయవచ్చు. ఇలాంటి భావాలు హరి మనస్సులో మొదలవటంతో అతను మ్రాన్పడిపోయి, మాటలు పెగిలిరాలేదు. అందు వలన అతను మౌనంగా తల ఊపాడు.

"ఇదుగో, నీకు అలాంటి అభిరుచి ఉందో, లేదో, తెలుసు కొనేందుకు యిప్పుడే ప్రారంభించుదాం," అంటూ, గాజు లాంటి ఆకుపచ్చని పిడి ఉన్న చిన్న స్క్రూడ్రైవర్ను అతనిచేతికిస్తూ నవ్వాడు, పాన్‌వాలా.

"నా చేతులు చాలా మురికిగా ఉన్నాయి," అన్నాడు, హరి అస్పష్టంగా సిగ్గుపడి.

"మురికిగా ఉన్నాయా?" అంటూ నవ్వాడు పాన్‌వాలా "అయితే, యిదిగో, యీతువ్వాలుతో తుడుచుకో. ఇప్పుడు బాగున్నాయి." పని నేర్చుకొంటూ సహాయపడే కుర్రవాడు లభించి నందుకు పాన్‌వాలా సంతోషించినట్లున్నాడు. జాగూకుస్నేహం అంటే యిష్టం ఉండదు. దానికి భిన్నంగా పాన్‌వాలాకు స్నేహం అంటే చాలా యిష్టం. "నేను గమనించిన దాన్ని బట్టి నీకు నైపుణ్యంగల వ్రేళ్లున్నాయని తెలుస్తోంది. ఇదుగో యిక్కడ ఉపయోగకరమైన పరికరం ఉంది - దాన్ని యిలా పట్టుకో, ఏంచేయాలో చెప్తాను."

అలా, అలా హరి చేతిగడియారాలు మరమ్మతు చేసే పనిని నేర్చు కొనే వాడిగా మారాడు. అలా మారటంతో తనకు గూడ మంచి భవిష్యత్తు ఉండవచ్చునని, ఎవరైనా ఎల్లప్పుడు తానున్నచోటనే అంటుకు పోయి ఉండనవసరములేదని, ఆ ప్రదేశం నుండి బయటపడి పురోభివృద్ధిసాధించ వచ్చునని, హరి భావించాడు. అలాజరగాలంటే బాగాకృషిచేయవలసి ఉంటుంది, కాని అదృష్టంకూడ ఉంటే కొంచెం సహాయకారిగా ఉంటుంది. హరి ఎలాంటి యిబ్బంది లేకుండ మధ్యాహ్నం మందకొడిగా ఉన్న సమయాన్ని చేతిగడియారాలు మరమ్మతుచేసే పాన్‌వాలా దగ్గర గడపటానికి జాగు అనుమతి పొందాడు - జాగు మితభాషి, అయినా మంచి స్వభావంగల వ్యక్తి అందువల్ల హరి, చేతిగడియారాలు మరమ్మతు

చేయటాన్ని ఆసక్తితో నేర్చుకోవటం ప్రారంభించాడు. అతను కొంచెం తేటపడటం ప్రారంభమ వటంతో సంతోషంగాను చలాకీగాను కనిపిస్తున్నాడు; వృద్ధుడైన పాన్‌వాలా తాను ఏకాగ్రతతోను, ఆసక్తితోను, తీక్షణంగాను పని చేస్తూంటే చిరునవ్వునవ్వాడు.

"బాగా చేస్తున్నావు, హరి, బాగుంది," అన్నాడు పాన్‌వాలా, మళ్లీ, మళ్లీ, ప్రోత్సాహకరంగా. "చాలా బాగుంది వర్షాకాలం ప్రవేశించేలోపు నీకు మొదటి పాఠాలు బోధించటం పూర్తి అవుతుంది. వర్షాకాలం పూర్తి అయ్యేలోపు నీ అంతట నీవే చేతిగడియారాలు మరమ్మతు చేస్తూంటావు."

కాలం గడిచేవిషయాన్ని గురించి పాన్‌వాలా చేసిన సూచన పట్ల కృతజ్ఞతా పూర్వమైన భావంతో, హరి మౌనంగా అతని వైపుచూసాడు.

"అవును," అన్నాడు, వృద్ధుడైన పాన్‌వాలా, హరి వైపుచూస్తూ. ఎలాగైతేనేం నిన్ను చిరునవ్వు చిందించేలా - లేక పోతే నవ్వేటట్లు చేయగలనేమో - ఏం?" అన్నాడు.

వర్షాకాలం అంతటా 'మాన్‌రిపోస్' లో ఉండాలనుకొన్న సందర్శకుడు ఒకతను, డిసిల్వా కుంటుంబ సభ్యులు, తుళ్ గ్రామాన్ని వదలి వేళ్లే ముందు రోజు వచ్చాడు. ఆ రొణగొణలు అయోమయ పరిస్థితిలో, లీల, ఆమె చెల్లెళ్లు, అతని ఉనికిని వెంటనే గమనించ లేదు. అతను బొంబాయి నుండి బస్‌లో వచ్చి, తన సామానులుతానే మోసుకొంటూ, నడచివచ్చాడు. అందువల్ల అతను ప్రవేశించేటప్పుడు ఎలాంటి ఆర్భాటంచేయలేదు. డిసిల్వా కుటుంబ సభ్యుల సంఖ్య అధికం కావటం చేత, వాళ్ల మధ్య ఒక అదనపు వ్యక్తి చేరటం వల్ల భేదం ఏమీకనపడలేదు. డిసిల్వాల కుక్క మీషా మాత్రమే మామూలు రోజుల్లో కంటె అధికోత్సాహంతో, అటు ఇటూపరుగిడుతూ, మొరుగుతున్నట్లు కనిపిస్తోంది.

వంట మనిషి, వంటగదిలోని వస్తువులను తీసి, డిసిల్వాల వస్తువుల నన్నింటినీ రవాణాచేయటానికి పెట్టెల్లో సర్దుతుంటే లీల అతనికి సాయంచేస్తోంది, ఆమె చెల్లెళ్లు డిసిల్వా శ్రీమతికి వెళ్ల బోయేముందు పచ్చగన్నేరు పూలు, మందారపూలు, ఎర్రమల్లె పూలు తీసుకొని రావటానికి, వాళ్లపిల్లలకు మల్లెపూల దండలు తీసుకొని రావటానికి వెళ్లారు. పిల్లలందరూ వసారాలో ఉన్నారు. వాళ్లు సముద్ర తీరంలో గవ్వలు, రాళ్లు ఏరుకొన్నారు. వాటిని వాళ్లు బొంబాయి లోని తమ యింటికి తీసుకొని పోవాలను కొన్నారు. కాని అందుకు వాళ్ల అమ్మ ఒప్పుకోక పోవటంతో వాళ్లలో వాళ్లు వాటిని గురించి వాదులాడు

కొంటున్నారు. "అన్నీ కాదు - వాటిల్లో మంచివి కొన్ని ఎంచుకోండి," అందామె. ఆమె అలా అనటంతో వాళ్లు తాము సేకరించిన గవ్వలు, రాళ్లు చూసి, ఏవి తీసుకు వెళ్లాలో నిశ్చయించుకోవటం బాధాకరంగా పరిణమించింది. ఆదృశ్యం చూసి, బేల, కమల నవ్వుకొన్నారు - వాళ్లకు సముద్రతీరం మీద పరచుకొని ఉన్న గవ్వలు, రాళ్లు చిరపరిచితం కావటంచేత వాళ్లు వాటిని ఎన్నడూ శ్రద్ధగా గమనించలేదు.

చివరికి సామాను కారులో ఉంచటం జరిగింది. డిసిల్వా కుటుంబ సభ్యులు కారులో ఎక్కి లీల, ఆమె చెల్లెళ్లకు వీడ్కోలు చెప్పటానికి, కిటికీల్లో నుండి వెలుపలికి చూస్తున్నారు.

"మీ అమ్మను గురించి బాధపడవద్దు," అని మళ్లీ, మళ్లీ, చెప్పారు, డిసిల్వా. "వర్షాకాలంలో ఆమెను ఆసుపత్రిలోనే ఉంచండి - విన్నావా? వర్షాకాలంలో మీ పూరింటిలో చాలా తేమగా ఉంటుంది. మీ నాన్న, ఆమె బాగోగులు చూస్తుంటే, ఆమె ఆసుపత్రిలో ఉంటేనే ఆరోగ్యకరంగా ఉంటుంది. నేను వెళ్లేటప్పుడు ఆలీబాగ్‌లో ఆగి, మీ అమ్మ ఆరోగ్యం కుదుటపడి, యింటికి చేరేంత వరకు ఖర్చులకోసం, మీ నాన్నకు కొంత డబ్బు యిస్తాను. దీపావళికి మీ అమ్మను యింటికి పంపించటానికి వీలవుతుందని డాక్టర్ అభిప్రాయపడ్డాడు - అలాచేయటం మీకు యిష్టమేనా?"

ఈ విషయాన్ని యింతకు ముందే డిసిల్వా, లీలకు చెప్పారు. అయినా ఆమెకు మరోసారి వినాలనిపించింది. అందుచేత అతను మరోసారి చెప్తుంటే, లీల కృతజ్ఞతా పూర్వకంగా తల ఊపింది. వాళ్ల పూరిల్లు, హరి వాళ్లనాన్న, అమ్మ, పింటో గూడ లేక పోవటం వల్ల నిశ్శబ్దంగా ఉంది. యిప్పుడు డిసిల్వాలు 'మాన్ రిపోస్' నుండి వెళ్లిపోవటంతో మరింత నిశ్శబ్దంగా ఉంటుంది.

"సయ్యద్ ఆలీసాహెబ్‌ను బాగా చూసుకోండి," అని చెప్పారు. డిసిల్వా "అతను భోజనం చేసేటట్లు చూడండి - అతను భోజనం చేయటమే మరచి పోతాడు - అందువల్ల మీరేజ్ఞాపకం ఉంచుకోవాలి. ఆయన చాలా గొప్పవాడు - ఆయన పట్ల జాగ్రత్త వహించండి. ఆయనకు ప్రతిరోజు పాలు, గ్రుడ్లు యివ్వటానికి, చేపలు వండి పెట్టటానికి సరిపడే డబ్బు మీకు యిచ్చాను. ఆయనకు కూరగాయలన్నా యిష్టమే - అందువల్ల కూరగాయలు తీసుకొని రండి. బొద్దింకలు, ఎలుకలు, పాములు రాకుండా ఉండేందుకు, ప్రతి రాత్రి తాళం వేయబోయే ముందు వంటగదిని కడగండి."

డిసిల్వా మాటలు వినగానే, క్రితం రాత్రి వంటగదిలో వాళ్ల అమ్మకు కనిపించి, ఆ వెంటనే అల్మరాక్రిందికి వెళ్లి అదృశ్యమైన పాము జ్ఞాపకం రావటంతో, పిల్లలు కారులోని వెనుక సీట్లో కేకలు వేసారు, "ఓ, పాములు!" అంటూ వాళ్లు కీచుగొంతులతో అరిచారు. వాళ్లనాన్న, డిసిల్వా, కారు బయలుదేర వలసిన సమయం అయిందని భావించి, ఒక్కకుదుపుతో కారును, ముందుకు పోనివ్వటంతో, కారులో ఉన్న వాళ్ల కుక్క, కిటికీలోంచి తల బయటకుపెట్టి, కొబ్బరి చెట్లు గుండ్రంగా తిరుగుతూ, వెనక్కుపోతున్నట్లుంటే, ఉత్సాహంగా మొరగటం మొదలెట్టింది. లీల, బేల, కమల, కయ్యి పైని దుంగమీద నిలబడి వీడ్కోలు చెప్తున్నారు.

కారు వెళ్లి పోయిన తర్వాత, వాళ్లు అకస్మాత్తుగా నిశ్శబ్దంగా మారిపోయిన యింటి వంక చూస్తూ నిలబడిపోయారు. అప్పుడు వాళ్లు 'మూన్ రిపోస్'లో ఉండటానికి వచ్చిన వ్యక్తిని చూసారు. అతను, సన్నగా, వయోధికుడిగా ఉన్నాడు; తెల్లనిగడ్డం ఉంది; కళ్ల జోడు ముక్కు మీదికి జారుతోంది. అతను వాళ్లను గమనించ లేదు. కళ్ల దగ్గర దుర్భిణీని ఉంచుకొని, ఆసక్తితో చెట్లవైపు చూస్తున్నాడు. అతను ఏమి చూస్తున్నాడో అని ఆలోచిస్తూ వాళ్లు గూడ చెట్లవైపు చూసారు. అక్కడ ఏమీ లేనట్లు అనిపించింది కాని తర్వాత వాళ్లకు గరగరమన్న శబ్దం వినిపించింది. ఆతర్వాత బూడిద, కావి రంగుల్లో ఉన్న పక్షి ఒకటి చెట్లనుండి బయటకు ఎగిరిపోయింది. అది అలాఎగిరిపోతున్నప్పుడు, పొడవాటి, కావి రంగుతోక కనిపించింది. అది అక్కడి నుండి యింటి వెనుక భాగానికి ఎగిరిపోయింది. ఆయన నిట్టూర్చుతూ దుర్భిణీని తొలగించి, జేబులోంచి ఓపుస్తకాన్ని తీసి, దానిలో ఏదో వ్రాయటం ప్రారంభించాడు.



లీల, ఆమె చెల్లెళ్లు, అతను చేస్తున్న పనికి భంగం కలిగించ కుండా ఉండేందుకు, చప్పుడు చేయకుండా, ఒక మూలగా, వంటగదిలోకి వెళ్లారు.

వంటగదిలో, పింగాణీ తొట్టిలో ఉంచిపోయిన పళ్లాలను, పాత్రలను మౌనంగా శుభ్రంచేస్తూ, "ఆయన ఏం చేస్తున్నాడు?" అని ప్రశ్నించుకొన్నారు, వాళ్లు.

"ఎవరికి తెలుసు?" అంది, భుజాలెగురవేస్తూ, లీల. "ఆయన యిక్కడ ఏదో అధ్యయనం చేయటానికి వచ్చాడని డిసిల్వా చెప్పారుగదా."

"ఏం అధ్యయనం చేయటానికి - పక్షులా?" అని అడిగింది. బేల, కమలకు ఆమాట హాస్యాస్పదంగా ఉండటంతో, నవ్వింది.

"ఏమైన సరే, మనల్ని ఆయన అసలు గమనించడు - మనం ఆయనకు భోజనం తయారు చేసి, భోజనానికి పిలవ వలసి ఉంటుంది" అంది, లీల.

వాళ్లు ఆపనినే చేయటం ప్రారంభించారు. వాళ్లు యిప్పుడు వాళ్ళ అమ్మ సంరక్షణగాని, హరికిగాని, వాళ్లనాన్నకుగాని ఎలాంటి పనులు చేయనవసరం లేక పోవటం వల్ల తమతో ఎన్నడూ మాట్లాడ కుండా, భోజనానికి పిలిచినప్పుడు కళ్లజోడు గుండా భోజనం వంక చూసే, భుజానికి దుర్భిణీని, నిండుగా పుస్తకాలు, పెన్సిళ్లు ఉన్న సంచిని తగిలించుకొని అదృశ్య మయ్యే అపరిచిత వ్యక్తి కొరకు వంటచేయటం అవసరమైన సరుకులు కొనుగోలు చేయటం, బట్టలుతకటం లాంటి పనులు చేయటం మొదలెట్టారు. అపుడపుడు అతను వాళ్లకు చిత్తడి ప్రదేశంలో బురద, తుంగను తొక్కుకొంటూనో, లేక చెట్ల క్రింద రాతిమీద ప్రశాంతంగా కూర్చొని, మనుషులను తప్ప ప్రతిదాన్ని ఆసక్తిగా చూస్తూ కనపించటం జరిగేది. అతను తుళ్‌లో చాలా మంది జనం ఉన్నట్లు గమనించనట్లుండేవాడు. అతనికి మనుషుల పట్ల ఆసక్తిలేనట్లు కనిపించేవాడు. కాని అతను చాలామర్యాదగా ప్రశాంతంగా ఉండే వాడు; ఎలాంటి యిబ్బంది పెట్టేవాడుకాదు. అతనికి ఫిర్యాదులూ లేవు. ఫలానాది కావాలని కోరికలూ ఉండేవికావు. అందువల్ల వాళ్లు వింత అలవాట్లను పట్టించుకొనే వారుకాదు; అతన్ని చూచినవ్వే వాళ్లు కాదు. ఒక సందర్భంలో అతను కయ్యమీది దుంగ పైన వెనుక వైపుకాలువేసి, కయ్యలో పడిపోతే, వాళ్లు అతనికి సాయం చేయటానికి పరుగెత్తి వెళ్లి, అతని సంచి, కాగితాలను అందులోంచి తీసి వసారాలో ఎండ బెట్టవలసి వచ్చింది. ఆసందర్భంలో మాత్రమే వాళ్లు అతన్ని చూచినవ్వారు. అప్పుడు అతని దగ్గర కాగితాల మీద, పెన్సిల్‌తో గీసిన పక్షుల చిత్రాలుండటం వాళ్లు గమనించారు. వాటిని

చూచి వాళ్లు ఆశ్చర్యపోయారు.

అలా తడిసిపోయిన కాగితాలను, జాగ్రత్తగా వేరుచేసి ఆరటానికి ఎండలో పెడుతున్నపుడు బేల వాటి మీదకు వంగి, "చూసారా? ఈయన పక్షులను అధ్యయనం చేస్తున్నాడు." అంది మెల్లగా. "పక్షులను అధ్యయనం చేస్తున్నాడా?" అంటూ కమల ఆపుకోలేనంతగా నవ్వనారంభించింది. కాని లీల వాళ్లను కోపగించుకొని ఆ కాగితాల పట్లశ్రద్ధవహించమని చెప్పింది. ఆకాగితాల మీది చిత్రాలు చాలా అందంగా ఉన్నాయి; వాటిలో దేన్ని పాడుచేయకూడదు అనిచెప్పింది.

ఆవింత వ్యక్తి పొడిబట్టలు వేసుకొని తనగదినుండి బయటకు వచ్చి బాధపడుతూ, వాళ్లవైపు చూసాడు. అప్పుడు అతను వాళ్లకు చాలా కృతజ్ఞతలు తెలిపి, బేల, కమలకు యివ్వటానికి జేబులోంచి డబ్బు తీసాడు. "మిఠాయిల కొరకు," అని అస్పష్టంగా అంటూ గాభరాతో, త్వర త్వరగా వెళ్లిపోయాడు.

నెల ఆఖరిరోజున లీలకు జీతం యిచ్చినప్పుడు, ఆమె ఆనందంగా నవ్వుకొంటూ త్వరగా యింటి చుట్టూ తిరిగి, కయ్య మీదుగా వాళ్ల పూరింటికి పరుగెత్తినప్పుడు కూడ అతను అదేవిధంగా గాభరా పడ్డాడు. లీలకు డబ్బులు సంపాదించటం ఆశ్చర్యకరంగా ఉంది. ఇప్పుడు వాళ్లవంటగదిలో బియ్యం, టీ, పంచదార నిల్వ ఉంచు కొనేందుకు సరిపడే డబ్బు ఉంది. లీల ప్రతివారం బస్‌లో ఆలీబాగ్‌వెళ్తోంది. అలా వెళ్లినప్పుడు, ఆమె వాళ్ల అమ్మకు అదనంగా పాలు, పండ్లు కొనటానికి కొంత డబ్బు తీసుకొని వెళ్లి వాళ్ల నాన్నకు యిస్తుండేది. డబ్బు వలన అన్ని పనులు సాధ్యమౌతున్నాయి. ఈ వ్యక్తి యిక్కడే ఉండి పోతే, తాను యిలాగే డబ్బు సంపాదించడం వీలవుతుందని ఆశించింది, లీల.

"కాని వర్షాకాలంలో ఎవరూ ఉండరు," అంది కమల. "వర్షా కాలం రావటంతో అందరూ వెళ్లిపోతారు. మనమే మిగులు తాం."

# పదవ అధ్యాయం

"వర్షకాలం వస్తోంది!" అని అరిచాడు వృద్ధుడైన పాన్‌వాలా ఓ పెద్ద సముద్ర కెరటం వచ్చి, సముద్రపు ఒడ్డున నిర్మించిన గోడను తాకి నప్పుడు, అక్కడి నుండి వెనక్కు అడుగు వేస్తూ. ఆపెద్ద కెరటం సముద్రాన్ని చూడటానికి వచ్చి, రాళ్లు పరచిన ప్రదేశంలో నిల్చున్న మనుషులపై నురగ చిలకరించింది. "చూడు, హరి, వర్షాకాలం వస్తోంది!" అన్నాడు పాన్‌వాలా.

హరి, తలఊపాడు, నవ్వుతూ, నురగ తనను తడుపుతుండగా. మరో కెరటం, దాని వెంట మరో కెరటం, దాని వెంట మరో కెరటం వచ్చి, పెద్ద శబ్దంతో గోడకుతగిలి, విచ్ఛిన్నమవుతూంటే అక్కడచేరిన మనుషులు వెనక్కువెళ్లారు. సముద్ర మంతా కల్లోలంగా ఉండటంతో పెద్ద అలలు పుట్టి తీరం వైపువేగంగా వస్తున్నాయి. అప్పటికి ఆకాశంలో మేఘాలు లేవు, అయినా సముద్రానికి ఆ విషయం తెలిసినట్లు వేగంగా ముందుకురావటం, మేఘాలను కలుసు కోవటానికి పైకి లేస్తున్నట్లు కనపడుతోంది.

వర్షాకాలప్రవేశాన్ని చూడటానికి పాన్‌వాలా హరిని, ఒర్లి, సముద్ర తీరం దగ్గరకు తీసుకొని వెళ్లాడు. ప్రతిసంవత్సరం జూన్ మొదటి వారంలో యిలా చేస్తుంటానని పాన్‌వాలా చెప్పాడు. అతను తన దుకాణాన్ని ముందుగానే మూసి వేసి, తల మీది నల్లని టోపీ సరి చేసుకొని హరికి ఒక సాయంత్రం విరామం యివ్వమని జాగూను అడిగి హరిని బస్ మీద యీ ప్రదేశానికి తీసుకొని వచ్చాడు. అతను హరి కోసం కొబ్బరి బోండాం, మరమరాల పొట్లం కొంటానని పట్టు బట్టాడు. అక్కడికి చాలామంది తల్లి దండ్రులు తమపిల్లలను షికారుకు తీసుకొని వచ్చారు. వాళ్లు రాళ్లు పరచిన ప్రదేశంలో ఏర్పాటు చేసిన రంగుల రాట్నం మీద తిరుగుతూ, బెలూన్‌లు కొంటూ, ఐస్ క్రీమ్‌లు కొబ్బరి బొండాంలు కొంటూ ఆనందిస్తున్నారు. హరి, ఆ అదృష్ట వంతులైన పిల్లల్లాగే మరమరాల

పొట్లాన్ని చేతిలో ఉంచుకొని, మర మరాలను తింటున్నాడు. వాళ్లను చూస్తున్న హరి కఠోరమైన యీ ప్రపంచంలో యితర వయోజనులతో ఎలాగో జీవనం కొనసాగిస్తున్న, సంకోచపూరిత, స్వల్పవయస్కుడైన పెద్ద కుర్రవాడి లాగ కాకుండ, ఆ పిల్లలతో పాటు తానుకూడ మళ్లీ చిన్న పిల్లవాడై పోయినట్లు భావించాడు. ఉప్పు ఘాటుతో సముద్రం నుండి పెద్ద శబ్దాలతో వెలువడు తున్నగాలి, అలల వల్ల ఏర్పడుతున్న బాధాకరమైన నురగ అక్కడినుండి ఆఫ్రికావరకు విస్తరించి ఉన్న సముద్ర దృశ్యం, తనకు జ్ఞాపకం ఉన్న చాలా కాలం క్రిందటి కంటె, యిప్పుడు అతని మనసును తేలికపరచి, అమితానందాన్ని కలిగించింది.

"మీకు కృతజ్ఞతలు, పాన్‌వాలాగారు," అన్నాడతను, కృతజ్ఞత చెప్పాలన్న విషయం జ్ఞాపకం ఉంచుకొని.

ఆరోజు సాయంత్రం, వర్షాకాలం బొంబాయి ప్రజల జీవ నాన్ని ఎంత దుర్భరం చేసిందో హరికి తెలియలేదు.

వర్షా కాలం నగరం మీద భీకరస్థాయిలో విరుచుకు పడుతూ ప్రవేశిస్తుందని పాన్ వాలా చెప్పినట్లు జూన్ పదవ తారీకున సముద్రంనుండి తీవ్రస్థాయిలో వెలువడి తన ప్రతాపంచూపింది. వర్షం, నగరం మీద పరచిన పెద్ద దుప్పటి లాగా ఉంది. వీధుల్లో వాననీరు అధికంకావటం మొదలైంది. ఆసమయంలో హరి గూడ యితర బొంబాయి పౌరుల్లాగే అల్పాహారశాలలోనే ఉండి పోయాడు. అల్పాహారశాలకు ముందున్న వీధి మొదట ఒక మురికి కాలువలాగా మారింది - సంవత్సరమంతా పేరు కొనిపోయిన చెత్త అంతా వాననీటి ఉరవడిలో కొట్టుకొని పోయింది - తర్వాత ఆ వీధి ఒక నదిలా మారి పోయింది. మురుగు కాలవల్లో అవరోధాలు ఏర్పడ్డాయి. వర్షంనీటిస్థాయి పెరుగు తూండటంతో వీధుల్లో వ్యర్ధమైన నీరు పోవటానికి ఏర్పరచిన ప్రవేశ మార్గాలనుండి నీరు మళ్లీ వీధుల్లోకి రావటంతో అవి జలమయ మయ్యాయి. కార్లు మోకాళ్లలోతు జిడ్డునీళ్లలో నిలిచిపోయాయి.

వర్షంలో బయట తిరుగుతున్న నగరంలోని అల్లరి కుర్రవాళ్లకు కొంత సేపు మంచి అవకాశం లభించింది. వాళ్లు నీళ్లలో ఆగిపోయిన కార్లను చేతులతో నెట్టి, మెరక ప్రాంతాలకు చేర్చి, కార్ల డ్రైవర్ల నుండి డబ్బులు తీసుకొంటున్నారు. హరి , అతనితో పాటు వంటగదిలో పని చేసే కుర్రవాళ్లు గూడా బయటికి వెళ్లి, చిల్లర ఖర్చులకు సరిపోయే డబ్బు సంపాదించారు. హరి మొదటిసారిగా, తడిసిన చొక్కాలు, నిక్కర్లు, చిందర వందరగా ఉన్న జుత్తు నవ్వు నిండిన,

తడిసిన ముఖాలతో, తనతో పాటు పనిచేసే వంట వాళ్ళు. డ్రైవర్లను డబ్బులు అడుగుతూ, నీళ్లలో నిలిచిపోయిన కార్లను, టాక్సీలను బయటకి లాగు తూండటం చూసాడు.

ఆ వర్షంతో సంవత్సరం పాటు నగరమంతటా పేరుకొనిపోయిన మురికంతా శుభ్రంగా కొట్టుకుపోవటంతో పాటు వేసవి తాపాన్ని గూడా తగ్గించింది. అకస్మాత్తుగా, నాటకీయమైన రీతిలో ఉష్ణోగ్రత తగ్గిపోవటంతో ప్రతి ఒక్కరు సంతోషించారు. అంతటా విహార యాత్రా వాతావరణమో లేక సెలవుల వాతావరణమో నెలకొన్నట్లుంది. పాఠశాలలకు బడికి వెళ్లలేకపోయిన పిల్లలకు, నిముష నిముషానికి నీటి స్థాయిపెరగటం వల్ల, తాము పనిచేసే చోటికి వెళ్లటానికి వీలులేని శ్రామికులకు వాస్తవంగా ఆరోజుసెలవుగానే పరిణమించింది. వీధుల్లో నిలిచిపోయిన నీటిలో చిందులాడుతున్న ఆకతాయి పిల్లలు, "త్వరలో మనకందరికి పడవలు అవసరం అవుతాయి," అంటూ కేకలు వేస్తున్నారు.

కాని హరికి అతనితో పాటు వంటగదిలో పనిచేసే కుర్రవాళ్లకు మాత్రం అది సెలవుకాదు. ఏపనీజరగక పోవటం వల్ల కూలీలు, చేతోబండ్లను లాగే వాళ్లు శ్రీకృష్ణా అల్పాహారశాలలో కూర్చోవటానికి వచ్చి టీ, వేడి వేడిభోజనం కావాలని అడుగుతున్నారు. జాగు, వీధులో ఉన్న కుర్రవాళ్లను పిలిచి, పని చేయటం ప్రారంభించమని చెప్పాడు. వాళ్లు ఎలాంటి విరామం లేకుండా, నిర్ణీత కాలం కంటె అధిక కాలం పనిచేసారు. బొగ్గు, కట్టెలు, అన్ని తడిసి పోవటం వల్ల వంటచేయటం కష్టమైంది. పొయ్యి వెలిగించినా అది సరిగా మండకుండ, పొగ చిమ్ముతూండటంతో ఆపొగ వాళ్ల కళ్లల్లోకి ప్రవేశించటం వల్ల, దగ్గుతూ, మసిబారిన చేతులతో కళ్లునులుము కోవలసి వచ్చింది. ఖాతాదార్లు అల్పాహారశాలలో ప్రవేశించినప్పుడు, వాళ్లు కాళ్లకు అంటు కొన్న బురద అక్కడ పేరుకోవటంతో ఒక గుడ్డ ముక్క, బకెట్‌తో దాన్ని శుభ్రం చేయవలసి వచ్చింది. దాంతో అవి రెండూ బురదమయమయ్యాయి. అప్పుడప్పుడు వాళ్లను సిగరెట్‌లు తీసుకొని రావటానికి పంపించటంతో తడిసిపోయి, చలికి బాగా వణికేవారు.

సాయంత్రం వరకు వర్షం భారీగా కురుస్తూనే ఉంది. అప్పటికి, హరి యింతకు ముందు రోజులకంటె బాగా అలసిపోయాడు. ఆరోజురాత్రి ఉద్యాన వనంలో నిద్రించటానికి వీలుపడదని హరికి అకస్మాత్తుగా అవగాహన అయ్యింది - బహుశ వర్షాకాలంలో ఏ రాత్రివీలుకాదేమో!

జాగు లైటు ఆర్పివేసి, ఆ రాత్రికి అల్పాహారశాలను మూసి వేయటానికి,

తాళం చెవి తీసుకొన్నప్పుడు, హరికి వర్షంలో బయటికి వెళ్లటానికి వీలులేదని తెలిసిపోయింది. ఊపిరి పీల్చుకోవటానికి గూడా యిబ్బందిగా ఉండే ఆ అల్పాహారశాలలో బల్ల మీద పండుకొని నిద్ర పోవటానికి ప్రయత్నం చేయగలగటం కంటె చేయగలిగిందేమీ లేదు. ఆ రాత్రి హరి మొదటి రాత్రి జైలులో గడిపిన ఖైదీ లాగా బాధపడ్డాడు.

పగలు, రాత్రి నిరంతరం వర్షిస్తోంటే, వర్షాలు వారాల కొద్దీ కొనసాగాయి. భారీ వర్షంకొంచెం తగ్గు ముఖం పట్టి, చిన్న జల్లులుగా మారి, వరదలు తగ్గినప్పటికీ ఏ వస్తువూ పొడిగా లేదు. అన్నీతడిసిపోయి, బురద కొట్టుకొని, వాసన వేస్తున్నాయి. చెత్త నిండిన బకెట్‌ను ఖాళీచేయటానికి గాని, ఖాతా దార్లకు సిగరెట్లు తీసుకొని రావటానికి గాని హరి బయటకు వెళ్తే, అతని చొక్కామరోమారు తడిసిపోయేది. దానిలో అతను మిగిలిన రోజంతా ఒంటికి అంటుకుపోతున్న తడి చొక్కాతోనే ఉండి పోవలసి వచ్చింది. దానితో అతనికి దగ్గు మొదలై ఎక్కువగా దగ్గటంతో గుండెల్లో నొప్పి పెట్టింది.

పొరుగున ఉన్న పాన్ వాలా కూడా నిరంతరాయంగా దగ్గుతూ, గురగురమంటూ శబ్దాలు చేస్తూ, ఊపిరిపీల్చుకోవటానికి గూడా యిబ్బంది పడ్డాడు. అతనికి జబ్బు చేయటం వల్ల ఒకరోజు దుకాణం తలుపు తీయటానికి గూడా రాలేదు. ఒక రోజు అతను మరమ్మతులుచేసే బల్ల దగ్గర ఎర్రబడ్డ కళ్లతో, జ్వరం వచ్చినట్లు కూర్చొని ఉండటం హరి గమనించాడు; అతనికి తల నొప్పి ఎక్కువగా ఉండటం వల్లనని అంతా హరికి అప్పగించాడు. మరుసటి రోజు అతను దుకాణానికి రాలేదు. చేతిగడియారాల దుకాణానికిగాని, ఉద్యానవనానికి గాని వెళ్లటానికి వీలులేక పోవటంవల్ల వంటగదినుండి గాని, అల్పాహారశాల నుండి గాని, హరికి తప్పించు కోవటానికి మార్గం లేక పోయింది. పగలు రాత్రి, శ్రీకృష్ణా అల్పాహారశాలలోనే బంధింప బడటంతో అతను జైలు గదిలో శిక్ష అనుభవించే ఖైదీలాగా భావించుకొన్నాడు.

జాగు, అతని భావాలను గ్రహించాడు. ఒక రోజు రాత్రి వంటగదికి తాళం వేస్తున్న సమయంలో, నిద్రపోకుండా, నేలమీద కూర్చుండి, కాళ్లు పట్టుకొని, తలఒడిలో ఉంచుకొని, దగ్గుతున్న హరిని చూసి, అతను నిలబడి పోయాడు.

"నీకు జబ్బు చేసింది. నీవునాతో పాటురా. రా, నేను, నిన్ను, మా యింటికి తీసుకుపోతాను," అన్నాడ తను.

జాగు, అలా ఆహ్వానించటంతో, హరి మనసు కృతజ్ఞతా భావంతో నిండి

పోయి, మారు మాట్లాడ కుండా లేచినిలబడి, జాగూతో పాటు అల్పాహారశాల నుండి బయటకు వచ్చి. అతనితో పాటు వెళ్లాడు. జాగు ఎక్కడ ఉంటాడో, తనను ఎక్కడికి తూసుకొని వెళ్తున్నాడో తెలియక పోయినా, అతనితో పాటు వెళ్లాడు. మరొకరు తనను వాళ్ల యింటికి తీసుకుపోతున్నందుకు, హరికి కృతజ్ఞతా భావం కలిగింది; ఆ మాటకొస్తే ఎవరు తీసుకొని వెళ్లినా అలానే భావించేవాడు.

జాగు ఒక హోటలుకు యజమాని, నిరంతరం రద్దీగా ఉండే వీధిలో ఉన్న అల్పాహారశాలకు స్వంత దారుడు; చాలా మంది ఖాతా దార్లున్నారు. అయినా అతని యిల్లు ఒక మురికి వాడలో ఉంది. ఆయిల్లు గోనె పట్టాలతోను, చదరం చేయబడిన యినుపరేకుల తోను నిర్మించబడిన పాకల సముదాయంలో ఉంది. అలాంటి వాటిని బొంబాయిలో జోపడ పట్టీలంటారు. నగరంలో పనిచేయటానికి వచ్చి జీవనోపాధి సంపాదించుకొనే లక్షలమంది ప్రజలకు సరిపోయినన్ని యిళ్లుగాని, గృహసముదాయాలు గాని లేవు. చాలినన్ని లేక పోవటం వల్ల చాలా తక్కువ గదులున్న అంతస్తులు కూడ జాగూ లాంటి వాళ్ల స్థాయికి అందుబాటులో ఉండవు. ఇలాంటి జోపడపట్టీల్లో, ఒకపాక అద్దెకు లభించటం గూడ, జాగు తన అదృష్టంగానే భావించాడు.

పురోగ మిస్తున్న వర్షబుతు ప్రవేశాన్ని చూపించటానికి హరిని పాన్ వాలా తీసుకొనిపోయిన విశాలమైన వీధి వెనుక వైపు, సముద్రం ప్రక్కన కొండ పార్శ్వానికి ఆనుకొని యీపాకలు నిర్మింపబడ్డాయి. కొండకు యివతలి వైపున విశాలమైన వీధిలోని యిళ్లు, గులాబీ, ఆకుపచ్చ, పసుపు రంగుల్లో చాలా పెద్దవిగాను, ఎత్తుగాను ఉండి, 'సూర్యకాంతి,' సముద్రపుకాకి, లాంటి పేర్లతో ఉన్నాయి. వాటిలో ధనికులుంటారు. కొండకు అవతలి వైపున బీదవాళ్లుండే పాకలున్నాయి. అవి కొండకు దిగువగా ఎలాంటి ఆచ్ఛాదన లేని మురుగు కాలవ దాకాను నిరంతరం రద్దీగా ఉండే రోడ్డువరకు విస్తరించి ఉన్నాయి.

సన్నని మార్గంలో జాగూను అనుసరించి నడుస్తున్న హరికి, తన కాళ్లు మెత్తని బురదలో జారుతున్నట్లనిపించింది. మొత్తం కొండ అంతా బురదగా మారుతున్నట్లనిపించింది. అక్కడ పాకలన్ని ఉండిపోయి వీధిని, జోపడపట్టీని వేరు చేస్తూ, ఎక్కువగా నీరు నిండిపోయిన మురికి కాలువ లోకి జారుతున్నట్లున్నాయి.

అక్కడ ఉన్న యిరుకైన మార్గంవెంట యీ కళా విహీనమైన పాకలున్నాయి. ఆ మార్గం వెంట జాగూ, తనను తీసుకొనిపోతున్నప్పుడు, చొక్కా చేతులతో

ముక్కు తుడుచుకొంటూ, కళ్లకు అడ్డంపడుతున్న వెంట్రుకలను సరి చేసుకొంటూ నడుస్తూ, అధికంగా బాధపడ్డాడు, హరి జాగు యిలాంటి పాకలో ఉంటున్నాడా? అతను హరిని యిలాంటి ప్రదేశానికి ఎలా తీసుకొని రాగలడు? కాని తీసుకొని రాగలడు, వాస్తవంగానే తీసుకొని వచ్చాడు. ఇంతలో జాగు, ఇనుపరేకులు, చిరిగిన గోనె సంచులు, ప్లాస్టిక్ కాగితాలతో నిర్మించిన ఒక పాక ముందు నిలబడి, దానికి అడ్డంగా కట్టిన గోనె పట్టాను తొలగించి, తలవంచుకొని, లోపలికి ప్రవేశించాడు. ఆ తర్వాత అతను హరిని గూడ లోపలికి రమ్మని సైగ చేయటంతో హరి కూడ వంగి లోపలికి వెళ్లాడు.

వర్షం నీటితో పాటు ముందు వాకిలి ద్వారాను, గోడలకున్న పగుళ్లు, కప్పుగుండాను, బయట ఉన్న బురద, మట్టి లో పలికి వచ్చాయి. వాస్తవానికి నేల అంతా వర్షపు నీటితోపాటు వచ్చి చేరిన చెత్తతో నిండిపోయిఉంది. జాగు కుటుంబం అంతా ఒక నులక మంచాన్ని తెప్పగా భావించినట్లు, దాని మీద ఒకరి కొకరు ఆనుకొని కూర్చున్నారు. ఇనుప డబ్బాల్లోను, అట్టపెట్టెల్లోను ఉన్న వాళ్ల వస్తువుల నన్నింటినీ ప్రక్కల ఉన్న యిటుకలు, రాళ్లమీదకు ఎక్కించారు. తాను గూడ యితరుతో పాటు ఆ నులక మంచం మీదికి చేరుకోవలసి ఉంటుందేమోనని ఆలోచిస్తూ నిలబడ్డాడు, హరి. నులక మంచం అప్పటికే జనంతో నిండి ఉంది.

అలాంటి అవసరం లేకుండా, పాత్రలు, పళ్లాలు, పెట్టెలు, మూటలు లేని బల్ల ఒకటి కొంచెం ఖాళీగా ఉంది. "ఇక్కడ కూర్చో హరి," అంటూ జాగు నులక మంచం మీద కూర్చొన్న కుటుంబ సభ్యులతో మాట్లాడాడు. కారుతున్న కప్పునుండి పడే వర్షపు నీరు తలల మీద పడకుండా ఉండటానికి నెత్తిమీద ఉంచు కొన్న పాత గుడ్డ పీలికల క్రింది నుండి ఎన్నోజతల కళ్లు హరి వైపు చూసాయి. మురుగు కాలవకు అవతలి వైపు నుండి కొంచెం వెలుగు పడుతున్నప్పటికీ లోపల చీకటిగా ఉంది.

తర్వాత మాట్లాడుతున్న ఓ స్త్రీ స్వరం వినిపించింది. ఆ స్వరం తీవ్రంగా, ఉన్నతస్థాయిలో, వేగంగా మాట్లాడుతున్నట్లుండటం వలన హరికి మాట్లాడుతున్న దేమిటో అర్థంకాలేదు. కొంచెం సేపటి తర్వాత అతనికి తెలిసిన తిట్లు వినిపించటంతో హరి మరింత బాధపడుతూ, సహాయంకోసం జాగు వైపుచూసాడు.

"మాట్లాడకు," అంటూ, జాగు అరిచాడు. "నాకు భోజనం తీసుకురా; యీ కుర్రవాడికి మరోపళ్లెంతీసుకురా, అతనికి అనారోగ్యంగా ఉంది. రేపు అతన్ని మందుల కొరకు ఆసుపత్రికి తీసుకుపోతాను. ఈ రాత్రి అతను

యిక్కడే నిద్రిస్తాడు," అన్నాడతను.

నులక మంచం మీద మూటల్లాగా ఉన్న మానవాకృతులు కదిలి, ప్రత్యేక రూపాలుగా వేరైనప్పటికీ, కీచుమంటున్న, తీవ్రమైన కంఠస్వరం ఆగకుండా మాట్లాడుతూనే ఉంది. అలామంచం మీదనుండి వేరుపడిన ఓ ఆకారం క్రింద ఉన్న బురదలోకి దిగివెళ్లి, జాగుకు, హరికి సత్తుపళ్లాల్లో భోజనం తీసుకువచ్చింది.

"మనకే సరిగా సరిపోవటం లేదు. నీవు మరొకరిని భోజనానికి తీసుకొని వచ్చావు," అని అరుస్తూ, ఆ స్త్రీ పళ్లాలను వాళ్లవైపు నెట్టింది. "అందువల్ల నీకు సగం భోజనమే అదేనీకు జరిగేది నీకొత్త స్నేహితునికి నా పిల్లల ఆహారంలో భాగం పెడతాననుకొంటున్నావా? నీవు తింటూంటే మేము భోజనం లేకుండా ఉంటామనుకొంటున్నావా?"

"మాట్లాడకు," అన్నాడు, జాగు, తీవ్రంగా ఆమె వైపు భయంకరంగా ముఖంపెట్టి. "నోరు మూసుకో లేక పోతే నేను తిన్నగా సారాదుకాణానికి వెళ్లి, నీవు తయారు చేసే భోజనానికి బదులు అక్కడే సారాయి త్రాగుతాను," అన్నాడు.

"వెళ్లు, వెళ్లు," అని అరిచిందామె. "నేను నిన్ను ఆపుతున్నట్లు. నీకు అదేకదా కావలసింది - సారాదుకాణానికి వెళ్లటం నీకు కావలసిందల్లా ఏదో ఒక నెపం. నీవు వెళ్లి, నిన్ను నీవు విషపూరితం చేసుకొంటానంటే నాకేం అభ్యంతరం? వెళ్లి ఆదుకాణం వాళ్లు అమ్మే విషంతో చావుకొని తెచ్చుకో - నేను వచ్చి నీ అంత్య క్రియల సమయంలో నవ్వుతాను. నేను పిల్లలను తీసుకొని మన గ్రామంవెళ్తాను, అక్కడ పొలాల్లో ఆకలి బాధతో మేమంతా మరణిస్తే, రాబందులు మమ్మల్ని పీక్కుతింటాయి..." అందామె.

హరి పళ్లాన్ని ముందుంచుకొని కూర్చొన్నాడు. అతని తల మరీ క్రిందకు వాలిపోతోంది. ఒక్క ముద్దతినటానికి గూడ అతనికి సహించలేదు. కాని జాగు ఆ భోజనం అంతా పెద్ద పెద్ద ముద్దలు చేసుకొనితిని, "అలాగే, నీవు బలవంతంచేస్తే నేను వెళతాను," అంటూ లేచి నిలబడి, హరిని, ఆస్త్రీతోపాటు వదలి అదృశ్యమయ్యాడు.

కాని జాగు వెళ్లగానే ఆమె మౌనం వహించింది. ఆమె నులక మంచం మీద చేరి, తల మీది దాకా చిరుగుల దుప్పటి ఒకటి కప్పుకొని, దాని క్రిందనుండి హరి వైపు చూసింది. అతను గూడ ఆమె వైపు చూసాడు. కొంచెం సేపటి తర్వాత ఆమె గట్టిగా గాలి పీల్చి, తన పసిపిల్లను జోకొట్టటం మొదలెట్టింది. ఆమె భారంగా నిట్టూర్చటం హరికి వినిపించింది.

"నిద్రపో, నిద్రపో," అంది ఆమె. ఆమె ఆ మాటలు, హరిని ఉద్దేశించి

అన్నదో, తన ప్రక్కనున్న పసిపిల్లను గురించి అన్నదో అతనికి అర్థం కాలేదు, "పండుకొని నిద్రపోవటం గాని లేక చావటం కన్న చేయగలిగిందేముంది? పురుషులైతే సారాదుకాణానికి వెళ్లి, త్రాగుతారు, మర్చిపోతారు. మనం ఏమి చేయలేం. అందువల్ల మనం పండుకొని నిద్రపోవాలి. నిద్రపో," అందామె, మళ్లీ పసి పిల్లను జోకొడుతూ, నిట్టూర్చుతూ.

హరి ఆమెతో మాట్లాడాలను కొన్నాడు. ఆమె అంత కోపంగాను విచారకరమైన స్వరంతోను ఎందుకు మాట్లాడవలసి వచ్చిందో అతనికి తెలుసు. చీకటిలో గ్రామంనుండి వాళ్ల నాన్న రాకకోసం ఎదురుచూస్తూ రాత్రి ప్రొద్దు పోయేంతవరకు లీల, తాను కూర్చున్నప్పుడు యిలాగే మాట్లాడుకొనే వాళ్లు. వాస్తవంగా, యీ స్త్రీ తన తరపున, లీల తరపున, వాళ్లు అమ్మ తరపున మాట్లాడు తున్నట్లు అతనికి అనిపించింది. అతనికి ఆమె అంటే భయం తొలగిపోయింది.

"ఇతను ప్రతిరాత్రి త్రాగుతాడా?" అడిగాడు తను, మెల్లగా.

ఆమె తల అడ్డంగా ఊపింది. "లేదు ఆయన యీ జోపడ పట్టీలోని యితరు లంత చెడ్డవాడు కాదు. అతను విచారంగా ఉన్నపుడు లేక మరీ బాధగా ఉన్నపుడు మాత్రమే త్రాగుతాడు."

"మా నాన్న ప్రతి రాత్రి త్రాగుతాడు," అని ఆమెతో అన్నాడు హరి. అతను యీ విషయాన్ని యింతకు ముందు ఎవరికి చెప్పలేదు. కాని యిప్పుడు అతను, వాళ్ల భోజనాన్ని తిన్నందుకు తనను కేకలు వేసి, తిట్టిన యీ అపరిచిత స్త్రీ తో నిష్కపటంగా మాట్లాడటం జరిగింది.

"అలా చేస్తాడా? అవునా? మీ అమ్మను కొడతాడా? మీకు భోజనం లేకుండా చేస్తాడా?" అంటూ ప్రశ్నించిందామె, ఆసక్తితో

అందుకు హరి మాట్లాడటానికి బదులు తల ఊపి, దగ్గాడు ఆమెకు తాను చెప్పనవసరం లేదు - ఆమెకు యిప్పటికే అంతా తెలిసింది.

"పండుకో, బాబు, ఉదయం ఆసుపత్రి నుండి నీకు మందు తెస్తాంలే. అక్కడి డాక్టర్ దగ్గర దగ్గులకు, జలుబులకు మందు ఉంది. మాపాపను గూడా అక్కడికే తీసుకొనిపోతాం. మాపాపకు జబ్బుగా ఉంది. దానికి జ్వరం," అంటూ ఆమె తన ప్రక్కన నిద్రపోతున్న పసి పిల్ల వీపు మీద, నిట్టూరుస్తూ తడుతోంది.

హరి బల్ల మీద ముడుచుకొని నిద్రపోవటానికి ప్రయత్నిస్తూ, జాగు తన కుటుంబానికి యింకా అసౌకర్యం కలుగ జేస్తూ తనను ఎందుకు అక్కడికి

తీసుకొని వచ్చాడా అని ఆలోచిస్తున్నాడు.

మరుసటి రోజు ఉదయం హరి, బురదనిండిన కొండకు ఆవలి వైపున ఉన్న దారిలో జాగూతో పాటు నడుస్తున్నాడు. అది సంపన్నంగాను, సౌకర్యవంతంగాను, సంతోషంగాను ఉండే ప్రాంతం. అప్పుడు హరి, "నేను ఆల్పాహారశాలకు వెళ్తాను, జాగు ఇక్కడ నేను ఉండటానికి జాగాచాలదు. నేను వెనక్కి వెళ్లిపోతాను," అన్నాడు.

జాగు అతని వైపు తీవ్రంగాచూసాడు. "ఆమె చెప్పిందా నీకు వెళ్లమని? ఆమె మాటలు వినకు - ఆమె స్త్రీ రూపంలో రాక్షసి, స్త్రీ రూప రాక్షసి,"అన్నాడు.

"లేదు, ఆమె చెప్పలేదు," అన్నాడు హరి, త్వరగా. "కాని మీ పాపకు జబ్బుగా ఉంది, ఆమెకు చేయవలసిన పని చాలా ఉంది. మరి యిల్లో -" అన్నాడు.

"హుమ్," అన్నాడు జాగు, ఆలోచిస్తూ. "ఈ యిల్లు వర్షా కాలంలో బాగుండదు. వేసవిలో మేము ఉండే యిల్లు ఏమంత అసౌకర్యంగా ఉండదు. మాకు నీటి కొళాయిలేదు. నీళ్లు తెచ్చుకోవటానికి యితర స్త్రీలతో పాటు కొళాయి దగ్గర వరుసలో నిలబడాలి. వర్షా కాలంలో అన్ని ప్రదేశాల్లోను నీరున్నప్పుడు, యిక్కడ మరీ చెడ్డగా ఉంటుంది." అంటూ అతను తల ఊపాడు. జాగు తనను యిక్కడికి తీసుకొని రావటంలో తప్పుచేసానని గ్రహించినట్లు హరి అవగాహన చేసుకొన్నాడు. అతను దయార్ద్రహృదయంతోను, సహాయం చేయాలన్న తలంపుతోను తనను యిక్కడికి తీసుకొని వచ్చాడని హరికి తెలుసు. అందుకు హరి, జాగూకు కృతజ్ఞతలు తెలియజేయాలను కొన్నాడు కాని చెప్పలేక పోయాడు.

ఇనుపరేకుల కప్పుతో, బీటలు వారిన భవనంలో ఉన్న ఆసుపత్రి మీద వర్షంకురుస్తున్న శబ్దం అధికంగా వస్తోంది. వసారాలోను బయట వర్షంలోను, పురుషులు, స్త్రీలు, పిల్లలు చాలా మంది బారులు తీరి డాక్టరు చేత పరీక్షలు చేయించు కోవటానికి నిలబడి ఉన్నారు. అక్కడ ఉన్న పెద్ద బారునుచూసి, "చాలా సమయం పడుతుంది." అన్నాడు జాగు, విచారంగా.

"నేను యిక్కడ వేచి ఉంటాను. మీరు అల్పాహారశాలకు వెళ్లండి నేను ఒంటరిగా వేచి ఉండగలను," అన్నాడు హరి.

తాను అన్నింటినీ అస్తవ్యస్తంచేసినందుకు అధికంగా సిగ్గుపడుతూ జాగు వెళ్లిపోయాడు.

హరి, అలా వరసలో నిలబడి ఉండగా జాగు భార్య చేతిలో పాపను ఎత్తుకొని, మరొకచేతిలో మందుకొరకు సీసాపట్టుకొని, వర్షంలో, ఆ వరుస చివరనిలబడటం చూసాడు. హరి, ఆమె వద్దకు వెళ్లి, "నేను మీ మందుతెస్తాను, పాపకు ఎత్తుకోనీండి," అన్నాడు. ఆమె ఆశ్చర్యంతో తల అడ్డంగా ఊపి, "వద్దు, వద్దు, నేను చేసుకోగలను," అంది. ఆ మాటలతో ఆమెకు తాను సహాయపడటం సాధ్యం కాదని తెలుసుకొని, వెనక్కు తిరిగాడు, హరి.

నగరంలో తాను ఉండటానికి మరోచోటు లేక పోవటం వల్ల వర్షకాలం అంతా హరి అల్పాహారశాలలోనే ఉండిపోయాడు. పొరుగున ఉన్న పాన్‌వాలా దుకాణం మూసి వేసి ఉంది. అతనొక్కడే హరికి యిక్కడున్న స్నేహితుడు ఒక మారు మొదటిసారి శ్రీకృష్ణా అల్పాహారశాలకు తీసుకొని వచ్చిన ఎత్తైన భవనం కాపలాదారుడు నల్లని, పెద్ద గొడుగు వేసుకొని వెళుతూ, ప్రక్కన నిలబడి, హరిని, పిలిచాడు.

"ఎలా ఉన్నావు? కుర్రవాడా," అంటూకేక వేసాడు, వర్షపు చినుకుల శబ్దంలో తన కంఠం వినిపించేంత బిగ్గరగా మాట్లాడుతూ. "ఇంకా యిక్కడే ఉన్నావా? పని చేస్తూ కాలం వెళ్ల బుచ్చు తున్నావా? ఇష్టమయ్యిందా? అంతా బాగానే ఉందా?" అని ప్రశ్నించాడు.

హరి తన తల ఊపి, చిరునవ్వు చిందించటానికి యత్నించాడు. అతని వల్లనే తనకు ఆశ్రయం, పని, భోజనం లభించాయి. స్నేహితులు లభించారు. తనకు లభించిన పని, భోజనం, ఆశ్రయం ఎలాంటివో పరిగణించిచూస్తే అవిచాలా కష్టంతో కూడుకొన్నవి అయినప్పటికీ అతను వీటి విషయంలో ఆకాపలా దారునికి కృతజ్ఞుడై ఉండాలని అతనికి తెలుసు. "ఆఁ ఆఁ, బాగానే ఉన్నాను," అన్నాడు హరి బొంబాయిలోని చాలా మంది కంటె తన స్థితి బాగుందని హరికి తెలుసు.

"ఏమైందో నీకు తెలుసా అబ్బాయ్? ఆరోజు రాత్రి నీవు 'సముద్రపుపక్షి,' అన్న పేరుగల భవనంలోని వ్యక్తులను కలుసు కోవాలని వచ్చావే - వాళ్లు తిరిగి వచ్చారు. వాళ్లుక్రితం వారం విదేశాల నుండి తిరిగి వచ్చారు. నీవు వచ్చి వాళ్లను కలుసుకో గూడదూ? వాళ్ల యింట్లో నీకు ఉద్యోగం దొరకవచ్చు." అన్నాడు.

హరి కొంచెం ఆశ్చర్యపడ్డాడు. అతను చాలాకాలం క్రితమే వాళ్లనుగురించి ఆలోచించటం మాని వేసాడు. అతని సమయం మనసంతా పూర్తిగా వంటగదిలో పని పాన్‌వాలా వద్ద నేర్చుకొంటున్న చేతిగడియారాల మరమ్మతు, యింటికి

తీసుకొనిపోవటానికి పొదుపు చేస్తున్న డబ్బులాంటి వాటితో నిండిపోయాయి. అతనికి మరుసటి రోజును గురించి దాన్నిమించిన భవిష్యత్తును గురించి ఆలోచించటానికి సమయంలేదు. అలా ఆలోచిస్తూంటే అతని మెదడంతా తాను బొంబాయి వచ్చిన మొదటి రాత్రి ఆలోచనలతో నిండిపోయింది. తాను బొంబాయిలో చూసిన విద్యుద్దీపాలను, పెద్ద పెద్ద భవనాలను, జనసమూహాలను చూసి ఎంత ఆశ్చర్యపడిందీ జ్ఞాపకం వచ్చింది. అతను ఎన్నో అంతస్తున్న పెద్ద భవనాన్ని గురించి, ఏదో మంత్రశక్తి లాగా తనను పైకి తీసుకొని పోయిన యంత్రాన్ని గురించి, వెలుగుతో నిండిన గదిలోకి ప్రవేశపెట్టిన, మెరుస్తున్న తలుపు గురించి, తెల్లని దుస్తులు వేసుకొన్న తల బిరుసు సేవకుని గురించి, ఆలోచించాడు. అతను పిండి తయారుచేయటం, పప్పుధాన్యాల కూర, టీ సరఫరా చేయటం లాంటి పనులుచేస్తూ వాటినన్నింటిని గురించి ఆలోచిస్తూనే ఉన్నాడు. తాను వీటన్నిటినీ వదలి వెళ్ళగలడా? తనకు ఆసంపన్నమైన, ఎత్తుగా ఉన్న భవనాల్లోని మెరుపుల ప్రపంచంలో స్థానం లభింస్తుందా? దేవతా సంబంధమైన కథల్లో లాగ సేవకులు, కార్లు, సెలవులు, ధనం, స్వేచ్ఛ ఉండే ప్రపంచంలో తానుండగలడా?

వాటినిగురించి ఆలోచిస్తే హరికి ఉత్తేజం కలిగింది. అతను ఆకాపలాదారుని సలహాప్రకారం యీసారి మధ్యాహ్నం విశ్రాంతి లభించినప్పుడు ఆపెద్ద భవనం దగ్గరకు వెళ్లి తన అదృష్టాన్ని పరీక్షించు కోవాలా లేదా అన్న విషయాన్ని గురించి ఆలోచిస్తూ ఆరాత్రి నిద్రకు దూరమయ్యాడు.

ఆ రాత్రి హిందూమహా సముద్రంలో పెద్ద తుఫాను ప్రారంభమై నగరం మీద విరుచుకుపడింది. ఆకాశంలో దట్టంగా పరచుకొన్న నల్లని మేఘాలనుండి, చురకత్తుల్లాంటి మెరుపులతో వర్షం ప్రారంభమైంది. ఉరుముల ధ్వనులు పెద్ద పెద్ద భవనాల మధ్య మారు మ్రోగాయి. సూర్యోదయానికి ముందే ఉదయం పూటవర్షం ప్రారంభమైంది. మరోసారి వీధులన్నీ జలమయమయ్యాయి. సముద్రం నుండి వెలువడిన గాలి వర్షాన్ని మోసుకువచ్చి నగరంలోని గోడలు, కిటికీల మీద టప టప మన్న శబ్దాలను సృష్టించింది. ఉద్యానవనంలో ఉన్న పెద్ద వృక్షమొకటి పెద్దశబ్దంతో విరిగి అక్కడ ఉన్న ఒక సందుకు అడ్డంగా పడి పోవటంతో అటు యిటూ వెళ్లే కార్లు ఆగిపోయాయి. కార్లు హారన్‌లు అవిశ్రాంతంగా మోగుతున్నాయి. వీధుల్లో అంతా అయోమయం నెలకొంది. బస్‌లు, కార్లు, ప్రతి ప్రదేశంలోను ఆగిపోయి ఉన్నాయి. హరి తడిసిన బట్టలతో, అల్పాహారశాల నుండి యిదంతా గమనిస్తున్నాడు.

ఆ రోజు అల్పాహారశాలలో తక్కువ మంది ఖాతాదార్లున్నారు. పాదచారులుగూడ వీధుల్లోకి రావటం లేదు. టీ కొరకు వచ్చిన లారీ డ్రైవర్, తన లారీ చక్రాలమధ్య వరకు చేరిన నీటి వల్ల ఆగి పోవటంతో రోజంతా అక్కడే ఆగిపోవలసి వచ్చింది. అతనికి ఓ ట్రాన్సిస్టర్ రేడియో ఉంది. అతను దాన్ని టీ గ్లాస్ ప్రక్కన ఉంచి, అల్పాహారం సేవించి టీ త్రాగుతూ కార్యక్రమాలు వింటున్నాడు. కుర్రవాళ్లు ఆ ప్రసారాలను వినటానికి మూగారు. వాళ్లు బొంబాయి నుండి  వెలువడిన సినిమాల్లోని పాటలు టూత్ పేస్ట్, బట్టలు శుభ్రంచేసే పౌడర్, వంటనూనె, ముఖసౌందర్యసాధనాల లాంటి వ్యాపారప్రకటన గలగలలు విన్నారు. రాజులు, రాణులు, ఓడిపోయిన. జయించిన యుద్ధాలను గురించిన నాటికను గూడా విన్నారు. తర్వాత నాటిక చివర, రాజు చచ్చిపోయిన అనంతరం రాణి చివర పాట పాడు తున్న సందర్భంలో, వార్తలతో పాటు ప్రకటనలు చేసే వ్యక్తి కంఠం వినిపించింది.

వార్తలన్నీ తుఫానుగురించే. పన్నెండుగంటల్లో ఎలాపది అంగుళాలు వర్షం కురిసిందీ మొత్తంనగరం ఎలాస్తంభించిందీ వివరించటం జరిగింది. తర్వాత ప్రకటనలు చెప్పేవ్యక్తి సముద్రంలో చేపలు పట్టే పడిపడవల జాడ తెలియ రావటం లేదని చాలా మంది జాలరులు చచ్చిపోయి ఉంటారని భావింప బడుతున్నట్లు ప్రకటించాడు.

ఆ వార్త విన్న హరి పెద్దగాకేక వేసి, రేడియో దగ్గరకు వచ్చి, శ్రద్ధగా వింటూ, ప్రకటన చేసే వ్యక్తి నుండి సమాధానం అడుగుతున్నట్లు "ఎక్కడ? ఎక్కడ?" అంటూ అరిచాడు.

అక్కడ చేరిన కుర్రవాళ్లు హరిని చూసి నవ్వనారంభించారు. లారీ డ్రైవర్ కూడ పండ్లికిలించాడు. అయినా హరికి కావలసిన సమాధానం లభించింది.

"తుఫాను తగ్గిన తర్వాత జాడ తెలియ కుండా పోయిన చేపలు పట్టే పడవలను, జాలరులను వెదకటానికి శోధించే బృందాలను ఆలీబాగ్ నుండి పంపించటం జరుగు తుంది," అని ప్రకటన వెలువడింది.

"ఆలీబాగ్" అని అరిచాడు హరి, తనను గమనిస్తున్న ముఖాలవైపుచూస్తూ. "అదేనాస్వస్థలం! అదేనాస్వగ్రామం," అన్నాడు.

"సరే, కుర్రవాడా, సరే," అన్నాడు లారీడ్రైవర్. అతను పెద్ద మీసాలు, తలపాగా ఉన్న సిక్కు. "నీవు జాలరివి కాదు, అవునా? నీవు పడవ మీద ప్రయాణంచెయ్యటం లేదు. నీవు చాలినంత మంచి ఆహారం, వేడి టీ ఉన్న

హోటల్‌లో సురక్షితంగా, ఆరోగ్యంగా ఉన్నావు. అంతగా కంగారు పడకు," అన్నాడతను.

జాగు మరింత అవగాహన ప్రదర్శించాడు. హరి తన యింటిని సందర్శించటం విషాదకరంగా విఫలం అయినప్పటి నుండి, జాగు, హరితో చాలా తక్కువగా మాట్లాడుతున్నాడు. కాని అతను యిప్పుడు గుర్రుమని," ఏమిటి విషయం? మీనాన్న జాలరా? తప్పి పోయిన పడవల్లో ఒకటి మీ నాన్నదా?" అని అడిగాడు.

"లేదు," అన్నాడు, హరి, తల అడ్డంగా ఊపుతు. "లేదు," అంటూ అతను వంటగదిలోకి వెళ్లాడు, ఆ బాధను తానే ఒంటరిగా అనుభవించటానికి సిద్ధమై. తన తండ్రి తప్పిపోయిన పడవల్లో లేక పోవటం, ఒక్కటి కూడా పడవలేకుండా ఉండటం వాస్తవమే కాని తన గ్రామస్తులే చేపల వేటకు వెళ్లారు; ఆతప్పిపోయిన వారిలో తనకు తెలిసిన వాళ్లో, తనకు తెలిసిన మనుష్యులో, స్నేహితులో, పొరుగు వాళ్లో అయి ఉంటారు. అకస్మాత్తుగా అతనికి బిజాకు సంబంధించిన చేపలు వేటాడే పడవ జ్ఞాపకం వచ్చి, యీ పాటికి దాన్ని జలప్రవేశం చేయించటం జరిగి, అది సముద్ర జలాల్లో చాలా దూరంలో ఉండి ఉంటుంది.

అతను దిగంతాల అంచున కనిపించే తెరచాపలను గురించి, సముద్ర తీరంలో రాత్రి పూట కనిపించే పడవల్లోని దీపాలను గురించి ఆలోచించాడు. అలాగేసాయంత్రం పూట చేపలు వేటాడే పడవల్లోంచి సముద్ర తీరంపై ప్రోగుపడే చేపలు, తీరపు యిసుకపై మెరుస్తున్న చేపల తట్టల విషయంలో వాదులాడు కొంటున్న జాలరి స్త్రీల కంఠాలు హరికి జ్ఞాపకంవచ్చాయి. అతను చేపల వలను, తాను దానితో ఎలా లోతు తక్కువ ప్రాంతాల్లో తిరుగాడింది జ్ఞాపకంచేసు కొన్నాడు. తానుపట్టుకొన్న పీతలను తింటున్నకాకులు, చేపలకొరకు సముద్రపు అలల మీద తక్కువ ఎత్తులో తిరుగాడుతున్న సముద్రపు కాకులుగూడా జ్ఞాపకం వచ్చాయి. హరికి, వాళ్లపూరింటి ప్రక్కన ఉన్న చెరువుదగ్గరి రాతి మీద నిశ్చలంగా కూర్చొన్న కొంగ, చెట్టు మీది నుండి నీలిరంగులో మెరుపులాగా నీటి పైకి దూకే లకుముకిపిట్ట జ్ఞాపకంవచ్చాయి, సముద్రంలోని శిలపై పూలుచల్లి, పూజ చేయటానికి పూలబుట్టతో దారి మీదుగా వచ్చే తన అక్క లీల, సముద్రంలోని శిలలకు అంటుకున్న నత్తలను గీరుతూ రాళ్లమీద కూర్చొన్న బేల, కమలలు కూడా హరికి జ్ఞాపకం వచ్చారు. పింటో మొరుగుతున్న శబ్దంకూడా వినిపించినట్లనిపించింది. వీటన్నిటి పట్ల అతనికి ఆసక్తి అధికమైంది. పొయ్యి ప్రక్కన గొంతుకూర్చొని, మోకాళ్ల మీద తల ఆనించి,

కళ్లు మూసుకొని, తనకు సంబంధించిన అందమైన, ప్రకాశవంతమైన దృశ్యాలను మననం చేసుకొన్నాడు.

వర్షాకాల ప్రవేశంతో లీల, బేల, కమలలు పాతబడిపోయి. అక్కడక్కడా చిల్లులు పడ్డపూరికప్పును కప్పటానికి త్వరగా కొబ్బరి ఆకులను అల్లారు. అలాగే తలుపులు, కిటికీల మీదకప్పటానికి గూడ కొబ్బరి ఆకుల చాపలను, సముద్రంనుండి వేగంగా వెలువడి తీరం మీదా, రాత్రింబవళ్లు, నిరంతరాయంగా, తగ్గు ముఖంలేకుండా పూరి పాకల మీదా, తన ప్రతాపాన్ని చూపించే వర్షంనుండి రక్షణ కొరకు గూడా కొబ్బరి ఆకుల చాపలను అల్లారు. విశాలంగా వ్యాపించిన నల్లని వర్షాకాలపు మేఘాలు సముద్రం నుండి ఉబికి, ఆకాశంలోకి చేరుకొంటున్నట్లున్నాయి. సముద్రంలో లేస్తున్నపెద్ద అలలు వాటిని కలుసుకోవటానికి ముందుకు ఉరుకుతున్నాయి. ఇవి అన్నీ కలిసి, భూమి మీద, ఆకాశం మీద విశాలమైన నీటి దుప్పటి లాగ అన్ని ప్రదేశాల్లో వ్యాపించాయి.

చేపలు వేటాడే పడవలను వర్షా కాలంలో ఎగిరి పడుతున్న అలలతో పొంగిన కయ్యలో కట్టి వేయటం జరిగింది, అలల ఉధృతికి ఆపడవలు అటూ యిటూ ఊగుతూ పరస్పరం ఢీకొంటున్నాయి. వాటికి ఉన్న తెరచాపలు, జెండాలు, అన్నీతొలగించి దాచటం వల్ల వాటి తెరచాప కొయ్యలు బోడిగా ఉన్నాయి. గ్రామస్తులు చాలా వరకు తమ పూరిళ్లలోనే ఉండిపోయారు. అవసరం అయినప్పుడే నల్లని, పెద్దగొడుగులు వేసుకొని బయటకు వెళ్తున్నారు. చెరువులు, కయ్యలు పూర్తిగా జలమయమయ్యాయి. పొలాలన్ని జలమయమై, బురద, బురదగా మారిపోయాయి; కలుపు మొక్కలు విస్తారంగా పెరిగాయి; కప్పలు రాత్రంతా విపరీతంగా బెక, బెక లాడాయి. పొయ్యిలో మంటలు పొగచిమ్ముతున్నాయి; పూరిళ్లు తేమగ, చీకటిగా ఉన్నాయి. వర్షం పూరికప్పుల మీద తన ప్రతాపం చూపించటంతో అవి నీరుకారుతూ ప్రతివస్తువును తేమ పూరితంగా చేయటంతో అవిపొడిగామారే అవకాశం లేనట్లుకనిపించింది.

అలాంటి తుఫానుల్లో జాలరులు సముద్రంలోకి వెళ్లలేక పోవటంవల్ల వాళ్లు ఎలాంటి పని లేకుండా ఉండిపోయారు. ఫలితంగా చేపలు లభించటం లేదు, గ్రామంలోని యితర పురుషులు గూడ సాధారణంగా స్త్రీలు చేసే పనులైన తాళ్లు పేనటం, కొబ్బరి ఆకుల చాపలల్లటం లాంటి పనులు చేస్తూ కూర్చొన్నారు. బహుశ, వాళ్లు సంవత్సరంలోకి యితర సమయాల్లో కంటె యీ సమయంలో అధికంగా సారా సేవించి ఉండవచ్చు కాని లీల వాళ్ల నాన్న త్రాగుడుమాని వేసాడు.

అతను ఆసుపత్రి బయట కూర్చొని, నర్సుల, డాక్టర్లరాక పోకలనుగమనిస్తూ, తన భార్యకు అవసరమైన వన్నీ లభించేటట్లు చూస్తున్నాడు. అతను వసారాలో ముడుచుకు కూర్చొని, చేతితోపట్టుకొనే హుంక్కా త్రాగుతూ, పైనుండి ధారాహికంగా పడుతున్న వర్షాన్ని చూస్తున్నాడు, లీల క్రమం తప్పకుండా వారానికోసారి ఆసుపత్రికి వస్తోంది. వచ్చేటప్పుడు తనతండ్రి, కొంచెం పొగాకు, టీ, తినుబండారాలు కొనుక్కోవటానికి వీలుగా తాను 'మూన్ రిపోస్'లో సంపాదించిన డబ్బు తనతో తెచ్చేది, ఆవర్షంలో యిబ్బంది పడుతూ తడిసి మట్టి కొట్టుకొన్న బస్ మీద ఆలీబాగ్ వెళ్లింది. అక్కడకు చేరిన తర్వాత తన తండ్రి మద్యం సేవించకుండా ఉండటం, తల్లి ఆరోగ్యం యింతకు ముందు వారంకంటె బాగుండటం చూసి, అలా శ్రమపడినందుకు మంచిఫలితమే లభించినట్లు భావించింది. ఆమె తిరిగి వెళ్లేటప్పుడు వాళ్లందరూ కంటతడిపెట్టినా, ఆమె ఆసుపత్రిని సందర్శించిన సందర్భాలు ఆనందంగా ఉండేవి.

అప్పుడప్పుడు లీల, బేల,కమల, ముగ్గురూ కలిసి సరుకులుకొనటానికి గ్రామంలోకి వెళ్లేవాళ్లు. వాళ్లు వర్షం తగ్గే వరకు వేచి ఉండవలసి వచ్చింది. తలుపులన్నీ మూసుకొని, అందరూ యిళ్లల్లో ఉండి పోవటంతో గ్రామం అంతా ఖాళీగా ఉంది.

అయితే వర్షా కాలపు మూడు నెలలు యింట్లోనే ఉండటానికి జాలరులకు వీలు కాలేదు. వాళ్లు నిలవ చేసుకొన్న ధాన్యం తరిగి పోవటంతో వాళ్ల భోజనాల సంఖ్య, పరిమాణం తగ్గింది. వాళ్ల కుటుంబ సభ్యుల బుగ్గలు పీక్కుపోయి చిక్కిపోయారు. వర్షం తగ్గినప్పుడు, వాళ్లు సముద్ర తీరానికి వెళ్లి, పడవల్లోకి ఎక్కి, ఆకాశం వంక చూస్తూ, వాతావరణాన్ని గురించి మాట్లాడుకొనేవారు.

ఒకరోజు వర్షం కొంచెం ఉపశమించింది. దట్టంగా, బూడిదరంగు మేఘాలు దిగంతాల వద్ద ప్రశాంతంగా ఉండి క్రమ్ముకొస్తున్నట్లు కనిపించక పోవటంతో జాలరుల బృందం ఒకటి పడవల్లో సముద్రం మీదికి బయలుదేరింది. లీల, ఆగ్రామంలోని దుకాణంనుండి ధాన్యపు సంచితో వస్తూ, ఆ పడవలను చూసింది. అవి అలల మీద తీవ్రంగా ఊగుతున్నాయి; వాటి తెరచాపలు గాలిలో రెపరెపలాడు తుంటే, పడవలు కిర్రుమని శబ్దంచేస్తూంటే, వాటిల్లో ఉన్నవాళ్లు వాటిని అదుపుచేసే ప్రయత్నంలో ఒక వైపు నుండి మరోవైపుకు విసరి వేయబడుతున్నారు. ఇలాంటి వాతావరణంలో తన క్రొత్తపడవను సముద్ర ప్రవేశంచేయించటానికి

యిష్టపడని వృద్ధ బిజూ, కయ్యి ముఖద్వారం వద్ద నిలబడి, వాళ్లను కేకలు వేస్తున్నాడు.

"మూర్ఖుల్లారా, వెనక్కు రండి! మీ పడవలుయీ వాతావరణానికి అనుకూలమైనవి కావు," అన్నాడు.

"వాతావరణం బాగానే ఉంది. నీకు కనిపించటం లేదూ?" అని ఒక జాలరి సమాధానంగా అరిచాడు. "వృద్ధస్త్రీలలాగా చాలా రోజులు యింట్లోనే కూర్చున్నాం," అన్నారు.

"మునిగిపోతారు. మీపడవలు పగిలి పోతాయి." అంటూ బిగ్గరగా అరిచాడు బిజూ, వాళ్లనుద్దేశించి. కాని వాళ్లుమళ్లీ సముద్రం మీదికి వెళ్లే ఉత్సాహంలో అతని మాటలను కొట్టిపారేసారు.

ఆ తర్వాత లీల వాళ్లను గమనించటానికి అక్కడ నిలబడలేదు. చిన్న పడవలు అలల మీద ఎగిరి పడుతున్న దృశ్యం ఆమెకు భయం కలిగించటంతో ఆమె ఆందోళన పడింది. ఆమె యింటికి చేరిన తర్వాత కొద్ది సేపటిలోనే భీకరమైన ఉరుముల శబ్దం విని పించింది. రాత్రంతా మెరుపులు మెరుస్తూనే ఉన్నాయి, ఉరుములు ఉరుముతూనే ఉన్నాయి. కొబ్బరి చెట్లు కిర్రుకిర్రుమంటూ, వాళ్ల పూరింటి మీద ప్రమాద కరంగా ఊగుతున్నాయి. గాలి చేసేశబ్దాలు, సముద్రపు హోరు చాలా అధికంగా ఉన్నాయి. అశబ్దాలకు లీల, ఆమె చెల్లెళ్లు, భయంకొద్దీ చెవులు నొప్పిపెడుతున్నాయని చెప్పి నూలుదుప్పట్ల క్రింద దాక్కొన్నారు.

మరుసటిరోజు ఉదయం పెందలకడనే, వర్షా కాలానికే అతి పెద్ద తుఫాను ప్రారంభమైంది. కొన్ని సందర్భాల్లో వాళ్ళ పూరిల్లు తుఫాను తీవ్రతకు ముక్కలై గాలికి కొట్టుకుపోతుందేమోనని పించింది. కొబ్బరి చెట్టొకటి వాళ్లకప్పు మీద విరిగి పడుతుందేమోనని లీల భయపడింది. కయ్యిలోని నీటి స్థాయి నిమిష నిమిషానికి అధికమైంది. దాంతో అదిపెద్ద సరస్సులాగా మారిపోయింది. బేల, కమల ఉత్తేజంతో కొట్టు మిట్టాడు తున్నారు, కాని లీల సమయం గడుస్తున్న కొద్దీ ప్రశాంతంగా మారిపోయింది - సముద్రంలోకి వెళ్లి నపడవలను తాను చూసినట్లు ఆమె తన చెల్లెళ్లకు చెప్పలేదు.

మూడు రోజుల తర్వాత తుఫాను సమసిపోయింది. అటు తర్వాత రెండు రోజులకు మేఘాలన్ని విడిపోయి నీటి తుంపురులతో కూడిన, కొంచెం పాలిపోయినట్లున్న వెలుగు ప్రసరించింది. లీల, బేల, కమల, సముద్రంలోని శిలవద్దకు వెళ్లి, పూలు, కుంకుమ సమర్పించటానికి వీలవుతుందేమో చూడటానికి సముద్ర తీరం దిగువకు పరుగెత్తారు. వాళ్లు అలల్లో నిలబడి ఉండటం వల్ల

తడిసిపోతూండటంతో కేకలు వేస్తున్నారు. అప్పుడు వాళ్ల యింటి వెనుక ఉన్న పూరింటికి చెందిన హీరాబాయి గ్రామంనుండి తిరిగి వస్తూ అక్కడికి వచ్చింది. ఆమె వాళ్ళున్నచోట ఆగిపోయి చేపలు పట్టే పడవలకు సంబంధించిన నాటకీయ పరిణామాలను వాళ్లకు తెలియ జేసింది, బేల, కమల భయపడిపోయారు; లీల వివరాలు తెలుసుకోవటానికి ఆసక్తి ప్రదర్శించింది.

చేపలు పట్టటానికి వెళ్లినపడవలు దగ్గర, దగ్గర నాలుగు రోజుల పాటు కనిపించకుండా పోయాయి. తుఫాను తీవ్రత తగ్గటం ప్రారంభమవగానే నౌకాదళము, కోస్తారక్షణ దళం వాళ్లు ఏర్పాటు చేసిన బృందం సముద్రంలో శోధించేందుకు బయలు దేరింది. బిజూ వాళ్లతో పాటు వస్తానని పట్టు పట్టటంతో అతను త్వరలో పడవను నడిపేచక్రాన్ని చేపట్టాడు. అతనే చేపలు పట్టే పడవల శకలాలను గుర్తించాడు. మూడు పడవలు మునిగి పోయాయి, మిగతావి దెబ్బతిని, పగిలిపోయాయి. ముగ్గురు జాలరులు మునిగి పోయారు. ఆహారం లేకుండా, జ్వరపడిన జబ్బు చేసిన, మిగతా జాలరులను వాళ్లు రక్షించి, తీసుకొనివచ్చారు.

నౌకాదళం వాళ్లు, కోస్తా రక్షణ దళం వాళ్లు బిజూనుపొగడి, కృతజ్ఞతలు తెలిపారుకాని జాలరులు మాట్లాడలేనంతగా అలసి ఉండటంతో. కుంటుతూ యిళ్లకు వెళ్లిపోయారు.

"నేను వాళ్లకు చెప్పాను. వాళ్లకు సముద్రంలోకి వెళ్లవద్దని చెప్పాను. వాతావరణంచాలా క్రూరంగా ఉందని, అగ్గిపెట్టెల్లాంటి చిన్నపడవలు తుఫానుకు తట్టుకోలేవని చెప్పాను," అన్నాడు బిజూ బిగ్గరగా, కయ్యప్రక్కన నిలబడి, ఆ జాలరుల పడవలకు లంగరువేయటం, వాటిని కట్టివేయటాన్ని పర్యవేక్షిస్తూ. ఇది అతనికి చాలా గొప్పదినం. ఈ రోజు అతని అధికసామర్థ్యంగల పడవశక్తి అందరికీ తెలిసే విధంగా నిరూపించ బడింది. మందమతులైన యీ జాలరులు ఆ విషయాన్ని ఆమోదించనందుకు మాత్రమే అతను విచారించాడు. "అంగీకరించండి - మీరు అంగీకరించ వలసి ఉంటుంది," అన్నాడు అతను. "ఈ వాతావరణానికి డీజెల్ యంత్రం ఉన్న పడవ ఉండాలి. మీ తెరచాపలు, మీరు మునిగి పోవటానికి మాత్రమే పనికి వస్తాయి," అన్నాడు.

కొద్దిమంది జాలరుల భార్యలు, యీ కార్యకలాపాలను గమనిస్తూ, బిజూ మాటలు వింటూ యింకా యిసుక మీదే నిలబడి ఉన్నారు. వాళ్లలో ఒకస్త్రీ, "అవును, కాని నీపడవలాంటి పడవను ఎంత మంది నిర్మించగలరు," అంది.

"మాపడవలు బలహీనమైనవి, నిరుపయోగమైనవి కావచ్చు. అయినా మేము తిండి తినాలి. అందువల్ల మాలాంటి జాలరులం చేపలను వేటాడాలి,"

అన్నాడు మరోజాలరి, బిజూమాటలను, ఆమోదిస్తూ.

ఆ మాటలకు బిజూ బడాయిలు, ప్రగల్భాలు ఆగిపోయాయి. అతను తీవ్రంగా చూస్తూ, "ఏదో ఒక నాటికి ప్రతి ఒక్కరూ నా పడవ లాంటి దాన్ని నిర్మించుకోవలసి ఉంటుంది," అన్నాడు వాళ్లనుద్దేశించి. "పరిస్థితుల్లో మార్పురావాలి. అప్పుడే మీరు బాగుపడతారు," అన్నాడు బిజూ వాళ్లు వెనుదిరుగు తూండగా. "మెరుగు పడండి! మారండి!" అంటూ అతను బురదగా ఉన్నకయ్యి ఒడ్డు మీద నడుస్తూ తన పడవను చూడటానికి వెళ్లాడు. అప్పటికే గాలి, వర్షం మళ్లీ ప్రారంభమై కొయ్యలతో నిర్మించిన పడవల పైభాగాల మీద పెద్ద పెద్దశబ్దాలు చేస్తూ వర్షిస్తోంది, దానితో యిసుకలో చిన్న ప్రవాహాలు ప్రారంభమయ్యాయి. కొంతసేపటి తర్వాత బిజూ తన పడవను ఆగాలీ వర్షంలోనే వదలి వేసాడు.

అకస్మాత్తుగా అతను ఒడ్డుమీద యింకా నిలబడిపోయి, గమనిస్తున్న మనుషుల గుంపులో ఒక ఆకారాన్ని గుర్తించాడు. "నీవా," అంటూ అరిచాడు అతను లావుగా, ఉంగరం పెట్టుకొన్నతన వ్రేలిని అతని వైపుచూపిస్తూ, "నీవు యిక్కడికి వచ్చావా? ఇప్పుడు నీకు తెలిసిందా నాకు ఎంత మంచి పడవ ఉందో?" అన్నాడు బిజూ బిగ్గరగా నవ్వుతూ. ఆమాటలకు ఏమీ సమాధానం చెప్పకుండా త్వరగా వెళ్లి పోవటానికి ప్రయత్నించాడు ఆవ్యక్తి. అలా వెళ్లటానికి ప్రయత్నించిన వ్యక్తి కర్మాగార నిర్మాణ ప్రదేశం దగ్గర కాపలాదారుడు. అతను బిజూ పడవ నిర్మాణంలో ఉన్నపుడు ఎగతాళి చేసాడు. ఇప్పుడు అతనికి యీ గ్రామస్తులు, వాళ్లపడవలు, వృత్తులు తాను చెప్పినంత దయనీయమైనవి కావని బాగా అవగాహన అయ్యింది. అయితే అతనికి ఆవిషయం అంగీకరించటం యిష్టంలేక తన పాకకు త్వర తర్వగా వెళుతున్నాడు.

"అవును. ఈ రోజు బిజూ గర్వపడదగిన దినం," అని హీరాబాయినవ్వుతూ, అక్కడ చేరిన ఆడపిల్లలకు అంతా వర్ణించి చెప్పింది.

"అవును. ఇతరవ్యక్తులు, వాళ్ల భార్యలు ఎలా భావించి ఉంటారో?" అందిలీల.

అప్పుడు హీరాబాయి తన చేయి ఆకాశంవైపు చూపించింది. "ఎప్పుడూ ఎలా అనుకొంటారో, అలాగే," అంటూ ఆమె నిట్టూర్చింది. "దేవుళ్లకే వదలి వేయాలి - అదే మనం చేయగలిగింది, దేవుళ్లకే వదలి వేయటం," అని ఆమె వెనుదిరిగి, సముద్ర తీరం మీద మెల్లగా నడుస్తూ, కొబ్బరి చెట్ల వరుస దగ్గరకు వెళ్లింది.

ఆ రోజు రాత్రి లీల, బేల, కమల తేమగా ఉండటం వల్ల పొగ చిమ్ముతున్న

మంటచుట్టూ గుమికూడారు. వర్షాకాలం ప్రవేశించటంతో వెళ్లిపోకుండా, దాన్ని గమనించనట్లు పరిసరాల్లో సంచరిస్తున్న పెద్దమనిషి 'మాన్ రిపోస్' లోనే ఉండి పోయి, వాళ్లకు డబ్బు యిస్తూండటం వల్ల వాళ్లు భోజనం చేయగలుగుతున్నారు. అందుకు వాళ్లు అతనికి కృతజ్ఞతను వెల్లడించారు. వాళ్ల నాన్న, సోదరుడు లేని సమయంలో అతను అక్కడ ఉన్నందుకే వాళ్లు కృతజ్ఞతా భావాన్ని వ్యక్తం చేసారు. బయట వీస్తున్న తుఫాను శబ్దాలు విని వాళ్లు హరిని గురించి ఆలోచించారు. హరి ఎందుకు రాలేదు. బొంబాయిలో సురక్షితంగా ఉన్నానని పోస్ట్‌కార్డ్ ఒకటి వ్రాసాడు. అతను ఎందుకు తిరిగి రాలేదు? అని ఆలోచిస్తూ, చీకటిలో కప్పల బెక బెకలు వింటూ, కొబ్బరి ఆకుల మీద, వాటి మీద నుండి తమ యింటి మీదికి జారుతూ, ధారలుగా కురుస్తున్న వర్షపు శబ్దాలను మౌనంగా వింటూ కూర్చొన్నారు.

చివరిగా, "హరి ఎప్పుడు వస్తాడను కొంటున్నావు?" అని అడిగింది బేల, నేల మీద వ్రేలితో గీతలు గీస్తూ.

"ఇప్పుడు వాడు రాలేడు - యీ వర్షాల వల్ల మనుషులు ప్రయాణం చేసే పడవలు ఆగిపోయి ఉండవచ్చు," అంది లీల, వివేకవంతంగాను, చురుకుగాను ఉన్నట్లు కనపడటానికి ప్రయత్నిస్తూ, "బహుశా, వర్షాకాలం అయిపోయిన తర్వాత రావచ్చు. బహుశ వాడు దీపావళికి రావచ్చు," అంది.

# పదకొండవ అధ్యాయం

"నీవు ఏదో ఒకరోజు మీ గ్రామం వెళ్లి పోతావు, విచారించకు బాబు" అన్నాడు పాన్‌వాలా, దయార్ద్రంగా. "నీవు మీగ్రామం నుండి ఎక్కువ దూరంలో లేవు నీవు తిరిగి వెళ్లవచ్చు," అన్నాడు.

"ఎప్పుడు?" "నేను యిప్పుడు వెళ్లాలను కొంటున్నాను," అన్నాడు హరి దిగులుగా. "వర్షాలు ఆగిపోయేంతవరకు ఆగు బాబు, వర్షాకాలంలో ప్రయాణీకుల పడవ రేవాస్ దాకాపోదు. వర్షాలు ఆగిపోయిన తరువాత ప్రయాణీకుల పడవ ఎక్కి నీవు మీ గ్రామానికి తిరిగి వెళ్లవచ్చు. అప్పటికి నీవు మరింత డబ్బు పొదుపు చేయవచ్చు. అవునా? నాకు యిప్పుడిప్పుడే పూర్వపు శక్తి వస్తోంది. త్వరలోనే నేను దుకాణానికి వచ్చి నీకు చేతిగడియారాల మరమ్మత్తును గురించి, యింకా కొన్ని సూక్ష్మ విషయాలను నేర్పుతాను. నీవు చేతిగడియారాలు మరమ్మతు చేయటం ప్రారంభిస్తే, వాటివల్ల లభించే డబ్బు నీవేవసూలు చేసుకోవచ్చు. ఆడబ్బు నీదే అవుతుంది. నాది కాదు. ఈ ఏర్పాటు బాగుంది? ఆఁ? అప్పుడు నీవు మీ ఊరువెళ్లి గ్రామంలో చేతి గడియారాల మరమ్మతు ప్రారంభించవచ్చు," అన్నాడు పాన్‌వాలా.

హరి, వృద్ధ పాన్‌వాలా అజ్ఞానానికి నవ్వాడు. ప్రతి ఒక్కరు సూర్యుణ్ణి చూసి కాలం చెప్పే గ్రామంలో చేతిగడియారాలు, గోడగడియారాలు ఎక్కడ ఉంటాయి? వృద్ధ బిజూకు గోడగడియారం ఉండి ఉండవచ్చు, కాని తనకు తెలిసినంత వరకు, అది ఉప్పుగాలిలో త్రుప్పుపట్టి - అతని టెలివిజన్ సెట్‌లాగ నిరుపయోగంగా మారి ఉండవచ్చు. అయినా పాన్‌వాలా వ్యక్తంచేసిన భావాన్ని పురస్కరించుకొని సంతోషించాడు. అలాంటి ఆలోచనను తనకు తెలియ జేసినందుకు పాన్‌వాలా పట్ల కృతజ్ఞత అతని మనసులో నెలకొంది.

ఇంటికి వెళ్లాలన్న కోరిక భరించ రానిదిగా మారినప్పుడు పాన్‌వాలా

తనను చూడటానికి పరుగెత్తు కొంటూ వచ్చాడు. తాను పాన్‌వాలా ఎక్కడున్నాడో వెదకి తప్పిపోయిన చేపలు వేటాడే పడవలను గురించి చెప్పాడు. ఆవృద్ధుడు జబ్బుపడ్డ రోజునుండీ దుకాణానికి రాలేదు. అప్పటి నుండి ముందు తలుపు వేసేఉంది. కాని ఒకరోజు ఓ ఖాతాదారు తనచేతి గడియారం కొరకు వచ్చి ప్రక్కన ఉన్న జాగూను చేతిగడియారాలు మరమ్మతు చేసే వృద్ధునికి ఏమైంది, అతను మరమ్మతు చేసే గడియారాలు ఏమయ్యాయో తెలుసునా? అని అడిగాడు ఆవచ్చిన వ్యక్తికి జాగూ పాన్‌వాలా చిరునామా చెప్తొంటే హరి వినటం జరిగింది.

"ఏమిటి?" అన్నాడు, హరి చేతిలో ఉన్న గుడ్డముక్కను నేల మీద వేస్తూ, "ఎక్కడ ఉంటాడతను?" పాన్‌వాలా ఉండే చిరునామా జాగూకు తెలిసి ఉంటుందని యింత కాలం హరికి తోచలేదు.

జాగు, హరి అడగటంతో పాన్‌వాలా చిరునామా మరోసారి చెప్పాడు. అప్పుడు హరి ఒగంట విరామం యిస్తే తాను వెళ్లి, ఆవృద్ధుణ్ణి చూసి వస్తానని జాగూను అభ్యర్థించాడు. అతను ఉండే ప్రదేశం దుకాణానికి ఎంతోదూరం లేదు; అది గ్రాంట్ రోడ్ స్టేషన్ ప్రక్క, రోడ్డు చివర ఉంది. హరి ఆ చిరునామా తేలికగా కనుక్కోగలిగాడు. త్వరత్వరగా అతను ఊగుతున్న కొయ్య మెట్లమీదుగా పైకి వెళ్లాడు. అలా వెళుతున్నపుడు అతను వీధితో సమానమైన ఎత్తులో ఉన్న మిఠాయి షాపు ప్రక్కగాను, మొదటి అంతస్థులో ఉన్న పక్షుల, జంతువుల వైద్యశాల ప్రక్కగాను, గడపల మీది పిండి ముగ్గులు, ద్వారాలకు ఎండిపోయిన బంతి పూల దండలు, వేలాడు తున్న గుమ్మాల ప్రక్కగాను, వెళ్లి పై అంతస్థుకు చేరుకున్నాడు. అక్కడ పాన్‌వాలా కొకగది ఉంది. దాని ముందు వసారాలో పాతడబ్బాలు, పెట్టెల్లో ఎక్కువ సంఖ్యలో మొక్కలున్నాయి.

అక్కడ అతను విరిగిన పేము కుర్చీలో కూర్చొని ఉన్నాడు. అతను బాగాపాలి పోయి, బలహీనంగా ఉన్నాడు - యిప్పుడిప్పుడే కోలుకుంటున్నాడు. ప్రారంభంలో ఫ్లూజ్వరం వచ్చింది. కాని తర్వాత అతని ఆరోగ్యం బాగా పాడైపోయి గుండె పడిసెంగా మారింది. అతని పొరుగున ఉన్నవాళ్లు అతన్ని ఆసుపత్రికి తీసుకొని వెళ్ల వలసి వస్తుందేమోనని భయపడ్డారు. కాని అతనుచాలా బలహీనంగా ఉండటం వల్ల అతనిని గదిలో ఉండనివ్వటమే మంచిదని నిర్ణయించు కొని, వంతులు వారీగా భోజనం, మద్యం సరఫరా చేసారు. అతనుంటున్న క్రింది అంతస్తులోని వైద్యుడు, వాళ్లిద్దరూ ఏభై సంవత్సరాలకు పైగా పొరుగున నివసిస్తూండటం వల్ల అతనికి ఉచితంగా వైద్యం చేసాడు.



పాన్‌వాలా ఆగృహ సముదాయంలో అందరికి ఆదరణ పాత్రుడయ్యాడు, అతన్ని అందరూ అభిమానిస్తారు; యిప్పుడు అతన్ని విలువైన వ్యక్తిగా భావిస్తారని స్పష్టమైంది. అతను కోలు కొన్నప్పుడు అందరూ ఉపశమనం పొందారు; కాని పనిచేయటానికి వెళ్తూంటే మళ్లీ జబ్బు పడకుండా ఉండటానికి వర్షాకాలం దాటిపోయేంత వరకు యింటి దగ్గరే ఉండి విశ్రాంతి తీసుకోవాలని పట్టుబట్టారు. హరి అలా ఆకస్మాత్తుగా రావటం అతనికి ఆనందాన్ని కలిగించింది. అతను ప్రశాంతంగా కూర్చొని రైల్వేస్టేషన్ కప్పుగా ఉన్న ముడుతలు, ముడుతల యినుపరేకులను, వాటి మీద కూర్చొని, పెద్ద శబ్దాలతో రైళ్లు స్టేషన్‌లోకి వచ్చి నప్పుడు, కీచుమంటూ బయటకు వెళ్లుతున్నపుడు, వెలువడే నల్లని

పొగ మధ్యగా ఎగిరిపోతున్న పావురాల గుంపులను చూస్తున్నాడు.

హరి అతని కాళ్ల దగ్గర ఉన్న పీటమీద కూర్చొని పాన్‌వాలాకు జబ్బు చేసినపుడు అతనికి భోజనం పెట్టటానికి, సంరక్షణ చేయటానికి సహాయ పడిన కుఱ్ఱ వాడొకడు గ్లాస్‌లో తెచ్చిన తియ్యని టీ త్రాగాడు. ఏదో ఒక సమయంలో పాన్‌వాలా నుండి సహాయంపొంది ఉండటం వలన చాలామంది కుఱ్ఱవాళ్లకు అతని పట్ల కృతజ్ఞతాభావం. హరి టీ త్రాగుతూ తుళ్‌కు సంబంధించిన విశేషాలన్నీ చెప్తున్నాడు. పాన్‌వాలా వివేకవంతమైన వృద్ధ పక్షిలాగా తల ఒక ప్రక్కకు వంచి హరి మాటలు వింటూ తన ఒడిలో ముడుచుకొని నిద్రపోతున్న బూడిద రంగు పిల్లిని నిమురుతూ కూర్చున్నాడు.

"అవును," అంటూ అతను తల ఊపాడు. "త్వరలోనే కొబ్బరి కాయలతో పూజ చేసే రోజు వస్తుంది. అప్పటికి వర్షాకాలం ముగుస్తుంది. అప్పుడు అందరు సముద్రానికి కొబ్బరి కాయలు సమర్పిస్తారు. దాంతో పడవలు మళ్లీ సముద్రంలోకి సురక్షితంగా వెళ్లగలుగుతాయి. అప్పుడు నీవు పడవ మీద మీ ఊరు వెళ్లవచ్చు. నీవు యింటి నుండి రాకుండా ఉండవలసింది బాబు. ఇక్కడికి వచ్చేందుకు మీ అమ్మ, అక్కా చెల్లెళ్లను వదలి వేయకుండా ఉండాల్సింది. చూడ నీవు ఎంత సన్నగా అయిపోయి, చిక్కిపోయావో చూడు - ప్చ్!" అన్నాడు.

"అక్కడ నేను చేయటానికి ఏమీ లేదు," అనిహరి వివరించాడు. "మా నాన్న చాలా కాలం క్రితమే చేపలు పట్టే పడవను అమ్మి వేసాడు. ఆయన మా ఆవును కూడా అమ్మి వేసాడు. చేయటానికి పనేమీలేదు - కూరగాయలు పండించటానికి చిన్న స్థలం మాత్రమే ఉంది - అది చాలా చిన్నది. ఇప్పుడు తుళ్‌లో పెద్ద కర్మాగారం నిర్మింపబడబోతోంది. వాళ్లు మా భూమినంతా తీసుకొంటారు. అప్పుడు చేపలు పట్టటంకాని, వ్యవసాయంగాని ఉండ బోదని అంటున్నారు. నేను పని కొరకు బొంబాయి రావలసిన పరిస్థితి ఏర్పడింది," అన్నాడు హరి.

తిన్నగా కూర్చుంటూ, పక్షిలాంటి నిశితమైన కళ్లతో హరివైపు చూస్తూ "నీకు ఎక్కడైనా పని దొరుకు తుంది," అన్నాడు పాన్ వాలా. అతను హరి చేతి వ్రేళ్లను పైకెత్తి, వాటిని అటుయిటు ఊపుతూ, "నీ చేతులను ఉపయోగించగలిగినంత వరకు వాటికి పని లభిస్తుంది. వాళ్లు మీ భూమిని తీసుకొంటే, నీవు దానికి బదులు వాళ్ల కర్మాగారంలో పనిచేయటం నేర్చు కోవలసి ఉంటుంది. నీవు దాన్ని నిరోధించ లేకపోతే, నీవు కర్మాగారాన్ని

ఉపయోగించటం నేర్చుకోవాలి - భయపడకు," అన్నాడు.

"కళాశాలల నుండి పట్టాలు పొందిన యింజనీర్లకుమాత్రమే అక్కడ పని లభిస్తుందని మాపెద్దలు అంటున్నారు. వాళ్లకు జాలరులు, వ్యవసాయ దారులు అవసరం లేదు. మాకు పని లభించదు," అన్నాడు హరి.

"హ్," అని పాన్‌వాలా కొంత సేపటి వరకు పెదవిని పంటితో నొక్కి పెట్టాడు. "బహుశా అలాగే కావచ్చు. కర్మాగారంలో పని కాకుండా యితర పని ఉండవచ్చు. కర్మాగారం నిర్మాణదశలో ఉన్నప్పుడు కట్టడాలు కట్టేతాపీ పనివానిగానో లేక రోడ్ల నిర్మాణం చేసే శ్రామికునిగానో నీకు పని లభించవచ్చు. తరువాత యింజనీర్లు, మెకానిక్‌లు, నూతన గృహ సముదాయాల్లో ఉండేందుకు వస్తారు. వాళ్లకు పని చేయటానికి పని వాళ్లు అవసరమౌతారు. వాళ్లకు ఆహారం, కూరగాయలు, పాలు, పండ్లు, గ్రుడ్లు కూడా అవసరమౌతాయి. మీరు పండించే కూరగాయలు, బోండాలు వాళ్లకు అమ్మవచ్చునని నీకు అర్థం మౌతుంది. ఆ ఆదాయంతో బహుశ నీవు ఒక ఆవునో లేక కోళ్లనో కొనగల వేమో. అలావాటి ద్వారా జీవనో పాధి లభించవచ్చు - అవును, అవును, అవును - ఆ విషయాలను గురించి ఆలోచించు. హరి, చాలా పని ఉంటుంది. వాళ్లు నీవు మరమ్మతు చేసేందుకు చేతిగడియారాలు, గడియారాలు తమతో తీసుకొనిరావచ్చు," అంటూ ఎర్రని, పళ్లులేని చిగుళ్లు కనిపించేటట్లు నవ్వాడు పాన్ వాలా. "అందువల్ల నీవు నేర్చుకొన్న చేతిగడియారాలు మరమ్మతు చేసే నైపుణ్యం నిరుపయోగం కాదు! బహుశ ఒకనాటికి నీవు తుళ్‌లో మొదటి చేతి గడియారాల మరమ్మతు దుకాణం యజమానివి కావచ్చు - యీ విషయాన్ని గురించి ఏమంటావు?" అన్నాడు.

హరి ఆశ్చర్యంతో నవ్వాడు వీటిని గురించి ఎన్నడూ తానెందుకు ఆలోచించలేదు?

"ఓ పాన్‌వాలా నాకు యింకా బాగా గడియారాల మరమ్మతులు నేర్పటానికి దుకాణానికి ఎప్పుడు - తిరిగి వస్తావు?"

"అవును, అవును, అవును," అంటూ పాన్ వాలా నవ్వాడు. ఒడిలో ఉన్న బూడిద రంగు పిల్లిని, మెల్లగా నిమురుతూ. "నేను వస్తాను. నేను నీకు నేర్పుతాను - నాకోసం ఎదురు చూడు. త్వరగా పారిపోకు ," అన్నాడు పాన్‌వాలా.

"నేను వెళ్లను," "నేను యింకా బాగా నేర్చుకోవాలను కొంటున్నాను," అన్నాడు హరి వాగ్దానం చేస్తున్నట్లు.

"మంచిది," అన్నాడు పాన్‌వాలా. "నేను నీనుండి అమూలే వినాలను కొన్నాను. నీవు అభివృద్ధి చెందినీలో మార్పు రావటానికి బాగా నేర్చుకో. ఎప్పుడూ పరిస్థితులు మారుతుంటాయి, నాయనా - ఏదీ ఒకే విధంగా ఉండదు - మన భూమి అంతా నీటితోనిండి ఉన్నప్పుడు - అన్ని ప్రాణులు నీటిలో జీవించి, యీదు తూండేవి. నీరు తగ్గి పోయి భూమి కనిపించటంతో సముద్రంలోని ప్రాణులు బయటకు ప్రాకి గాలి పీల్చటం, భూమి మీద నడవటమూ నేర్చు కొన్నాయి. తినటానికి చాలినన్ని మొక్కలు లేకపోవటంతో అవి ఆహారం కొరకు వేటాడి, చంపటం నేర్చుకొన్నాయి. అన్నీ అలాగే ఉన్నాయను కోకు, లేదు, బాబు, యింకా మారు తూనే ఉన్నాయి - మారుతూనే ఉంటాయి. జీవించి ఉండాలంటే నీవు కూడా మారవలసి ఉంటుంది. చక్రం తిరుగుతూనే ఉంటుంది. అది ఎప్పుడూ ఆగదు, నిశ్చలంగా ఉండదు. చూడుబొంబాయి కూడా ఎప్పుడూ ఒకే విధంగా లేదు - ఏభై సంవత్సరాలక్రితం, కొండలు, తోటలు, అందమైన భవనాలు, పెద్ద పెద్ద భవనాలుండేవి. ఇప్పుడు మురికివాడలు, దుకాణాలు, రాకపోకల రద్దీ, జనసమూ హాలు కనిపిస్తున్నాయి. ఒకప్పుడు నేను తోట, గులాబీ మొక్కలు, ఫువ్వారాలు ఉన్న పెద్ద భవనంలో ఉండేవాడిని. ఇప్పుడు నేను రైల్వే స్టేషన్ పైన పావురాలు విశ్రమించే చోట ఉంటున్నాను!" ఇదంతా ఒక చతురోక్తి అన్నట్లు అతను బిగ్గరగా నవ్వాడు. "అందువల్ల జాలరైన హరి, వ్యవసాయ దారుడైన హరి, కోళ్ల పెంపకాన్ని చేపట్టే హరిగా కాని, చేతి గడియారాలు బాగుచేసే హరిగాకాని మారవలసి ఉంటుంది," అన్నాడు.

పాన్‌వాలా అంత ఉత్తేజితంగాను, శక్తి వంతంగాను ఉండటంవల్ల హరి నవ్వాడు. అతనంత ఆరోగ్యంగా ఉంటే త్వరలో తప్పక దుకాణానికి వచ్చి హరికి గడియారాలు బాగు చేయటం నేర్పుతాడు. ఇంకా నేర్చుకోవలసింది చాలా ఉందని హరికి తెలుసు.

"నీవు అదృష్టవంతుడివి," అంటూ పాన్‌వాలా మళ్లీ కుర్చీలో వెనక్కు వాలాడు. "నీవు చిన్నవాడివి, నీవు మారవచ్చు, విషయాలు నేర్చుకొని అభివృద్ధి పొందగలవు. వయస్సు మళ్లిన వాళ్లు చేయలేరు కాని నీవు చేయగలవు. నీవు అలా చేయగలవని నాకు తెలుసు," అన్నాడు.

పరిస్థితులు మారతాయని పాన్‌వాలా చెప్పినట్లు, చక్రం మళ్ళీ తిరిగింది. ఇంతకు ముందు అధ్వాన్నంగా మారిన పరిస్థితులు మెరుగయ్యాయి. వర్షం తగ్గి తుంపరలుగా మారింది పాన్‌వాలా తనదుకాణాన్ని తెరవటానికి తిరిగి

వచ్చాడు. అతను పాలిపోయినట్లు బలహీనంగా ఉన్నాడు. కానీ మళ్లీ పనిచేపట్టాలని ఆదుర్దాగా ఉన్నాడు. అతని వద్ద చాలా పని పేరుకు పోవడం వల్ల హరి, అధికసమయం, అతనికి సాయంచేస్తూ, అల్పాహారశాలలో తక్కువ సమయం గడపవలసి వచ్చింది.

జాగూదాన్ని గురించి అంతగా పట్టించుకొలేదు. హరి తన యింటికి రావడం దురదృష్ట కరంగా పరిణమించటంతో అతనికి హరిని ఎక్కువగా కలవాలని గాని, అతనితో ఎక్కువగా మాట్లాడాలని గాని అనిపించ లేదు. బహుశ హరి, తన భార్యను, కుటుంబ సభ్యులను కలుసుకొని, వాళ్లు ఎలానివసిస్తుందీ చూసినందుకు విచారపడ్డాడేమో. దాని వల్ల హరి, పాన్‌వాలా దుకాణంలో కొన్ని గంటలు పనిచేయటానికి అనుమతి కోరినప్పుడు అతను ప్రక్కవైపు చూడటమో, లేక గుర్రు మనటమో, లేక తల ఊపటమో చేసేవాడు.

హరి, డిసిల్వాలు ఉండే ఎత్తైన గృహసముదాయం ఉన్న కొండ మీదికి వెళ్ల లేదు. అతను ఆగృహ సముదాయంలోకి వెళ్లి, పనికొరకు అభ్యర్థించటం వల్ల కలిగే అవమానాన్ని భరించ లేనని భావించాడు. ఇప్పుడు తాను భయపడిపోయి అయోమయ స్థితిలో ఆశ్రయము, రక్షణ లభించే ఎలాంటి చోటికైనా వెళ్లటానికి ఎంత మాత్రం సిద్ధంగాలేడు. తాను ఇప్పుడు ఏదిమంచిదో నిర్ణయించుకోగలనని, నిర్ణయాలు చేసుకోగలనని అతనికి తెలిసి పోయింది. తాను ఓధనవంతుని యింట్లో సేవకునిగా ఉండాలని, అతను వాస్తవంగా కోరుకోవటంలేదు. తానొక మూర్ఖుడిగా మారిపోయి గ్లాసులు, పింగాణీ పళ్లాలు పగులగొట్ట వచ్చును; మెరుస్తున్న వాటి మీద తన వ్రేళ్లముద్రలు పడవచ్చు, శుభ్రంగా ఉన్న చోట తన పాదముద్రలు, పడవచ్చునని భావించాడు; లిఫ్ట్‌లు, డోర్‌బెల్స్, టెలిఫోన్‌లు కార్లలాంటి వస్తువుల విషయంలో తన అవివేకాన్ని ప్రదర్శించవచ్చు. తాను నగరానికి సంబంధించిన కుర్రవాడు కాదు. అలామారాలని కూడా అనుకోవటం లేదు. సముద్రంలో జాడ తెలియకుండా పోయిన చేపల పడవలను గురించిన వార్తలు రేడియోలో విన్నప్పటి నుండి తనపడవలే పోయినట్లు, లేక తనతండ్రి, సోదరులు సముద్రంలో మునిగి పోయినట్లు కలత చెందాడు. తాను తుళ్‌కు చెందిన వాడినని తాను మళ్లీ అక్కడికే వెళతానని తనకు తెలుసు. జీవితంలో తాను ఏమి చేయదలచుకొన్నదీ ఎంచుకోగలగటం అద్భుతంగా ఉంటుంది. తాను అలానే ఎంచు కొంటాడు. "నేను వర్షాలు తగ్గిన తరువాత వెళ్లి పోతాను," అని హరి, జాగూతో చెప్పాడు; యిప్పుడు చెప్తే, నా స్థానంలో మరొకరిని తీసుకోవాలను కుంటే మీకు

వీలుగా ఉంటుందని, యిప్పుడే చెప్పటం మంచిదను కొన్నాను," అన్నాడు.

జాగూ ఏమి మాట్లాడకుండా తల ఊపి, మరోవైపు చూసాడు "ఎప్పుడు," అన్నాడతను అస్పష్టంగా.

"కొబ్బరి కాయలతో పూజ చేసే ఉత్సవం జరిగే రోజు తర్వాత." "కొబ్బరి కాయలతో పూజ చేసే ఉత్సవం జరిగిన ఆ తర్వాత ఏదోఒక రోజు," అన్నాడు హరి.

"దివాళీ వరకు ఉండు," అన్నాడు జాగు, మురికిగా ఉన్న మేజాబల్ల ఉపరితలం వైపు చూస్తూ, కంగారుగా దాని మీద వేళ్లతో వాయిస్తూ. "అప్పుడు మాఊరినుండి నా సోదరుడు నాకు సాయం చేయడానికి వస్తాడు. అప్పటి వరకు ఉండు," అన్నాడు.

హరి ఆప్రతిపాదనను తిరస్కరించాలను కొన్నాడు. అతను అంత దీర్ఘకాలం ఉండాలని అనుకోలేదు. అయినా అతను అభ్యంతరం తెలుప లేక పోయాడు. జాగు తనపట్ల చాలా మంచిగా వ్యవహరించాడు. తనకు భోజనం పెట్టి, ఆశ్రయం కల్పించి తన జీవితాన్ని కాపాడాడు. తను ప్రయత్నంలో సఫలీకృతుడు కాలేకపోయినా జాగు తనను, అతనికుటుంబ సభ్యునిగా చేసుకోవటానికి ప్రయత్నించాడు. అందువల్ల అతని మాటను కాదనలేదు. అలా ఆలోచిస్తూ హరి, మేజా బల్లల మీదున్న ఎంగిలి పళ్లాలను తీసి, వాటిని శుభ్రం చేయటానికి వెళ్లాడు.

"జాగు నన్ను దివాళి వరకు వెళ్లనీయడు," అని చెప్పాడు హరి, పాన్ వాలాకు, యిబ్బందిగా.

"వెళ్లనీయడా?" అని అడిగాడు పాన్ వాలా. "ఓహ్ అంత నిరాశా పూరితంగా కనిపించకు, బాబు, మనకు తెలియకుండానే దివాళి వచ్చేస్తుంది. ఆకాశం వైపు చూడు మేఘాలు వెళ్లిపోతున్నాయి. త్వరలో కొబ్బరి కాయలతో పూజ చేసే రోజు వస్తుంది. ఎన్నో పండుగలు, ఒకదాని తర్వాత ఒకటి వస్తాయి. మొత్తం సంవత్సరంలోనే ఉత్కృష్టమైన రోజు దివాళి. ఆరోజు స్వగ్రామం వెళ్లాలను కోవటం మంచి ఆలోచన అని భావిస్తున్నాను. అప్పటి వరకు యిక్కడ ఉండి నీవు చేతిగడియారాలు బాగు చేయటం నేర్చుకోవచ్చు. నేను నీకు నేర్పవలసింది చాలా ఉంది. నేను నిన్న నీకు యిచ్చిన చేతిగడియారాన్ని చక్కగా బాగుచేసావు; దాని స్వంతదారు వచ్చినప్పుడు అతను నీకే డబ్బులిచ్చేటట్లు చేస్తాను, కాని నేర్చుకోవలసింది యింకా చాలా ఉంది. ఇదిగో జపాన్ నుండి వచ్చిన యీ చేతిగడియారాన్ని చూడు.

ఎలక్ట్రానిక్ గడియారం చూసావా నా వృద్ధాప్యంలో ఓ క్రొత్తరకమైన చేతిగడియారాన్ని గురించి నేర్చుకోవలసి వచ్చింది. నీవు గూడా నేర్చుకోవచ్చు, కూర్చో, చేతులు తుడుచుకో. నేను యీ గడియారాన్ని విప్పబోతున్నాను. చూడు - తర్వాత వాళ్లిద్దరూ బాగా పనిచేస్తున్న గడియారపు చిన్న భాగాలను పరిశీలిస్తూ అద్భుతావహమైన ఆ గడియారపు లోపలి భాగాల వంక చూసారు.

వాళ్లు పని చేస్తూండగా, "పాన్‌వాలా, మీరు కొబ్బరి కాయలతో పూజ చేసే రోజుకు సంబంధించిన ఉత్సవము, దివాళీని జరుపు కొంటారు. అయినా మీరు హిందువు కాదు, అవునా? నేను మీరు పార్శీలని, పార్శీ పండుగలను మాత్రమే నిర్వహిస్తారని భావించాను," అన్నాడు హరి.

"ఓ, లేదు, లేదు, బాబు," అన్నాడు పాన్‌వాలా, హాస్యపూరితంగా. "అలా ఉంటే ఆనందం ఏముంటుంది? హిందూ, ముస్లిమ్‌ల పండుగల్లో ఉన్న ఆనందాన్ని నేను ఎందుకు కోల్పోవాలి? లేదు, లేదు నాకు అన్నింటిలో పాలుపంచు కోవటం, అన్నింటిని ఆనందించటం పట్ల విశ్వాసం ఉంది. అందువల్లే నేను చాలా సంతోషంగా ఉంటాను. కాదా? నాకు విచారంలేదు, కాదూ?" అన్నాడు.

వాళ్లు అలా జపాన్ లో తయారైన చేతి గడియారాన్ని బాగు చేస్తుండగా హరి బాగు చేసిన రోలెక్స్ చేతిగడియారపు స్వంతదారు దాని కొరకు రావటంతో పాన్ వాలా హరికే డబ్బు లివ్వమని అతనికి చెప్పాడు. అతను కొంచెం ఆశ్చర్యపడి నట్లు కనిపించాడు, అయినా పాన్‌వాలా చెప్పినట్లు హరికి పది రూపాయలనోటు యిచ్చాడు హరి పదిరూపాయల నోటు వంక చూస్తూ నిలబడ్డాడు. ఒక్కసారిగా అతను తాను యిక ఎంత మాత్రం చిన్నవాడు కాదని, తాను ఎదిగిన వయోజనుణ్ణని భావించాడు. అందువల్ల ఏమిటి నీకు తృప్తిగా లేదా? నవ్వవా?" అని పాన్‌వాలా అడిగినప్పుడు అతను నవ్వలేక పోయాడు. అతను తల ఊపి డబ్బును జాగ్రత్తగా జేబులో దాచాడు.

"నేను యింటికి వెళ్లే ముందు, నా అక్కా, చెల్లెళ్లకు కానుకలు కొంటాను." "చేతిగడియారాలు బాగు చేయటం వల్ల వచ్చే డబ్బంతా అందుకే పొదుపు చేసి ఉంచుతాను," అని హరి తనలో తాను అనుకొన్నాడు.

చివరకు వర్షాలు పూర్తిగా ఆగి పోకముందే కొబ్బరి కాయలతో పూజచేసే రోజు వచ్చింది. వర్షాకాలంలో లాగ పగలు, రాత్రి వర్షాలు పడటం లేదు - అప్పుడప్పుడు అటూ యిటూ పరుగెత్తుతున్న మేఘం నుండి తుంపరలు మాత్రమే పడుతున్నాయి. ఇప్పుడు మేఘాలు నగరాన్ని బూడిద రంగు ఉన్ని

దుప్పటి లాగా ఆవరించి విస్తృతమైన ఆకారంలో లేకుండా సూర్య కాంతిలోను, గాలిలోను తేలిపోయే మెత్తని శకలాలుగా ఉన్నాయి. సముద్రం ప్రశాంతంగా ఉంది. దాని అలలు రాజ మార్గం మీద ఎత్తుగా విరుచుకు పడటం లేదు, వీధులకు అడ్డంగా విరుచుకు పడటం లేదు. తుఫానుల తర్వాత అవి అలసి పోయినట్లు బురదతో ముందుకు కదులు తున్నాయి. నగరంలోని భవనాలు యింకా తేమగాను, బూజు పట్టి ఉన్నాయి కాని వాటిలోకి అధిక పరిమాణంలో నీరు ప్రవేశించటం లేదు. అవి యిప్పుడిప్పుడే ఆరటం మొదలైంది.

కొబ్బరి కాయలతో పూజ చేసే రోజు ఉదయం చిన్న జల్లు పడింది, అయితే ఆజల్లు మనుషు లందరూ యిళ్లలో ఉండి బొంబాయి నగరపు ఆరాధ్య దైవమైన గజ వదనుడైన గణేశునికి అగరొత్తులతో, బంతిపూలతోను పూజచేస్తూ, మిఠాయిలతో నైవేద్యం సమర్పిస్తున్న తరుణంలో పడింది. మధ్యహ్న సమయంలో సముద్రానికి సమర్పించటానికి కొబ్బరి కాయలు పట్టు కొని జనం అందరూ అధిక సంఖ్యలో వీధుల్లోకి వచ్చి నప్పుడు సూర్యుడు కనిపించి, తుఫానుల వల్ల దెబ్బతిని, మురికి పేరుకుపోయిన నగరాన్ని బంగారు కాంతులతో వికసింపజేసాడు.

చౌ పట్టి సముద్ర తీరానికి చేరుకొన్న వేలాది మంది ప్రజల్లో హరి, పాన్ వాలా కూడా ఉన్నారు. హరి బొంబాయిలో మొట్ట మొదటి రోజు చూసి మంచిదని భావించిన ప్రాంతమే ఆ చౌపట్టి సముద్ర తీరం. ఈ రోజు అది నిజంగా ఉత్సవం జరిగే ప్రదేశం. పోలీసులువచ్చి, ఊరేగింపులు మెరేన్, డ్రైవ్‌ను దాటి సముద్ర తీరానికి చేరుకొనే విధంగా రద్దీని నిర్దేశిస్తున్నారు. ఆదృశ్యాన్ని చూడటంతో హరికి తాను బొంబాయికి చేరుకొన్న మొదటిరోజు మళ్లీ జ్ఞాపకం వచ్చింది. ఇసుకలోని ప్రతి అంగుళం జనంతోనిండి పోయింది; ఇంతకు ముందు కంటే అధికసంఖ్యలో వస్తువులు అమ్మేవాళ్లు, దుకాణాలవాళ్లు ఉన్నారు. వాళ్లు ఉత్సాహంగా ఉన్న పిల్లలకు, ఉప్పు, కారం కలిపిన తిను బండారాలు, ఐస్ క్రీమ్‌లు, రంగుపానీయాలు, బెలూన్‌లు, రేకుబూరలు, కాగితపు బూరలు అమ్ముతున్నారు. కొబ్బరి బొండాలు కూడా ఉన్నాయి. తుఫానుల ఋతువు తర్వాత, ఎలాంటి ప్రమాదాలు లేకుండా ముగిసినందుకు కృతజ్ఞతలు తెలుపుతూ సముద్రానికి భక్తి ప్రపత్తులతో సమర్పించేందుకు అందరూ ఒక్కో కొబ్బరి బొండాం కొన్నారు.

దీర్ఘ కాలం అస్వస్థత వల్ల యింకా పాలిపోయి వంగి పోయినప్పటికీ, చాలా సంతోషంగాను, శక్తి వంతంగాను ఉన్న పాన్‌వాలా హరి కొరకు ఒక

కొబ్బరి బొండాం కొన్నాడు. హరి ఆకొబ్బరి బొండాం ధర చెల్లించటానికి ప్రయత్నం చేసినప్పుడు, "నీవు నీడబ్బు మీ కుటుంబసభ్యులకు కానుకలు కొనటానికి ఉంచుకో," అన్నాడు పాన్‌వాలా. తర్వాత వాళ్లిద్దరూ సమూహాన్ని దాటి సముద్రం అంచు వరకు వెళ్లారు. అక్కడ కొందరు పట్టీలతో మెడకు తగిలించుకొన్న మృదంగాలను వాయిస్తున్నారు; మరికొందరు మో చేతులు బయటకు వచ్చేలాగా, మోకాళ్లు వంచి, ఆనందంతో గంతులు వేస్తూ, పాడుతూ వాళ్ల ముందు నాట్యం చేస్తున్నారు. స్త్రీలు గులాబీ, పసుపు పచ్చ నీలం, నారింజ రంగుల ప్రకాశవంతమైన, క్రొత్త చీరెలను ధరించారు. అందరి తలల్లో పూలున్నాయి. వాళ్లలో కొందరు ఎర్రని చూర్ణాన్ని గాలిలో చల్లుతున్నారు. ఆ చూర్ణం వాళ్ల తలమీద, భుజాల మీద పడి, మధ్యహ్నం ఎండలో మెరుస్తుంది.

అలల ఉధృతి తగ్గి సముద్రంలో చాలా దూరంలో ఉండటం వల్ల వాళ్లు చదరంగా తేమగా ఉన్న యిసుక మీదికి వెళ్లారు. తేమగా ఉన్న యిసుక మెరుస్తూ, బంగారు కాంతులీనుతున్న ఆకాశంలో అటూ యిటూ పరుగెడుతున్న ఎర్రని పెద్ద మేఘాలను ప్రతిబింబిస్తోంది. చిన్న పిల్లలు పాదరక్షలు లేకుండా దాని మీదుగా సముద్రం దగ్గరకి పరుగెత్తుతున్నారు. సముద్రం లోపలికి వెళ్లి వాళ్ల కొబ్బరి బొండాలు లోతు ప్రాంతంలో నిమజ్జనం చేయాలనుకొనే వారి కొరకు అక్కడ జాలరులు, పడవల్లో ఎదురు చూస్తూ ఉన్నారు. మిగతా వాళ్లు తాము తెచ్చిన కొబ్బరి బొండాలను ఊరికే విసిరి వేస్తున్నారు. మరి కొంత మంది వాటిని సముద్రంలో కొంచెం లోతుకి వెళ్లి వాటిని అక్కడ వదలి వేస్తున్నారు. వేలకొద్దీ కొబ్బరి బొండాలు అలల మీద ఎగిరి పడుతూ, తేలుతూ తర్వాత మునుగుతున్నాయి. వందల కొద్దీ అల్లరి పిల్లలు నీళ్లు చిమ్ముకుంటూ అలల్లోకి వెళ్లి వాటి కొరకు నీటి అడుగు భాగానికి వెళు తున్నారు.

అకస్మాత్తుగా తనకు యిరువైపులా ఉన్న కుర్రవాళ్లను నెట్టి వేసి తన ముందున్న ఎత్తైన వ్యక్తి ప్రక్కగా పరుగెత్తి, పాన్ వాలాకు ఆశ్చర్యం కలిగించే విధంగా, "అదినాది అదినాది," అంటూ కేకలు వేసి, సముద్రపు నురగలోకి దూకాడు హరి. అలాదూకి ఎవరో సముద్రంలో వేసిన కొబ్బరి బొండాన్ని పట్టు కొన్నాడు. దాని కొరకు ముగ్గురు, నలుగురు యితర కుర్రవాళ్లు తీవ్రంగా పోట్లాడు కొంటున్నారు. హరిసముద్రంలో నడుములోతు వరకు వెళ్లాడు. అతని చుట్టూ నురుగు వ్యాపిస్తోంది. హరి అక్కడ నిలబడి కొబ్బరిబొండాన్ని పట్టుకొని విజయవంతంగా పాన్ వాలా వైపు చూసి నవ్వుతున్నాడు.

పాన్‌వాలా ఆశ్చర్యంతో నవ్వాడు, తాను పట్టు కొన్న కొబ్బరి బొండాంతో, నీరు కారుతున్న దుస్తులతో సముద్రం నుండి హరి బయటకు వస్తున్నపుడు, పాన్‌వాలా నవ్వి, "అయితే నీవు గూడా చివరకు నిజమైన నగరం కుర్రవాడిగా మారిపోయావు అవునా? హరి నేనెప్పుడూ నీవుయిలా చేస్తూండగా చూస్తాననుకోలేదు," అన్నాడు పాన్ వాలా.

హరి కొంచెం సిగ్గు పడటం మొదలెట్టాడు. తాను తెచ్చిన కొబ్బరి బొండాన్ని యివ్వటానికి బిచ్చగాడు ఎవడైనా ఉన్నాడేమో నని చుట్టూరా చూసాడు. అయితే పాన్ వాలా దిగ్భ్రాంతికి లోనుకాలేదు. అతను నవ్వుతున్నాడు.

"అవును, నేను యిప్పుడు కార్యాన్ని సాధించగలను" అన్నాడతను. సంతృప్తి చెందినట్లు "నీవు సరిగానే పనులను నిర్వహించగలవు - నాకు అవగాహన అవుతోంది - నేను నీగురించి యిక విచారించ నవసరంలేదు," అన్నాడతను.

# పన్నెండవ అధ్యాయం

హరి ప్రయాణీకుల పడవ మీద కాకుండా బస్‌లో ప్రయాణించి తుళ్ చేరుకున్నాడు - జాగు, పాన్‌వాలాలు యిద్దరూ హరికి బస్‌టికెట్ కొన్నారు. పాన్‌వాలా, హరికి వీడ్కోలు కానుకగా మరో పది రూపాయలు యిస్తూ, కళ్లలో ఉబుకుతున్న కన్నీటిని ఆపుకోవటానికి కళ్లు తుడుచుకొంటూ, దుకాణంద్వారం దగ్గరే వీడ్కోలు చెప్పాడు. జాగు, హరితో పాటు బస్‌డిపోకు వచ్చి, అతనిని సరియైన బస్ ఎక్కించటానికి ఉదయం పూట పనికి విరామం పెట్టాడు "నీ డబ్బు భద్రంగా ఉందాహరి?" అంటూ ఆదుర్దాగా ప్రశ్నించాడు. "జేబుదొంగ లుంటారు. జాగ్రత్త జేబును తాకవద్దు. నీదగ్గర అంత డబ్బుందని ఎవరికీ తెలియనీకు," అంటూ జాగూ జాగ్రత్తలు చెబుతున్నాడు. హరి తన సంపాదనతో తుళ్‌కు సురక్షితంగా చేరుకోవాలని జాగూ కూడా హరి లాగా ఆదుర్దాగా ఉన్నాడు. హరి తాను జాగ్రత్తగా ఉంటానని, తుళ్ చేరగానే పోస్ట్ కార్డ్ వ్రాస్తానని, జాగూతో ఎప్పుడూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతానని మాటి మాటికి వాగ్దానం చేయవలసి వచ్చింది. చివరికి ఎలాగైతేనేం బస్ బయలు దేరటంతో వాళ్లిద్దరూ మౌనంగా వీడ్కోలు సూచకంగా చేతులూపు కోవటం తప్ప మరేమీ చేయలేక పోయారు.

తాను నగరంలోని మురికివాడలు, పెచ్చులూడు తున్న బూడిద రంగు యిళ్లు, అనాచ్ఛాదితంగా, మురుగుకంపు కొడుతున్న మురుగు కాలువలు, వీధి ప్రక్కనున్న దుకాణాలు, బస్‌డిపోలు రద్దీని వదలి వస్తున్నప్పుడు బహిరంగ గ్రామ ప్రాంతం కొరకు వెదుకుతూ హరి తనముఖాన్ని బస్-కిటికీ కి ఆనించి నొక్కి ఉంచుకొన్నాడు. అలా వస్తున్నప్పుడు బస్ పొడవాటి, వెడల్పుగా ఉన్న వంతెన దాటటం జరిగింది. ఆవంతెన క్రింద సముద్రం ఉంది. అది తుళ్‌లో తానెరిగిన సముద్రం లాంటిదికాదు. ఈ సముద్రం బొంబాయిని, ప్రధానభూమి నుండి వేరు చేస్తోంది. యిది చిత్తడి సముద్రం - సముద్రపు

ఆటు పోటులతో పెరుగుతూ, తగ్గుతూ ఉంటుంది. అయినా దాని నుండి ఉప్పువాసనతో పాటు, మట్టి వాసన గూడా వెలువడుతోంది. దాని అంచుల మీద గుంపులుగా ఉన్న రెల్లు పొదలతో పాటు చేపలు వేటాడే పడవలు, వలలు, కిటికీలకు అమర్చటానికి అనువుగాఉండి, మెరుస్తున్ననత్త గుల్లలు కూడా ఉన్నాయి. వాటిని చూస్తూ హరి ఉత్తేజంతో ఉండిపోయాడు కాని ఆ తర్వాత మరో విషాద పూరిత భూభాగం కనిపించింది. అది థానాకు చెందిన కర్మాగారాలు నెలకొన్న భాగం; ఆప్రాంతంలోని కర్మాగారాలు చెడు వాసనతో కూడిన పొగ, రసాయనాలను గాలిలోకి విరజిమ్మటంతో ఆకాశం కూడ నీలం రంగును కోల్పోయింది. ఆ చుట్టు ప్రక్కల భూమి అంతా నాశనం అయిపోయి, శూన్యంగా ఉంది. ఎక్కడా గడ్డి పోచకూడా కనిపించటంలేదు. మిగిలిన కొద్ది చెట్లు కూడా వాటికి అవరోధకరంగా ఉండే దుమ్ములో నిండిపోయి ఉన్నాయి. రేవాస్ నుండి ఆలీబాగ్ వరకు ఉండే పచ్చని కోస్తా ప్రాంతం కూడా ఏదో ఒక రోజు యిలాగే మారుతుంది కాబోలునని భావిచాడు హరి.

అలాంటి మార్పుకు సంబంధించిన కొన్ని సూచనలు అక్కడక్కడా కనిపిస్తున్నాయి. జాతీయ మార్గాన్ని విస్తరిస్తున్నారు. రైల్వేవంతెన నిర్మాణంలో ఉంది. పురాతనమైన పెద్ద చెట్లను నరికి వేయటం జరుగుతోంది. మట్టినిత్రవ్వి పోసే యంత్రాలు, మట్టిని చదును చేసే యంత్రాలు పని చేస్తున్నాయి. అయినప్పటికీ యింకా బంగారు కాంతు లీను తున్న వరిపైరు కోతకు సిద్ధంగానే ఉంది. ఆపైరుకు దూరంగా ఉన్న చిన్న గుట్టలు నీలి, కంచు రంగుల్తో మెరుస్తూనే ఉన్నాయి. ఆకాశం నిర్మలంగా నీలిరంగులో కనపడుతోంది. తర్వాత మంద కొడిగా వరి చేల మధ్యగా ప్రవహిస్తున్న నదిని దాటింది హరి ప్రయాణిస్తున్న బస్; తరువాత పెద్ద పెద్ద ఆకులున్న మద్ది చెట్ల అడవి గుండా ప్రయాణించింది. అలాప్రయాణించి కోస్తా తీరం చేరింది. హరి మరోసారి కొబ్బరి చెట్లను దూరంలో అస్పష్టమైన నీలిరంగు సముద్రాన్ని చూడగలిగాడు.

హరి ప్రయాణం చేస్తున్న బస్ అతణ్ణి పై భాగంలో దేవాలయం ఉన్న కొండకు ప్రక్కన ఉన్న జాతీయ మార్గం మీద దించింది. పాత, మట్టి రోడ్డును వెడల్పు చేసి తారు వేస్తున్నప్పటికీ, ప్రక్కన ఉన్న మద్ది, మఱ్ఱి చెట్లు చాలా వాటిని అర్థంలేకుండా ఉండటానికి నరికి వేయటం జరుగుతోంది. తుళ్ గ్రామం మాత్రం మార్పులేనట్లు కనపడుతోంది. సూర్యకాంతిలో కొండ వివర్ణంగా ఉంది. దాని మీద చిన్న, ఘనాకారపు దేవాలయం యిప్పటికీ నిలిచి ఉంది. హరి జాతీయ మార్గం నుండి, నిశ్శబ్దంగా, నిద్రాణంగా ఉన్న గ్రామం గుండా,

కొబ్బరి, తమలపాకుల, తోటలగుండా పోతున్న, గాళ్లు ఏర్పడి ఉన్న మట్టిరోడ్ మీదికి చేరుకున్నాడు.

హరి ఆమార్గం మీదుగా, కొబ్బరి తోటల మధ్యగా, సముద్ర తీరం మీద ఉన్న మెలికలు తిరిగిన పాత సరుగుడు చెట్ల సమూహం దగ్గరకు చేరుకున్నాడు అక్కడ వీచేగాలి ఉప్పగా, తాజాగా ఉంది, దగ్గరగా సముద్రం ఉంది. ఇది వాస్తవమైన బహిరంగమైన సముద్రం; బొంబాయి ద్వీపాన్ని చుట్టి ఉన్న సముద్రం కాదు. హరి ఓ సరుగుడు చెట్టు వ్రేళ్ల దగ్గర కూర్చొని, గడ్డం చేతుల్లో ఉంచుకొని, దాని వంక అలా చూస్తూ కూర్చుండి పోయాడు. అతను ఆచెట్టు తనకు జ్ఞాపకం ఉన్న విధంగా ఉందా అని నిర్ధారించుకోవాలను కున్నాడు. అది అలానే ఉంది సముద్రంలో అలలు ఉధృతిని సంతరించు కొంటున్నాయి. అవి వెండి కాంతులీనుతున్న ఇసుక మీద పెద్ద శబ్దాలతో విరుచుకు పడుతున్నాయి. సముద్రంలో ఉన్న మూడు నల్లని శిలలు అలల్లో మునుగుతున్నాయి. వాటి పైభాగాలు మాత్రమే అలల వల్ల ఏర్పడిన మెత్తని నురగపైన కనిపిస్తున్నాయి. దిగంతాల్లో చేపలను వేటాడే పడవల తెరచాపలు, సముద్రపు కాకుల లేక సీతాకోక చిలుకల రెక్కల్లాగ, తెల్లగా ప్రకాశవంతంగా ఆకాశం అంచున ధైర్యంగా కనిపిస్తున్నాయి. సముద్రానికి దగ్గరలో అంధేరి, కంధేరి అన్న చిన్న ద్వీపాలున్నాయి. ఆ ద్వీపాలు రెండూ రాళ్లతోనిండి ఆకుపచ్చగా ఉన్నాయి. చిన్న చేపల పడవలు వాటి చుట్టూ అలల మీద ఎగిరి పడుతున్నాయి. అవి తిరిగి తీరానికి, గ్రామానికి చేరుకోవటానికి ప్రయత్నిస్తున్నాయి.

ఉపశమన భావంతో నిట్టూరుస్తూ హరి అక్కడి నుండి లేచి నిలబడి, సముద్రం అంచున ఉదయం వికసించే నీల శోణిత వర్ణపు పూలతో ఆకర్షణీయమైన యిసుక తిన్నెల పైనున్న మార్గం మీదికి చేరుకొన్నాడు. అతను వాళ్లకున్న ఒకే ఒక చిన్న చేని ప్రక్కగా నడుస్తూ, తన అక్కా చెల్లెళ్లు సాధారణంగా వేసే టిండ్లీ పంటనే వేసినట్లు గమనించాడు - వెదురు తడికల మీదకు ప్రాకించిన ద్రాక్షతీగలాంటి తీగకు చిన్న చిన్న గుమ్మడి కాయలు వ్రేళ్లాడు తున్నాయి. అతను తెల్లని 'మాన్ రిపోస్'ను దాటి వెళ్తూ, వర్షా కాలంలో దాని మీద కప్పి ఉన్న పూరిగడ్డి తొలగించబడి, పచ్చని చెట్ల మధ్య అది తెల్లగా మెరుస్తూండటం గమనించాడు. అటు పిమ్మట అతను కయ్య దగ్గరకు చేరాడు. అక్కడ ఒక కొక్కెరరాతిమీద చేపలు పట్టటానికి నిశ్చలంగా కూర్చొని ఉంది; లకుముకి పిట్ట నీలంరంగు మెరుపులాగ నీళ్ళలోకి దూకింది. మంచులాంటి

తెల్లని కొంగ తుంగ మెక్కల నుండి ఎగిరి పోయింది. అతను కయ్యకు అడ్డంగా ఉన్న దుంగను దాటి పుష్పించిన ఎర్రమల్లె చెట్టును చూసాడు. దాని నీడలో తమ పాత పూరిల్లు యింతకు ముందులాగే అంధకారంగాను, విచారపూరితంగాను ఉంది. దాని మట్టి గోడలు పడిపోతున్నాయి. దాని కొబ్బరి ఆకుల పూరి కప్పు వంకరలు తిరిగి, చిరిగిపోయిచూరుకు వ్రేళ్లాడుతుంది.

తాను ఈ పరిస్థితిని పూర్తిగా మార్చివేస్తాడు. తాను పూరింటిని పునర్నిర్మిస్తాడు. తాను యింటికి తిరిగి వచ్చాడు కనుక యిప్పుడు దాన్ని గురించి పట్టించుకొని యింటిని, ప్రకాశ వంతంగాను, ఆనందపూరితంగాను, సుఖవంతంగాను మారుస్తాడు.

"లీలా, బేల, కమలా," అని అతను పిలిచాడు. తాను కట్టు కొన్న పాత, ఎఱ్ఱ చీరెను సరిచేసుకొని, ఒక్క క్షణంలో లీల గుమ్మం లోకి వచ్చింది. ఆమె గోధుమరంగులో, వింతగా ఉన్న ముఖంతో తొంగి చూస్తుంది. అతన్ని చూసి, ఆమె ఆశ్చర్యంతో నోరు తెరిచింది. వాళ్లిద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు. అప్పుడామె "హరి! హరి!" నీవు వస్తావని నాకుతెలుసు. రేపు దివాళి, అందువల్ల నీవు వస్తావని నాకు తెలుసు," అంది.

"నీకెలా తెలుసు? నేను ఉత్తరం వ్రాయలేదు గదా."

"ఓ! నాకు తెలుసు. నీవు వస్తావని నాకు తెలుసు," అంటూ లీల చిరునవ్వు నవ్వింది. మేము నీ కొరకు మిఠాయిలు చేసాం "హరి-రా తిను."

హరి వెంటనే వాళ్ల అమ్మ, నాన్న, బేల, కమల వాళ్ల గురించి, గ్రామాన్ని గురించి, బిజూ పడవను గురించి, అన్నిటిని గురించే ఓ వంద ప్రశ్నలు అడగాలను కొన్నాడు. అయినా అలా అడగకుండా అతను లీలతో పాటు యింట్లోకి వెళ్లాడు. తమయిల్లు పాత బడిపోయి, మురికిగా ఉన్నప్పటికీ అది ఎంతో నీడనిస్తూ, చల్లగా ఉంది. అది అలా ఉన్నప్పటికి హరి మనస్సు దానిపట్ల కృతజ్ఞతా భావంతో నిండిపోయి, ఆ యింటిలోని గాలిని పీలుస్తూ మౌనంగా నిలబడి పోయాడు. కంటికి కనిపించ కుండా, గాలిలో ఎగురు తున్న మెత్తని గాలి బుడగల్లాగ, పావురాలు మాత్రంవాటి సంగీతంలాంటి శబ్దాలను వెలువరిస్తున్నాయి.

అప్పుడు లీల, చేతిలో యిత్తడి పళ్లాన్ని పట్టుకొని, హరి దగ్గరకు వచ్చింది. అందులో బియ్యపు పిండి, క్రీమ్, పంచదార, గోధుమపిండి, కొబ్బరి కలిపిచేసిన మిఠాయిలున్నాయి.

"నేను ముందు కాళ్లు, చేతులు కడుక్కోవాలి. నాశరీరం నిండా దుమ్ము

ఉంది," అన్నాడు హరి తర్వాత అతను వెనుక ద్వారం గుండా. నీళ్లు నింపిఉన్న పెద్ద మట్టి కుండ వద్దకు వెళ్లి, దానిలోంచి నీళ్లు వంపుకొని తన ముఖం, కాళ్లు కడుక్కొని, చల్లని నీళ్లను జుత్తు మీద కూడా చల్లు కున్నాడు. అలా చల్లుకొన్నపుడు అతను తాను బొంబాయిలో ఉన్న తొమ్మిది నెలల మొత్తం కాలంలో యింత చల్లని, సేదదీరే నీళ్లతో ముఖం, కాళ్ళు కడుక్కోవటం జరుగ లేదను కొన్నాడు.

అతను వెనుదిరిగేటప్పటికి లీల తువ్వాలుతో గుమ్మంలో నిలబడి ఉంది. అతను ఆమె దగ్గరనుండి తువ్వాలు తీసుకొని, తుడుచు కొన్నాడు.

"ఇక్కడి నీళ్లు ఎంత బాగున్నాయి," అన్నాడతను.

"మన బావినీళ్లు తియ్యగా ఉంటాయి, తెలుసా," అంటూ లీల చిరునవ్వు, నవ్వింది.

"కాని యింత తియ్యగా ఉంటాయన్న విషయం నేను మర్చి పోయాను," అంటూ అతను తనతలకు అంటుకొన్న నీటి బిందువులు చిందేటట్ల తలవిదిలించు కొన్నాడు. "నేను చాలా విషయాలు మరచి పోయాను. అమ్మ ఎక్కడుంది, లీలా?" అని అడిగాడతను. అలా అడుగు తున్నపుడు లీల ముఖంలో చెడ్డవార్తలకు సంబంధించిన సూచనలు చూడవలసి వస్తుందేమోనని హరి, లీల ముఖం వైపుచూడటానికి ధైర్యం చేయలేకపోయాడు. కాని లీల అతని ముఖంలోకి స్థిరంగా చూసింది.

"అమ్మ, ఆలీబాగ్‌లో ఆసుప్రతిలో ఉంది. డిసిల్వా కుటుంబ సభ్యులు ఆమెను కారులో అక్కడికి తీసుకొని వెళ్లారు. నాదగ్గర బస్ చార్జీలకు డబ్బులున్నప్పుడు, అప్పుడప్పుడు ఆమెను చూడటానికి వెళుతున్నాను. ఆమె ఆరోగ్యం బాగా మెరుగైంది," అంది లీల.

"ఎలా - జరిగింది?"

"మంచి ఆహారం, సరియైన మందులతో, అనుకొంటాను. సరియైన ఆహారం తీసుకొనక పోవటంవల్ల వచ్చిన రక్త హీనత," అని డాక్టర్ చెప్పాడు.

ఆ విషయాన్ని అవగాహన చేసు కోవటానికి హరి తీవ్రంగా ప్రయత్నిచాడు. వాళ్లు తినే ఆహారం సరిపోదు అని అతనికి తెలుసు కాని ఆమాత్రానికే జబ్బు చేస్తుందని అతనికి తెలియదు, తాను యిప్పుడు తన కుటుంబ సభ్యులు మంచి ఆహారం తీసుకొనే లాగా చూడాలి.

"నాకు ఎన్నోరకాల ఆలోచనలున్నాయి," "నీకు చెప్తాలే," అన్నాడతను.

"రాముందు. ముందు మిఠాయిలు తిను మేము వాటిని దివాళి కొరకు

చేసాం. కాని మనం యీ రోజు ఉత్సవం చేసుకోవటం ప్రారంభించుదాం," అంటూ ఆమె నవ్వి, మిఠాయిల పళ్లెం తీసుకురావటానికి వెళ్లింది. హరి తనకు యిష్టమైన తియ్యనిపిండి, కొబ్బరి తురుముతో నిండిన పూర్ణం తీసుకొని, ఆత్రంగా తినటం ప్రారంభించాడు. అది రుచిగా, కరకరలాడుతోంది. లీల ఎప్పుడూ వాటిని అలాగే చేస్తుంది. అలా వాటితో అతని నోరు నిండుగా ఉన్న సమయంలో బేల, కమల వచ్చారు.

వాళ్లకు తరుపరి ఏమి చేయాలో తోచలేదు - పరస్పరం కౌగిలించు కోవాలో, మాట్లాడు కోవాలో లేక మిఠాయిలు తినాలో తెలియలేదు. వాళ్లు అన్నీ ఒకేసారి చేయటానికి ప్రయత్నించటంతో గడ బిడ ఏర్పడింది. అప్పుడు హరి వాళ్ల కోసం కొన్ని కానుకలు బయటకు తీసాడు. ఆ కానుకలను, చేతిగడియారాలు బాగుచేయటంతో లభించిన డబ్బుతో బొంబాయిలో కొనటానికి పాన్‌వాలా సహాయంచేసాడు. ఆ కానుకల్లో చెల్లెళ్లకు, బంగారు, వెండి పూత పూసిన గాజులు, లీలకు ఒక చీరె ఉన్నాయి. లీల కోసం కొన్న చీరె, గ్రామాల్లో లభించే ముతక నేత చీరెకాదు, సిల్కుచీరె. ఉదయం పూట వికసించిన తాజాపుష్పంలాగా ఉంది, దానికి గులాబీ, తెలుపు గళ్లున్నాయి. వాళ్లు స్పష్టంగా చూసేందుకు హరి ఆ చీరెను విప్పినప్పుడు బేల, కమల, ఆశ్చర్యంతో మ్రాన్పడి పోయారు - అంత అందమైన, ఖరీదు గలిగి నవనాగరికమైన చీరె యింతకు ముందెన్నడూ వాళ్లయింట్లో కొనటం జరగలేదు. లీల ఆశ్చర్యంతో నోరు వెళ్ల బెట్టింది. ఆమె చెల్లెళ్లు గూడా ఆశ్చర్యంతో కీచుమంటూ నోటి మీద చేతులుంచు కొన్నారు.

"హరి నీకు అంత డబ్బెక్కడి నుండి వచ్చింది? నీవు అంత డబ్బెలా ఖర్చుచేయగలిగావు?"

"నేను డబ్బు యింటికి గూడ తెచ్చాను," అని అతను వాళ్లకు నమ్మకం కలిగే విధంగా చెప్పాడు. "నేను బొంబాయిలో సంపాదించిందంతా పొదుపు చేసాను. నేను అక్కడ ఏమీ ఖర్చు చేయలేదు - నేనెప్పుడూ సినిమాకు వెళ్లలేదు, కనీసం సిగరెట్ కూడా కొనుక్కోలేదు. నాకు రెండు ఉద్యోగాలుండేవి," "అని ప్రగల్భంగా అన్నాడతను - అతను అలాచెప్పు కోకుండా ఉండలేక పోయాడు - బేల, కమలల్లాగే అతనూ ఆనందిస్తున్నాడు." "నేనొక అల్పాహారశాలలో పని చేసేవాడిని. దాని యజమాని నాకు ఉచిత భోజన, వసతి సౌకర్యాలు కల్పించటంతో పాటు, జీతం కూడా యిచ్చేవాడు. పొరుగున ఉన్న చేతి గడియారాలు బాగుచేసే దుకాణంలో కూడా పని చేసేవాణ్ణి. నేను

బాగు చేసిన గడియారాలకు నాకే డబ్బు లొచ్చేవి - నేను చేతిగడియారాలు బాగుచేయటం నేర్చు కొన్నాను తెలుసా," అన్నాడతను.

"చేతి గడియారాలు బాగు చేయటమా?" అని అడిగారు బేల, కమల, ఆశ్చర్యంగా.

"చేతిగడియారాలు బాగు చేయటమా?" అంటూ వాళ్లు అడిగిన ప్రశ్నను లీల కూడా తక్కువ స్వరంలో అడిగింది. అలా అడుగు తున్నప్పుడు ఆమె ముఖంలో నిరుత్సాహం వెల్లడవుతోంది. తుళ్ గ్రామంలో అధిక సంఖ్యాకులు, జాలరులు. ఎప్పుడు పడవమీద సముద్రంలోకి వెళ్ళాలో, ఎప్పుడు సముద్రంలో పట్టిన చేపలును తీసుకొని రావాలో తెలియజేయటానికి వాళ్లకు చేతిగడియారాలు అవసరం లేదు వాళ్లకు సముద్రపు ఉధృతి వలన, సూర్యుని వలన కాలం తెలుస్తుంది. అందువలన చేతి గడియారాలు బాగు చేయటం వట్టి నిరుపయోగమైందిగా లీలకు తోచింది.

లీల నిరుత్సాహ పడినట్లు హరి గ్రహించాడు. "ఇప్పుడు యిక్కడ చేతిగడియారాలు లేవని నాకు తెలుసు లీలా - కాని కర్మాగారం పూర్తయ్యేంత వరకు, గృహ సముదాయ నిర్మాణం పూర్తయ్యేంత వరకు ఆగు. అప్పుడు ఇక్కడ చేతి గడియారాలు ఉన్న వాళ్లు చాలా మంది ప్రత్యక్ష మౌతారు. అప్పుడు వాటికి ఆయిల్ వేసి, బాగుచేయటం తెలిసిన వాణ్ణి తుళ్‌లో నేనొక్కణ్ణే అవుతాను. వాటిని బాగు చేయించుకోవటానికి బొంబాయి వెళ్లనవసరం లేదు. యిక్కడ పరిస్థితులు మారతాయి లీల," అన్నాడు.

"అవునా?" "ఎప్పుడు? ఎంత కాలం పడుతుంది? అప్పటి వరకు మనం ఏం చేయాలి?"

అని అడిగింది లీల సందేహంగా.

"నేను డబ్బు కూడా తెచ్చాను గదా; నేను నీతోటి - అమ్మను చూడటానికి వెళ్లినపుడు ఆమెతోటి చర్చించాలనుకుంటున్నాను," అతను వాళ్ల నాన్న గురించి ప్రస్తావించలేదు. ఆయనను గురించి ప్రస్తావించటం నిరుపయోగమని అతనికి తెలుసు.

"ఈ డబ్బు ఏదో విధంగా ఉపయోగకరమైన విధంగా ఉపయోగించు కోవచ్చు. నేను కోళ్లు కొని, మనకున్న కొద్ది పాటి భూమిలో కోళ్లపెంపక కేంద్రం ప్రారంభించవచ్చునని అనుకొంటున్నాను. అది మార్కెట్‌లో అమ్మటానికి వీలయ్యే కూరగాయలను పండించటానికి చాలా చిన్నదిగాను, కోళ్లు పెంపక కేంద్రానికి చాలా పెద్దది గాను ఉంటుంది. కర్మాగార నిర్మాణం పూర్తి అయి.

వాటిల్లో పనిచేసే కార్మికులంతా యిక్కడ ఉండటానికి వచ్చేటప్పటికి, మనకు అమ్మేందుకు గూడ కోళ్లుంటాయి. మనం కోళ్ల పెంపక కేంద్రం ద్వారా జీవనోపాధి సంపాదించుకోవచ్చు."

ఆమాటలకు బేల, కమల సంతోషంతో కేకలు వేసారు వాళ్లిద్దరు ఆ ఆలోచన అద్భుతమైనదని భావించారు. వాళ్లు మిఠాయి పళ్లాన్ని మరోసారి అందించారు.

"నేను చేతిగడియారాల దుకాణాన్ని ప్రారంభించిన తరువాత మీరిద్దరూ కోళ్ల సంరక్షణ వహించవచ్చు" అని హరి వాళ్లతో అన్నాడు. "నేను కోళ్ల పెంపక కేంద్రాన్ని ప్రారంభించి దాని నిర్వహణ మీకు అప్పజెప్తాను," అంటూ అతను నవ్వాడు. వాళ్లకు తాను చెప్పింది యిష్టమైనట్లు హరి గ్రహించాడు.

"తుళ్‌లో యిది మొదటి దవుతుంది," అంది కమల "కహిమ్‌లో ఒకటుంది. ఆలీబాగ్‌లో చాలా ఉన్నాయి. కాని తుళ్‌లో యిదే మొదటి దవుతుంది - అదిమనదే అవుతుంది."

"ఒకప్పుడు యిక్కడ ఒకటి ఉండేది," అని ఆ విషయాన్ని లీల జ్ఞాపకం చేసింది. "వృద్ధ సాబూకు ఒకటుండేది. అతని తోటలో పాడైపోయిన కోళ్ల గూళ్ళు, విరిగి పోయిన యినుప తీగల జెల్లడలు యిప్పటికీ చూడవచ్చు. అది విఫలమైంది," అంది లీల.

"తుళ్‌లో అతని కేంద్రంలో ఉత్పత్తయిన గుడ్లు, కోళ్లను అప్పుడు ఎవరూ కొనుగోలు చేయలేదు," అని హరి వివరించాడు. "వాటిని బొంబాయి తీసుకు వెళ్లి అమ్మటానికి అతనికి కారు ఉండేది కాదు. కాని యిప్పుడు అట్లా కాదు జనం తుళ్‌కు వస్తారు - వేలకొద్దీ - మనం సరఫరా చేయటానికి వీలు లేనంత మంది కొనుగోలుదార్లు మనకుంటారు. నీవే చూస్తావుగా, లీలా - యిది అభివృద్ధి చెందుతుంది; విఫలంకావటానికి వీలులేదు. అమ్మకు కూడా తింటానికి గ్రుడ్లు, కోళ్లు ఉంటాయి;" అన్నాడతను, ఆమెను సంతోష పెట్టాలని బుజ్జగిస్తున్నట్లు మాట్లాడుతూ.

ఆ ఆలోచనకు ఆమె వెంటనే చిరునవ్వు నవ్వింది. "అవును అవి ఆమెకు ఉపయోగకరంగా ఉంటాయి," అని లీల అంగీకరించింది. "ఆమెకు కొంచెం బలం వస్తే, ఆమె యింటి పనిలో సాయం గూడ చేయవచ్చు" అన్నది.

"మీరు నాకు అన్ని విషయాలు చెప్పాలి. వార్తలన్ని చెప్పండి. మీరు నా కెప్పుడూ ఉత్తరం వ్రాయలేదు," అన్నాడు హరి.

"నీవు ఎక్కడున్నావో మాకు తెలియదు. ఎప్పుడైనా, ఎవరైనా బొంబాయి వెళ్తూంటే మేము కబురు పంపించేవాళ్లం, కాని వాళ్లె వరికి నీవు కనిపించలేదు" అంది లీల.

అందుకు అతను తల ఊపాడు "నేను కొంత కాలం పాటు నా స్వశక్తి మీదనే ఆధారపడి ఉండాలను కొన్నాను. "నాన్న," అంటూ చివరికి తనకు ఉచ్చరించ టానికి యిష్టం లేని మాట అన్నాడు. "నాన్న, ఆయనెక్కడ ఉన్నాడు?"

తన అక్కా చెల్లెళ్లు పెద్దగా మాట్లాడటం, వాళ్ల స్వరాల్లోని ఆనందాన్ని బట్టి వాళ్ల నాన్న త్రాగి, పగటి పూటనే నిద్రపోవటం లేదని, యింట్లో లేదని స్పష్టమైంది.

"ఆయన ఆలీబాగ్‌లో ఉన్నాడు," అని చెప్పింది లీల, తాపీగా. "ఆయన అమ్మతో పాటు వెళ్లాడు; డిసిల్వాలు ఆమెను తీసుకొని వెళ్లినప్పుడు, ఆయన బాగా ఆవేశపడి పోయాడు, బాగా కోపం వచ్చింది. ఆయన పెద్దగా కేకలు వేస్తూ, మన కుండలన్నీ పగులగొట్టాడు. అప్పుడు ఆయన త్రాగి ఉన్నాడు. కాని ఆయన త్రాగుడు మాని వేసి, ఆమెకు సరియైన సంరక్షణ జరిగేటట్లు చూడటానికి ఆమెతోపాటు ఆలీబాగ్ వెళ్లాడు, అప్పటి నుండి ఆయన అక్కడే ఉండిపోయాడు. ఎప్పుడూ తిరిగి రాలేదు. నేను ఆమెను చూడటానికి వెళ్లి నపుడు అమ్మ ఉన్న గది బయటి వసారాలో కూర్చొనో లేక బయట ఆసుపత్రి ఆవరణలోనో కనిపించేవాడు. ఆమెకు తన అవసరం ఉండవచ్చునని చెప్పి, ఆమెకు అందుబాటులో ఉంటున్నాడు," అని చెప్పింది.

"అక్కడ ఆయన త్రాగుతున్నాడా?"

అందుకు లీల తల అడ్డంగా ఊపింది. "త్రాగటం లేదను కొంటాను. ఆయన మానేసాడను కొంటాను. అందుకు ఆయనకు డబ్బు కూడా లేదు. డిసిల్వా కుటుంబ సభ్యులు కొంత డబ్బు యిచ్చారు. నేను కొంత తీసుకొని వెళ్లాను - ఆ డబ్బు ఆయన భోజనానికి సరిపోతుంది, త్రాగుడికి చాలదు. ఆయన మరికొంచెం డబ్బు కావాలని అడగలేదు. ఇప్పుడు ఆయనకు త్రాగాలనిపించడం లేదను కొంటాను," అంది లీల.

"మరి ఆ ఖానేకర్ కుటుంబ సభ్యులో - వాళ్లు మళ్లీ వచ్చారా?"

"లేదు, వాళ్లు మన మానానికి మనల్ని వదలి వేసారు." అంటూ కృతజ్ఞతా పూర్వకంగా శ్వాస తీసుకొంది లీల. "పింటో పట్ల వాళ్లు వ్యవహరించిన తీరుకు వాళ్లు చాలా బాధపడుతున్నారను కొంటాను."

వాళ్లందరూ పింటోను గురించి, వాళ్ల నాన్నను గురించి వాళ్ల జీవితాల్లోని

యీ వింత, నూతనమైన మార్పును గురించి మౌనంగా ఆలోచిస్తూ కూర్చొన్నారు. అప్పుడు లీల లేచి నిలబడి, "హరి, సముద్ర తీరానికి వెళ్లి, నీవుయింటికి వచ్చిన సందర్భంగా విందు భోజనానికి చేపలు కొందాం రండి. మన మందరం వెళదాం రండి. అలా వెళ్లేటప్పుడు మాకు అన్ని విషయాలు చెప్పవచ్చు," అంది లీల.



వాళ్లు సముద్ర తీరానికి వెళ్లినప్పుడు ఆకాశమంతా అస్తమిస్తున్న సూర్యకాంతితో వెలుగొందుతోంది; ఎత్తుగా ఉన్న సముద్ర తీరంలోని తడియిసుక మీద ఎఱ్ఱని రంగు, నీలిరంగు ప్రతిబింబిస్తున్నాయి. ఆదృశ్యం చూసి హరికి ఆనందంతో మాటలు రావటంలేదు. అతను ఆనందంతో పాదరక్షలు లేని కాళ్లతో తడియిసుకని స్పృశిస్తూ పరుగెత్తాడు. బేల, కమల అతని వెంట

పడ్డారు. హరి వాళ్ల నుండి తప్పించు కొనటానికి ప్రయత్నించాడు. ఆదృశ్యం చూచి లీల నవ్వింది. హరి తల వెనక్కు వాల్చి, ఉఫ్ మని గాలిని వదలటంతో సముద్రం అంచున ఉన్న సముద్రపు కాకులు ఎగిరి, అరుస్తూ, ఆకాశంలో వలయా కారంలో ఎగరటం మొదలెట్టాయి. అతను గట్టిగా మూసిన పెట్టెనుండి బయటపడి యిప్పుడు క్రొత్తగా వెలుగు చూచి, మొదటి సారిగా చల్లనిగాలి అనుభవించినట్లు, నూతనమైన వ్యక్తిగా రూపొంది నట్లు, భావించు కొన్నాడు. అతను గూడునుండి వెలువడిన సీతాకోకచిలుక లాగా నూతన జన్మపొంది ఉండవచ్చు. బేల, కమల అతని చేతులను చెరి ఒకవైపు పట్టు కొన్నారు.

వాళ్ళు నవ్వు కొంటూ సముద్ర తీరం మీద నడుస్తూ, గ్రామస్త్రీలు, వెదురు చట్రాల మీద, చదరపు నేల మీద ఎండవేసిన పాములాంటి చేపలను తన్నుకు పోవటానికి వేగంగా క్రిందికి దిగుతున్న సముద్రపు కాకులను గమనిస్తున్నారు. ఒక సముద్రపు కాకి, బొంబాయి బాతు అనిపిలిచే చేపను ముక్కున కరచుకొని పైకి ఎగిరింది మిగతా పక్షులు దాన్ని లాక్కోవటానికి ప్రయత్నించగా అది సముద్ర తీరం మీద పడిపోయింది. అప్పుడు అవి అన్నీ దాని కొరకు వేగంగా క్రిందికి దిగి వ్యవసాయ క్షేత్రంలోని కోళ్లలాగా పొడుచుకొంటూ, అరుస్తూ - అలల అంచున వాలాయి. అవి ముత్యం రంగులోను, నల్లని రంగులోను ఉన్నాయి.

"ఈ సంవత్సరం చేపల విషయంలో అనుకూల మైందేనా?" అని హరి అడిగాడు.

"ఇప్పుడే చేపల వేటకు సంబంధించిన ఋతువు మొదలైంది - బాగానే ఉంటుందని ఆశిస్తున్నాం" అంది లీల.

అప్పుడతను ఒక ప్రశ్న అడిగాడు, ఆ ప్రశ్నకులభించే సమాధానం పట్ల అతనిలో భయం నెలకొంది. అప్పుడు హరి చిన్న స్వరంతో "తుఫానులో తప్పిపోయిన పడవల జాడ తెలిసిందా?" అని అడిగాడు.

"నీవు ఆవార్త విన్నావా?" అని అడిగారు వాళ్లు, ఆశ్చర్యపడుతూ. తర్వాత వాళ్లు, బిజూ నిర్మించిన శక్తి వంతమైన కొత్త పడవలో ఓబృందం శోధించటానికి వెళ్లటం, పడవలు పగిలి పోవటం మునిగిపోయిన ముగ్గురు ఆలీబాగ్ జాలరులు తప్ప ఎలా మిగతాజాలరులను ప్రాణాలతో రక్షించి యింటికి తీసుకువచ్చారో చెప్పారు.

"అయితే బిజూ నిర్మించిన పడవ కొంత ఉపయోగకరమైందన్న మాట," అన్నాడు హరి, ఊరటగా. తనను తాను తుఫానుతో కల్లోలంగా ఉన్న సముద్రం

నుంచి ప్రశాంతంగా ఉన్న తీరంపైకి తీసుకొని రాబడిన వ్యక్తి లాగా భావించు కొన్నాడు.

"అది అద్భుతమైన పడవ," అని బేల, కమల ఒకే సారిగా అన్నారు. "అయినా అతను దాన్ని గురించి ఎల్లకాలం బడాయిలు చెప్పుకోలేదు," అంది లీల.

"కాదు అతను మన జాలరులను రక్షించినందుకు మనం అతని పట్ల, కృతజ్ఞతా పూర్వకంగా ఉండాలి," అని ఆమెకు జ్ఞాపకం చేసాడు హరి. హరి మనసు గూడ కృతజ్ఞతా భావంతో నిండిపోయింది. తర్వాత తాను ఎలా తుఫాను సమయంలో రేడియోలో వార్తలు విన్నది, ఎలా తుళ్ తిరిగి వెళ్లి మళ్లీ తన స్వంత మనుష్యుల మధ్య మెసలాలను కొన్నదీ వివరించాడు. అలాంటి భావనతో తాను తుళ్ గ్రామ కుర్రవాడినని అనుకోవటం, ఎప్పుడూ అలాగే భావిస్తానని, వాళ్లతో చెప్పటంతో, వాళ్లు ఆనందంతో నవ్వారు.

తెర చాపలు ఆకాశంలోకి తోకల్లాగా విస్తరించిన చేపలు వేటాడే పడవలు తిరిగి తీరం చేరేప్రయత్నంలో ఉన్నాయి. అలల ఉధృతి తగ్గి పోతూండటంతో పడవలు సముద్రంలోనే లంగరు వేయవలసి వచ్చింది. జాలరుల నుండి చేపలతో నిండిన తట్టలను తీసుకొని, వాటిని తీరానికి తూసుకొని రావటానికి, జాలరిస్త్రీలు చీరెలు ఎగదోపుకొని నీళ్లలో పడవల్లోని జాలరుల వద్దకు నడిచి వెల్లవలసి వచ్చింది. చేపల తట్టలను తీసుకొని వచ్చి, వాటి మీద కప్పిన గుడ్డలను తొలగించటంతో పెద్దగా అరుపులు, వాదాలు మొదలయ్యాయి.

"వీళ్లు సముద్రపు కాకుల కంటె ఎక్కువ గోల చేస్తున్నారు" అంది లీల.

"మనం గూడ చేపలు కొందామా? నా దగ్గర డబ్బుంది," అన్నాడు హరి గర్వంగా.

"ఓ నీవు నగరంనుండి ధనికుడుగా మారి పోయివచ్చావు, అవునా?" అని హరి అక్కా చెల్లెళ్లు నవ్వుతూ, సంతోషంతో ఆటపట్టించారు అతన్ని.

" కనీసం కొద్ది రోజుల పాటు ధనవంతణ్ణే," అన్నాడు హరి.

"రా లీలా, కావలసినవి చూసుకో చందువా చేపను, లేక సుర్మాయ్‌నో, లేక కొన్ని పీతలనో కొను," అన్నాడు హరి.

కాని లీల ఒక్క రోజు కూడ ధనవంతురాలుగా వ్యవహరించటానికి అలవాటు పడలేదు. ఆమె అలా నిలబడి ఇతరులు బేరం చేస్తూ, వాదులాడు తూండటం గమనిస్తోంది. పెద్ద రొయ్యలు, చందువా చేపల తట్టలు అమ్ముడు పోయిన తరువాత కొన్ని చిన్న రొయ్యలు కొన్నది. అవిచాలా చిన్న రొయ్యలు

వాటికి పొడవాటి మీసాలు ఉన్నాయి. అవి ఒకసంచి అడుగున గుజ్జురూపంలో ప్రాకుతున్నాయి. అవిచాలా చౌక. బేల, కమల నిరుత్సాహపడ్డారు. కాని హరి, "నేను చాలా కాలంగా చిన్న రొయ్యలు కూడా తినలేదు," అన్నాడు. దానితో లీల తాను కొన్న రొయ్యలను, యింటికి తీసుకొని పోవటానికి మూట కట్టింది.

వాళ్లు యింటికి వెళ్లబోయే ముందు ఆలీబాగ్ సముద్ర తీరంనుండి తుళ్‌ను వేరుచేసే కయ్య వరకు నడిచారు. చిన్నవి, తేలికపాటి పడవలు, ఆ కయ్య ఎగువ భాగంలో కట్టివేయబడి ఉన్నాయి. వాటి తెరచాపలు దించి ఉన్నాయి; కాని జాలరి స్త్రీల చీరెల పొడవాటి ముక్కలతో కుట్టిన వాటి జెండాలు గాలిలో రెప రెప లాడుతూ ఎగురు తున్నాయి. వాటికి దూరంగా వివర్ణమైన కొండలున్నాయి. అవి బంగారురంగు కాంతులీనుతున్న ఆకాశపు కాంతి వల్ల ఎరుపు, యిత్తడి రంగు పులుముకొంటున్నాయి.

హరి, అతని అక్కా చెల్లెళ్లు కయ్య మొదటికి చేరుకొన్నారు. ఇసుక మీదుగా ముందుకు వస్తున్న ప్రతి అల గవ్వలను తీసుకొని వచ్చి, గుట్టలుగా పేరుస్తోంది. వాటిలో చాలా వరకు రేణువుల్లాగా, మెరుస్తున్న పొడిలాగ మారు తున్నాయి. కాని లోపలి భాగం అంతా మెరుస్తున్న పెద్ద శంఖాలు కొన్ని ఉన్నాయి. సముద్రంలోకి విసరి వేసేందుకు హరి వంగి వాటిని చేతుల్లోకి తీసుకొన్నాడు. కయ్యకు ఆవల ఆలీబాగ్ సముద్ర తీరంలో సరుగుడుతోపు, వాటికి అవతల, మొగలాయీల కాలం లోని గొప్ప సముద్ర యోధులు ఆంగ్రేలు చాలా కాలం క్రితం నిర్మించిన పట్టణము, కోట ఉన్నాయి.

దూరంగా ఉన్న ఆలీ బాగ్ వైపు చూస్తూ లీల, "రేపు దివాళి. రేపు మనం వెళ్లి, అమ్మను యింటికి తీసుకొని రావాలి," అంది.

"ఆమె యిప్పుడు యిక్కడ ఉండిపోవటానికి తిరిగి రాగల స్థితిలో ఉందా? ఆమె ఆరోగ్యం పూర్తిగా మెరుగయ్యిందా?" అని అడిగాడు హరి.

"చాలా బాగుంది. డాక్టరు ఆమెను దివాళికి యింటికి పంపిస్తానని చెప్పాడు."

"అయితే నేను వెళ్లి ఆమెను తీసుకొని వస్తాను."

"అలాగే నీవు ఉదయం వెళ్లవచ్చు, ఇంతలో నేను, బేల కమల దివాళికి అవసరమైన అన్ని ఏర్పాట్లు చేస్తాం."

"ఇంటికి వెళ్లి భోజనం చేద్దాం రండి," అంది బేల, ఒక్కసారిగా ఆకలవు తున్నట్లుచెప్తూ.

"పరుగెత్తండి నేను పరుగు పందెంలో మిమ్మల్ని ఓడిస్తాను," అన్నాడు

హరి. అతను అలా అనటంతో వాళ్ళు కేకలు వేస్తూ బయలుదేరారు.

దిగంతాలు, సూర్యుని వెలుగులో ప్రకాశవంతంగా ఉండి, కరుగు తున్న గాజు బంతి లాగా సముద్రంలో కరిగి పోతున్నట్లున్నాయి. ఆకాశం పసుపు పచ్చని వర్ణానికి మారి పోయింది; తూర్పున అప్పటికే నీలశోణిత వర్ణం అలముకొంది. ఆసమయానికి ఓనక్షత్రం పొడిచింది - అది సాయంత్రం పూట మొదటిగా ఉదయించే కాంతి వంత మైన సాయం నక్షత్రమే.

కొంచెం సేపు పరిగెత్తిన తర్వాత హరి రొప్పుతూ, పరుగెత్తటం మానివేసి, లీలప్రక్కన నడవ నారంభించాడు.

"మనం యింటికి వెళ్లిన తర్వాత, నీవు మాకు బొంబాయిని గురించిన విశేషాలన్నీ చెప్పాలి," అంది లీల.

"అయితే మొదట మన యింటిని గురించిన వార్తలు చెప్పాలి," అన్నాడు హరి. ఆ మాటలను పురస్కరించు కొని వాళ్లు భోజనాలు చేసిన తరువాత వెలుగుతున్న లాంతరును పూరింటిలోనే వదలి ఆరుబయట నక్షత్ర కాంతిలో కూర్చొన్నారు. బయట కొబ్బరి తోపు చీకటిలోను, చిత్తడి ప్రదేశపు తేమ పూరిత మైన చీకటి లోను, మిణుగురు పురుగులు మెరుస్తున్న చేపల్లాగా ఎగురుతున్నాయి.

హరి, వాళ్లకు శ్రీకృష్ణా అల్పాహారశాల, డింగ్ డాంగ్ చేతిగడియారాల దుకాణం, పాన్‌వాలా, జాగు, ఉద్యానవనం, కొబ్బరి కాయలతో పూజ చేసే ఉత్సవాన్ని గురించి చెప్పిన తర్వాత అతను లేని సమయంలో వాళ్ల యింటిలో ఏమి జరిగింది చెప్పటం లీల వంతు అయ్యింది.

"ఇన్ని రోజులు మేము నీకొరకు ఎదురు చూసాం నీవు దివాళికి ఇంటికి వస్తావను కొన్నాను," అని లీల తన మాటలను పూర్తి చేసింది.

"నిజమే," అన్నాడు హరి, ఆమె చేతిని తన చేతిలోకి తీసు కొంటూ, "రేపు దివాళి కదా, నేను రేపు అమ్మను చూడటానికి ఆలీబాగ్ వెళతాను."

"దయచేసి, ఆమెను యింటికి తీసుకొనిరా," అని అర్థించింది, బేల.

"అలాగే," అంటూ హరి వాగ్దానం చేశాడు. అలా అంటూ హరి ఆమెను చూచి నవ్వాడు. అలాగే వాళ్లందరినీ చూచినవ్వాడు.

"మీరు చాలా అద్భుత వ్యక్తులు," అన్నాడతను. "ఇన్ని నెలలు యింత చక్కగా మీరు పనులు నిర్వహించు కోవటం చాలా అద్భుతంగా ఉంది."

ఆమాటలకు కొంచెం గర్వ పూర్వకంగా చిరునవ్వు నవ్వింది లీల. "మేము మా పనులు చేసు కొన్నాం" అంటూ ఆమె సిగ్గుతో తన పాదాల వైపు

చూపులు మరల్చింది. "లేదు మేము యితరుల సహాయం లేకుండా చేసుకోగలిగే వాళ్లం కాదు - డిసిల్వా కుటుంబ సభ్యులు అమ్మకు సాయం చేసారు - అందరూ వెళ్లి పోయిన తరువాత బంగాళా లోని సయ్యిద్ అలీసాహెబ్ సాయం చేసాడు. మేము యితరుల సహాయం లేకుండా చేసుకోగలిగే వాళ్లం కాదు," అంది లీల.

"సయ్యిద్ అలీ సాహెబా?" అంటూ హరి నిష్ఠూరత వ్యక్తం చేసాడు. ఆపేరు పరిచిత మైనదిగా తోస్తోంది. తాను ఆపేరు ఎక్కడ విన్నదీ జ్ఞప్తి తెచ్చుకోలేక పోయాడు. "ఆc, బొంబాయిలోనా లేక తన అక్కా, చెల్లెళ్లు యింతకు ముందు ప్రస్తావించారా?" బంగళాలోని అపరిచిత వ్యక్తిని గురించి శ్రద్ధ కనపరుస్తూ, "నేను అలీబాగ్ నుండి తిరిగి వచ్చిన తరువాత నేను ఆయన దగ్గరకు వెళ్లి మీకు సాయం చేసినందుకు కృతజ్ఞతలు చెప్పివస్తాను," అన్నాడు హరి.

"వద్దు" అంది బేల, బిగ్గరగా. " మాపనులు మేమే నిర్వహించు కొన్నాం ఆయన గూడ సహాయం చేసాడు."

"అవును, మీరు మీపనులు మీరేచేసుకొన్నారు" అంటూ చిరునవ్వు నవ్వుతూ, వాళ్లతో ఏకీభవించాడు హరి.

"మీరంతా అద్భుతమైన వాళ్ళు" అన్నాడు.

# పదమూడవ అధ్యాయం

దివాళి రోజు ఉదయం హరి, తన అక్కా చెల్లెళ్లు దివాళికి సంబంధించిన ఏర్పాట్లు చేస్తోంటే, తాను అలీ బాగ్ వేళ్లే బస్ కొరకు గ్రామంలోని రోడ్ మీద నడచి వెళ్లాడు. ఏమైనా కొని తీసుకుని రావాలా అని అతను లీలను అడిగాడు. దానికి లీల తల అడ్డంగా ఉంది, "మనకు కావలసినవి అన్నీ ఉన్నాయి, హరి," అంది. కాని అతను కొబ్బరి చెట్ల తోపుగుండా యిసుక దారి మీద నడచి పోతూఉంటే, బేల, అతని వెనుక పరుగెత్తుకుంటూ వచ్చి, మోచేయి పట్టుకుని, "హరి, దివాళి సమయంలో ఆలీబాగ్‌లో అమ్మే పంచదార బొమ్మలు కొన్ని మాకు తెస్తావా? నేను చెప్పేదేమిటో నీకు తెలుసా - అవే తెల్లని పంచదార గుఱ్ఱాలు, ఏనుగులు? సయ్యద్ ఆలీ సాహెబ్‌ను నీటిలోంచి నేను వెలికి తీసినప్పుడు ఆయన నాకిచ్చిన డబ్బులు నా దగ్గరున్నాయి -"అని అడిగింది.

"నీవు ఆ డబ్బు సంపాదించావు కాబట్టి నీవే ఉంచుకోవాలి," అంటూ నవ్వాడు, హరి. "నేను నా డబ్బుతో నీకు పంచదార బొమ్మలు కొంటాను," అన్నాడు హరి, గర్వంగా. అలా అంటూ అతను వెళ్ళిపోయాడు.

ఆ ఉదయం వర్షాకాలం తరువాత కనిపించే బంగారు కాంతులతో నిండిన ఉదయం. తేమ, వాతావరణంలోని నీటి తుంపరులు ఎండి, అదృశ్యమౌతున్నాయి. రాబోయే శీతాకాలం, పచ్చగడ్డిమీద మంచు కురుస్తూ, గాలికి తాజాదనాన్ని చేకూరుస్తోంది. హరి పొలం చుట్టూ తిరిగి, ఓ మూల కొంచెంసేపు నిలబడి చూస్తూ, తాను అక్కడ ఎలా కోళ్ళ పెంపక కేంద్రాన్ని ప్రారంభించాలా అని ఆలోచిస్తున్నాడు. తనకు కోళ్ళను గురించి ఏమీ తెలియదు; బహుశా తాను సులువుగా నేర్చుకోగలడేమో. అయినా అది కష్టమైంది కాకపోవచ్చు. తాను ప్రారంభంలో కొద్దిపాటి కోళ్ళను కొని, వాటిని గురించి మరింత తెలుసుకొని,

తన పట్ల తనకు నమ్మకం ఏర్పడిన తర్వాత, కేంద్రం పరిమాణాన్ని పెంచుకోవచ్చు. కర్మాగారం, గృహసముదాయ నిర్మాణం జరిగి, తాను గ్రామంలో చేతి గడియారాలు బాగుచేసే వృత్తిని స్వీకరించేంత వరకు యీ పని కుటుంబ నిర్వహణకు ఉపకరిస్తుంది.

ఆ ఆలోచనతో అతనికి సంతోషం కలిగి, అతనిలోని ఆశావాదాన్ని అధికం చేసింది. అప్పుడతను గ్రామంలోని రోడ్డులోకి తిరిగి కొబ్బరి చెట్ల తోపులకు, పోక చెట్లకు మధ్యనున్న మట్టి త్రోవ మీదుగా నడిచాడు. పురాతనమైన యిళ్ళు యధాతథంగా ఉండటాన్ని చూసి అతను సంతోషించాడు. వృద్ధులు వసారాలోని ఉయ్యాల బల్లల మీద కూర్చొని ఉన్నారు. కోళ్ళు నేల గీరుతుంటే, పెరట్లో నీడగా ఉన్న ప్రాంతంలో పిల్లులు నిద్రపోతుంటే, స్త్రీలు రంగురంగుల ముగ్గులు వేస్తూ, గుమ్మాల్లో కాగితం దీపాలను వ్రేళ్ళాడగడుతున్నారు. రోడ్డు చివర వికసించిన ఎర్రని, తెల్లని తామరపూలతో చెరువు యింకా అందంగా ఉంది. స్త్రీలు చెరువు ఒడ్డున చదరంగా ఉన్న రాళ్ళమీద బట్టలుతుకుతూ నిలబడి ఉన్నారు. తర్వాత బాలికల పాఠశాల, బాలుర పాఠశాల ప్రక్కగా వంపులు తిరుగుతూ పోతున్న రోడ్డు, పోను పోను మరింత దుమ్ముతోను, గాళ్ళతోను నిండి ఉంది. జాతీయ రహదారిలో కలిసే దగ్గర ఓ చిన్న గోధుమ రంగు కొండ వుంది. హరి అక్కడ బస్ ఎక్కాలనుకొన్నాడు.

హరి అక్కడ నిలబడి కొండ మీద ఉన్న దేవాలయంపై కోబాల్ట్ నీలి ఆకాశంలో వలయాలుగా తిరుగుతూ, కిందికి దిగుతున్న గద్దలను గమనిస్తున్నాడు. ఇంతలో తీవ్రంగా సైకిల్ గంట మ్రోగిస్తూ ఓ సైకిల్ అక్కడకు వచ్చింది. "హరి! హరి తిరిగి వచ్చాడు! హరి ఎక్కడకు వెళ్ళావు? ఎప్పుడు తిరిగి వచ్చావు?" అని అడుగుతూ, రాము సైకిల్ దిగి వచ్చి, హరి ముందు నిలబడ్డాడు.

రాము తానొక్కడే చేస్తున్న అల్లరిని గమనించి, హరి నవ్వి, "నేను బొంబాయిలో ఉన్నాను, రాము," అన్నాడు.

"మళ్ళీ అప్పుడే వెళుతున్నావా?"

"లేదు, నేను ఆసుపత్రిలో ఉన్న మా అమ్మను చూడటానికి ఆలీబాగ్ వెళుతున్నాను."

"నేను గూడ దివాళికి బాణా సంచా కొనటానికి ఆలీబాగ్ వెళుతున్నాను. రా, కూర్చో, నాతోపాటు నిన్ను గూడ తీసుకొని వెళతాను."

హరి, రాము సైకిల్ మీద వెనుక కూర్చోవటంతో రాము సైకిల్ త్రొక్కుతూ

ముందుకు పోవటం ప్రారంభించాడు. గతుకుల మీదుగా పోతున్న పాత సైకిల్ చేస్తున్న శబ్దాలు ఎక్కువగా ఉండటంతో వాళ్ళకు మాట్లాడుకోవటానికి వీలుకాలేదు. అయినా తాము మాట్లాడుకోవలసిన విషయాలను, సైకిల్ శబ్దాలకంటె బిగ్గరగా చెప్పుకున్నారు.

"నీవు ఎప్పుడొచ్చావు?"

"నిన్న, దివాళి పండుగకు వచ్చాను."

"దివాళి తర్వాత వెళ్ళిపోతున్నావా?"

"లేదు, నేను యిక్కడే ఉండిపోతాననుకొంటాను. నేను కొంచెం డబ్బు సంపాదించాను. నేను ఆ డబ్బు నాతోపాటు తెచ్చాను. ఇప్పుడు నేను యిక్కడే పని చేయటానికి ప్రయత్నిస్తాను."

"ఇక్కడ పనిచేస్తావా," అంటూ రాము తన పాత పద్ధతిలో హరిని వేళాకోళం చేసాడు. "నీకు యిక్కడ ఏం పని దొరుకుతుంది?"

"నేను ఏదో ఒకటి చేస్తాను," అని చెప్పాడు, హరి ఆనందంగా, తన ఆలోచనలను మనసులోనే ఉంచుకొని.

"నీ అంతట నీవు పనిచేయలేవు," అని రాము అన్నాడు. "కర్మాగార నిర్మాణం పూర్తయ్యేంత వరకు వేచి ఉంటే ఉద్యోగాలు లభిస్తాయి."

"ఆలీబాగ్‌లోని జాలరులు, వ్యవసాయదారులు, కర్మాగార నిర్మాణాన్ని ఆపటానికి ప్రయత్నిస్తున్నారని అనుకొన్నాను," అన్నాడు హరి.

"హాఁ! నీవు బొంబాయి వెళ్ళింది అందుకే గదూ, అవునా? ప్రభుత్వం వాళ్ళు కర్మాగారం నిర్మించకుండా చేసేందుకు వెళ్ళారు, అవునా? కొద్దిమంది గ్రామస్థులు ప్రభుత్వాన్ని కర్మాగారం నిర్మించకుండా ఎలా ఆపగలరు?" అని అడిగాడు రాము.

రాము తన సహజ ధోరణిలో మాట్లాడుతుంటే, హరి మౌనంగా ఉండిపోయి, అతని మాటలను వింటున్నాడు. "ఇక్కడ అన్ని మారాలి - అన్నీ భిన్నంగా మారతాయి," అన్నాడు.

కాని. "రాము," అంటూ హరి, అతణ్ణి నిరోధించి, "మనం కూడా మారాలి. మనం కూడా భిన్నమైన వ్యక్తులుగా మారాలి," అన్నాడు.

దానితో రాము మౌనంగా ఉండిపోయాడు. హరి సైకిల్ సీటు పట్టుకొని, చుట్టూ ఉన్న బురదతో నిండిన పొలాలను, శీతాకాలపు పైరుల విత్తనాలు చల్లటానికి తయారు చేయటానికి పొలాల్లో నాగళ్ళు లాగుతున్న ఎద్దులను చూసాడు. ఈ దృశ్యం మారుతుందని, లేక యీ తరహా జీవితం అంతం

అవుతుందని హరి ఊహించలేక పోయాడు.

తర్వాత వాళ్ళు జిల్లాలో పెద్ద పట్టణమైన అలీబాగ్ చేరారు. అక్కడ వెల్లవేసిన భవనాలు, వెడల్పాటి రోడ్లు, మార్కెట్లు, దుకాణాలు ఉన్నాయి. ఆ దుకాణాల్లో యంత్రాలతో తయారైన రొట్టె, బాణా సంచా, యింకా కావలసినవన్నీ లభిస్తాయి. హరి సైకిల్ దిగి, రాముకు వీడ్కోలు చెప్పి, తన చెల్లెళ్ళు కావాలన్న పంచదార బొమ్మల కొరకు బయలుదేరుతుంటే, రాము మౌనంగా, వీడ్కోలు సూచనగా చేయి ఊపుతూ, హరిలో వచ్చిన మార్పులను అవగాహన చేసుకొంటూ, ఆలోచిస్తూ నిలబడ్డాడు. కాలిబాట మీద ఉన్న చక్రాల బండి దగ్గర ఓ సంచినిండా బొమ్మలు కొని, హరి తిన్నగా ఆసుపత్రి ద్వారం దగ్గరికి వెళ్ళాడు.

తర్వాత అతను ఆసుపత్రి ఆవరణలో నిలబడి తన తల్లిని గురించి అడగటానికి ఆసుపత్రి దుస్తులు వేసుకొన్న వాళ్ళు ఎవరైనా కనిపిస్తారేమోనని చుట్టూ చూస్తున్నాడు. ఇంతలో ఓ వృద్ధుడు అతని ప్రక్కగా కాళ్లీడ్చుకొంటూ వెళ్తూ, వణికే చేతులతో హరి భుజం తట్టి, "హరి, నీవా?" అన్నాడు మెల్లగా.

హరి ఓ నిముషంపాటు అతని ముడుతలు పడ్డ ముఖం, అట్టలు కట్టిన తెల్లజుత్తు వైపుచూసి, "నాన్నా!" అన్నాడు.



"నీవు మీ అమ్మను చూడటానికి వచ్చావా?" అన్నాడా వృద్ధుడు, కంపిస్తున్న స్వరంతో, "ఎలాగైతేనేం నీవు వచ్చావు."

"నేను బొంబాయిలో ఉన్నాను, నాన్నా."

"నీవు ఆమెను చూడటానికి ఎన్నడూ రాలేదు గదా?"

"నేను నిన్న వచ్చాను. లీల అమ్మ యిక్కడ వుందని చెప్పింది. నేను ఆమెను యిప్పుడు యింటికి తీసుకుపోవచ్చా?"

"నీవు ఆ విషయం డాక్టర్ దగ్గరికి వెళ్ళి అడగాలి," అంటూ ఆ వృద్ధుడు, వసారా చివర, గుమ్మానికి ఆకుపచ్చని తెరలున్న గదిని చూపించాడు. హరి నిదానంగా ఆ గదివైపు వెళ్లి, తెర ప్రక్కకు తొలగించి, లోపలికి చూసాడు. ఆ గదిలో ఓ డాక్టర్ మేజా బల్ల వద్ద కూర్చొని ఏదో వ్రాస్తున్నాడు. గది చివర కొంతమంది నర్సులు పింగాణీ తొట్టిలో చేతులు కడుక్కొంటూ, ఏవో పరికరాలను శుభ్రం చేస్తున్నారు. వాళ్లు హరివైపు చూసి, "ఎవరు? నీకేం కావాలి?" అడిగారు.

వాళ్లకు తన తల్లి పేరు తెలుస్తుందా అని ఆలోచిస్తూ, హరి వాళ్లకు ఆమె పేరు అస్పష్టంగా చెప్పాడు. వాళ్లు వెంటనే ఆ పేరును తెలుసుకున్నారు. ఆమె చాలా నెలలుగా అక్కడ వాళ్ల మధ్య ఉంది.

"అవును, అవును - వెళ్లి ఆమెను చూడు - రెండో వార్డ్ - నలభై ఐదవ పడక," అని, తాను పెట్టుకొన్న కళ్లజోడు వెనుక స్నేహభావాన్ని వ్యక్తం చేస్తూ, లావుగా ఉన్న నర్స్ చెప్పింది.

డాక్టర్ వ్రాయటం ఆపి, అతని వైపు చూసి, "నీవెవరు? నీవు ఆమె గ్రామం వాడివేనా?" అని అడిగాడు.

ఇంతకుముందు తానెందుకు రాలేదన్న విషయాన్ని వివరించటానికి, "నేను ఆమె కొడుకుని - బొంబాయి నుండి వచ్చాను," అన్నాడు హరి.

"ఓ, బొంబాయి నుండా? ఆమె కుమారుడు బొంబాయిలో ఉన్నాడని నాకెవరూ చెప్పలేదే?" అన్నాడు డాక్టర్. "నేను తుళ్ నుండి వచ్చిన ఆమె కూతురినే చూసాను. ఆమెను దివాళికి తీసుకొని వెళ్లటానికి వచ్చావు, అవునా?" అన్నాడు.

అలా తీసుకొని వెళ్లటం వీలవుతుందా, కాదా అన్న విషయం తెలుసుకోవటానికి, హరి తల ఊపి, డాక్టర్ ముఖం గమనిస్తున్నాడు.

"అలాగే," అంటూ డాక్టర్ తల ఊపాడు. "ఆమెకు యింటికి వెళ్లటానికి వీలైన బలం చేకూరింది. ఆమెను మేము గ్రామంలోని నాటు వైద్యుడికి

వదిలి వేయలేము. ఆమె కోలుకొంది, మాకూ ఆమె ఆరోగ్యంగా ఉంటుందని నమ్మకం కలగాలి," అన్నాడు డాక్టర్.

"నేను ఆమెను తీసుకొని వస్తాను," అని వాగ్దానం చేసాడు, హరి కుతూహలంగా. "నేను బొంబాయి తిరిగి వెళ్లటం లేదు. నేను యిక యిక్కడే మా ఊరిలో ఉంటాను; నేను ఆమెను ప్రతి నెల తీసుకొని వస్తాను," అన్నాడు.

"అలాగే తీసుకొని వచ్చేటట్లు చూడు," అన్నాడు డాక్టర్. "ఆమెను యింకా జాగ్రత్తగా చూడవలసిన అవసరం ఉంది," అంటూ అతను మరో వైపు తిరిగి నర్సుతో ఆసుపత్రి నుండి పంపించటానికి సంబంధించిన పత్రాలను గురించి మాట్లాడాడు. పత్రాలన్నీ సిద్ధమై, డాక్టర్ సంతకం చేయటం అయిపోయిన తర్వాత, హరిని రోగులు ఉండే గదుల వద్దకు తీసుకొని వెళ్లారు.

హరి, తన తల్లిని అతి కష్టం మీద గుర్తించగలిగాడు. చాలా కాలంపాటు, హరి ఆమె పండుకొని, కళ్లు మూసుకొని నిద్రపోతూ, మాటలు లేకుండా ఉండటం చూసాడు. అందువల్ల మంచం చివర కూర్చొని, చిరునవ్వు నవ్వుతున్న యీ స్త్రీ తన తల్లి అంటే హరి నమ్మలేకపోయాడు. సంవత్సరాల తరబడి ఉన్న జబ్బును తరిమివేస్తే, అదృశ్యమైపోయి, ఆమెకు జబ్బు చేయకముందు ఆరోగ్యంగా ఉన్నట్లుంది ఆమె. అయితే ఆమె జుత్తు యిప్పుడు పండిపోయింది; ముఖంలో ముడుతలు కనపడుతున్నాయి, కాని ఆమె బరువు పెరిగింది, కళ్లు కాంతివంతంగా ఉన్నాయి.

"హరి! హరి! నీవు దివాళికి యింటికి వచ్చావా?" అన్నది, ఆమె.

"అవును, నేను నిన్ను దివాళికి యింటికి తీసుకొని వెళ్లటానికి వచ్చాను."

"నేను వెళ్లవచ్చా?" అని ఆమె నర్సును కుతూహలంగా అడగటానికి ఆమె వైపు తిరిగింది.

"వెళ్ళవచ్చు - మేము నిన్ను దివాళి సమయంలో ఆసుపత్రిలో ఉంచబోవటం లేదు. నీవు మీ పిల్లలను చూసేందుకు యింటికి వెళ్లటానికి అనువైన సమయం వచ్చింది," అంది నర్సు. "నీ వస్తువులు, - నీ బట్టలు, నీ దువ్వెన, నీ మందులు అన్నీ పెట్టెలో సర్దుతాం."

కొద్ది సేపట్లో, హరి, వాళ్ల నాన్న ఆమె ఆసుపత్రి ద్వారం దగ్గర ఉన్న కిరాయికి కుదుర్చుకొన్న గుఱ్ఱపుబండిలో కూర్చొనటానికి సాయం చేస్తున్నారు. ఆమెకు చాలాకాలంగా నడక అలవాటు తప్పి పోవటం వల్ల, ఆమె కాళ్ళు బలహీనంగా ఉండి, ఆమె కొంచెం వణికింది. అలాగే ప్రకాశవంతమైన వెలుగులో బజారులోకి రావటం వల్ల కూడా ఆమె బిడియపడింది. హరి,

అతని తండ్రి వెడల్పుగా ఉన్న వెనుక సీటులో ఆమెకు యిరువైపులా కూర్చొని, ఆమె జారిపోకుండా ఉండేందుకు, ఆమె చేతులు పట్టుకొని కూర్చొన్నారు. తర్వాత గుఱ్ఱపుబండిని తోలేవ్యక్తి, గుఱ్ఱం వీపు మీద కొరడా ఝుళిపించటంతో అది ముందుకు కదలి, వాళ్లను దివాళికి తుళ్కు తీసుకొని పోసాగింది.

వాళ్లు యింటికి చేరుకొనే సమయానికి లీల, బేల, కమల, అన్ని సిద్ధం చేసి ఉంచారు. వసారాలో నేల మీద పసుపు పచ్చ, ముదురు ఎరుపు, తెల్ల రంగుల చూర్ణాలతో రంగు రంగుల ముగ్గు వేసి ఉంది. వసారాలోని వాసాలనుండి ఎఱ్ఱని రంగు కాగితపు లాంతరు వ్రేళ్ళాడుతోంది; దానికి వ్రేళ్ళాడగట్టిన చిన్న జెండాలు గాలిలో గలగలమని శబ్దాలు చేస్తున్నాయి. ఇంటిలోని యిత్తడి పాత్రలు, గ్లాసులు, వంటగదిలోని బీరువా అరల్లో ప్రకాశవంతంగా ఉన్న దీపాల్లాగా మెరిసేటట్లు తోమి, శుభ్రం చేయబడి ఉన్నాయి. లీల పండుగకు చేసిన మిఠాయిలన్నింటినీ ఒక పళ్ళెంలో పెట్టింది. వాటితో తురిమిన కొబ్బరి, పిండి కూరిన పూర్ణాలు, మినపపిండి, పంచదారతో చేసిన గుండ్రని సున్ని ఉండలు, చక్కెర చేర్చిన గుమ్మడి, బొప్పాయి ముక్కలు, బాదం పప్పు, ఎండు ద్రాక్షతోపాటు మందంగా మీగడతో తయారు చేసిన మిఠాయిలున్నాయి. హరి తన తల్లి దండ్రులతో యింటికి చేరే సమయానికి నారింజరంగులో ఉన్న జిలేబీలను వేడి నూనెతో వండి, పంచదార పాకం వున్న పాత్రలో వేస్తోంది లీల.

బేల, కమల, మల్లెలు, గులాబీలు, బంతిపూలతో దండలు తయారుచేసి, వాళ్ల అమ్మ కొరకు ఎదురుచూస్తున్నారు. వాళ్లు నవ్వుతూ ఆ దండలు ఆమె మెడలో వేసారు. వాళ్ల అమ్మ ఆనందంతో నవ్వుతూంటే, ఆ దృశ్యం చూసి, వాళ్ల నాన్న చిన్నగా ఏడుస్తూంటే, వాళ్లందరు కొంచెం నిరుత్సాహపడ్డారు. వాళ్ల తల్లి తిన్నగా వంట గదిలో ఓ మూల ఉన్న పూజా స్థలం దగ్గరికి వెళ్లి, అగరొత్తులు, గులాబీ రేకుల గుట్టల మధ్య ఉన్న గణేశ, లక్ష్మీ దేవి మట్టి బొమ్మలకు కృతజ్ఞతాపూర్వక ప్రార్థన చేస్తూ, దండలు వేసింది.

సాయంత్రంపూట, తన చెల్లెళ్లు చిన్న మట్టి ప్రమిదలను వసారాలోను, ఎత్తు తక్కువగా ఉన్న గోడల మీద, తోటలోని కాలిబాటలు, చెట్లచుట్టూ, పొదలచుట్టూ ఏర్పాటు చేస్తోంటే, హరి వాళ్లకు సాయం చేసాడు. లీల ప్రతి ప్రమిదలోను జాగ్రత్తగా నూనె పోసింది. బేల, కమల ప్రత్తితో చేసిన వత్తులను వాటిల్లో ఏర్పాటు చేసారు. తర్వాత అది సులభంగా ముట్టుకొనేందుకు అది పీల్చిన నూనెను పిండి వేసారు. వాళ్లు అలా చేస్తోంటే హరి ఓ కొవ్వొత్తి

పట్టుకొని వచ్చి, వాటిని వెలిగించాడు. చీకటిలో, బంగారు వెలుగులతో ప్రమిదలు జీవం పోసుకొని, ప్రకాశవంతంగా భాసించాయి.

అప్పుడు హరి బాణాసంచాతో నిండిన బుట్టను కొబ్బరితోటలోని గడ్డి పెరిగిన దిబ్బమీదికి తీసుకొనిపోయి బేల, కమల, ఉత్తేజంతో కేకలు వేస్తూండగా, ఆకాశంలోకి ఓ రాకెట్‌ను పేల్చాడు. అది పెద్ద శబ్దంతో పేలి రంగు రంగుల రవ్వలను వెదజల్లింది. బేల, కమల, హరి పట్టుకొన్న క్రొవ్వొత్తి దగ్గరకు వచ్చి కాకర పూవొత్తులను వెలిగించి, అవి ముఖమల్‌లాంటి చీకటిలో కాంతిపుంజాలను వెదజల్లుతూండగా, వాటిని త్రిప్పుతూ కొబ్బరి తోపు చుట్టూ పరుగెత్తారు. తర్వాత లీల ఓ దానిమ్మ కాయను వెలిగించి, అటు పిమ్మట ముఖద్వారం దగ్గర వెండి రంగు కాగితం అమర్చబడి, మట్టితో తయారైన చిచ్చుబుడ్డిని వెలిగించింది. అది బంగారు, వెండి రంగుల నక్షత్రాల పువ్వారం లాగా కొబ్బరి చెట్టంత ఎత్తుకు వెలుగు రవ్వలను చిమ్ముతోంది. బేల, కమల, వసారాలోని గచ్చుమీద, భూ చక్రాలను ముట్టించారు. అవి గుండ్రంగా తిరుగుతూ తెల్లని, వేడి రవ్వలను చిమ్ముతోంటే లీల, వాళ్ల అమ్మ, అతనిని జాగ్రత్తగా ఉండమని హెచ్చరించారు. దానితో అతను మళ్లీ గడ్డి పెరిగిన దిబ్బ మీదికి వెళ్లి, మరిన్ని రాకెట్లను కాల్చాడు. అవి ఒక్కొక్కటి ఆకాశంలోకి తోక చుక్కలాగ చొచ్చుకుపోయి పెద్ద శబ్దంతో పేలి, నక్షత్రాల వెలుగును విరజిమ్మాయి. అలా అతను ఒకదాని తర్వాత మరొకటి కాల్చాడు.

బుట్టలోని బాణా సంచానంతా కాల్చిన తర్వాత, బేల, కమల, "అయ్యో! అప్పుడే అన్ని అయిపోయాయా?" అని విచారంగా అనటంతో, హరి, "మనం సముద్ర తీరానికి వెళ్లి, పెద్ద మంట వేద్దాం, రండి," అనటంతో, వాళ్లు నవ్వుతూ, చప్పట్లు కొడుతూ, చీకటి దారిలో హరి వెంట సముద్రతీరానికి పరుగెత్తారు. అలా వెళ్తున్నప్పుడు హరి ఎండు కొబ్బరి మట్టను వెలిగించి, కాగడాలా ఉపయోగించి వాళ్లకు దారి చూపించాడు. లీల తన తల్లి దండ్రులతో వసారాలోనే ఉండిపోయి, మనం యిక్కడి నుండే చూద్దాం - సముద్రతీరంలో అమ్మకు గాలి ఎక్కువగా ఉంటుంది," అంది.

హరి, బేల, కమల చల్లగా ఉన్న యిసుకమీద మోకరిల్లి, ఎండు కొబ్బరి మట్టలను జాగ్రత్తగా, గుట్టగా అమర్చటంతో అది పిరమిడ్ ఆకారం దాల్చింది. తర్వాత హరి, దానికి నిప్పంటించటంతో, వాళ్లు చిటపటలాడుతూ మండుతున్న మంటలకు దూరంగా నిల్చొని, ఎండు ఆకులు, మట్టలు, త్వరత్వరగా కాలి పిరమిడ్‌లాంటి ఆకారం బొగ్గులు, బూడిదగా మారటాన్ని గమనించారు. అప్పటికి

చీకటి బాగా ఆవరించింది - ఆకాశం, యిసుక, సముద్రం అన్నీ మఖమల్ లాంటి చీకటిలో మునిగిపోయాయి; వాళ్లు గూడా ఆ చీకటిలో మునిగిపోయారు. కాని వాళ్ల కళ్లు ఆ చీకటికి అలవాటు పడిన మీదట సముద్రం నుండి సన్నని శబ్దాలతో వాళ్లవైపు పయనిస్తున్న నురగను వాళ్లు గమనించ గలిగారు. దానికి సంబంధించిన వెలుగు అలలకు, తెల్లని యిసుకకు మిధ్యాకాంతిని ఆపాదించింది. ఆకాశం లక్షల కొలది నక్షత్రాలతో వెలుగొందుతోంది; అది వాళ్ల శిరస్సులపైన ప్రకాశవంతంగా, ప్రశాంతంగా ప్రకాశిస్తున్నాయి.

కాలుతున్న చివరి కొబ్బరి మట్ట నిట్టూరుస్తున్నట్లు బూడిద, బొగ్గులుగా మారి కూలిపోతున్నప్పుడు, "రండి, వెళ్లి అమ్మతో కూర్చొందాం," అన్నాడు, హరి.

అకస్మాత్తుగా, చాలా సంవత్సరాలుగా వాళ్లు పాటించిన ఆచారాన్ని జ్ఞాపకం చేసుకొని, బాల్యం రోజులనుండి కూడా జ్ఞాపకం తెచ్చుకొని, "అమ్మా, మాకు దీవాళీ కథ చెప్పు," అంది లీల.

దానితో వాళ్లు వరండాలోకి చేరుకున్నారు. అక్కడ గులాబీ రంగు కాగితం లాంతరు యింకా వెలుగుతూనే ఉంది. వాళ్లు తమ తల్లి పాదాల వద్ద కూర్చొన్నారు. అప్పుడు ఆమె అయోధ్య రాకుమారుడైన రాముడు, అడవిలో అపహరణకు గురైన సీతను తీసుకొని రావటానికి లంకాధిపతియైన రాక్షస రాజు రావణునితో ఘోర యుద్ధం చేసి విజయం సాధించి, అయోధ్యచేరినప్పుడు ప్రజలంతా ఆయనకు ఆనందోత్సాహాలతో, దీపాలంకరణతో స్వాగతం పలకటాన్ని గురించిన దివాళి కథను వాళ్లకు చెప్పింది.

అప్పుడు బేల, ఎప్పుడూ వాళ్ల అమ్మ కథను ముగించేటప్పుడు చెప్పేచివరి వాక్యాన్ని జ్ఞాపకం చేసుకొని, "అందువల్లే మనం మన యిళ్లను కూడ వెలుగులతో నింపుకొంటాంకదూ," అంది బేల.

"అవును, ఈ దీపాలు ధనాధి దేవత, లక్ష్మీదేవికి దారి చూపించి, మన యింటికి వచ్చేటప్పుడు, చీకటిలో దారితప్పకుండా, మన యింటిని సందర్శించటానికి ఆమెకు ఉపయోగపడతాయి," అంది వాళ్ల అమ్మ.

అప్పుడు కమల, హరి భుజం తడుతూ, అతను గర్వభావంతో వెలిగి పోతూండగా, "అమ్మా, హరి అన్న మనకు సంపదను చేకూర్చాడు," అంది తీవ్రంగా.

"మీ రందరూ నా ప్రక్కన ఉండటం చూసి, నేను సంపన్నురాలుగా భావించు కొంటున్నాను," అంది వాళ్ల అమ్మ మెల్లగా.

వాళ్లు కొబ్బరి ఆకులమధ్య గలగల లాడుతున్న గాలిసవ్వడులను, సముద్ర తీరం మీద వ్యాపిస్తున్న సురగ శబ్దాలను వింటూ మినుకు మినుకు మంటూ వెలుగుతున్న దీపాలు, ప్రకాశిస్తున్న నక్షత్రాలను గమనిస్తూ కూర్చొన్న సమయంలో, కొంచెం సేపుమౌనం నెల కొంది. అప్పుడు వాళ్ల నాన్న దగ్గి, గొంతుసవరించుకొని, మొదటి సారి తన బొంగురు గొంతుతో మాట్లాడాడు. వాళ్లందరూ ఆశ్చర్యంతో ఉలికిపడేలా, "మన పింటో యేం లేకుండాపోయింది," అన్నాడతను. "పాపం, పింటో," అని అస్పష్టంగా అంటూ, మళ్లీ మౌనంగా మారిపోయాడు, అతనే మీ మాట్లాడకపోయి నప్పటికీ, అతను పింటో చనిపోయిన విషయంలో తాను నిర్వహించిన పాత్రకు, ఓ విధంగా అందుకు తాను బాధ్యుడైనందుకు విచారం వ్యక్తంచేస్తున్నాడని వాళ్లందరూ భావించారు. ఇప్పుడే అతను మొదటి సారిగా గతంలో తాను చేసిన పనులకు విచారం వ్యక్తంచేసాడు. ఆ మాటలకు అందరూ మౌనం వహించారు. కొద్ది సేపటి తర్వాత లేచి నిలబడి, చీరె చెరుగుతో తనకళ్లు తుడుచుకొంటూ, వాళ్లనాన్నను ఓదార్చు తున్నట్లు, "మీకు టీ పెట్టమంటారా? లేక వేడిపాలు త్రాగుతారా?" అని అడిగింది, లీల.

అందుకు అతను అసమ్మతి సూచకంగా తల అడ్డంగా ఊపాడు. వాళ్లకు యిప్పుడేమీ అవసరం అనిపించలేదు.

దీవాళీ తర్వాత రోజు హిందూ నూతన సంవత్సరపు రోజు, ఆరోజు గ్రామంలోని ప్రతి యిల్లు తాజా మామిడాకుల తోరణాలు, బంతిపూలతో, అలంకరింపబడుతుంది. ప్రతి దుకాణంలోను ప్రత్యేకంగా జరిపే పూజ తర్వాత, ఖాతాపుస్తకాలను ప్రారంభించి, రాబోయేనూతన సంవత్సరంలో తమను ఆశీర్వదించమని, ధనాధి దేవత లక్ష్మినిగురించి ప్రార్థనలు చేస్తారు.

అందు వల్ల మరుసటిరోజు ఉదయం, లీల, ఆమె చెల్లెళ్లు, యిల్లంతా శుభ్రంచేసి, తుడిచి, తాజా దండలు అమర్చి, కొత్త ముగ్గులు వేయటంలో నిమగ్నమయ్యారు, పగటి వేళ, కొంచెం ప్రొద్దెక్కిన తర్వాత సముద్ర తీరంలో ఎద్దుల బండ్ల పందాలు నిర్వహిస్తారు, అందువల్ల గ్రామం అంతా ఉత్సాహపూరితంగా ఉంది. గ్రామంలోని ఎద్దుల కొమ్ములకు గులాబీరంగు వేస్తున్నారు, గుఱ్ఱపు బండ్లను తోలేవాళ్లు, తమగుఱ్ఱపు బండ్లను జెండాలతో చెమ్కీలతో అలంకరించి, గుఱ్ఱాన్ని పూన్చటానికి ఉపయోగించే తోలుపట్టీలను తళుకు పూలతో అలంకరించారు.

హరికి మాత్రమే చేయటానికి పనేమీలేకపోయింది. అతను కొంచెం

సేపు యితరులను గమనించి, "ఇప్పుడు నేను చేయవలసిందేమీ లేదు. అందువల్ల నేను ఆయింటిలోని సాహెబ్‌ను సందర్శించటానికి వెళ్తాను," అన్నాడు.

వసారాలో కూర్చొని నేల మీద పెద్దముగ్గు వేయటంలో లీలకు సాయంచేస్తున్న వాళ్ల అమ్మ, "సరే, కాని, త్వరగా తిరిగిరా," అంది.

హరి కయ్యమీది దుంగను దాటు తూండటం చూసిన అతని చెల్లెళ్లు, "హరి, నీవుమమ్మల్ని సముద్ర తీరం మీద జరిగేపందాలకు తీసుకొని వెళతానన్నావు, గదా," అని కేకలు వేసారు.

"నాకు తెలుసు, నాకు తెలుసు, అన్నాడతను, నేను సరైన సమయానికి తిరిగి వస్తాను."

అతను మాన్ రిపోస్ కు వెళ్లి చూడగా, లీల అప్పటికే ఆయింటిని శుభ్రంగా ఊడ్చి, ఎరుపు, తెలుపు రంగుల సాధారణమైన ముగ్గు వేసి ఉండటం, అతని చెల్లెళ్లు, ద్వారానికి మామిడాకులతోరణాలు కట్టి ఉండటం కనిపించింది. అక్కడ యిప్పుడెవరూలేరు; అంతా ప్రశాంతంగా ఉంది. హరి ఆ యింటి చుట్టూ తిరిగి, ఎక్కడైనా ఎవరైనా ఉన్నారేమోనని వెదుకు తూంటే సయ్యిద్ ఆలీసాహిబ్ చిత్తడి ప్రదేశం అంచున, రెల్లు పొదలమధ్య నిశ్చలంగా కూర్చొన్న కొక్కెరలాగా కూర్చొని, చిత్తడి ప్రదేశం ఆవలి ఒడ్డున ఉన్న కొబ్బరి చెట్టు వంక దుర్భిణీతో చూస్తూండటం కనిపించింది.

అతను పాదాలచప్పుడుకు కొంచెం తల త్రిప్పి చూసాడు కాని మాట్లాడలేదు. హరి ఆయనను యింతకు ముందు ఎక్కడ చూసానా అని ఆలోచిస్తూ కొంచెం సందేహించాడు. తన అక్కా చెల్లెళ్లు, సయ్యిద్ ఆలీసాహిబ్ బొంబాయి నుండి వచ్చాడని చెప్పారు. అందువల్ల అతను బొంబాయికి సంబంధించిన జ్ఞాపకాల్లో ఎక్కడైనా ఓసూచన తగులు తుందేమోనని జ్ఞాపకంచేసుకోవటానికి ప్రయత్నించాడు, కాని అతనికి ఆయనను చూసినట్లు జ్ఞాపకంరాలేదు.

"నేను మీకు అంత రాయంగా ఉన్నానాండీ? నేను కొంచెం సేపటి తర్వాత వచ్చేదా?" అని అడిగాడు, అనిశ్చితంగా, హరి.

దానికి సమాధానంగా ఆయన తన ప్రక్కనున్న నేలను కూర్చో మన్నట్లు చేతితో తడుతూ, "నీవు నాతో మాట్లాడాలా? కూర్చో అలాగైతే మనం పక్షులను కలవరపెట్టటం జరుగదు," అన్నాడు.

సయ్యిద్ ఆలీసాహిబ్ పక్షులను అధ్యయనం చేస్తున్నాడని తన అక్కా

చెల్లెళ్లు చెప్పగా తెలుసు కొన్నాడు. కాని ఎలా అధ్యయనం చేస్తారో తెలియదు. ఇప్పుడతను ఆవిషయాన్ని తెలుసుకోవాలను కొన్నాడు. తాను ఎప్పుడూ కొత్త విషయాలను తెలుసుకొంటూ, నేర్చుకొంటూ ఉండాలని, ఎప్పుడూ నేర్చు కోవటం మాన కూడదని తనకు పాన్ వాలా చెప్పాడు. ఆ విషయాన్ని జ్ఞప్తిచేసుకొంటూ, యీసయ్యిద్ ఆలీసాహిబ్, నెత్తి మీద పెట్టుకొన్న టోపి క్రింద తెల్లజుత్తు, తెల్లని గడ్డం ఉన్నా ఎలా పాన్‌వాలాను పోలి ఉన్నాడో ఊహించుకొన్నాడు. ఇద్దరూ ఏదో ఒక రీతిలో పక్షుల్లాగే ఉన్నారు. అలా ఆలోచించటంతో హరికి నమ్మకం కలిగి, "మీరు యిక్కడ పక్షులను అధ్యయనం చేస్తున్నారా?" అని గౌరవపూర్వకంగా అడిగాడు.



"నేను గిజిగాడు పిట్టలు గూళ్లుకట్టు కోవటాన్ని అధ్యయనం చేస్తున్నాను." అన్నాడు ఆలీసాహబ్. అలా అంటూ అతను చిత్తడి నేల మీద వంగి ఉన్న కొబ్బరి చెట్టునుండి వ్రేలాడుతూ, ఊగుతున్న వాటిగూళ్లవైపు చేయి చూపాడు. "నేను వాటిని వర్షాకాలం అంతా అధ్యయనం చేసాను. ఇప్పుడవి వాటి పిల్లలను పెంచుతున్నాయి. నీవు గూడా చూడు," అని ఉత్సాహంగా చెప్తూ, వాటిని గమనించటానికి, హరి వద్ద నుండి ప్రక్కకు తిరిగాడు.

హరి పక్షుల విషయంలో యింతకు ముందెన్నడు శ్రద్ధ చూపకపోయినా, యిప్పుడు వాటిని గమనించటం తప్పమరో మార్గం లేక పోయింది. అవి లకుముకి పక్షులు, కొంగలలాంటి అందమైనవి కావు. అవి పిచ్చుకల్లాంటి మచ్చలున్న, గోధుమ రంగులో ఉన్న చిన్న పిట్టలు; వాటిలో కొన్నింటికి తలలు పసుపురంగు లో ఉన్నాయి. ఇప్పుడు అతను బలవంతంగా వాటిని చూడవలసి రావటంతో యీ చిన్న జీవులు, నీటి మీద, తమ పిల్లలను ఎవరూ పట్టుకోకుండా, హానిచేయకుండా ఉండే విధంగా గాలిలో ఊగుతున్న వింతగూళ్లు సముదాయాన్ని నిర్మించుకోవటం అతనికి అద్భుతంగా తోచింది. ఆగూళ్లు గొట్టాల్లాగా లేక గరాటాల్లాగా ఉన్నాయి. వాటిని గడ్డి పరకలతోను, వరి ఆకులతోను చక్కగా కట్టి, జాగ్రత్తగా అల్లి, మట్టి ముద్దలతో చిక్కగా కూర్చాయి. ఆ పిట్టలు "టి లీలీలీ, టి లీలీ - కిటి - టి లీలీ - కిటూ," అని అరుస్తూ గూళ్లలోకి వెళ్లటం, రావటం చేస్తున్నాయి.

"అలాంటి గూడు కట్టటం కష్టం, అలాగూడు కట్టుకోవాలను కొంటే ముందుగా తక్కువ వయసులోనే మగపిట్టగూడు కట్టటం నేర్చుకొన్న తర్వాతనే సంసారం ఏర్పాటు చేసుకొంటుంది. ఏదైనా పొరపాటు జరిగి, గూడు సరిగా రాకపోతే అది దాన్ని వదలి వేసి మరో గూడు నిర్మించటం మొదలెడుతుంది. గూడు చక్కగా ఉంటేనే అది సంతృప్తి పడుతుంది. అది చాలా ఆడపిట్టలను భార్యలుగా స్వీకరించేందుకు చాలా గూళ్లుకడుతుంది. అది ఆడ పక్షులను ఆకర్షించటానికి మట్టి ముద్దలో పక్షుల యీకలు, పూరేకులు అంటించి, గూళ్లను అలంకరించటం గూడా చేస్తుంది. ఆడ పిట్టలు మంచి గూళ్లు కట్టిన మగపిట్టలతోనే కలుస్తాయి." అని చెప్తూ, అతను నవ్వాడు.

"ఇంతకంటె తెలివైన ప్రాణిని గురించి ఊహించగలవా?"

అకస్మాత్తుగా హరి ఉలికిపడ్డాడు, అతను ఎదుటి వ్యక్తి కంఠాన్ని గుర్తించాడు. అతను యీకంఠాన్ని యింతకు ముందు విన్నట్లు నిర్ధారించుకొన్నాడు. అతను ఆలీసాహిబ్ వైపు తిరిగి, అతనిని ఆశ్చర్యంతో చూసి, అతను ఎవరో అవగాహన చేసుకొన్నాడు అతను బొంబాయిలోని నల్లగుట్టం దగ్గర జనసమూహాన్ని గురించి ప్రసంగించిన వ్యక్తి. అతను తాను బొంబాయి పౌరుడు అయినప్పటికీ ఆలీబాగ్ తీరాన్ని గురించి ఎందుకు ఆసక్తి ప్రదర్శిస్తున్నాడో వివరించాడు. రాబోయే మార్పులన్నింటి వలన ఆలీబాగ్ తీరం పాడైపోతుందని భయపడుతున్నట్లు వివరించాడు. ఇప్పుడు అతను, యిక్కడ తుళ్‌లో ఉన్నాడు. అయ్యో, నేను మా ఊరి వాళ్లతో వచ్చినప్పుడు మీరు బొంబాయిలో నల్లగుట్టం

దగ్గర మాట్లాడుతుంటే విన్నాను - అన్నాడు, హరి.

ఆ మాటలకు ఆలీసాహిబ్ దుర్భిణీని తొలగించి, తల ఒక ప్రక్కకు వంచి, పక్షి చూసినట్లు, హరిని చూసాడు. "ఓ, నీవు వాళ్లల్లో ఒకడివా?" అని అడిగి, చివరకు హరిని గూడ, గిజిగాడు పిట్టల్లాగ ఆసక్తి కరంగా భావించాడు. "ఓ, అలాగా, ఓ అలాగా, రా, వసారాలోకి వెళ్లి మాట్లాడుకొందాం - యిక్కడ తేమగా ఉండటం వల్ల ఎక్కువ సేపుకూర్చో వటం వీలుకాదు."

ఆలీసాహిబ్ వసారాలోకి చేరుకొన్న తర్వాత గూడా తన దుర్భిణీని వదల లేదు, పక్షులను పరుశీలించటం ఆపలేదు. అతను మాటి మాటికి, ఆనందంతో, చిన్నగా నవ్వుతూ డ్రోంగో పక్షి ఎగరటం లేక తేనెటీగలను పట్టుకొనే పక్షులను గమనించటానికి దుర్భిణీని కళ్ల దగ్గర ఉంచుకొంటున్నాడు. ఆలీసాహిబ్ అలా చూడటాన్ని గమనించిన హరి, తుళ్‌లో అధిక సంఖ్యలో ఉన్న పక్షులను తాను గమనించక పోవటంవల్ల ఎంతో ఆనందాన్ని కోల్పోయాననుకొన్నాడు. అతను యిక నుండి అధికంగా పక్షులను గమనించాలని నిర్ణయించుకొన్నాడు. ఆసమయంలో ఆలీసాహిబ్ దుర్భిణీని తొలగించి, "అయితే నీవు ముఖ్యమంత్రికి విన్నపం సమర్పించ టానికి బొంబాయి వచ్చిన ఆలీబాగ్ వ్యవసాయదారుల్లో ఒకడివి, అవునా?"అన్నాడు.

"కాదండి, నేను తుళ్ గ్రామస్తుణ్ణి - నేను అక్కడ కనిపించే పూరింటిలో ఉంటాను," అని చెప్పాడు హరి. "నా అక్కా, చెల్లెళ్లు మీకు వంట చేసి బట్టలు శుభ్రం చేస్తారు,"

"ఆఁ, అవును, అవును," అన్నాడతను. కాని అప్పుడే ఓ జత చీలిక తోకలున్న డ్రోంగో పక్షులు గాలిలో ఎగిరి, వాటినీలి, నలుపు రంగు యీకలు మెరుస్తూండగా గిరికీలు కొట్టటం ప్రారంభించటంతో అతను ఆనందంగా కేరింతలు వేస్తూ, నోరు తెరచి, వాటి వంక చూసాడు.

డ్రోంగోల కఠోరమైన అరుపులకు అవరోధం కల్పిస్తూ, "నేను ప్రదర్శన కారుల బృందంతో బొంబాయి వెళ్లాను," అని హరి, ఆలీసాహిబ్‌కు జ్ఞాపకం చేసాడు. "మేము, వాళ్లు యిక్కడ కర్మాగారాన్ని నిర్మించటం నిలుపు చేయాలనుకొన్నాం."

"ఆఁ," అంటూ నిట్టూర్చాడు, పక్షులను గమనిస్తున్న ఆలీసాహిబ్. అలా అంటూ దుర్భిణీ తొలగించి, పేము కుర్చీల్లో జారగిల్లాడు, "అయితే నీవు పోరాటం సలిపిన వ్యక్తుల్లో ఒకడివా? - మీ పోరాటం విఫలమైంది తెలుసా - మనం న్యాయస్థానంలో కేసు ఓడి పోయాం - రాజకీయనాయకులే గెలిచారు

- అందు వల్ల వాళ్లు పురోగతి పేరున భూమిని అమ్మటం, అనుమతి పత్రాలు జారీ చేయటంలాంటి వాటి ద్వారా చాలా డబ్బు సంపాదిస్తారు. తుళ్ నష్టపోతుంది," అంటూ నిట్టూర్చి, కళ్లజోడుసరిచేసు కొన్నాడు. "అంతా నాశనమౌతుంది. సముద్రంలోని చేపలు నీటిలోకి విడి చే రసాయనాల వల్ల చచ్చిపోతాయి. వరి పొలాల్లోను, యిళ్ల ప్రక్కన కర్మాగారాలు నిర్మింపబడతాయి, నేను అభిమానించే గిజిగాడు పిట్టలకు గూళ్లు కట్టుకోవటానికి వరి ఆకులుండవు, వాటి పిల్లలకు ధాన్యం, ఆహారం లభించదు. అవి యిక్కడి నుండి మరోచోటికి ఎగిరిపోవాలి, నేను వచ్చే సంవత్సరం వాటిని గమనించటానికి వీలుండదు," అన్నాడు.

అతను అలా హృదయం భగ్నమైనట్లు విచారిస్తూండటంతో, "మీరు పక్షులను గురించి ఎందుకంత శ్రద్ధవహిస్తారు," అని అడిగాడు హరి.

"భూమి మీద ఉన్న ప్రాణుల్లో పక్షులే ఆఖరిస్వేచ్ఛా జీవులు. ఇతర ప్రాణులన్నింటినీ పట్టుకొని, మచ్చిక చేసుకొని, బానిసలుగా మార్చటం జరిగింది. పులులు, జంతు ప్రదర్శనశాలల్లోని బోనుల్లో బంధింపబడ్డాయి; సింహాలను వినోదం కొరకు ఏర్పాటు చేసిన ఉద్యానవనాల్లో బంధించి, జన సమూహాలు వాటిని చూసి ఆనందిస్తున్నారు; అగ్గిపెట్టెల్లాంటి యిళ్లల్లో ఉండే పురుషులు, స్త్రీలు, జైళ్లలాంటి కర్మాగారాల్లో పని చేస్తున్నారు. పక్షులు మాత్రమే స్వేచ్ఛగా ఉండి, తమ యిష్టం వచ్చినప్పుడు ఎగిరిపోయి, అంతరిక్షంలోకి వెళ్లగలవు." ఆలీ సాహిబ్ అలా మాట్లాడుతున్నప్పుడు అతని ముఖం కాంతివంతమైంది; అతని కంఠం కంపించింది. "అందువల్లే నాకు పక్షులంటే అభిమానం - మనకు లేని స్వేచ్ఛ వాటికి ఉండటం వల్ల నాకు అవి అంటే యిష్టం. బహుశ నేను గూడ అన్నీ వదిలి వాటిలాగ ఎగిరి పోవాలనుకొంటున్నాను. నీవు గూడా అలాగే చేస్తావా," అని హరిని అడిగాడు, ఆలీ సాహిబ్.

"కాని మనకు ఎగిరిపోవటం సాధ్యం కాదండి," అని హరి అతనికి జ్ఞాపకం చేసాడు హృదయ పూర్వకంగా. "మనం యీ భూమి మీద ఉన్నాం. మనం దాన్ని వదలివెళ్లలేం. మనం ఎలాగైనా యిక్కడే ఉండాలి," అన్నాడు.

ఆ మాటలకు ఆలీ సాహిబ్ విచారంతో నిండిన కళ్లతో హరి వైపు చూసాడు. "అవును, నీవేమి చేస్తావు? నీవేమౌతావు? నాకేమీ తెలియటం లేదు, మిత్రమా. ప్రజల విషయానికొస్తే నాకు - నాకేమీ తెలియటం లేదు. నేను అయోమయంలో ఉన్నాను. నీవేం చేస్తావు?" అని అడిగాడు.

హరి, ఆలీ సాహిబ్ దగ్గరకు వెళ్లాడు. "ఇప్పుడు చేపలు పట్టటానికిగాని,

వ్యవసాయం చేయటానికి గాని చాలా ఆలస్యం అయినందు వల్ల యీ ప్రదేశం వ్యవసాయానికిగాని, చేపలు పట్టటానికిగాని అనువైన ప్రదేశం కాకపోవటం వల్ల, కర్మాగారంలో పనిచేయటం నాకు యిష్టం లేదు కాబట్టి నేను కొన్ని కోళ్లను కొని, నాకున్న చిన్న పొలంలో, కోళ్ల దొడ్లుకట్టి, కోళ్ల పెంపక కేంద్రం ప్రారంభించి, గ్రుడ్లను గ్రామంలో అమ్మి, కర్మాగార నిర్మాణం పూర్తి అయిన తర్వాత తుళ్ వచ్చే ధనవంతులకు కోళ్లు అమ్మి కొంతకాలంపాటు అలా జీవించ వచ్చుననుకొంటున్నాను. నేను చేతి గడియారాలు బాగుచేయటం కొంచెం నేర్చుకొన్నాను - అందువల్ల, తరువాత చేతి గడియారాలు బాగుచేసే దుకాణాన్ని ప్రారంభిస్తాను," అన్నాడు హరి, సిగ్గుతో కూడిన గౌరవంతో.

"నీవు నేర్చుకొన్నావా?" అని అడిగాడు ఆలీ సాహిబ్, ఆశ్చర్యపోతూ. "చేయగలవా - నీవు నా చేతి గడియారాన్ని బాగుచేయగలవా? నేను కయ్యలో పడిపోయాను, తెలుసా," అంటూ నవ్వాడు. "అప్పటి నుండి నా చేతి గడియారం పనిచేయటం లేదు. నీవు అది మళ్లీ ఆడేటట్లు చేయగలవా?" అంటూ, అతను చొక్కా జేబులోంచి చేతి గడియారాన్ని తీసి హరికి యివ్వటంతో అతను దాన్ని ఉత్సాహంగా తీసుకొన్నాడు. బొంబాయిలో తనతో మాట్లాడి, పక్షులను, అధ్యయనం చేయటానికి తుళ్ వచ్చిన యీ గొప్ప వ్యక్తి తనను ఏదో చేయమని అడగటం హరికి నమ్మశక్యం కాకుండా ఉంది.

అతనిచ్చిన చేతి గడియారాన్ని తీసుకొని, దాన్ని మెల్లగా ఊపి, చెవి దగ్గర ఉంచుకున్నాడు హరి. "ఇందులోకి నీరు పోయిందండి. దాన్ని శుభ్రం చేసి ఎండబెట్టటం చాలా తేలిక. నేను వర్షాకాలంలో బొంబాయిలో చాలా చేతి గడియారాలు బాగు చేసాను," అన్నాడు.

పక్షులను అధ్యయనం చేసే ఆలీ సాహిబ్, హరి అలా మాట్లాడుతుంటే అతన్ని, అద్భుతమైన, ఆసక్తి కరమైన పనిచేసే పక్షి అన్నట్లు అతనివైపు చూస్తున్నాడు. అప్పుడతను కుర్చీలోంచి, "పరిస్థితులకు అనుగుణంగా మారు, పరిస్థితులకు అనుగుణంగా మారు," అన్నాడు బిగ్గరగా.

"ఏమిటండీ?" అన్నాడు హరి, ఆశ్చర్యపోతూ. అతనికి ఆలీ సాహిబ్ మాట అర్థం కాలేదు.

"పరిస్థితులకు అనుకూలంగా మారు - నీవు అదే చేయబోతున్నావు. పక్షులు, జంతువులు జీవించి ఉండాలంటే ఏమి చేస్తాయో, అలాగే నీవు చేయాలి. పిచ్చుకలు, పావురాలు, నగర జీవనానికి అలవాటుపడి, పొలాల్లో ధాన్యం, పురుగుల కొరకు వెదికే బదులు, వీధుల్లో మిగిలిపోగా పారవేసిన ఆహార

పదార్థాల మీద ఆధారపడి జీవించటానికి అవసరమైన పద్ధతిలో మారినట్లు" అని అతను హరికి వివరించాడు. "అందువల్ల నీవు నీ నూతన పరిసరాలకు అనుగుణంగా మారాలి."

"నాకు అలా మారటం చేత కాదనుకొంటానండి," అన్నాడు హరి, అనిశ్చితంగా.

"కాని యింతకు ముందే కదా నీ వేమి చేయబోతుంది చెప్పింది. జీవించి ఉండటానికి నీవు సాంప్రదాయక జీవన విధానాన్ని వదలి, తుళీలో నిర్మింపబోయే కర్మాగారం సృష్టించబోయే నూతన వాతావరణానికి అనుగుణమైన జీవన విధానాన్ని నేర్చుకొంటావు. అవును, జీవనాన్ని కొనసాగించ గలవు," అన్నాడతను.

పక్షులను అధ్యయనం చేసే ఆలీ సాహిబ్ ఉపయోగించే సగం పదాలను కూడా హరి అర్థం చేసుకోలేక పోయాడు. అతన్ని అసలు అర్థం చేసుకోలేక పోయాడు. కాని అతని మాటలు తాను పాన్‌వాలాను చూడటానికి వెళ్ళినప్పుడు అతను మేడ మీది వసారాలో కూర్చొని రైల్వే స్టేషన్ కప్పుమీది పావురాలను గమనిస్తూ తనతో అన్నమాటలను జ్ఞప్తికి తెచ్చాయి. దాంతో హరి ఆ మాటలను జ్ఞాపకం చేసుకొంటూ, "చక్రం తిరుగుతూ ఉంటుంది," అనుకొన్నాడు మెల్లగా, ఆశ్చర్యపడుతూ. "చక్రం తిరుగుతుంది, తిరుగుతుంది, తిరుగుతుంది," అనుకొన్నాడతను, ఆ మాటలను అర్థం చేసుకొంటూ. ఇప్పుడు తాను ఆ మాటల్లో ఉన్న సంబంధాన్ని అర్థం చేసుకొన్నానని, యీ గొప్ప చక్రభ్రమణంలో పక్షులు, మనుషులు ఐక్యంగా ఉన్నారని, పక్షులను మనం అవగాహన చేసుకొంటే అవి మనకు చాలా ముఖ్యమైన విషయాలు తెలుపగలవని, బోధించగలవని చెప్పటానికి సయ్యిద్ ఆలీ వైపు తిరిగాడు. "అయ్యా, నాకు అర్థమైంది," అని అరిచాడతను, కాని అప్పుడే ఉత్సాహపూరితమైన, పక్షులను అధ్యయనం చేసే సయ్యిద్ ఆలీ ఆకారం అకస్మాత్తుగా వసారా అంచున గెంతటం మాని, త్వరగా అదృశ్యమైంది. ఆలీ సాహిబ్ వెనక్కువాలి, వరండా మీది నుండి క్రింద ఉన్న మందార పొదలో పడిపోయాడు. అతను నిలబడటానికి సాయం చేసేందుకు హరి కిందికి దూకి, "మీకేమైనా దెబ్బ తగిలిందా? మీకేమి కాలేదు కదాండీ," అని అడిగాడు.

"లేదు, లేదు; లేదు," అన్నాడు నత్తిగా ఆలీ సాహిబ్. అతను కొంచెం తత్తరపోయినట్లున్నాడు. అతను తన దుస్తులకు అంటిన దుమ్ము దులుపుకోవటంలోను, దుర్భిణీని వెతుక్కోవటంలోను హరి సాయం చేస్తూండగా,

నవ్వటం మొదలెట్టాడు. "నేను నా చేతి గడియారం నీకివ్వటం మంచిదైంది," అంటూ నవ్వి, "లేకపోతే నేను దాన్ని గూడ పగులగొట్టే వాణ్ణి," అన్నాడు.

"అది నా దగ్గర సురక్షితంగా ఉందండీ," అన్నాడు హరి. తన జేబును తడుముతూ. "నేను దాన్ని యింటికి తీసుకొని వెళ్ళి, బాగుచేసి, మీకు సాయంత్రానికి తిరిగి యిచ్చివేస్తాను. అలా అయితే యిబ్బందేమీ కాదుగదండీ?" అన్నాడు.

కాని ఆలీ సాహిబ్ ఏమీ సమాధానం చెప్పలేదు. ఆనందంతో అరుస్తూ అతను మళ్లీ చిత్తడి ప్రదేశంవైపు అస్తవ్యస్తంగా నడుస్తున్నాడు. అతనికి ఓ చిన్న గిజిగాడు పిట్ట పిల్లలకు ఆహారం తీసుకొని రావటం కనిపించింది. అది చూసి అతను ఆనందంగా అటువైపు వెళ్లాడు. అతను హరిని గురించి మరచినట్లుంది.

హరి, వాస్తవంగా అతను అలా ప్రవర్తించినందుకు బాధ పడలేదు. ఆలీ సాహిబ్ చెప్పిన మాటలు అప్పటికే హరికి కావలసిన నమ్మకాన్ని కలుగజేసాయి. ఇప్పుడతను ముందుకు పోగలడు.

హరి, తన చెల్లెళ్లను సముద్ర తీరంలో జరుగబోతున్న పందాల వద్దకు తీసుకొని పోవాలనుకొన్నాడు.

కొమ్ములకు గులాబీ, ఎరుపు రంగులు వేసిన, పాలవలె, తెల్లగా ఉన్న ఎద్దులు యిసుక మీద కొయ్య బండ్లను లాగుతూ, వేగంగా నడుస్తున్నాయి. రంగురంగుల తలపాగాలు చుట్టుకొని, బండ్లు తోలేవాళ్లు గొంతు బొంగురు పోయేలాగా అరుస్తూ, చేతిలోని కొరడాలను గాలిలో ఝుళిపిస్తూ, ఎద్దులను అదలిస్తున్నారు.

"బిజూ బండి - బిజూ ఎద్దులు - బిజూ ఎద్దులు గెలిచాయి," అంటూ సముద్రతీరం చివరి భాగం నుండి కేక వినిపించటంతో, ఆ మాట యిసుక తిన్నెల మీద ఉన్న జనాలకందరికీ తెలిసిపోయింది. తెల్లని, క్రొత్త ధోవతి ధరించి, బిజూ జనం మధ్య నవ్వుతూ, నిలబడ్డాడు. అతను యింతకు ముందుకంటె ఎత్తుగాను, విశాలంగాను ఉన్నట్లు కనిపిస్తున్నాడు. అతని భార్య, కుమార్తె, దీవాళీకి ధరించిన కొత్తబట్టలు కట్టుకుని అతని పక్కన నిలబడి ఉన్నారు. జనం కేకలు వేస్తూ అతన్ని అభినందిస్తున్నారు - అతను సముద్రంలో తుఫానులో చిక్కుకొని మునిగిపోయే జాలరులను రక్షించటంలో సాయపడటం వల్ల, జనం ఎలాగైతేనేం అతని బడాయి చేష్టలను, తల బిరుసుతనాన్ని క్షమించినట్లున్నారు. సముద్రంలో చెలరేగిన గొప్ప తుఫాను జాలరులనందరినీ సన్నిహితం చేసింది. వాళ్లు ఏ విధంగా పరస్పరం ఆధారపడి ఉన్నారో,

పరస్పరం ఎలా అవసరమో అర్థం చేసుకొన్నారు. వాళ్లు ఆ సాన్నిహిత్య భావాలను పురస్కరించుకొని యీ రోజు ఉత్సవం చేసుకొంటున్నట్లున్నారు.

తరువాత తేలికగాను, వేగంగాను ఉన్న గుఱ్ఱపు బండ్ల వంతు వచ్చింది. గుఱ్ఱపు బండ్ల చక్రాలు, యిసుక మీద గుండ్రంగా, వేగంగా తిరుగుతున్నాయి. గుఱ్ఱాలు మెడలుసాచి, వాటి జూలు అలల్లాగా ప్రకాశిస్తుంటే, తోలు పట్టీలకు అలంకారంగా అమర్చిన పూలు మెరుస్తూండగా, ఎంతో వేగంగా పరుగెత్తుతున్నాయి.

"చూడు, చూడు, చూడు," అని అరిచారు, బేల, కమల, ఉత్సాహంతో.

"అలా అరవకండి," అన్నాడు హరి, "ఇదుగో, మిఠాయిలు తీసుకోండి," అంటూ ఆలీబాగ్‌లో వాళ్ల కొరకు కొన్న పంచదార బొమ్మలను వాళ్లకు అందించాడు. బేల, కమల వాటిని తీసుకొని, వాళ్ల స్నేహితులకు కూడా కొన్ని యిచ్చి, సంతోషంగా తినటం మొదలెట్టారు. వాళ్లకు లీల ఆ క్షణంలో పరిపూర్ణమైన వ్యక్తిలాగాతోచింది.

పందాలు ముగియటంతో జన సమూహాలు తగ్గిపోయాయి. హరి యింకా యిసుక తిన్నెల మీద నిలబడి స్త్రీల సమూహం, అరచేతుల్లో బుట్టలుంచుకొని, తీరం మీది మార్గంలో నడుస్తూ రావటం గమనించాడు. వాళ్లు సముద్రం నీటిపైన కనిపించే మూడు శిలలవైపు వెళ్తున్నారు. వాళ్లు నెమలి కంఠపు నీలి రంగు, ఆకుపచ్చ సముద్రపు నీళ్లలో నడుస్తున్నారు. సముద్రపు నురగ వాళ్ల చీల మండలను తాకుతోంది. వాళ్లు ప్రార్థన చేస్తూ, పూరేకులు, రంగురంగుల కుంకుమలను శిలలపై చల్లుతున్నారు. అతని తల్లిగూడా వాళ్లలో ఉండటం హరి గమనించాడు.

అప్పుడు, "లీలా, చూడు, చూడు, లీలా," అన్నాడు హరి.

Typeset at Printofast, 11/4, Old Rajinder Nagar, New Delhi - 60 and printed at
The Central Electric Press, Naraina Phase -II, New Delhi - 110028.